# యమకూపం

(YAMA THE PIT)

మూలం : అలెగ్జాండర్ కుప్రిన్.
అనువాదం : రెంటాల గోపాలకృష్ణ.






ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ.

# ప్రవేశిక

విశ్వవిఖ్యాతి నార్జించుకొన్న నవలలలో యామా ది పిట్ (Yama The Pit) ఒకటి. దీన్ని సుప్రసిద్ధ రష్యన్ రచయిత, కవి, కథకుడు, నవలాకారుడు, వ్యాసకర్త, విమర్శకుడు అయిన అలెగ్జాండర్ ఇవానోవిచ్ కుప్రిన్ (1870-1938) రచించాడు.

దక్షిణరష్యాలో ఒక పెద్ద నగరం ఉంది. ఆ నగరం వెలుపలిభాగంలో యామ్‌స్కాయా స్లొబోడా అనే పేట వుంది. ఆ ప్రదేశాన్నే 'యామా' అని పిలుస్తారు. యామాలో రెండు వీథులు వ్యభిచారానికి పేరుగాంచాయి. ఆ రెండు వీథుల్లో దాదాపు ముప్పయి సానికొంపలున్నాయి. ఆ ముప్పయి కొంపలూ ముప్పయి సంస్థలుగా వృద్ధిపొంది బాహాటంగా పడుపువృత్తిని సాగిస్తున్నాయి.

# రెండు

వ్యాపారం సాగించడానికి ప్రభుత్వం సమ్మతించింది. ప్రభుత్వంయొక్క ప్రోద్బలం, ప్రోత్సాహం, సానుభూతి సహకారాలతోనే ఈ వ్యాపారం సాగుతోంది. జూదానికీ, పానానికీ, పడుపుకత్తెలకు యామా ప్రసిద్ధికెక్కింది. ఇక్కడ చీట్లాట, పోట్లాటలు సర్వసామాన్యమే. ఇక్కడ పచ్చి శృంగారం - పెచ్చుపెరిగి విచ్చలవిడిగా విహారం చేస్తోంది. యామా అవినీతికీ, దుర్మార్గానికీ నిలయం. యామా ఒక రౌరవనరకం! యామా ఒక యమకూపం! దాదాపు నాలుగువందలమంది స్త్రీలు ఈ యమకూపంలో పడి కొట్టు కుంటున్నారు. తమ వ్యక్తిత్వాన్ని, నైతిక విలువను కోల్పోయి, సిగ్గు, బిడియం విడిచి, శీలాన్ని అమ్ముకుని, శరీరాలు పురుషులకు అప్పజెప్పి, స్వేచ్ఛగా, పిచ్చిగా పడుపువృత్తి సాగిస్తూ బ్రతుకీడుస్తున్నారు. ఇదే ఈ నవలకు ఇతివృత్తం. ఇదే ఇందలి కథావస్తువు.

ఇతర రచయితలు అనేకమంది పతితలను, పడుపు కత్తెలను పాత్రలుగా స్వీకరించి కథలు, నవలలు సృష్టించారు. కాని కుప్రిన్ అలా చేయలేదు. వ్యభిచారాన్నీ, దానివల్ల కలిగే దుష్ఫలితాలనూ తన నవలకు ప్రధానవస్తువులుగా స్వీకరించాడు. మొత్తం వ్యభిచారమనే వృత్తినే ఒక పాత్రగా స్వీకరించి, అద్భుతమైన రచనాశిల్పంతో మలచి పరిపూర్ణమైన ప్రతిమను తయారుచేశాడు కుప్రిన్. విశ్వ సాహిత్యంలో ఇలాంటి రచన చేసిన మహారచయిత కుప్రిన్

మూడు

ఒక్కడే! ఈ విషయంలో విశిష్టస్థానాన్ని ఆక్రమించుకున్న నవల 'యామా' ఒక్కటే!

ఈ నవల తొలిసారి వెలువడినప్పుడు (1904) రష్యాలో పెద్ద సంక్షోభం బయలుదేరింది. ఆనాటి జారుప్రభుత్వం గజగజ వణకిపోయింది. తన పెట్టుబడిదారీవ్యవస్థలోని కుళ్ళును, అవినీతిని బట్టబయలుచేశాడని భయపడింది. ఏంచేస్తుంది? అసూయతో, ద్వేషంతో కుప్రిన్‌మీద, అతని రచనమీద విరుచుకుపడింది. దౌర్జన్యచర్యలకు పూనుకుంది. అతనిరచనను దుయ్యబట్టింది. తీవ్రంగా విమర్శించింది. పసివాళ్ళ మనసుల్లోనూ, యువకుల హృదయాల్లోనూ, కుప్రిన్ పచ్చివిషం నూరిపోస్తున్నాడనీ, వాళ్ళను చెడగొట్టి పాడుచేస్తున్నాడని నిందించింది. నవలను ప్రజలలోకి రాకుండాచేయాలని, ప్రచురణాలయంమీద దాడిచేసి ప్రతులను తగులబెట్టింది. ఇంకా అతన్ని పేర్లైనన్నివిధాల హింసించి స్వేచ్ఛగా జీవించడానికికూడా వీలులేకుండాచేసింది. అవును. నిజాన్ని, నిప్పును భరించడం కష్టం. కుప్రిన్ తన రచనలో నిజాన్ని నిఖిలజగత్తుకూ వెల్లడించాడు. స్త్రీ జాతి నైతికంగా పతనమైతే దేశానికీ, మానవకోటికీ ఎంతటి దుర్గతిపడుతుందో విప్పిచెప్పాడు. వ్యభిచారం ఎంతనీచమైనదో [illegible] ఎలాంటి దుష్పరిణామాలు కలుగుతాయో, ఎంతటి [illegible]పట్లకు గురికావలసివస్తుందో, ఎటువంటి తీవ్రమైసమస్యలను ఎదుర్కోవలసివుంటుందో, ఇవన్నీ కుప్రిన్

తన నవలలో అత్యద్భుతంగా చిత్రించాడు. ఆనాడు స్త్రీలను అమ్ముకునే ఘోరమైన దురాచారంకూడా ఒకటి వుండేది. దీన్ని కుప్రిన్ తీవ్రంగా ఖండించాడు. వీటన్నిటికీ హేతుభూతమైన ఆనాటి పెట్టుబడిదారీవ్యవస్థను నిశితంగా, నిర్భయంగా విమర్శించాడు. అందుకనే జారు ప్రభుత్వానికి వళ్లుమండింది. సహించలేక, ఏంచేయడానికీ చాతకాక, చివరకు దౌర్జన్యచర్యలకు పూనుకుని ఈ నవలను అణగద్రొక్కడానికి విశ్వప్రయత్నం చేసింది. ఈ నవలను నిషేధించింది. దీన్ని ఎవరూ చదువకూడదనీ, ఇది అసలు రచనే కాదనీ, ఒక బూతుబొమ్మల పటమనీ ప్రకటించింది. కాని నిప్పును, నిజాన్ని దాచడం సాధ్యమా? నిజం నిజంగా నిలుస్తుంది. నిప్పును దాచిపెడితే లోలోపలనే దహించివేస్తుంది. 'యామా' ప్రజలచేతుల్లో పడింది. మొదట్లో కొద్దిమంది మాత్రమే ఈ నవలలోని కటువైన సత్యాలను గ్రహించగలిగారు. కాని క్రమక్రమంగా యామా రష్యాదేశమంతటనేకాక, ఖండఖండాంతరాలకు కూడా వ్యాప్తి చెందింది. పండితులు, పామరులుకూడా ఈ అద్భుతమైన నవలను వేనోళ్ళ ప్రశంసించారు. ప్రపంచం నలుమూలలా కుప్రిన్‌కూ, యామాకు అఖండమైన కీర్తి లభించింది. మొట్టమొదట పడుపుకత్తెలే ఈ నవలను గుర్తించారు. వేలకొద్దిమంది స్వయంగా కుప్రిన్‌కు జాబులు వ్రాశారు. తమ దుర్భరమైన జీవితాలను, తాము పడే హింసలను, తమ గోడు

అన్నీ వాస్తవంగా, ఉన్నది ఉన్నట్లుగా, కళ్ళకుకట్టినట్లుగా కుప్రిన్ ఈ నవలలో చిత్రించాడని ప్రశంసించారు. తమ విషాదజీవితాలను తలచుకొని వాపోయారు.

త్వరలోనే యామా దాదాపు ఇరవై భాషల్లోకి తర్జుమాచేయ్యబడింది. 1929 నాటికే షుమారు ముప్పయి లక్షల ప్రతులు అమ్ముడుపోయాయి. రాబిన్‌సన్ క్రూసో మాదిరి ఈ నవల అతి వేగంగా వ్యాప్తిచెందింది.

కుప్రిన్ జీవితం చాలా చిత్రమైంది. కవిగా, గాయకుడుగా మిలిటరీఉద్యోగిగా, పడవకూలీగా, బ్యాండు మాస్టరుగా, న్యూస్ రిపోర్టరుగా, యాక్టరుగా, నల్లసముద్రంలో జెస్తనాడుగా జీవించాడు. వివిధరంగాలలో ప్రవేశించి కృషిచేశాడు. జీవితంలోని వివిధకోణాలను దర్శించాడు. రకరకాల మనఃప్రవృత్తులను అవగాహనచేసుకున్నాడు. జీవితాన్నే జీర్ణించుకున్నాడు. అందువల్లనే ఈయన రచన రంగురంగుల వెలుగును వెదజల్లుతూఉంటుంది. స్టీఫెన్ గ్రాహం ఈయన్నుగురించి చెపుతూ 'ఈనాటి రష్యన్ రచయితలలో కుప్రిన్ గొప్పవాడు. మహాకవి, గొప్ప నవలాకారుడు. మానవహృదయాల్లోని లోతులు వెదకిన శోధకుడు. మూఢ విశ్వాసాలను, భ్రాంతులను, చిత్తప్రవృత్తులను చిత్రించడంలో దిట్ట. వాస్తవిక రచనకు పెట్టిన పేరు. సమాజంమీద తిరుగుబాటుచేసి అన్యాయాన్ని దుయ్యబట్టడంలో మొనగాడు. చెకోవ్‌లోగల నిజాయితీ, నిశ్చల

విశ్వాసం, టాల్‌స్టాయ్ శిల్పచాతుర్యం, టర్జినీవ్ పటుత్వమైన శైలి ఇతనిలో ఉన్నాయి.' అని పేర్కొన్నాడు. ఈయన ఇంకా అనేక కథలు, నవలలు, వ్యాసాలు రచించాడు. అన్నిట్లోకీ విశ్వవిఖ్యాతిపొందిన నవల యామా.

యామాలోని పాత్రలన్నీ సహజంగా, సజీవంగా వుంటాయి. సమాజంలో మనం నిత్యం చూచే వ్యక్తులనే స్వీకరించినప్పటికీ కుప్రిన్ తన శక్తివంతమైనకలంతో వాటికి ఒక విశిష్టతను చేకూర్చి, ఉక్తివైచిత్రితో రచన సాగించాడు. ఒక ఉత్తమ కళాఖండంగా తయారుచేశాడు. వేశ్యలలో జెన్నీని మనం ఎన్నటికీ మరువలేము. ఘోరమైన అంటువ్యాధికి గురిఅయి, అందుకు ప్రతీకారంగా ప్రపంచం మీదనే పగ సాధించ నిశ్చయించుకుంది. తుదకు తన ప్రియుడి సమక్షంలో హృదయపరివర్తన పొందింది. తన జీవితంమీద తనకే రోతపుట్టి ఆత్మహత్యచేసుకుంది. అలాగే ల్యూబా, టమారా, పాష్కా, తదితర పాత్రలలోనూ ఉదాత్తత కనిపిస్తుంది. ఉన్నతభావాలతో ముందుకురికి, పతితోద్ధరణకు కంకణంకట్టుకుని, చివరకు ఆశయసిద్ధిని పొందలేక చెడిపోయిన బలహీనుడు, పిరికివాడైన లిఖోనిన్ అనేవిద్యార్థి, ప్రియురాలి ఉపదేశంతో పరివర్తన చెందిన కోల్యా అనే మిలిటరీకుర్రాడు, అంటువ్యాధి తగిలి ఆత్మహత్య చేసుకున్న విద్యార్థి బోరిస్. పడుపుకత్తెలను తారుస్తూ, స్త్రీలను అమ్ముకుంటూ జీవించిన వ్యాపారి గోరిజాంట్, జీవితంనుంచి ఏదో

...గ్రహించాలని తహతహలాడే మేధావి, పత్రికారచయిత ష్లాటోనోవ్—వీరంతా సాహిత్యజగత్తులో ధృవతారలు.

యామా కేవలం ఒక దేశానికీ, ఒక కాలానికీ మాత్రమే సంబంధించింది కాదు. వ్యభిచారం పాతుకు పోయిన ప్రతి దేశానికీ, ప్రతి స్థలానికీ యామా వర్తిస్తుంది! వ్యభిచారం సాగుతోన్న ప్రతికాలంలోను ఇది నిలుస్తుంది! ఇందులోని ఊళ్ళ పేర్లూ, వ్యక్తులపేర్లూ మార్చివేసి చూచు కుంటే ఏ దేశానికైనాసరిపోతుంది. యామా ఆనాడురష్యాలో వుంది. ఈనాడు అన్ని దేశాలలోనూ అనేక యామా లున్నాయి. ఇంతెందుకు, మన దేశంలోను, మన ప్రాంతంలోను రకరకాల యామా లున్నాయి. రష్యాలో యామావీథులు- తెలుగుపట్టణాల్లో దొమ్మరిగుడిసెలు, జీడిపప్పుసందులు, భోగం బజార్లు. అక్కడ రూబుల్సుపుచ్చుకుంటే, ఇక్కడ రూపాయలు పుచ్చుకుంటారు. అక్కడ జెన్నీ, టమారా, ల్యూబా—ఇక్కడ గిరి, మణి, సామ్రాజ్యం. ఇంతే తేడా! అందుకనే యామా నవలకుసార్వకాలీనత, సార్వజనీనత సిద్ధించినై. మరోవిచిత్రం ఏమిటంటే, ఈ నవల చదువుతున్నప్పుడు పడుపుకత్తెలమీద మనకు జుగుప్స కలుగదు. పైగా వారిపట్ల సానుభూతి కలుగుతుంది. జాలిపుడుతుంది. 'అయ్యో! పాపం!' అని స్తుంది. కొన్ని సంఘటనలు చదివేటప్పుడు మనకు 'షాక్' యినట్లవుతుంది కూడాను.

## ఎనిమిది

ఈనవలను ఆంగ్లానువాదంనుంచి శ్రీ రెంటాల గోపాల కృష్ణగారు మధురమైన తెలుగు నుడికారంతో, చక్కని వ్యావహారిక శైలిలో సాఫీగా అనువదించారు. సంక్షిప్తం కాని, పూర్తి తెలుగు అనువాదాన్ని పాఠకలోకానికి అందించగలుగుతున్నందుకు ఆనందించుచున్నాము.

విశ్వ సాహిత్యంలో ఉత్తమశ్రేణికి చెందిన ఈ నవలను ఆంధ్రలోకం ఆదరిస్తుందని ఆశిస్తున్నాము.

సంపాదకుడు.

# యమకూపం

## ఒకటవ భాగం

చాలాకాలంక్రితం - అప్పటికి ఇంకా రైళ్ళుకూడా పడ్లేదు. రష్యాలో దక్షిణభాగాన ఒక పెద్దనగరంవుంది. ఆ నగరాన్ని ఆనుకుని వెలుపలిభాగంలో బండ్లు తోలేవాళ్లు నివాసం ఏర్పరుచుకున్నారు. ఈ బండ్లవాళ్ళు రెండు తెగలుగా వున్నారు. కొందరు స్వంతబండ్లవాళ్ళు. మరికొందరు ప్రభుత్వంతరఫున బాడుగకు తోలేవాళ్ళు. వీరంతా తరతరాలబట్టి అక్కడే స్థిరపడిపోయారు. అందువల్లనే ఈ ప్రాంతానికి 'యామ్‌స్కాయా స్లొబోడా' అని పేరువచ్చింది. దీన్నే 'బండ్లవాళ్ళ పేట' అనీ, లేకపోతే 'యామ్‌స్కాయా', అనీ పిలుస్తారుకూడా. ఇంకా సులువుగా వుండడంకోసం పేరు పొట్టిచేసి "యామా" అనేవారు అంతా. గుర్రబ్బండ్లుపోయి రైలుబండ్లు వచ్చాయి. గుర్రబ్బండ్లకాలం పోయి రైలుబండ్లకాలం వచ్చింది. దాంతో బండ్లవాళ్ళపని కాస్తా పడిపోయింది. క్రమక్రమంగా చితికిపోయారు. ఆ తరువాత చెట్టుకొకరు పుట్టకొకరుగా చెదిరిపోయి వేరువేరు వృత్తుల్లో ప్రవేశించారు. జనం పలచబడింది. సందడి తగ్గింది. అయినా "యామా"కు వెనకటి పేరుమాత్రం పోలేదు. 'యామా' వ్యభిచారానికి ప్రసిద్ధి. పడుపుకత్తెలకూ, పానానికీ పెట్టినపేరు. ఇక్కడ పచ్చి శృంగారం పెచ్చుమీరి విచ్చలవిడిగా విహారం చేస్తోంది. బండ్లవాళ్ళ సాహసకృత్యాలు ప్రశస్తంగా చెప్పుకుంటారు. ఇహ చీట్లాట, పోట్లాట సర్వసాధారణం. ముఖ్యంగా రాత్రిపూట ఇక్కడ వుండడం ఏమాత్రం క్షేమకరం కాదు. బండ్లవాళ్ళు పోయినా, యామాకు ఈ అప్రతిష్ఠమాత్రం పోలేదు. ఆనాటినుంచి ఈనాటిదాకా ఆ పేరు అట్లాగే తిష్ఠవేసుకుని వుండిపోయింది.

గుర్రాలు, గుర్రబ్బండ్లూ పోయి, రైలుబండ్లు ఎలావచ్చాయో, అలాగే పాతకాలపు పడుపుకత్తెలు, పాతయిళ్ళు పోయి కొత్తవి లేచాయి.

పూర్వం ఇక్కడ గులాబీల్లాంటి సోల్జర్ల భార్యలు, జిలేబీల్లాంటి బంట్లవాళ్ళ పెళ్ళాలు కులాసాగా, ఖుషామత్తుగా తిరిగేవాళ్ళు. అటు సారాఅమ్మకం, ఇటు సానివ్యాపారం స్వేచ్ఛగా సాగించేవాళ్ళు. వాళ్ళంతా పోయారు. కొత్తకొత్త ఇళ్ళు పుట్టుకొచ్చాయి. కొత్తకొత్త పిల్లలు కొట్టుకొచ్చారు. ఈ వ్యభిచారగృహాలమీద ప్రభుత్వపు అజమాయిషీ వుంది. పకడ్‌బందీ అయిన కట్టుబాట్లు వున్నాయి. వీటన్నిటికీ లొంగి ఈ వ్యాపారం సాగుతోంది. పందొమ్మిదో శతాబ్దం ఆఖరున 'యామా'లో రెండు వీధులు ప్రఖ్యాతి వహించాయి. అందులో ఒకవీధిపేరు "బోల్షాయా." ఇది కొంచెం విశాలమైనవీధి. ఇహ రెండోదానిపేరు "మలాయా యామ్‌స్కాయా." ఇది చిన్నవీధి. ఇరుగ్గావుంటుంది. ఈ రెండువీధుల్లోవున్న కొంపలన్నీ పసుపుకత్తెలవే. పోతే ఓ అయిదారుఇళ్ళల్లో మాత్రం సారాఅంగళ్ళు పెట్టారు. ఈ దుకాణాల్లో మద్యమాంసాలు సమృద్ధిగా దొరుకుతాయి. పేరుకు సారా అంగళ్లుకాని, వీటిల్లో సమస్త వస్తువులూవుంటాయి. యామాలో సానులకు కావల్సిన సర్వ హంగులూ, రంగులు, ఇవే సమకూరుస్తాయి.

ఈ సానివ్యాపారం అంతా పవిత్రంగా విస్తారంగా వుండే ఓ ముప్పై యిళ్ళలో సాగుతోంది. ఈ ముప్పైయిళ్ళూ ముప్పై సంస్థలుగా వృద్ధిపొందాయి. వీటిల్లో జరిగే తంతు అంతా ఒకేమోస్తరు. విటులను ఆహ్వానించడం, ఆదరించడం, వారితో విహరించడం, అంతా ఒకేరీతిగా జరుగుతుంది. కాకపోతే కొద్దితేడాలు మాత్రం కనుపిస్తాయి. ముఖ్యంగా రేటువిషయంలో. రకరకాల పిల్లలున్నట్టే, రేట్లల్లో కూడా రకాలున్నాయి. ఓ అందమైన అమ్మాయిమీద కన్నువేస్తే ఎక్కువ చార్జీ వసూలుచేస్తారు. కాస్త నాసిరకం పిల్లమీద మనసు మళ్ళితే తక్కువ డబ్బు పుచ్చుకుంటారు. పసి చిన్నపిల్లలకు ఒకరేటు, ముసలివాళ్ళకు మరో రేటు. అలాగే అలంకారాల్లోకూడా. ఓ అమ్మాయి చక్కటి వస్త్రాలూ అవీ వేసుకుని, కాస్త అందంగా అలంకరించుకుంటుంది. చూసినవాడికి వళ్లు అదిరిపోయి కళ్ళు చెదిరిపోతాయి. ఎక్కువడబ్బు వసూలుచేస్తారు. అలాగే గదులలోకూడా తేడావుంది. ఒక గది కాస్త శుభ్రంగావుంటుంది. మంచం, పరుపు, దిండు, దీపం, దువ్వెన, అద్దం, బల్ల, కుర్చీ ఇవన్నీ వుంటాయి. కాని రేటు ఎక్కువ. మరోగది వుంది చూచారూ? మరీ అధ్వాన్నపు అడి

విలా వుంటుంది. ఆ ఏడ్చేదేదైనా చచ్చే చీకట్లో చిరిగిన చాపమీద ఏడ్చి పోవాలి. అంతే తేడేంలేదు వేటు చోక. ఈ తేడాలు ఏర్పరచడం అల్లా వచ్చే విటుల సౌకర్యంకోసమే. కొందరు పదినోట్లు జేబులో వేసుకుని పెళ్లి పచ్చీసుగా వస్తారు. మరికొందరు పావలాడబ్బులతో పని కానిచ్చుకుని పోతారు. అంతా ఎన్నుకోవడంలోనే వుంది మరి. ఎవరి తాహతునుబట్టి వారు, తగిన రకాలను ఏరుకుంటారు.

పెద్దవీధి బోల్లారమోలా ప్రవేశించగానే ఎడమవైపున మొదటి ఇల్లు ఉంది చూశారు? మాంచి ఉచ్ఛదశలో ఉంది. వ్యాపారం మహాజోరుగా సాగుతోంది. ఆ సంస్థపేరు 'ట్రిప్పెల్స్'. పురాతనమైనసంస్థ. పేరుమోగిన ఇల్లు. ఆ ఇంటికి చాలామంది యజమానులు మారారు. ప్రస్తుతంవున్న యజమాని ఒక కొత్తాయన. ఆయన పురపాలక సంఘంలోనూ, పట్టణసంఘంలోనూ సభ్యుడు.

'ట్రిప్పెల్స్' రెండంతస్తులఇల్లు. ఆ ఇంటికి ఆకుపచ్చ, తెలుపు కలిపినరంగు వేసివుంటుంది. పాతకాలపుపద్ధతిలోకట్టారు. పైకప్పు వంకరగా వంగి ఉంటుంది. ద్వారబంధాలకువేసిన చెక్కలుకూడా వంపులు తిరిగి వుంటాయి. ఇల్లంతా కొయ్యపనే. కొయ్యలపైనఅంచులకు సన్ననిపూజలు కూడా చెక్కివుంటాయి. మెట్లమీద తెలుపుఅంచుకల తివాసీపరచివుంటుంది. హాలులో ఒక ఎలుగుగొడ్డు బొమ్మవుంది. చేతులుచాచుకునివుంటుంది. దాని చేతిలో కొయ్యతో తయారుచేసిన ఒక గిన్నెవుంటుంది. అక్కడికివచ్చిన విటులంతా ముందు 'విజిటింగ్ కార్డు' ఒకటి ఆ గిన్నెలోపడెయ్యాలి. నాట్యశాలలో నేల అంతా చెక్కపరుపు. దానిమీద చిత్రవిచిత్రాల బొమ్మలు చెక్కివుంటాయి. చుట్టూ పలుచని సిల్కు తెరలు కడతారు. కిటికీలకుకూడా పెద్దపెద్ద సిల్కు తెరలుకట్టి అలంకరిస్తారు. ఈ కిటికీతెరలు గోరింటరంగులో వుంటాయి. గోడలకు ఆనించి రంగురంగుల కుర్చీలువేస్తారు. పైన పెద్దపెద్ద అద్దాలు తగిలిస్తారు. అవి గిల్టు ఫ్రేములతో కళకళలాడుతూ తళతళ మెరుస్తుంటాయి. వచ్చినవిటులతో ఏకాంతంగా మాట్లాడడానికి దానికీ, ప్రత్యేకంగా రెండు చిన్న గదులున్నాయి. ఈ గదుల్లో ధగధగ మెరిసే తివాచీలు పరుస్తారు. సొగసైన సోఫాలు, మెత్తగా నిగనిగలాడే పట్టుతో కుట్టిన అనుపుదిండ్లు అమర్చుతారు. వచ్చేవిటులను ఇట్టే ఆకర్షిస్తాయి ఈ గదులు.

ఇహ పోతే పడకగదుల్లో నీలం, గులాబీ రంగుల్లో వెలుగుతోన్న లాంతర్లు పెడతారు. మందంగా అందంగావున్న టఫేటాసిల్కుదుప్పట్లు వేస్తారు. పక్కలమీద పరిశుభ్రమైన దిండ్లు పడేస్తారు. పడకగదుల్లోవుండే పడుపుకత్తెలంతా, పొట్టిగాకుట్టిన సాయంత్రపు దుస్తులు ధరిస్తారు. లేకపోతే, అమ్మాయి అసలుఆకారం బయటపడకుండా మారురూపువచ్చే, మంచి విలువైనదుస్తులు వేస్తారు. ఈదుస్తుల్లోవాళ్ళంతా ఎలా అగుపిస్తారనుకున్నారు! గుర్రపురౌతులు, బంట్రోతులు, బెస్తవాళ్ళపడుచులు, హైస్కూలు పిల్లలు వీళ్ళకుమల్లే కనుపిస్తారు. సానులలో ఎక్కువమంది జర్మనీదేశస్థులు. వీరంతా జర్మనీలోని బాల్టిక్ రాష్ట్రాలనుండి వచ్చారు. వీరు అందంగా, పక్కమీదికి సరిపోయేలా, దుక్కల్లావుంటారు. తెల్లని శరీరం. రొమ్ములుమాత్రం లోపలికి పీక్కుపోయివుంటాయి. ట్రిప్పెల్సులోవుండే ఈ సానులందరికీ ఒకటే రేటు. ఒకసారివుండిపోవడానికి మూడురూబుల్సు, రాత్రిఅంతావుంటే పది రూబుల్సు తీసుకుంటారు.

ట్రిప్పెల్సుకాక మరో మూడుఇళ్ళువున్నాయి. ఒకటోది 'సోఫియా వాసిలెవనా'ది. రెండోది వృద్ధురాలైన 'కీవ్'ది. మూడోది 'అన్నామార్కోవ్నా'ది. ఈ మూడు ఇళ్ళూ రెండోరకానికి చెందినవి. ఇక్కడవుండే సానులందరికీ ఒకటే రేటు. తడవకు రెండురూబుల్సు పుచ్చుకుంటారు. అంటే ఇవి కొంత చౌకరకంఇళ్ళు అన్నమాట. డబ్బుకుతగ్గట్టు సౌకర్యాలుకూడా చచ్చుగానే వుంటాయి. ఇంతే బోలెడుకొంపలని మిగతా ఇళ్ళన్నీ మూడో తరగతికి చెందినవి. మరీఅధ్వాన్నంగా తగలడతాయి. అందుకే పాపం, ఒకసారికి ఒకరూబుల్ తీసుకుంటారు. ఇహ రెండోవీధి 'మలాయా యామస్కాయా' సంగతి చెప్పక్కర్లేదు. దారుణం, అతిభయంకరం! తరుచుఇక్కడికి వచ్చేవాళ్ళంతా సోల్జర్లు, నీచులు, దొంగవెధవలు, పనివాళ్ళు. ఇంకా మిగతా అమాంబాపతు అలగాజనం పడి పొర్లుతుంటారు. ఇక్కడ రేటు ఎంతఅనుకున్నారు! యాభై కోపెక్కులు ఇస్తే చాలు. ఒకతడవ వుండిపోవచ్చు. ఒక్కోసారి కక్కుర్తికోసం ఇంకా తక్కువకూడా వస్తారు. ఇక్కడ ఇళ్ళన్నీ ఘోరంగావుంటాయి. మురికికంపు కొడుతూ రోతపుట్టిస్తుంటాయి. ఇళ్ళల్లో అడుగుపెట్టడానికే భయం. నేలంతా పసుపుదారాలుగా మట్టి పగిలిపోయివుంటుంది. దానిమీద రంగులేస్తారు. ఆ రంగంతా ఊడ్చ

ఉగా పగిలి పైకితేచి వస్తూవుంటుంది. కిటికీలకు ముతకబట్టలతో తయారైన తెరలు కడతారు. పడకగదులు పడకగదులమాదిరిగా ఉండవు. పప్పూ, ఉప్పూపడేసే కొట్లమాదిరిగావుంటాయి. గదులన్నీ వరుసగా కొట్లుకట్టినట్టుగా విభాగాలుచేసి వుంటాయి. గదిగదికీ మధ్య పల్చనితెర అడ్డంవుంటుంది. అదైనా పైకప్పువరకు నిండుగా వేస్తే బాగుండును. సగంసగం వరకే వుండడం వల్ల, అవతలిగదిలోజరిగే అపభ్రంశపుపనులన్నీ ఇవతలిగదిలోకి, ఇవతలజరిగే భండాలమంతా అవతలగదిలోకి స్పష్టంగాకనిపిస్తూ, వినిపిస్తూ వుంటుంది. గదులలో పక్కలు లేకపోలేరు. నుగ్గు నుగ్గుఅయిన ఓ గడ్డిపరుపు పడేస్తారు. దానిమీద తరతరాలనాటి పాత దుప్పటి ఒకటి పరుస్తారు. దుప్పటీనిండా మాయని మరకలుపడివుంటాయి. అంతా చిరిగిపోయి చిల్లులుపడివుంటుంది. ఇళ్ళల్లోకివచ్చేగాలి కుళ్ళుకంపు కొడుతోంటుంది. సారా మొదలైన మత్తు పదార్థాల ఆవిరితోనిండి పొగలా వ్యాపిస్తూవుంటుంది. అబ్బ! దుర్భరమైన మానవ మలమూత్రాదుల దుర్గంధం వెలువడుతూవుంటుంది. స్త్రీలు ధరించేదుస్తులు చిరిగి పీలికలయివుంటాయి. అద్దకం అద్దిన 'కాలికో' దుస్తులు కాని, లేక నావికులుధరించే దుస్తులుకాని వేసుకుంటారు. కొందరివి బొంగురుగొంతులు. నంగిగామాట్లాడతారు. మరికొందరిముక్కులు మురిగిపోయి వుంటాయి. మాట్లాడుతోంటే మాట ముక్కులోంచివస్తున్నట్లుగావుంటుంది. గడచిన రాత్రియొక్క భయంకరచరిత్ర అంతా ఈ సానుల మొహాల్లో తాండవంచేస్తుంటుంది. బుగ్గలమీద గాట్లు, కొరుకుళ్ళు, ప్రత్యక్షస్థలాలు, మొహంనిండా రక్కుళ్ళు, గీతలు, గుచ్చుళ్ళు. ఛీ! సంగతటుంచండి. మొహమంతా రాక్షసచిహ్నాలతో సాక్షాత్కరిస్తాయి. అయినా వాళ్ళకది మామూలే. అందువల్ల ఏమాత్రం కించపడరు. సాయంత్రం అయ్యేసరికి ఓ ఎర్రనిరంగుతో మొహం అద్దుకుంటారు. గాట్లు, మచ్చలు కనిపించకుండాచేస్తారు. ఇదంతా వాళ్ళకు, సహజంగా సాఫీగా జరిగిపోతుంది.

సంవత్సరమంతా బీరుపోకుండా ఈ శృంగారం సాగిస్తూవుంటారు. కాకపోతే సంవత్సరం మొత్తంమీద ఒక నాలుగు రోజులు మాత్రం ఈ [illegible] ఒప్పుకోరు. ఈస్టర్ పండగకు ముందుగా వచ్చే "హోలీవీక్"లో మూడురోజులు; తరువాత దేవమాత అయిన మేరీకి మంగళవార్త రోజు; (మార్చి 25) మొత్తం నాలుగురోజులు. ఈ నాలుగురోజులు

ఒక పిట్టకూడా గూట్లోకిరాదు. ఒక పిల్లకూడా తల దువ్వుకుని ముస్తాబై ముంగిట్లో నిలుచోదు. మిగతా అన్నిరోజుల్లోనూ పొద్దుపోకడమే ఆలస్యం. ఎర్రని లాంతర్లు వెలిగించి నడవలో పెడతారు. ఇళ్ళన్నీ గుడారాలమాదిరి వుంటాయి. గుమ్మంలోకి వెడుతోంటే తల తగులుతూవుంటుంది. వీధి అంతా ఏదో తెచ్చిపెట్టుకున్న శోభతో వుట్టిపడుతూవుంటుంది. ఫిడేళ్ళు, పియానోలు మోగుతూవుంటాయి. సంగీతం తరంగాలుగా లేచి కిటికీలలోంచి బయటికి వ్యాపిస్తూవుంటుంది. వీధి విరామంలేకుండా ఇళ్ళముందరికి బళ్ళు వచ్చిపోతుంటాయి. ఇళ్ళ తలుపులు బార్లగా, బాహాటంగా తీసివుంటాయి. వీధిలో నిలబడి ఇంట్లోకి చూస్తే నిటారుగావున్న మెట్లవరస కనిపిస్తుంది. ఈ మెట్లు చాలా ఇరుగ్గావుంటాయి. ఇంట్లోకి పోవాలంటే ఈ సందులోనుంచే దోవ. పైన వున్న లాంతర్ల వెలుతురు మినుకుమినుకుమంటూ మెట్లమీద పడుతూవుంటుంది. తెల్లవారేవరకూ వందలు, వందలేమిటి? కొన్ని వేలమంది మగాళ్ళు ఈ మెట్లు ఎక్కుతూ దిగుతూ వుంటారు. అన్నిరకాలమనుషులూ ఇక్కడికి వస్తారు. దుర్బలులు, వృద్ధాప్యంవల్ల వంగిపోయి వగరుస్తూ నడిచేవాళ్ళు వస్తారు. వీళ్ళు చేసేదేముంది? పడుపుకత్తెలను పైపైన తడిమి దురద తీర్చుకుని వెళ్ళిపోతారు. మిలటరీలో చేరినవాళ్ళు, హైస్కూళ్లలో చదివేవాళ్ళూ; పాపం! మరీ పసివాళ్ళు - వాళ్ళు కూడా ఇక్కడికి వస్తారు. మీసాలు గడ్డాలు వచ్చిన సంసారులు, సంఘంలో మర్యాదస్తులని పేరుపొందిన పెద్దమనుషులు బంగారపు కళ్ళజోళ్ళు పెట్టుకుని ఇక్కడికి వస్తారు. అంతేకాదు, కొత్తగా పెళ్లిచేసుకున్నవారు, కొం[illegible] కిళ్ళను ఎగతట్టినవారు, పెద్ద పెద్ద [illegible] ప్రఖ్యాతి వహించిన ప్రొఫెసర్లు, లాయర్లు, దొంగలు, ఖూనీకోర్లు ఈ కొంపలచుట్టూ ప్రదక్షిణం చేస్తుంటారు. ఇంకా వున్నారు. శృంగారం పనికిరాదనిచెప్పే ఉపాధ్యాయులు, స్త్రీ పురుషులకు సమానహక్కులు కావాలని వ్యాసాలు వ్రాసే రచయితలు, శృంగారప్రబంధాలువ్రాసే కవులు, భావుకులు ఇక్కడపడి పొర్లుతుంటారు. వీరేకాదు. అపరాధ పరిశోధకులు, గూఢచారులు, జైలునుంచి పారిపోయిన నేరస్థులు, ఆఫీసర్లు, విద్యార్థులు, సంఘసేవకులు, కీయనాయకులు, అరాజకులు, దేశభక్తులు, ఓ! ఒకరేమిటి; [illegible] వుండా అంతా [illegible] లో నిలబడి [illegible] పువ్వులు

ఎడారిలావుంటుంది 'యామా'. వీధిఅంతా నిశ్శబ్దంగా, చైతన్యంలేని శవంలా పడివుంటుంది. ఇళ్ళతలుపులన్నీ గట్టిగాబిగిస్తారు. కిటికీరెక్కలు మూస్తారు. కాని ఎంతసేపు? ఇట్లావుండి- అట్లాచూచేసరికల్లా, సాయంత్రంఅవుతుంది. స్త్రీలు అంతా లేస్తారు. మళ్ళీమామూలు, రాబొయ్యే రాత్రికోసం రంగులు వేసుకుని హంగులుచేసుకుని సిద్ధంగావుంటారు.

ఆవిధంగాతెరిపిలేదు. అంతూపొంతూలేదు. రోజుతరువాతరోజు, వారాలు, నెలలు, సంవత్సరాలుగడచిపోతున్నాయి. ఈస్త్రీలను సంఘంలో స్థానంలేదు. లోకం వీరిని ద్వేషిస్తుంది. అసహ్యించుకుంటుంది. బంధువులు వీళ్ళనుతిట్టి దూరంగా తోస్తారు. కాని సంఘంలోని కామశక్తి వీళ్ళను బలి పశువులుగా వుపయోగించుకుంది. నగరంలోనిభోగాసక్తి తన ఇంద్రియసుఖం కోసం వీరిని పదిలంగాభద్రపరుచుకుంది. కుటుంబగౌరవానికి సంరక్షకులుగా అట్టిపెట్టుకుంది - ఆవిధంగా నాలుగువందలమంది పతితలు, పడుపుకత్తెలు; గొడ్డుబోతులైన స్త్రీలు, నష్టులై, సోమరులై, పిచ్చివాళ్ళయి, యమకూపమైన 'యామా' లో బ్రతుకీడుస్తున్నారు.



అప్పటికి మధ్యాహ్నం రెండుగంటలైంది. 'అన్నామార్కోవ్ నా' ఇంట్లో అంతా గాఢనిద్రలో వున్నారు. ఇది రెండోరకానికిచెందిన ఇల్లు. అంటే తడవను రెండురూబుల్సు పుచ్చుకుంటారు. ఇంట్లో అడుగుపెట్టగానే విశాలమైన హాలు కనిపిస్తుంది. నలుచదరంగావుంది హాలు; మఖమల్ తో కుట్టిన ఓ ఇరవై కుర్చీలు వేసివున్నాయి. గోడప్రక్కన ఒక క్రమపద్ధతిలో అమర్చి ఉన్నాయి. గోడను తైలచిత్రాలు తగిలించారు. 'మాకోవిస్కీ' తైలచిత్రాలను నకళ్ళు ఇవి. 'బోయార్ల వివాహభోజనం' చిత్రం ఒకటి. 'స్నాన సౌందర్యం' చిత్రం మరొకటి వేలాడుతున్నాయి. మసక మసక చీకట్లో హాలు అంతా ఏదో చిన్నబోయి దీనంగా, దిగులుగా అగుపిస్తోంది. క్రిందటి

రోజూ సాయంత్రం ఈ గదిలో తళ తళ మెరుస్తూ దీపాలు వెలిగాయి. రాత్రిఅంతా హాయిగొలిపే సంగీతం, నృత్యం. మామూలు ప్రకారం విటులు రావడం, ఆనందించడం అన్నీ జరిగాయి. ఎంతెమందో మనుషుల పాదాల తాకిడికీ, జాపులకూ నేలంతా అదిరిపోయింది. వాళ్ళు కాల్చిన సిగరెట్లపొగ హాలంతా వ్యాపించి గోడలు పొగచూరిపోయాయి. ఇళ్ళముందు వెలిగించిన ఎర్రని దీపకాంతులు, వీధిలోకి దిగజిమ్మి ఏదో శోభను తెచ్చిపెట్టాయి. రాత్రంతా వచ్చేపోయేబండ్లతోటీ, జనంతోటీ వీధిఅంతా మోగి, ఊగిపోయింది.

కాని ఇప్పుడు అలా లేదు. వీధినిర్మానుష్యంగా వుంది. వీధిఅంతా ఎండలో మెరుస్తూ, ఏకాంతంగా ఆనందిస్తోంది. ఇళ్ళతలుపులు మూసి వున్నాయి. లోపలిగదులు తెరలు వేసివుండడంవల్ల చీకటిగావున్నాయి. నాటకప్రదర్శనాలు జరిగినతరువాత మూసివేసిన థియేటరు, గుర్రపుస్వారీ చేసినతరువాత వుండేప్రదేశాలు, విచారణలు జరిగినతరువాత మూసివేసిన కోర్టులు ఎలావుంటాయో ఇప్పుడీగదులు అలావున్నాయి. గతరాత్రి జరిగిన కామవికారాలకు గుర్తులు ఇంకా మాసిపోలేదు. పొగాకువాసన, పరిమళద్రవ్యాల సువాసన ఇంకా గదులలో మిగిలివున్నాయి. అపరిశుభ్రంగా వుండే ఆడవాళ్ళ చెమటకంపు అలాగేవుంది. వారు ఉపయోగించిన ఫేస్ పౌడర్ల వాసన, బోరిక్ థైమాల్ సబ్బుల వాసన గాలిలో కలిసిపోయి గది అంతా పేరుకునివుంది.

అన్నామార్కోవ్నా ఇంట్లో అంతా నిశ్శబ్దంగానిద్రపోతున్నట్లుంది. వంటింట్లోంచి మాత్రం మాంసంముక్కలు నరుకుతున్న శబ్దం వినిపిస్తోంది. అంతలో 'ల్యూబ్కా' మధ్యగదిలోకి వచ్చింది. ఆ ఇంట్లోవుండే పిల్లలలో 'ల్యూబ్కా' ఒకతె. రాత్రిపూటతోడుక్కునే గౌను తొడుక్కుంది. కాళ్ళకూ, చేతులకూ ఏమీలేవు. పిల్లమాత్రం పుష్టిగావుంది. ఒళ్ళంతా నిగనిగలాడుతూ పరిశుభ్రంగా ఉంది. గతరాత్రి ఆమెదగ్గరికి ఓ ఆరుగురు విటులుమాత్రం వచ్చారు. కాని వారిలో ఒకరు కూడా రాత్రిఅంతా వుండలేదు. అంచాత ఆ అమ్మాయిఒక్కతే, రాత్రింతా తన విశాలమైన పక్కమీద హాయిగా పడుకుంది. కమ్మగా, కంటినిండా నిద్రపోయింది.

ఇప్పుడామె మాంసంముక్కలు తెచ్చి, ఇంట్లోవుండే పెంపుడుకుక్కకు పెడుతోంది. ఆ కుక్క ఉల్లాసంగా ఒక్కొక్క మాంసంముక్క అందుకుంటోంది. ల్యూబ్ కూడా ఇవాళ చాలా హుషారుగావుంది. రాత్రింతా ఏ విటుడిబాధా లేకుండా కంటినిండా నిద్రపోయిందామె. పైగా ఆరోజు పవిత్రమైన క్రైస్తవులపండుగకూడా. అంచేత ఆమెకు ఏదోఉత్సాహంగా వుంది. తన చిన్ననాటి సంగతులన్నీ గుర్తుకొస్తున్నాయి. అందులో ఇవాళ మబ్బు, మాయా లేకుండా చక్కని ఎండకాస్తోంది.

యజమానురాలి గదిలోకి కాఫీ తెచ్చిపెట్టారు. గదిలో ఆయిదుగురు హాజరైనారు. ఒకామె అన్నామార్కోవ్నా. ఆమే ఆ ఇంటికి యజమానురాలు ఆ ఇల్లు ఆమె పేరనే రిజిష్టరైంది. 'అన్నా'కు సుమారు అరవై ఏళ్ళ వయస్సు వుంటుంది. చాలా పొట్టిగా లావుగా వుంటుంది. ఆమెను చూడగానే ఫలానా అని గుర్తుపట్టవచ్చు. నడుము కిందిభాగం అంతా లావు. ఆపైన పొట్ట, ఎదురురొమ్ము మధ్యస్థ, తరువాత చిన్నతల; చాలా విచిత్రంగా అగుపిస్తుంది. ఒళ్ళంతా మెదమెదలాడుతూ ఉంటుంది. కళ్ళు నీలంగావుంటాయి. పసిపిల్లలా చూస్తుంది. నోరుమాత్రం పెద్దదిగావుండి, ముసలితనాన్ని స్పష్టం చేస్తూవుంటుంది. ఆమె భర్త పేరు 'ఇసయాసవిచ్.' అతనుకూడా భారీమనిషి కాదు. వృద్ధాప్యం వచ్చింది. పాపం మనిషి నెమ్మదస్తుడు. భార్యఅంటే భయం. ఆమెనోటికి వెరుస్తాడు. 'అన్నా' ఇంటిపెత్తనం చేస్తోంటే, ఇతనుమాత్రం వాకిట్లో కనిపెట్టుకుని కాపలా కాస్తుంటాడు. ఇతనికి కాస్త సంగీతంలో ప్రవేశంవుంది. అవసరమొచ్చినప్పుడు ఫిడేలు వాయించడానికి, డాన్సు చేయడానికి ఉపయోగపడుతుంటాడు.

ఇంటిపనులు చూడ్డానికి మరోఇద్దరు ఆడవాళ్ళుకూడా వున్నారు. మొదటి ఆమె పేరు 'ఎమ్మా ఎడ్వర్డోవ్నా'. లావుగా పొడుగ్గావుంటుంది. వయస్సు సుమారు నలభైఐదు. గుండ్రటి కళ్ళు, నల్లగా మెరుస్తుంటాయి. యజమానురాలికి ఈమె కుడిభుజంగావుంటుంది. ఆమె తరువాత ఈమెదే ఇంటిపెత్తనమంతా. పైగా మరోవిషయంవుంది. యజమానురాలు 'అన్నా' ఇంక ఒకటి రెండు సంవత్సరాల్లో ఈ వృత్తినుండి విరమించి విశ్రాంతి తీసుకోబోతోంది. పనివాళ్ళు, పడుపుకత్తెలతో సహా తన ఇంటిని బేరంపెట్టి "ఎమ్మా"కు అమ్మేయాలనుకుంటోంది. క్రయధనంలో కొంత

సౌఖ్యంగానూ, మరికొంత ప్రాశస్త్యంతోనూ తీసుకోవాలనే తలంపుతో వుంది. ఇందులో దాపరికంఏమీలేదు. ఈ విషయం ఇంట్లో అందరికీ తెలుసు. అందుచేత పనివాళ్ళు, పనుపుకత్తెలు, "ఎమ్మా" తమకు కాబోయే యజమానురాలని గౌరవిస్తూవున్నారు. ఆమెపట్ల భయభక్తులతో మెలగుతున్నారు. ఏ పిల్లయినాసరే, కొద్ది పొరపాటు చేస్తే చాలు. 'ఎమ్మా' విరుచుకుపడేది. నిర్భయంగా, నిర్దాక్షిణ్యంగా వారిని చావచితకకొట్టేది. ఆమె ఆకారం చూస్తేనే అందరికీ హడలు. పిల్లలందరిలోకీ ఒక పిల్ల అంటే ఆమెకు అమితమైన ప్రేమ, విపరీతమైన అసూయ వుండేవి. దాంతో ఆ పిల్లను చెప్పలేనంత హింస పెడుతూవుండేది. ఆమె కొట్టే చావుదెబ్బలయినా భరించవచ్చుగాని, ఈ హింసను సహించడం ఎవరికీ సాధ్యంకాదు.

మరో పనిమనిషి 'జోస్యా'. బక్కపలచగావుంటుంది. కళ్ళల్లో కొంచెం మెల్ల వుంది. గులాబీపూలవంటి బుగ్గలు, వంకులు తిరిగిన జుట్టూ ఈమెకు ఒక శోభను కలిగిస్తూవుంటాయి. నటులంటే 'జోస్యా' పడిచస్తుంది. అందులోనూ ముఖ్యంగా లావుగావుండే హాస్య నటులంటే ఈమెకు ఎంతో ఇష్టం. ఎమ్మాఎడలకూడా ఈమె ఎక్కడలేని పేరిమి వొలకపోస్తూవుంటుంది. ఆమె అడుగులకు మడుగులొత్తుతూ, ఆమె ఆదరాభిమానాలు సంపాదించుకుంటూ వుంటుంది.

ఇక అయిదోవాడు "కర్బిష్". ఇతనికి నగరంలో పోలీసుపని. మంచి బలిష్టుడు. కసరత్తుచేసినమనిషి. పలుచని గడ్డం ఎర్రని వెంట్రుకలతో మెరుస్తూవుంటుంది. కళ్ళు నిద్రమత్తుగా వుంటాయి. గొంతు కొంచెం బొంగురుపోయివుంటుంది. కాని మాట్లాడుతూవుంటే హాయిగా వుంటుంది. ఇతను ఇంతకుముందు డిటెక్టివ్ శాఖలో పనిచేశాడు. వంకర టింకర ప్రశ్నలువేసి మనుష్యుల్ని వంచడంలో ప్రతిభాశాలి. ఈ విషయం అందరికీ తెలుసు. ఇతని శరీరంబలం, దానికితోడు కుచ్చితమైన బుద్ధి చూచి అంతా అదరిపోయేవారు.

చేసిన దుర్మార్గాలు, ఇతని మనసులో వుండే దురాలోచనలు అన్నీ ఇన్నీ కావు. ఇతను రెండేళ్ళక్రితం డెబ్బయిరెండు సంవత్సరాల వయస్సు కల ఒక భాగ్యవంతురాలిని పెళ్ళిచేసుకున్నాడు. సంవత్సరమైనా తిరక్కముందే ఆమెను గొంతుపిసికి చంపేశాడు. కాని ఎలాగో ఆ విషయం

బయటపడకుండా మాపుకున్నాడు. అయినప్పటికీ నగరంలో అందరికీ ఈ విషయం తెలుసు. 'అన్నా' ఇంట్లోకూడా అందరికీ కెర్బిష్ చరిత్ర విదితమే. అక్కడవున్నవారంతా ఇలాంటి పాపాలు, అకృత్యాలు అన్నో, ఇన్నో చేసినవారే. అంచేతే ఎవరిమటుకు వారు తమతమ లోపాలు కప్పిపుచ్చుకుంటూ, కెర్బిష్‌తో స్నేహం నెరపుతూవచ్చారు.

వారంతా గదిలో కూచుని కాఫీ తాగుతున్నారు. కెర్బిష్ మాత్రం బ్రాందీ సేవిస్తున్నాడు. ఏదో బలవంతాన, ముఖమాటంకోసం తాగుతున్నట్లు నటిస్తున్నాడు.

"ఏం కెర్బిష్‌గారూ! ఈ వ్యాపారం ఏమాత్రం బాగాలేదు. దినగండం నూరేళ్ళ ఆయుస్సుగావుంది మా పని. ఏదో మీరు కాస్త కనిపెట్టివుండాలి" అంది అన్నామార్కోవ్నా, కాఫీతాగుతూ.

కెర్బిష్ మెల్లగా గ్లాసుడు బ్రాందీ తాగేశాడు. ఆ తరువాత కొంచెం కాఫీకూడా సేవించాడు. ఎడమచేతి వుంగరపువేలుతో మీసాలు అటూ ఇటూ తుడుచుకున్నాడు. బల్లమీద చేతులు పారచాపి ఇలా అన్నాడు.

"ఏంచేయమంటారమ్మా? చూస్తున్నారుగా, నే నెంత చిక్కులో పడ్డానో! ఆ పిల్ల చూడబోతే మోసదోవపట్టింది. ఎవరిచేతుల్లోనో పడింది. మోసంచేసి ఇంటిలోంచి ఈడ్చారు. నేను ఏమన్నాఅను. ఒక్క మాటలో చెప్పాలంటే ఈ రొంపిలో చిక్కుపడింది. ఇప్పుడు చూడబోతే తల్లి తండ్రులు ఆ పిల్లకోసం పోలీసులద్వారా దర్యాప్తుచేస్తున్నారు. ఏమవుతుందో? పోలీసులు ఇళ్ళిల్లా వెదుకుతారు. చివరకు ఇక్కడ దొరుకుతుంది. మరి నన్నేం చేయమంటారు? ఈ జిల్లాలో పోలీసునౌకరీ ఏలుతున్నవాణ్ణి... మీరేచెప్పండి...నా పని ఎంత ఇరకాటంలోపడిందో?"

"అవును కెర్బిష్‌గారూ! ఆ పిల్లకు మైనార్టీకూడా వెళ్ళిందిగా!" మళ్ళీ అడిగింది యజమానురాలు.

"అవును. పసిపిల్లాఏమిటి? ఈడొచ్చినపిల్ల. పైగా ఈ పని తన ఇష్టప్రకారమే చేస్తున్నానని కాగితంకూడా రాసిఇచ్చింది" అన్నాడు ఇవయాసలిచ్ మధ్యలో అందుకొని.

అంతలో ఎమ్మా కూడా యజమానురాలికి వత్తాసుగా నిలబడింది.

"దేవుడిమీద ఒట్టుపెట్టి చెపుతున్నాను. ఆమెను ఇక్కడ మా కన్నకూతురుతో సమానంగా చూసుకుంటున్నాం" అంది ఎమ్మా, ఆ పిల్లకు ఏకేం అన్యాయం జరగడంలేదన్నట్లు.

"నే నా విషయం కాదు మాట్లాడేది" అన్నాడు పోలీసు కెర్బెష్ కొంచెం కోపంగా.

"మీరు సరిగానే చూస్తూవుండొచ్చు. అసలు విషయం అదికాదు. నేను నా సంగతి చెప్తున్నాను. నా పరిస్థితి ఏమిటి? ఇప్పుడు నేనేం చేయాలి? మీరే ఆలోచించండి. నా డ్యూటీ నేను చేయొద్దూ?" అన్నాడు మళ్ళీ కెర్బెష్ ముఖం చిట్లిస్తూ.

అది విని యజమానురాలు వెంటనే లేచి తలుపువద్దకి వెళ్ళింది. ఆమె కాళ్ళకు స్లిప్పర్లు వున్నాయి.

"కెర్బెష్‌గారూ! మా ఇల్లు కొంచెం మార్చాలనుకుంటున్నాను. జాగా చాలడంలేదు. గదులు కొంచెం పెద్దవి చేస్తే ఎలా వుంటుందంటారు?" అని అడిగింది అన్నా కెర్బెష్‌వైపు అదోరకంగా చూస్తూ.

"ఓ! దానికేం? పసందుగావుంటుంది" అన్నాడు కెర్బెష్ తాపీగా.

అన్నా గదిలోంచి వెలుపలికి వెళ్ళింది. కెర్బెష్‌కూడా ఆమె వెంటవెళ్ళాడు. ఆ తరువాత మరో పదినిముషాలకు తిరిగి ఇద్దరూ గదిలోకి వచ్చారు. కెర్బెష్ ఒక నూరు రూబుల్స్ నోటు—కొత్తనోటు, మడిచి తన జేబులో పెట్టుకున్నాడు. ఇంతకుముందు మాట్లాడిన ఆ పిల్ల ప్రస్తావన మళ్లీ రాలేదు. ఆ పిల్లను బలాత్కారంగా చెరిచి, పడుపువృత్తిలోకి దింపారు. ఇంతకుముందు కెర్బెష్ మాట్లాడిన విషయం అదే. అయితేనేం? తనకు పచ్చనోటు చేతిలోపడిందిగా! మళ్ళీ నోరెత్తలేదు. టేబిల్ మీదవున్న మరోగ్లాసు బ్రాందీ సేవిస్తూ, ఇంకేదో విషయం మాట్లాడసాగాడు కెర్బెష్.

'నా కో కొడుకువున్నాడు. వాడిపేరు 'పాల్'. హైస్కూల్లో చదువుతున్నాడు. ఆ వెధవాయి వున్నాడు చూశారూ? నా దగ్గరకొచ్చి 'నాన్నా నాన్నా! బళ్ళో పిల్లలంతా నన్ను తిడుతున్నారు. నీ వేమో పాడుపోలీసు నౌకరి చేస్తున్నావట. రోజూ తనిఖీలకని 'యామా' లోకి

వెళ్ళి అక్కడ సానులదగ్గర లంచాలు పుచ్చుకుంటావట. 'మీ నాన్న ఇలాంటివా'డని పిల్లలంతా నన్ను అసహ్యించుకుంటున్నారు.' అంటాడు వాడు. చూచారా? వేలెడంతలేడు—వాడిపొగరు! ఎంతఅవమానం ఎంత అవమానం' అంటూ తనకొడుకువిషయం చెప్పాడు కెర్బిష్.

'ఆ!...ఇవేం లంచాలు?... ఇక్కడ లంచాలుఇవ్వడానికి ఎవరి దగ్గరున్నాయి?... నేనిప్పుడు ఇచ్చింది...' 'అన్నా' అలా అంటూవుండగా కెర్బిష్ మళ్ళీ మధ్యలో అందుకున్నాడు.

'అదే నేనూ చెప్పాను. ఆ కుర్రకుంకకు నాలుగు చీవాట్లుపెట్టాను. వెళ్ళి వాళ్ళ ప్రిన్సిపాల్‌తో చెప్పమన్నాను. ఈసారి స్కూల్లో ఎవడైనా నాపేరు ఎత్తాడా, డొక్కచీలుస్తానని చెప్పాను. సరాసరి గవర్నరుజనరల్‌కు రిపోర్టు వ్రాస్తాననికూడా హెచ్చరించాను. అది కాదండీ! వాడుగాడబోతే ఇంతలేడు. ఏంబుద్ధులుపట్టుపడ్డాయో చూడండి. నా దగ్గరికొచ్చి 'నాన్నా నాన్నా! నీవు నాకు తండ్రివి కావు. నేను నీకుకొడుకునుగాదు. కావాలంటే మరో కొడుకును తెచ్చుకో' అంటాడు. చూచారా వాడి తెలివి. ఏం పోయే కాలం అనుకున్నారు? చెడామడాతిట్టి నెళ్ళవాయగొట్టాను. ఇప్పుడా గాధ వాయి నాతో మాట్లాడ్డంకూడా మానేశాడు. అయితేమాత్రం వదిలిపెడతానా? వాడి అంతు కనుక్కోనూ?' అన్నాడు పోలీసు కెర్బిష్.

'నాకు తెలుసు బాబూ! పిల్లలంతా అలాగే పాడయిపోతున్నారు. మాటవరసకు మా చిన్నపిల్ల 'బెర్తా' వుంది చూడండి. 'ఫ్లీషర్స్' హైస్కూలులో చదివిస్తున్నాం. పట్నంలోనే మంచి మర్యాదస్థులఇంట్లో వుంచి, విద్యాబుద్ధులు పట్టుపడేలా చూస్తున్నాం. అయినా ఆపిల్లముండ అప్పుడప్పుడు నాదగ్గరకొచ్చి ఇలాంటిమాటలే అంటూవుంటుంది. హైస్కూలులో అందరూ ఏదోఅంటున్నారని అసహ్యించుకుంటున్నారని ఏదోవాగుతుంది. కాని నేను సహిస్తాననుకున్నారా? చెమడాలొత్తి పంపిస్తాను.' అంది అన్నా.

"దేవుడితోడు. నిజంగా మా ఆటద, అపిల్లముండకు బుద్ధిచెబుతుంది." అంటూ భార్యను సమర్థించాడు ఇషయాసవిచ్.

"నేనుమాత్రంవూరుకుంటానటండీ! ఈగడుగ్గాయిచేష్టలు నాదగ్గరా? అయినా చూచారూ? స్టూడెంట్లుఅంతా ఇలాగే పాడయిపోతున్నారండీ.

ఏమిటో విప్లవం తీసుకొస్తారట, లోకాన్ని మారుస్తారట వెధవాయిలు. ఈ మొహాలేనా ఆపని చేసేది? సంఘం అంతా చెడిపోతున్నదంటారు. అసలు చెడిపోతున్నది వాళ్ళే. అవినీతి, లంచగొండితనం అన్నిచోట్లా వున్నాయి. ధర్మం, న్యాయం నశించాయి. తల్లిదండ్రులమీద భక్తి, గౌరవం మట్టికొట్టుకుపోయింది. ఈ బళ్ళల్లో చదివే కుర్రకుంకలందరినీ కాల్చేయాలి' అంటూ న్యాయమూర్తిలా ఉపన్యాసం దంచాడు కెర్బెష్.

"అవునండీ! మొన్న ఇలాంటి సంగతే ఒకటి జరిగింది. ఒక లావాటి ఆయన ఇక్కడికి వచ్చాడు..." అంటూ జోస్యా పోలీసుతో ఏదో చెప్పబోయింది.

కాని వెంటనే 'ఎమ్మా' కన్నుగీటి సైగచేస్తూ ఆమెను వారించింది.

"అవునుగాని జోస్యా! నీవు వెళ్ళి భోజనాలవిషయం చూడరాదూ?"

అది గ్రహించి జోస్యా మళ్ళీ మాట్లాడకుండా ఊరుకుంది. యజమానురాలు తిరిగి పోలీసుతో ఇలా అంది.

"అంతే కెర్బెష్‌గారూ! ఈ రోజులలో ఎవరినీ నమ్మలేకుండా వున్నాం. ఈ పిల్లలున్నారు చూచారూ? అస్తమానం ఎవరి ప్రియుణ్ణి గురించి వారు, ఏదేదో చెప్పుకుంటూవుంటారు. ఆనందిస్తుంటారు. అంతే కాని తాము చేయాల్సిన పనులనుగురించి బొత్తిగా ఆలోచించరు. తమ పోతలేమిటో తామేమిటో తప్ప, తక్కిన విషయాలు కొస్తయినా పట్టించుకోరు."

'అన్నా' అలా అంటూవుండగా, అంతలో అవతలనుంచి పెద్దగా తలుపు చప్పుడైంది. ఎవరో ఆడమనిషి పెద్ద గొంతుపెట్టుకొని పిలిచింది. ఇహ తాను అక్కడ వుండడం భావ్యంకాదని కెర్బెష్ లేచి తన 'పట్టా కత్తి' సరిచేసుకున్నాడు.

"ఇహ నాకు పనుంది, వెడతానమ్మా! ఇషయాసవిచ్! వెళ్లొస్తాను. దయవుంచండి" అన్నాడు కెర్బెష్. యజమానురాలితోటీ, ఆమెభర్తతోటీ.

"మరోగ్లాసు బ్రాందీ పుచ్చుకోరూ?" అంటూ ఇషయా టేబిల్ మీదవున్న బ్రాందీ గ్లాసులోపోసి కెర్బెష్ చేతికి ఇవ్వబోయాడు.

కాని కెర్బెష్ తీసుకోలేదు.

"వద్దు థ్యాంక్స్. ఇప్పటికే డోస్ ఎక్కువైంది. మరి వస్తాను. సెలవు" అంటూ కర్బేబ్ బయలుదేరాడు.

"అప్పుడప్పుడు వస్తూవుండండి" అన్నాడు ఇవయా నుళ్ళి, ఏదో మర్యాద చూపిస్తూ.

కర్బేబ్ వీధివాకిలిదాకా వెళ్ళి అక్కడో క్షణం ఆగాడు.

"ఎందుకైనా మంచిది. ఆ అమ్మాయిని తక్షణం ఇక్కణ్ణుంచి మరో చోటుకు పంపేయండి. ఎటుపోయి ఎటువస్తుందో! ముందు జాగ్రత్త కోసం చెపుతున్నాను. మీ క్షేమం కోరేవాణ్ణికనుక ఇంతగా చెప్పాల్సివచ్చింది." అంటూ వెనుకటి విషయాన్ని గురించి హెచ్చరించాడు కర్బేబ్.

కర్బేబ్ వెళ్ళిపోయాడు. అతను మెల్లగా దిగుతూవుండగా "ట్ఫీ"మని తలుపు వేసింది ఎమ్మా ఎడ్వర్డోవ్నా. "లంజకొడుకు! రెండు వైపులా అంచాలు కొడుతుంటాడు. వుండాకోరు వెధవ!" అంటూ ఎమ్మా పళ్ళు కొరుక్కుంది.

## 3

ఆరుగంటలకు అందరికీ భోజనంతయారైంది; అప్పటిదాకా కాలం మందంగా, విసుగ్గా, విశేషాలు ఏవీ లేకుండా మామూలుగా గడిచి పోయింది. అన్నా మార్కోవ్నాఇంట్లో అమ్మాయిలంతా పరికిణీలు కట్టుకునివున్నారు. వక్షోజాలు సగపడ కనిపించేలా, పొట్టిగావున్న బాడీలు తొడుక్కున్నారు. అంతవరకూ వాళ్ళు మొహాలు కడుక్కోలేదు. తలలు దువ్వుకోలేదు. చేతులకు చొక్కాలు లేనందున చంకలందాకా కన్పిస్తోంది. కాళ్ళకు బూట్లుగాని, చెప్పులుగాని ఏమీలేవు. పనీపాటా లేకుండా వట్టి కాళ్ళతోటి, ఈ గదిలోంచి ఆ గదిలోకి, ఆ గదిలోనుంచి ఈ గదిలోకి, పిచ్చికుక్కల్లా తిరుగుతున్నారు. మధ్య మధ్య "పియానో" దగ్గరకు వెళ్ళి వేళ్ళతో మీటలు నొక్కుతున్నారు. కొందరు బాజీటికిలాగ తమఅదృష్టం ఎలావుందోఅని చూచుకుంటున్నారు. సోమరితనంవల్ల అప్పుడప్పుడు వాళ్ళకు

చిరాకు కలుగుతోంది. ఏదో చీదరించుకుంటూ పూరాకనే కోపం తెచ్చుకుంటున్నారు. రాత్రికోసం ఎదురుచూస్తున్నారు.

ఇద్దరుపిల్లలు "ల్యూబ్కా", "న్యూరా" గుమ్మంలో నిలబడ్డారు. వీధినిపోయే జనాన్ని చూచి ఎందుకో విరగబడి నవ్వుతున్నారు. "ఏదోఇష్టం వచ్చినట్లు వాగుతున్నారు. దీపాలు వెలిగించేవాడు వీధిలాంతర్లు తుడిచి కిరసనాయిలు పోస్తున్నాడు. ఒక పోలీసువాడు చంకలో రిజిష్టరుబుక్కు పెట్టుకుని పోతున్నాడు. ముకోసానికొంప యజమానురాలు, వీధికి అడ్డంగా పడి, హడావుడిగా అంగడికి పరుగెడుతోంది.

న్యూరా చిన్నపిల్ల. కళ్ళు మందమైన నీలపురంగును కలిగివుంటాయి. కనుగుడ్లు అదోరకంగా వికారంగా అగుపిస్తాయి. జుట్టు అవిసెరంగుపూసినట్లుంటుంది. ఆమె కణతలదగ్గర, చిన్న నరాలు నీలిరంగులో పైకి ఉబ్బివున్నాయి. మొహం ఏదో దైన్యంగా, అమాయకంగా అగుపిస్తుంది. ఆమె తనకు పనిలేకపోయినా అనవసరంగా అన్నివిషయాలలో జోక్యం కలిగించుకుంటూవుంటుంది. అందరి దగ్గరా చనువుతీసుకుని అతిగామాట్లాడుతుంది. పైగా మాటలు అమితతొందర. ఆమె మాట్లాడుతోంటే, పసిపిల్లలకుమల్లే పెదవులమీదినుంచి ఉమ్మి బయటికొచ్చి బుడగలు లేస్తూవుంటాయి.

అంతలో ఒకపనివాడు వీధివెంటపోతున్నాడు. పల్లగా వంకులుతిరిగిన జుట్టు. ఏహించి వస్తున్నాడు. తాగివున్నట్లుగా అతనిమొహం స్పష్టపరుస్తోంది. గబగబా సారాకొంపవైపు పోతున్నాడు.

"ఏ, పాత్రిఖోర్ ఇవానిచ్! ఇవానిచ్! ఇలారా ఒకసారి! పొద్దుతిరుగుడు గింజలు పెడతా" అతన్నిచూచి చేతులూపుతూ పెద్దగాఅరిచింది న్యూరా. అలాఅరుస్తూంటే పకలు వినవచ్చింది. న్యూరా గుప్పిట్లో పొద్దుతిరుగుడు గింజలున్నాయి. నోట్లోపోసుకుని బొక్కుతోంది.

అంతలో వెనుకనుంచి తలుపుతోసుకుని, ఎమ్మా గడపలోకివచ్చి నిలబడింది. దయ్యంలాంటి ఆమె ఆకారం చూసేసరికి, న్యూరా, ల్యూబ్కా కూడా హడలిపోయారు. వాళ్ళనుచూడగానే "ఎమ్మా" మొహం ఎర్రగా కందగడ్డలా అయింది.

"ఎన్నిసార్లు చెప్పినా మీకు బుద్ధిలేదు. పట్టపగలు బయటకిరావద్దని ఎన్నిసార్లు చెప్పాను? ఛీ! సిగ్గులేదూ? వంటిమీదగుడ్డలేకుండా

ఆ మైలబాడీలు వేసుకుని, వీధిలో నిలబడి వచ్చేపోయే జనాన్ని చూస్తున్నారా? ఒకసారి చెప్పగానే బుద్ధివుండాలి. చూసేవాళ్ళు ఏమనుకుంటారు? పరువు పోతుందే! మీరు ఎక్కడవున్నారో కాస్త గుర్తుంచుకొని మెలగండి. పొద్దస్తమానం సోల్జర్లు పడి పొర్లే కొంపల్లో కాదు మీరుంది. మట్టు మర్యాదగల ఇంట్లో వుంటున్నారు. మలాయాలో వున్న మకిలముండలనుకున్నారేమో! జాగ్రత్త!" అంటూ ఎమ్మా రాక్షసిగొంతు పెట్టుకుని అరిచేసరికి, ఆ పిల్లలిద్దరూ ఉక్కిరిబిక్కిరి అయిపోయారు. చడీ చప్పుడూ కాకుండా లోపలికి పోయి వంటింట్లో ప్రవేశించారు.

వంటింట్లో మూడుకాళ్ళ ఎత్తుపీటలున్నాయి. వాటిమీద కూచుని, మాట, పలుకూ లేకుండా పొద్దుతిరుగుడు గింజలు బొక్కడం మొదలెట్టారు. వంటమనిషి 'ప్రాస్కోవియా' ఇంకా ఏవో సర్దుకుంటోంది.

వీళ్ళిద్దరూ ఇక్కడ వుండగా, అక్కడ 'మంకా' గదిలో చాలామంది అమ్మాయిలు చేరారు. 'మంకా' మంచి వయసులో వున్న పిల్ల. ఈమెను చిన్నమంకా, లేక తెల్లమంకా అని పిలుస్తారు. శరీరం తెల్లగా ధగధగ మెరుస్తూవుంటుంది. 'మంకా' మరోపిల్ల 'జోయా' ఇద్దరూ పక్కమీద కూచుని పేకాట ఆడుతున్నారు. 'జోయా' పొడుగ్గా, అందంగా వుంటుంది. కనుబొమ్మలు ఆర్చిలకున్నట్లే వుంటాయి. కళ్ళు పిల్లికళ్ళు. పెద్దవిగా ముందుకు పొడుచుకొచ్చినట్లుంటాయి. మొహం, విచిత్రంగా ఏదో వెలవెలపోతూవుంటుంది. ఆమె మొహంలో రష్యన్ సానుల లక్షణాలు పూర్తిగా వున్నాయి.

చిన్నమంకా, జోయా, ఇదరూ పక్కమీద కొసను కూచుని పేకాట ఆడుతూవున్నారు. ఆటపేరు "అరవైఆరు ఓకులు" మంకాకు ప్రాణస్నేహితురాలైన జెన్నీ పక్కమీద పడుకుని చదువుకుంటోంది. ఆమె చేతిలో అక్కడక్కడ చిరిగిపోయిన పాతపుస్తకం ఒకటుంది. అది డ్యూమాస్ వ్రాసిన "రాణీగారి రత్నహారం" అనే నవల. జెన్నీ నవల చదువుతూ సిగరెట్టు కాలుస్తోంది. జెన్నీకి చదువుపిచ్చి జాస్తి. ఆ ఇంట్లో వున్న పిల్లలందరిలోకీ, ఈమెను ఒక్కదానికే చదువుమీద ధ్యాస. చదవడం మొదలెడితే, అంతులేకుండా వేరేవిషయం ఆలోచించకుండా, పుస్తకం అయిపోయేదాకా అలాగే కూచుంటుంది. ఆమె చదివేవి నవలలు. అందు

లోనూ సాహసకృత్యాలతో నిండిన ఫ్రెంచినవలలంటే ఆమెకు అమిత ఇష్టం. నవలల్లో వచ్చే కథానాయకులు, వాళ్ళు చేసే యుద్ధాలు, సాధించే విజయాలు, అద్భుతమైన వర్ణనలు, సాహసకృత్యాలు, ఇవన్నీ చదువుతోంటే, ఆమె మనసు పొంగిపోతూవుంటుంది. ప్రపంచం మరిచిపోయి వాటిల్లో లీనమవుతూవుంటుంది. అంతేకాదు; నాయకీనాయకుల ప్రణయం, వాటికి వచ్చే అడ్డంకులు, అందుకోసం వాళ్ళు పడే బాధ, చేసే ప్రయత్నాలు, ఇవన్నీ జెన్నీ హృదయానికి హత్తుకుపోతాయి. తనే ఆ నవలల్లో కథానాయకిగానూ, తన ప్రియుణ్ణే నాయకుడుగానూ ఊహించుకుని ఉబ్బిపోతుంది. చదువుతున్నంతసేపూ పాత్రలతోపాటు తనూ పరుగెత్తుతుంది. 'నాలుగో హెన్రీ' నెరపిన ప్రేమకలాపాలు, అతని చతురోక్తులు ఆమెకు నచ్చుతాయి. ఫ్రెంచి చరిత్రకు సంబంధించిన ప్రతి నవలా ఆమెను ఆకర్షిస్తుంది. చదువులో ఇలాంటి ఆసక్తివున్నా, మామూలు జీవితంలో చాల మార్పుగా కనిపిస్తుంది జెన్నీ. చాలా తెలివైన అమ్మాయి. అందమైనపిల్లకూడా. సన్నగా, పొడుగ్గా తీగెలా వుంటుంది. చక్కని కళ్లు, ఆ కళ్ళల్లో ఏదో ఆకర్షణ. లోపల ఏదో ఆవేశం, అగ్నిలా మండుతున్నట్లు కళ్ళల్లో కనిపిస్తుంది. గర్వం, మితభాషిత్వం తెలిపేలా చిన్ననోరు. పై పెదవిమీద మీసాలువస్తున్నట్లు సన్నగా పొడుగ్గా గుర్తు కనిపిస్తుంది. బుగ్గలమీదమాత్రం కొంచెం అసహ్యంగా మచ్చలుపడ్డాయి. జెన్నీది కొంచెం చిరచిరలాడే స్వభావం. ద్వేషం, తిరస్కారభావం ఆమెకు అబ్బాయి. ఏమైనా ఆ ఇంట్లోవుండే అమ్మాయిలందరిలోకీ జెన్నీ ప్రత్యేకంగా అగుపిస్తుంది. బోర్డింగ్ బళ్ళల్లో పిల్లలుంటారుచూచారా? బడి పిల్లలందరిలోకి ఒక్కకుర్రాడు బలంగా ఏదో ప్రత్యేకంగా బడిపెద్దలా అగుపిస్తాడు. అలాగే ఒక్కొక్క తరగతిలో ఆడపిల్లలందరిలోకీ ఒక్క అమ్మాయి అందంగా, ఆకర్షణీయంగా వుంటుంది. ఇలాగే జెన్నీకూడా. పడుపుకత్తెలందరిలో ఒక ప్రత్యేకస్థానం ఆక్రమించుకున్నట్లు కనిపిస్తూ వుంటుంది.

జెన్నీ తన నోట్లోంచి సిగరెట్టుకూడా తీయలేదు. సిగరెట్టుపొగ మొహంచుట్టూ వ్యాపిస్తున్నా, తప్పించుకుండా చదువుతోంది. వేలితో, వరసగా పేజీలు తిప్పేస్తోంది. మోకాళ్ళవరకే పరికిణీ వేసుకుంది. పాదాలు

చాలా పెద్దవిగా వికృతంగా వున్నాయి. కాలి బొటనవేళ్ళు పెద్దవి. మడమలు కోసుగా బయటికి పొడుచుకొచ్చినట్లు కన్పిస్తున్నాయి.

పేకాట ఆడే ఇద్దరిపిల్లలుగాక, మరో అమ్మాయి కూడా పక్క మీద కూచునిఉంది. ఆమెపేరు 'టమారా'. కాళ్ళు మెలిక వేసుకుని కూచుంది. తల వంచుకుని లేసు అల్లుతోంది. 'టమారా' అందమైన అమ్మాయి. స్నేహానికి తగిన పిల్ల. టమేటాపండులా వుంటుంది. ఎర్రని ఉలవెంట్రుకలు. శీతాకాలంలో నక్కలమీద వుండే జుట్టులా దిరి, తళతళ మెరుస్తూ వుంటాయి. ఈ అమ్మాయి అసలుపేరు 'గ్లికెరియా'. 'లౌకేరియా' అనికూడా అంటారు. కాని పేరు మార్చుకుని టమారా అని పెట్టుకుంది. అసలు సానులందరూ అంతే. పడుపువృత్తిలో ప్రవేశించగానే, పెద్దవాళ్ళు పెట్టిన పేరు తీసేసి తమాషాగావుండే కొత్తపేర్లు తగిలించుకుంటారు. అవును మరి, సాధారణంగా వుండేపేర్లు; మాట్రియోనా, అగాఫియా, సైక్లిటినియా ఇలాంటివి వీళ్ళకు నచ్చవు. పేరులో ఏదో పెన్నిధి వున్నట్లు, విటులను ఇట్టే ఆకర్షించాలని వీరి ఉద్దేశ్యం. అందుకని, వినగానే వళ్ళు పులకరించేలా, కసిపించినపుడల్లా పలకరించేలా, మరిచిపోకుండా గుండెల్లో ప్రతిధ్వనించేలా, విచిత్రమైన పేర్లు పెట్టుకుంటారు. సానులందరికీ ఇదొక సరదా అయిపోయింది. టమారా సన్యసించిన స్త్రీలా కనిపిస్తుంది. ఆమె మొహం తెల్లగా తేలిపోతూ వుబ్బి వుంటుంది. ఏదో గంభీరత, కొత్తదనం కనిపిస్తూవుంటుంది. ఆమెను చూడగానే, అప్పుడే ఏదో సన్యాసుల మఠంలో చేరిందా ఏం, అనిపిస్తుంది. టమారా ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడదు. తోటివాళ్ళతో కలిసి తిరగదు. తన పనేమిటో తానేమిటో. వేరువేరుగా తప్పుకుని తిరుగుతూ వుంటుంది. తన రహస్యాలు ఎవరితోనూ చెప్పదు. తన గతిచరిత్ర ఎక్కడా వెళ్ళగక్కదు. ఆమె ఒక సన్యాసినిలా, సర్వసంగపరిత్యాగం చేసిన వేదాంతిలా కనిపించినా, ఆమె జీవితంవెనకాల అంతకన్నా ఏవో రహస్యాలు దాగి వున్నాయని తోస్తుంది. ఘోరమైన పాపాలు, విచిత్రమైన రహస్యాలు దాచిపెట్టుకున్నట్లు, ఆమె మాటల ధోరణి, ప్రవర్తన స్పష్టపరుస్తాయి. రెప్పలువాల్చి క్రీగంట చూస్తూవుంటుంది. ఆమె కళ్ళల్లో బంగారు తళుకులు మెరుస్తూవుంటాయి. ఆ చూపులు నిప్పుకణుకుల్లా నిలువెల్లా తాకుతాయి. నింపాదిగా, నిండుగా మాట్లాడుతుంది. టమారాకు

చాలా భాషలు వచ్చు, ఒకసారి ఆమె ఫ్రెంచి, జర్మన్ భాషల్లో అనర్గళంగా మాట్లాడేసరికి, అక్కడున్న పిల్లలంతా ఆశ్చర్యపోయారు. ఎంత మితభాషిగా మెలగుతున్నా ఇంట్లో అందరూ ఆమెపట్ల గౌరవభావాన్ని ప్రదర్శిస్తారు. తోటి అమ్మాయిలు, యజమానురాలు, పనివాళ్ళు అంతా ఆమెను మర్యాదగాచూస్తారు. ఆఖరుకు భయంకరంగావుండేవాకిట్లో కాపలావాడుకూడా, టమారా అంటే భయభక్తులతో సంచరిస్తాడు.

'ఇదిగోనేవ్! నా ఆట అయిపోయింది. యాభైఏడు, పదకొండు, అరవైఎనిమిది. మూడు నీ ఓకులం ఎన్ని అయినాయి?' అంది జోయా పేక ముక్కలు కిందపరుస్తూ.

'నాది ముప్ఫయి' అంటూ తన ముక్కలు చూపించింది మంకా. ఆటలో ఓడిపోయానని మంకాకు బాధగావుంది.

'నీ దుంపతెగ, ముక్కలన్నీ నీకు మనసులోనే వుంటాయే! ఆటలో కూచుంటేసరి నక్కను తొక్కివస్తావు. సరేలే, మళ్ళీ కలుపు' అంది మంకా జోయాతో. అలా అంటూనే పక్కనకూచున్న టమారా వైపు మొహం తిప్పింది.

'నీవు చెప్పవే టమారా? ఆ తరువాత ఏం జరిగింది?' అంది టమారాతో.

అంతసేపటినిబట్టీ టమారా ఏదో ముచ్చట చెప్తోంది. మంకా ఒక వైపు పేక ఆడుతూనే మరోవైపు 'ఊఁ' కొడుతూ ముచ్చట వింటోంది. టమారకు మంకా ప్రాణస్నేహితురాలు. ఆమె ఒక్కదాంతో కొస్త మనసిచ్చి మాట్లాడుతుంది.

జోయా మళ్లీ పేక కలిపింది. పేక బాగా పాతపడి మెత్తగా వేళ్ళకు అంటుకుపోతోంది. మంకా తన వేళ్ళకు ఉమ్మితడి చేసుకుని పేక కోసింది. జోయా ముక్కలు వేస్తూంటే, పక్కన కూచున్న టమారా తిరిగి చెప్ప సాగింది. ఆమె తలెత్తకుండా తన కుట్టుపని చూసుకుంటూనే మాట్లాడుతోంది.

'చర్చి అలంకారాలకు కావల్సిన అల్లికలన్నీ మేమే తయారు చేసే వాళ్ళం. రంగురంగుల దారాలతో రకరకాల పూలు, లతలు, చెట్లు, పిట్టలు అల్లేవాళ్ళం. చిత్రవిచిత్రాలయిన బొమ్మలు, శిలువగుర్తులు వేసేవాళ్ళం. బలి

పీఠంమీదికి కావల్సిన గుడ్డలు మేమే కత్తిరించేవాళ్ళం. మా అల్లికలన్నీ బంగారంలా ధగధగ మెరుస్తూవుండేవి. కిటికీలలో కూచుని ఈ పనులు చేస్తుండేవాళ్లం. మేం మధ్యమధ్య మాట్లాడుకుంటే మా అమ్మగారు సహించేదికాదు. ఆమెగారికి పోచుకోలుకబుర్లు పనికిరావు. ఎప్పుడూ దైవధ్యానం తప్ప ఆమెకు మరొకటి వచ్చదు. అందుకని మమ్మల్ని చాలా భయభక్తులతో పెంచేది. పనులు చేస్తున్నంతసేపూ పల్లెత్తి మాట్లాడేవాళ్ళంకాదు. బైబిల్‌లోని ప్రార్థనాగీతాలు పాడేవాళ్ళం. "ఓ ప్రభూ! మా మొరాలకించు" అంటూ మేమంతా గానంచేస్తోంటే ఎంత హాయిగా, మధురంగా వుండేదనుకున్నావు? హృదయాలు ఊగిపోయేవి. ఏమోలేవే! జరిగిపోయిన ఆ సంగతులన్నీ తలుచుకుంటే ఒక కలలా తోస్తుంది.' అంటూ తన చిన్ననాటి సంగతులు చెప్పతోంది టమారా.

చదువుకుంటూన్న జెన్నీ అదంతా విన్నది. పుస్తకం పొట్టమీద ఆనించుకుని ఇలా అంది.

'మాకంతా తెలుసులేవే టమారా! నీవేం చెప్పక్కరలేదు. నీ జీవితమంతా ఒక సినిమాలావుంటుందిలే! నీవు చిన్నప్పుడు బంగారంతో ఆడుకునేదానివి. దేవుడు అహర్నిశలూ నీవెంట తిరుగుతూవుండేవాడు కదూ?'

జెన్నీ హేళనచేస్తూ ఈమాటలు అంది. అంతలో ఆటలోకూచున్న మంకా అనుకుంది.

'ఇందాక నలభై, ఇప్పుడు నలభైఆరు. పందెం నేనే గెలిచాను' అంటూ మంకా పెద్దగా చప్పట్లు కొట్టింది. 'ఈసారి ఆట మూడుతో ప్రారంభిస్తాను.'

జెన్నీమాటలు విని టమారా చిరునవ్వు నవ్వింది. అప్పుడామె మొహం ఎలావుందని? చిత్రకారులు గీసేబొమ్మలోమాదిరి ఏదో శోభ ఆమె మొహంలో కనిపించింది.

'అవును, లౌకికం నేర్చిన పెద్దమనుషులంతా అలాగే మాట్లాడతారు. పవిత్రమైన సన్యాసినుల జీవితంలోకూడా, ఏవో పుక్కిటికథలు అల్లి పరిహాసం చేస్తారు. ఒకవేళ పాపంచేస్తే మాత్రం పోయిందేమిటి?' అంది టమారా, జెన్నీ అన్నమాటలకు వ్యంగ్యంగానే సమాధానం చెప్తూ.

'పాపం లేనప్పుడు భయమెందుకు? నీవు పాపం చేయకపోతే పశ్చాత్తాప పడాల్సిన పనేలేదు' అంది మధ్యలో జోగుతూ, నోట్లో వేలుపెట్టుకుని. ఒక్క క్షణం తరువాత మళ్ళీ జెన్నీ ఇలాఅంది.

'టమారా! నీవు చాలా విచిత్రమైనపిల్లవే! నిన్నుచూస్తోంటే ఒక్కొక్కసారి నాకు అమితమైన ఆశ్చర్యం కలుగుతుంది. సోంకాలాంటిపిల్లలు అడ్డమైనవాళ్ళతో తిరుగుతూ వెకిలిచేష్టలు చేస్తుంటారు. అందులో కొంత అర్థం వుంది. ఎందుకంటె వాళ్ళు మూర్ఖులు. అన్నిటికీ తెగించినవాళ్ళు. నీవున్నావు చూచావూ? అన్నిట్లో ఆరితేరిన ఘటానివి. రకరకాలు రుచిచూచిన రంగసానివి. కాని ఏంలాభం? నీవుకూడా కొన్ని విషయాల్లో చాలా తెలివితక్కువగా ప్రవర్తిస్తూంటావు. నీవిప్పుడు ఆ లేసు ఎందుకు కుడుతున్నట్లుచెప్పు?'

టమారా, కుడుతోన్న గుడ్డతీసి మోకాళ్ళమీద పరుచుకుంది. వాల్గన్నులతో జెన్నీవంక చూస్తూ ఇలాఅంది.

"ఏంచేయను జెన్నీ? నేను ఊరికే కూచోలేను. విసుగుపుడుతుంది. పేకాట అంటే నాకు చెడ్డచిరాకు. మరి ఎలాగో పొద్దుపోవాలిగా? అందుకని..." అది విని జెన్నీ తలూపింది.

"నిజంగా నీవు విచిత్రమైన పిల్లవు టమారా! మా అందరికంటె నీకు విటులదగ్గరనుంచి సంపాదన ఎక్కువొస్తుంది. ఆ డబ్బంతా నీవు దాచుకుంటే బాగుండిపోను. ఏమిటో నీపిచ్చి, అనవసరమైనవాటికి తగలేస్తూవుంటావు. ఒక్కొక్క సీసా, ఏడురూబుల్సు పెట్టి సెంట్లు,తలనూనెలుకొంటూంటావు. దేనికి చెప్పు? ఇప్పుడు నీవు కడుతోన్న సిల్కుగుడ్డఖరీదు పదిహేను రూబుల్సు అది సెంకా కోసమేకదూ?" అడిగింది మళ్ళీ జెన్నీ.

"అవును. సెనుష్కాకోసమే" అంది తిరిగి టమారా.

"నీవు నిజంగా అదృష్టవంతురాలివి. ఎందుకూ పనికిరాని ఆ దొంగ వెధవ! వాడు ఒక పెద్ద ఛీఫ్ కమాండరు వచ్చినట్లుగా ఇక్కడికొస్తాడు. ఏమిటో ఆశ్చర్యం? వాడు నిన్ను ఒకదెబ్బయినా కొట్టడు. అయితే ఏంలే? నిన్నురాత్రంతా బాగాఉపయోగించుకుంటాడు.' అంది జెన్నీ.

"నాకు సాధ్యమైనంతవరకూ సంతోషపెడతాను" అంది టమారా దారం నోట్లోపెట్టుకుని తెంపుతూ.

'ఎలాగైనా నీవు అమాయకురాలివి. వచ్చినవాణ్ని వల్లో వేసుకుని వీలైనంత గుంజడం నీకు చాతకాదు. నీఅంతట నీవే లొంగిపోయి, నిజమైన ప్రేమతో వాళ్ళను సుఖపెడతావు. నీ అందం నీ చందం, నీ కళ్ళూ, నీ కళ్ళూ నాకు కనుక వున్నట్లయితేనా, మగాళ్ళను మూర్ఛపుల్ని చేసి, ముక్కుకు తాడేసి ముద్రిముడుపులు గుంజకపోయానా? ఈపాటికి మూటలు మూటలు ఆర్జించకపోయూనా!' అంది తిరిగి జెన్నీ.

"ఏంచేస్తాం? జెనుష్కా! ఎవరి అదృష్టంవారిది, ఎవరి అభిరుచులు వారివి. నీవుమాత్రం అందకత్తెవు కావా ఏమిటి? పైగా నీకు ధైర్యసాహసాలుకూడా వున్నాయి. అయినా ఏం చేస్తాం? మనకర్మ కాలి, ఇద్దరికీ, ఈ అన్నా మార్కోవ్నా అడుగులకుమడుగు లొత్తాల్సిన గతిపట్టింది" అంది టమారా.

అదివినేసరికి జెన్నీకి ఏదో దుఃఖంవచ్చింది. గట్టిగా నిట్టూర్చి ఇలా అంది.

'అవును మన కర్మ! అయినా నా కంటే నీవే, అదృష్టవంతురాలివి! నీ దగ్గరికి వచ్చేవాళ్ళు కొస్త పైలాపచ్చీసుగా వస్తారు. పైసా విసిరిపారేస్తారు. వచ్చినవాడూ సుఖపడతాడు. నీకూ ఆనందం కలుగుతుంది. మరి నా కర్మ ఏమిటో ఎప్పుడుపట్టినా అధ్వాన్నంగానే ఏడుస్తుంది. నా దగ్గరికి ముసలాళ్ళన్నా వస్తారు, లేకపోతే మరీ పసిపిల్లలయినా వస్తారు. సరసమైన సరసుడు ఒక్కడూ సరసకురాండే! ఆ పసికుర్రాళ్ళంటే నాకు తగని అసహ్యం. ఒక కుర్రాడొస్తాడా? వాడికి అమిత తొందర. ఎప్పుడు అవజేసుకుని బయటపడదామా అని చూస్తాడు. తగనిభయం. పట్టుకోగానే వణికిపోతాడు. అతనిపని అతను చేసుకుపోవడానికే చచ్చేసిగ్గు. బిత్తర బిత్తర చూపులు చూస్తాడు. వాడి చేష్టలు చూస్తుంటే చెముడాలొత్తాలనిపిస్తుంది నాకు. ముందుగానే జేబులో చేయిపెట్టి రూబుల్సు తీసుకుంటాను. గట్టిగా గుప్పిటపట్టుకుని కూచుంటాడు. అది వెచ్చగా, చెమటతో తడిసివుంటుంది. పనికిమాలిన కుర్రకుంకలు! వాళ్ళమ్మ ఏదో కొనుక్కుతినమని పది కోపెక్కులు ఇస్తుంది. అందులో కొంత, ఈ వెధవలు ముందలకోసమని దాచిపెట్టుకుంటారు. మొన్న నా దగ్గరికి మిలటరీస్కూల్లో చదివే ఒక కుర్రాడు వచ్చాడు. కావాలనే నేను వాడితో ఒక ఆట ఆడాను. చాక్లెట్ల పొట్లం

ఒకటి చేతికిచ్చాను. 'అబ్బాయీ! నాల్గులుసు వెకుతూ దోవలో తిను నాయనా!' అని చెప్పాను. కాని ఆ వెధవాయి ఏంచేశాడో తెలుసా? మొదట బిడియపడ్డాడు. తరువాత ఎలాగో తీసుకున్నాడు. అతను పోతోంటే నేను మెట్లమీద నిలబడి కనిపెడుతూనేవున్నాను. గడప దిగాడో లేదో, అటూఇటూ పారచూచి, గభాలున చాక్‌లెట్లు నోట్లో వేసుకున్నాడు. పందిబుద్ధి, వాడూను!" ఆవిధంగా జెన్నీ తన అనుభవాలు చెప్పింది.

"ఇహ ముసలాళ్ళసంగతి చెప్పనక్కర్లేదు. ఏడ్చి మొత్తుకున్నట్లుం టుంది'. అంది మంకా ఇదంతా వింటూ.

'ఏమే జోయా, నీ వేమంటావు?' అంటూ జోయాను ప్రశ్నించింది మళ్లీ మంకా.

అప్పటికి జోయా ఆట పూర్తిచేసి వళ్ళు విరుచుకుని పెద్దగా ఆవ లిస్తోంది. ఈ ప్రశ్నకు కోపం తెచ్చుకోవాలో, లేక నవ్వాలో జోయాకు తెలీలేదు. ఆమెదగ్గరికి ఒక విటుడు వరసగా వస్తూంటాడు. పెద్ద ఆఫీసరు. కాని బాగా ముసలాడు. మతికూడా చలించింది. జోయా అతనితో సరసా లాడడం చూచి, మిగతావాళ్ళంతా పగలపడి నవ్వేవారు. జోయాతో పరిహా సాలాడేవారు. అందుకనే ఇప్పుడు మంకా, ఆమెను అలా వ్యంగ్యంగా ప్రశ్నించింది.

'పోనిద్దురూ పాడుపీడ! ఆ ముసలిముండాకొడుకుల్ని నరకంలో పడి చావనీ' అంది జోయా, ఆవలించడం పూర్తిచేసి విసుగ్గా.

"అదికాదే జోయూ! మరోసంగతి చెపుతాను విను. నాదగ్గిరికివచ్చే కుర్రాళ్ళకంటె, నీకోసంవచ్చే ఆముసలాడికంటే, మన మంకా పరిస్థితి మరీ ఘోరంగా వుంటుంది. దానికోసంవచ్చే ఆసుర్రాణ్ని చూచావా? గుర్తు లేదూ? తాగుబోతు వెధవ, వళ్ళంతా చెమటకారుతూ మురికికంపు కొడుతూ వుంటుంది. పైగా శరీరమంతా మచ్చలు. ఇహవాడి బండారం అల్లా ఆసిల్కు చొక్కా ఒక్కటే. అదీ మన టమారాం పుణ్యమాఅంటూ అబ్బింది వాడికి. మాట్లాడితే బూతులకు లేస్తాడు దొంగలంజకొడుకు! ఛీ!తగాదాకు సిద్ధంగా వుంటాడు. పైగా "నా పే) చూసి మంకా ఒక్కతే-హా! మంకా! నాముద్దుల మంకా! నా వరహాలమంకా!" అంటూ అరుస్తాడు, వెధవగొంతూవాడూను. ఏమే మంకా, నిజమేనా? ఊ! చెప్పవేం?" అంటూ జెన్నీ మంకాను

రెండుచేతులతో గట్టిగా కౌగలించుకుంది. మంచంమీదపడేసి, ఆమెజుట్టూ కళ్లూ, బుగ్గలూ, నొక్కి నొక్కి ముద్దుపెట్టుకుంది.

"మంకాకు ఒక్క క్షణంవరకూ ఊపిరి ఆడలేదు. పైగా జెన్నీ చేష్టలకు చక్కలిగింతలు పుట్టి పెద్దగా నవ్వడంమొదలెట్టింది.

'ఊరుకోవే జెన్నీ! నన్ను లేవనీ! మా అమ్మవుకదూ!' అంటూ పట్టు తప్పించుకోవాలని జెన్నీని ప్రాధేయపడింది మంకా.

అంతలో లోపల్నుంచి పనిమనిషి జోస్యాపిలుపు వినిపించింది.

'భోజనం వడ్డించానమ్మాయ్! భోజనం వడ్డించాను. రాండి రాండి!' పెద్దగా అరుస్తూ జోస్యా, పరుగెత్తుకు మంకాగదిదగ్గరికి వచ్చింది. గది తలుపు తీసింది.

'భోజనం వడ్డించానమ్మా! త్వరగా రండి' అంది జోస్యా మళ్లీ.

అంతా గుంపుగా వంటింట్లోకిపరుగెత్తారు. వారంతా ఇంకా అంగాలు కట్టుకునేఉన్నారు. కాళ్ళూ, మొహం కడుక్కున్న పాపానపోలేదు. వాళ్ళకు స్లిప్పర్లుతప్ప మరేం లేవు. అందరూ భోజనాలముందు కూచున్నా రేకాని, ఒక్కరికీ తినాలనిలేదు. ఒక్కరికీ ఆకలి వున్నట్లు కనిపించదు. ఏదో ఆ వాంఛ తీర్చుకుంటే సరిపోతుందని వచ్చినట్లుగావుంది. ముందు టమాటోపులుసు పోసుకుని రుచిచూచారు. ఆతరువాత మాంసంముక్కలు కొంచెం కొంచెం కొరికి తిన్నారు. అందరూ అదో కంగా ఏవో వుపన్యాసాలు పెట్టుకుని, పళ్ళాలముందు ఊడిగలపడి కూచున్నారు. అవును పాపం! వాళ్ళకు ఆకలి చచ్చిపోయింది. అనేకదురభ్యాసాలవల్ల అలవాటుపడి ఆకలి పోగొట్టుకున్నారు. ఆశలు చంపుకున్నట్లే, ఆకలీ చంపుకున్నారువాళ్ళు. వాళ్ళల్లో 'నైనా'అనే ఒక అమ్మాయివుంది. చిన్న చప్పిడిముక్కు. ఎప్పుడూ ముక్కులు దిబ్బడలేసివుంటాయి. ఈమె రైతుకుటుంబంలో పుట్టింది. ఇటీవలనే, అంటే రెండునెలలక్రితం ఒక వ్యాపారి పుణ్యాన ఈ పిల్ల శీలాన్ని చెరిచాడు. తరువాత సానికొంపకు అమ్మేశాడు. ఈమెమాత్రం కొస్త కడుపునిండా తింటోంది. ఇటీవలనే ఈ రంగంలోకి దిగడంవల్ల, ఇంకా పూర్తిగా చెడిపోలేదు. అడిగి పెట్టించుకుని ఆవురావురుమని తింటోంది నైనా.

జెన్నీ ఒక మాంసంముక్కలో సగం కొరికతిని, పక్కన కూచున్న ఫెక్లాపాతో ఇలా అంది.

'ఒసేయ్, ఫెక్లూషా! నాదికూడా నీవేతినవే. నా చిట్టితల్లివికదూ! ఇది కూడా తినమ్మా. సిగ్గుపడకులే. నీ వింకా బాగా బలవాలి. ఎందుకో చెప్పనా?" అంటూ జెన్నీ అందరినీ కలయచూచింది. 'కొందరికీ 'ఎండువాత రోగం' వుంటుందికదా. మన ఫెక్లూషాకూడా ఆరోగం వుండితీరాలి. ఆ జబ్బుకల పిల్లలు ఏం చేస్తారో తెలుసా? వాళ్ళకి ఆకలి ఎక్కువ. అందుకని ఇద్దరుతినే తిండి, వాళ్ళు ఒక్కరే తింటారు.' అంది జెన్నీ వ్యంగ్యంగా.

సైనా అడిగి పెట్టించుకుని ఆవుర వురున తింటోందని జెన్నీకి అసూయగావుంది. అందుకని సైనాను ఎగతాళిచేయడంకోసం, ఫెక్లూషా పేరు పెట్టి ఎత్తిపొడిచింది జెన్నీ. అయితే ఆమాత్రం తెలివి సైనాకు లేకపోలేదు. తన్ను గురించే జెన్నీ అలా అంటోందని అర్థం చేసుకుంది.

"నాకేం లేదు ఎండువాతరోగం. అన్ని రోగాలూ నీకే వున్నాయి. అందుకే అలా ఎండిపోతున్నావు" అంది సైనా రోషంతో. సైనా గబగబా భోజనం పూర్తిచేసింది. ఎక్కిళ్ళు వస్తోంటే, నీళ్ళు తాగింది. ఎవరూ గమనించకుండా క్రాస్ చేసుకుని దేవుణ్ణి ప్రార్థించింది. అవును, సైనాకు అది అలవాటే. రోజూ క్రాస్ చేసుకుంటుంది.

కొద్ది క్షణాలు ఎవరూ మాట్లాడలేదు. అంతలో అవతల్నుంచి పెద్దగా జోస్యా అరవడం వినిపించింది.

'ఇహ కానీయండమ్మా! త్వరగా తెమలండి. ముచ్చట్లతో కాలక్షేపం చెయ్యడానికి పొద్దులేదు. ఊ! త్వర త్వరగా ముస్తాబై గదుల్లోకి పదండి' అంటూ జోస్యా కంచుగొంతు పెట్టుకుని అరచింది.

కొద్ది నిముషాల తరువాత ఇంట్లో ప్రతిగదీ గుసగుసలతో నిండిపోయింది. గబ్బునూనెలు రాని తలలు దువ్వడం, [illegible] హైమాల్ సబ్బుతోటి, చౌకరకం వాసన నీళ్ళతోటీ మొహాలుతోమడం చకచకా జరిగిపోతోంది. పడుపుకత్తెలంతా వచ్చేరాత్రికోసం ముస్తాబు అవుతున్నారు.

# 4

క్రమ చీకటిపడింది. ఆకాశంమీద మిణుకు మిణుకుమని నక్షత్రాలు గోచరించాయి. క్రమక్రమంగా భూమి అంతా చీకట్లు కమ్ముకున్నాయి. కాపలావాడు సిమన్ ఎర్రలాంతర్లు వెలిగించి గుమ్మాలముందు తగిలించాడు. విటులు వచ్చి కూచునే మొదటి హాలులోనూ, మెట్లదగ్గిర, లాంతర్లు ముట్టించి పెట్టాడు. సిమన్ భారీ మనిషి. వెడల్పాటి భుజాలు, నల్లని జుట్టు. కళ్ళల్లో గాంభీర్యం ఉట్టిపడుతూ వుంటుంది. మొహం కొట్టవచ్చినట్టుగా వుంటుంది. వెడల్పాటి కనుబొమలు, పెద్దమీసాలు. మొహంనిండా స్ఫోటకం మచ్చలున్నాయి. సిమన్‌కు పగలల్లా పనిలేదు. ఎక్కడో స్వేచ్ఛగా పడుకుని నిద్రపోతాడు. చీకటిపడగానే గుమ్మంలో కాపలా కూచుంటాడు. ఇంటికి వచ్చే విటులకు ఎలాంటి అసౌకర్యం కలగకుండా దోవ చూపిస్తూవుంటాడు.

పియానోవాయించేఅతను పెందలకడనే వచ్చాడు. అతను పొడుగ్గా వుంటాడు. సన్నగా, నాజూగ్గా వుంటాడు. చిన్నవాడే కాని, కనుబొమలు కనురెప్పల వెంట్రుకలు దాదాపు తెల్లగా వుంటాయి. పడికంట్లో పొర కూడా వుంది. విటులెవరూ రాకముందే, అతనూ, ఇషయాసవిచ్ కలిసి సంగీతం ప్రారంభిస్తారు. ఇంకేం? ఇవాళకూడా ఇతనూ, ఇషయాకలిసి ఒక డాన్సుపాట రిహార్సలు చేసుకుంటున్నారు. ఆరోజుల్లో పాస్ డి స్పాగిన్ అనే డాన్సు కొత్తగావచ్చి ప్రజల్లో పనపడిపోయింది. ఆ డాన్సు పాటే వాళ్ళిద్దరూ ఇప్పుడు అభ్యాసం చేసుకుంటున్నారు. విటుడు ఎవరైనావచ్చి డాన్సు చేయమని ఉత్తర్వుచేస్తే, వీళ్ళు వెంటనే ప్రదర్శిస్తారు. ఈనృత్యంలో రకాలున్నాయి. ఒకరకంగా తేలికఅయిన నృత్యానికి దఫాకు ముప్ఫయి కోపెక్కులు పుచ్చుకుంటారు. మరోరకమైన నృత్యానికి తడవకు యాభైకోపెక్కులు వసూలుచేస్తారు. ఈవిధంగా వసూలైనడబ్బును భాగపంపిణీలుచేస్తారు. సగభాగం ఇంటి యజమానురాలుకు పోతుంది. మిగతా సగాన్ని పియానో వాయించే అతను, అన్నా మార్కోవ్నా మొగుడు ఇషయాసవిచ్ సమానంగా పంచుకుంటారు. కనుక పియానో వాయించే అతనికి, వసూలయిన సొమ్ములో నాలుగోవంతుమాత్రం వస్తుం

దన్నమాట. ఒకవిధంగా ఇది అన్యాయమే. ఎంచేతంటే, రెండోవాడైన ఇషయాసవిచ్‌కి భాగం పెట్టడం శుద్ధదండుగ. అతను ఫిడేలువాయిస్తాడేకాని అంతా తప్పులు వాయిస్తాడు. నృత్యంకూడా సరిగా చేతకాదు. ఇతను చేసే తప్పులన్నీ, పియానోవాయించేఅతను సరిచేస్తూవుంటాడు. మరి ఇలాంటి పనికిమాలినవాడికి భాగం ఇవ్వడం అనవసరంకాదూ? శ్రమపడే వాడు పియానోఅతను, సొమ్ము చేతులో వేయించుకునేవాడు ఇషయా. అయినా తప్పదు మరి. ఇకపోతే పియానో వాయించేవాణ్ణి గురించి వేశ్యలంతా, వచ్చినవిటులతో గర్వంగా చెప్తారు. అతనొక గొప్ప సంగీత విద్వాంసుడనీ, ప్రభుత్వం నెలకొల్పిన సంగీత కళాశాలలో చదువుకున్నాడనీ, విద్యార్థులందరిలోకీ విశేషప్రతిభకలవాడనీ గొప్పలు చెపుతారు. కానీ అతను యూదీయుడవడంవల్ల, పైగా కళ్ళకు జబ్బువచ్చిన కారణాన, కళాశాలలో విద్య పూర్తికాకుండానే మానుకోవలసివచ్చిందనీ చెప్తారు. ఇలా చెప్పడంవల్ల తమకు గౌరవం వస్తుందనీ, తమ ప్రతిభ ఇనుమడిస్తుందనీ, వాళ్ళ ఉద్దేశ్యం.

అన్నామార్కోవ్నాఇంట్లో వేశ్యలంతా వన్నెగా ముస్తాబుచేసుకున్నారు. వచ్చే పురుషపుంగవులకు మరులుగొలిపేలా తయారయి ఎదురు చూస్తున్నారు. కొందరు కిటికీలలో కూచున్నారు. మరికొందరు కిటికీ అద్దాల తలుపులు పట్టుకుని అటూ, యిటూ ఊపుతూ, దిక్కులుచూస్తూ నిలుచున్నారు. వాళ్ళహృదయాలు ఏవో పరువెత్తుతున్నాయి. ఏవేవో మధురమైనకోర్కెలు మొలకెత్తుతున్నాయి. ప్రతిరోజూ ఇంతే. సాయంత్రం కాగానే వారి మనసుల్లో చిత్రవిచిత్రమైన తలంపులు తలెత్తుతాయి. ఆరోజు తమకు ఎలాంటి విటులు తటస్థిస్తారో, ఎలాంటి సంఘటనలు జరుగుతాయో అని ఉవ్విళ్ళూరుతూ వుంటారు. అవును, ఆనాడు వచ్చేవారిలో కొందరు నిజంగా తాము ప్రేమించేవారు వుండవచ్చు; పాతఖాతాదార్లేవచ్చి చనువుగామాట్లాడి, పూర్వస్మృతులు కలిగించి సంతోషపెట్టవచ్చు, లేక ఎన్నడూ చూడని కొత్తముఖం కనిపించి ఆశ్చర్యపడేలా చేయవచ్చు. అసలు ఇవేవీ కాక ఏ ఉదారచిత్తుడో, ఏ పుణ్యపురుషుడో హఠాత్తుగా సాక్షాత్కరించవచ్చు. అతని సహాయంవల్ల ఆనాటితో తమ అదృష్టం మారిపోతుం

దేమో? ఒక కొత్తజీవితం ప్రారంభమవుతుందేమో? ఏమో ఎవరు చెప్ప
గలరు? దేనికైనా అవకాశంవుంది.

సంధ్యవేళ సానులంతా అలాంటి ఊహాలతో క్షణక్షణం ఉత్సుక
పడుతూ, ఉత్సాహం తెచ్చుకుంటూ వచ్చేవారికోసం వేచివున్నారు. నిజా
నికి వారి ఊహల్లో అతిశయోక్తి ఏమాత్రం లేదు. అసత్యం అంతకన్నా
లేదు. ప్రతిరోజూ ఈ కొంపల్లో ఏదో ఒక అద్భుతమైన సంఘటన, అసా
ధారణమైన విషయం జరుగుతూనే వుంటుంది. అందువల్లనే ఏరోజుకు ఆరోజు
ఒక కొత్తరోజుగా వారు భావించగలుగుతున్నారు. ఆ చీకటిజీవితంలో
మార్పు లేకపోయినా, ఆరోజులోమాత్రం మహిమ వుంది.

ఒక్కొక్కరోజు ఎవరూ ఎన్నడూ ఎరగని కొందరు కొత్తమనుషులు
ఎక్కణ్ణుంచో ఈ కొంపల్లో ఊడిపడతారు. దాంతో ఒక తుఫాను వీస్తుంది.
ఉదాహరణకు ఒక పోలీసువాడు సామాన్యదుస్తులతో కొందరిని వెంట
బెట్టుకుని అకస్మాత్తుగా వస్తాడు. కొందరు పెద్దమనుషులను, మర్యాదస్తు
లను అరెస్టుచేస్తాడు. వాళ్ళను తన్నుకుంటూ, లాఠీలతో తలమీద బాదు
కుంటూ లాక్కునిపోతాడు. మరోసారి తప్పతాగి అల్లరిచేసే రౌడీవెధవ
లకు, సానికొంపల్లోవుండే కాపలావాళ్ళకు పెద్ద కొట్లాట జరుగుతుంది.
తాగివచ్చిన రౌడీవెధవ ఎవడో ఒక కాపలావాణ్ణి కొడతాడు, అదిచూసి
మిగతా కాపలావాళ్ళంతా వాడికి సహాయం చేయడంకోసం పరుగెత్తు
తారు. దాంతో పెద్ద గలాటా, భయంకరమైన యుద్ధంజరుగుతుంది. ఈ కొట్లా
టలో వాళ్ళకు ఒళ్ళుతెలీదు. పియానోలు విరగ్గొడతారు. కిటికీ అద్దాలు
పగులకొడతారు. ఒకరినొకరు కుర్చీలతో కొట్టుకుని తునాతునకలు చేస్తారు.
మెట్లమీద, నడవలో రక్తం మడుగుకడుతుంది. కొందరికి కాళ్ళు విరుగు
తాయి. మరికొందరికి తలలు పగులుతాయి. ఇంకా కొందరు గుమ్మంముందు
వున్న మురుగుకాలువలో పడి తన్నుకుంటారు, ఇలాంటి భీభత్సం జరిగే
సమయాలలో ఇండ్లలోవుండే పడుపుకత్తెలంతా భయంతో వణికిపోతారు.
పంచప్రాణాలూ బిగపట్టుకుని పక్కలకింద దాక్కుంటారు. కాని జెన్ని
వుంది చూచారూ? ఆ పిల్లకు ఇలాంటి సమయాల్లో భలే హుషారుగా
వుంటుంది. తొడలు చరుచుకుంటూ దెబ్బలాటమధ్యకు ఉరుకుతుంది. ఇరు

పక్షాలవారినీ ఉసిగొల్పుతుంది. పిల్లలంతా ప్రాణాలు గుప్పిటపట్టుకుని కూచుంటే, తనుమాత్రం నిర్భయంగా గంతులువేస్తూ ఆనందిస్తుంది జెన్నీ.

ఇంకొకప్పుడు ఏ అధికారసంస్థకు చెందిన సభ్యుడో, లేక షరాబో ఒక గుంపును వెంటపెట్టుకుని రావడం తటస్థిస్తుంది. ఇతను అనేక సంవత్సరాలబట్టీ వేలకువేలు రూబుల్సు జూదంలో తగలేశాడు. అపరిమితమైన తాగుబోతుకూడా అలవాటుపడి తన సర్వస్వం కోల్పోయాడు. చివరకు విసిగిపోయాడు. జీవితంమీద విరక్తిపుట్టింది. ఆత్మహత్య చేసుకోడానికో, జైలుకు పోవడానికో సిద్ధపడ్డాడు. అందుకని తనదగ్గరున్న చివరి కోపెక్కువరకూ ఖర్చుచేసి వళ్ళు తెలియకుండా తాగాడు. అతనికి పూర్తిగా మతిపోయింది. ఎంతటి ఘోరమైనా సునాయాసంగా చేయడానికి సంసిద్ధుడైనాడు. ఇలాంటి ఉన్మత్తుణ్ణి, అతని అనుచరుల్ని చూచి సానివాడ అంతా వణికిపోయేది. ఈ గుంపు సానికొంపలలో ప్రవేశించి స్వేచ్ఛగా విహరించేది. ఇళ్ళ తలుపులు, కిటికీలు గట్టిగా బిగించేవారు. ఆవిధంగా, ఈ ఉన్మాదులంతా రెండు పగళ్ళు, రెండు రాత్రిళ్ళు లోపలేవుండి నోటితో ఉచ్ఛరించరాని పనులన్నీ చేసేవారు. అడ్డుపెట్టేవారు, అదేమనేవారు ఎవరూ లేరు. ఆడవాళ్ళ అవయవాలనుండి రక్తం ప్రవహించేది. ఏడుపులు, మూల్గులు, కేకలు, పెడబొబ్బలు, ఓ! భయంకరమైనపిశాచ నృత్యం జరిగేది. ఆడాళ్ళు, మగాళ్ళుకూడా నగ్నంగా నాట్యంచేసేవాళ్ళు. దున్నల్లా, దుక్కల్లా వున్న మగాళ్ళు విపరీతంగా తాగి, ఆడాళ్ళను బలాత్కారంగా నాట్యంచేయించేవాళ్ళు. వాళ్ళమీదపడి ఎక్కి, తొక్కి వళ్ళంతా రక్కేవాళ్ళు. పియానోలు, ఫిడేళ్ళు మధురసంగీతం ఆలాపించేవి. గదులలో స్త్రీలు శవాల్లా పడి దొర్లుతూవుండేవారు. ఉన్మత్త తాండవంలోవున్న మగాళ్ళు, పక్కమీదనే తాగి, తిని, చెడాబడా కక్కేవాళ్ళు. మిగిలింది తాగినంత తాగి తక్కింది పారపోసేవాళ్ళు. పందుల్లా పడి పొర్లేవాళ్ళు. ఇల్లంతా కంపు, దుర్వాసన, దుర్భరమైన మానవ మలమూత్రాల దుర్గంధం, అపరిశుభ్రమైన దేహాలనుండి వెలువడే చెమట, ఉచ్ఛ్వాస నిశ్వాసాలనుండి పుట్టిన విషవాయువు— ఓ! భయానకం! బీభత్స యమలోకం!

మరోసారి సర్కస్‌లో సాము, కసరత్తు చేసే మల్లయోధుడు ఒక వస్తాడు. ఆడాళ్ళవంక అతి విచిత్రంగా చూస్తాడు. పడకగదిలో ప్రవేశించి

గుర్రంలా ప్రవర్తిస్తాడు. ఇంకోసారి చీనా దేశస్థుడొస్తాడు. చిత్రమైన వేషం వేసుకుని వుంటాడు. ఆడాళ్ళు తొడిగే రవికలాంటిది తొడుక్కుని, తెల్లని మేజోళ్ళు, తలమీద తమాషాఅయిన టోపీ పెట్టుకుంటాడు. మరో తడవ ఎవడో నీగ్రోవాడు నైట్ క్లబ్ లోంచి ఊడిపడతాడు. గళ్ళగళ్ళ ట్రౌజరు, తెల్లగా గంజిపెట్టిన చొక్కా వేసుకుంటాడు. చిత్రమైన కోటు తొడుక్కుని, గుండీబెజ్జంలో ఒకగులాబీపూవుధరించి వస్తాడు. అతన్ని చూచి సానులంతా ఆశ్చర్యపోతారు. అతను నీగ్రోవాడనీ, అతని శరీరం నల్లగా తాకడానికి వీలులేకుండా వుంటుందనీ ఎవరూ అనుకోలేరు.

ఇలాంటి అసాధారణవ్యక్తులు రావడం, అపురూపమైన సంఘటనలు జరగడం మామూలైపోయింది. అందచేతనే సాయంత్రం కాగానే సానుల హృదయాల్లో రకరకాల ఊహలు తలెత్తేవి. ఒకరినొకరు ద్వేషించుకోవడం అసూయపడడంకూడా జరిగేది.

ఒకసారి ఏం జరిగిందనుకున్నారు! కాపలావాడు సిమన్ తలుపుతీసి ఒక మనిషిని లోపలప్రవేశపెట్టాడు. అతను కొత్తవయసుమళ్ళినమనిషి. మామూలు పట్టణవాసికిమల్లే సామాన్యమైనదుస్తులుధరించాడు. అతని ఆకారంలో ప్రత్యేకత ఏమీ లేదు. పల్చని మొహం. మొహంమీద కండలేదు. బుగ్గలు లోతుగా గుంజుకుపోయి, ఎముకలు బయటికి పొడుచుకొచ్చాయి. చిన్నగడ్డం దళసరిగావున్న కనుబొమలు. ఒక కన్ను రెండోకంటికన్నా ఎంచేతనో ఎత్తుగా వుంది. అతను ఇంట్లో ప్రవేశించి సరాసరి కొట్కా దగ్గరికి వెళ్ళాడు. పిల్లలందరిలోకీ కొట్కా లావుగా బలిసివుంటుంది.

"వెడదాం రా!" అంటూ తలఊపి కొట్కాను లోపలికి తీసుకుపోయాడు.

అలా అతను లోపలికి వెళ్ళింతరువాత, కాపలావాడు సిమన్ తన ప్రియురాలైన న్యూరాతో సంగతంతా చెప్పాడు. ఆ వచ్చినతను పేరు డాడ్ షెంకో అనీ, అతని ఉద్యోగం ఉరితీయడమనీ చెప్పాడు. రెండురోజుల్లో పదకొండుమంది నేరస్థులను, స్వయంగా తన చేతులతో ఉరితీసిన ఘనుడనికూడా చెప్పాడు. ఇంకేం! న్యూరా ఈ వార్త తీసుకెళ్ళి ఇంట్లో ఉన్న తనస్నేహితురాండ్రందరికీ చెప్పింది. కాసేపట్లో ఇల్లంతా గుసగుసలు బయలుదేరాయి. పిల్లలందరూ ఏంజరుగుతుందో అని చచ్చేభయంతో

గుండెలు పిసుక్కున్నారు. ఓ అరగంట తరువాత డాక్‌షిన్ బయటికి వచ్చాడు. క్రూరమైన చూపులు చూచుకుంటూ వెళ్ళిపోయాడు. అతను వెళుతోంటే పిల్లలంతా నోళ్ళు తెరుచుకుని నిలబడ్డారు. తరువాత అతను సాంతం వెళ్ళిపోయేదాకా కిటికీల దగ్గర నిలబడి తొంగితొంగి చూచారు. పిమ్మట ఒక్క ఉరుకులో అంతా లోపలికి పరుగెత్తి కొట్కా గదిలోకి వెళ్ళారు. కొట్కా అప్పుడే బట్టలు, అవీ కట్టుకుంటోంది. ఏమే! ఏంజరిగింది అంటూ అంతా ఒకేసారి ప్రశ్నల వర్షం కురిపించారు. కొట్కా శరీరం అంతా ఎర్రగా కంది, కనుములు కట్టివుంది. పక్కంతా నలిగిపోయి నానా చండాలంగా వుంది. కొట్కా ఏంజరిగిందీ ఎవరితోనూ చెప్పలేదు. మేజోళ్ళ లోంచి ఒక రూబుల్ నోటు బయటికి తీసింది. 'ఏమగాడైనా మగాడే. అందరు మగాళ్ళవంటివాడే' అనిమాత్రం జవాబుచెప్పి, పెద్దగా వెక్కివెక్కి ఏడ్వడం మొదలెట్టింది. కొట్కాకు ఏంజరిగిందో, ఆమె ఏడ్వడానికి కారణం ఏమిటో, ఎవరికీ తెలీలేదు.

ఈ వచ్చినవాడు మనిషి కాదు. మానవజాతి అంతా వెతికిచూచినా ఇలాంటివాడు దొరకడేమో! మనుషులెవరూ ఊహించలేనంత నీచుడు. ఈ కసాయివాడు కొట్కాఎడల నిర్దాక్షిణ్యంగా పశువులా ప్రవర్తించాడు. ఇలా ఏ మానవుడూ, ఎప్పుడూకూడా ప్రవర్తించివుండడు. మానవుడేమిటి? కుక్క, గుర్రం, గొడుగు, కోటు, హేటు అచేతనమైన పదార్థంలో కూడా ఏదో మార్దవం కనిపిస్తుంది. కాని ఇతనిలో అలాంటిది లవలేశమైనా లేదు. ఏదో ఒకక్షణం ఉపయోగించుకుని అవతల పారేసే పనికిమాలినవస్తువులా, ఈమెను అతను చూచాడు. అతని అవసరం గడిచిన మరుక్షణంలో అతి కఠినంగా మారిపోయి అసహ్యంగా ప్రవర్తించాడు. పాపం అంచేతనే అమాయకురాలైన కొట్కా మనసుకు బాధ కలిగింది. శరీరానికంటె ఆమె మనసుకే ఎక్కువదెబ్బ తగిలింది. ఎన్నడూ అలాంటి బాధ ఎరగదు. ఏంజరిగిందో, కారణం ఏమిటో ఆమె ఎవరితోనూ చెప్పుకోలేకపోయింది. గుండె పగిలేటట్లు పెద్దగా వెక్కివెక్కి ఏడ్వసాగింది.

ఇంకా ఇలాంటి విచిత్రమైన అనుభవాలు, అసాధారణమైన సంఘటనలు ఎన్నో వున్నాయి. కనుకనే మూర్ఖులు, దరిద్రులు, రోగపీడితులు, అనాథలు, పతితలు, భ్రష్టలు అయిన ఈ స్త్రీలంతా ప్రతిరోజూ

సాయంత్రం అనేక ఆలోచనలలో మునిగిపోతారు. అసూయ, ద్వేషం, పెచ్చుమీరిపోయి తుపాకులతో కాల్చుకున్న సమయాలు, విషం పెట్టి చంపుకున్న సంఘటనలు ఉన్నాయి. ఎప్పుడో అరుదుగా సకల సద్గుణ సంపన్నుడు, సర్వాంగసుందరుడు అయిన ఒక యువకుడు, ఈ బురద గుంటలో వచ్చిపడడం కద్దు. ఒక్కో స్త్రీ అతన్ని ప్రేమించి, అతని సహాయంతో సానికొంపనుంచి బయటపడడంకూడా జరిగింది. కాని ఏం లాభం? మళ్ళీ ఆమె తిరిగీ ఇక్కడికి రాక తప్పిందికాదు. రెండుమూడు సార్లు ఒక ఇంట్లో వున్న పడుపుకత్తె గర్భవతికావడం సంభవించింది. బయటికి చూడ్డానికి ఇదొక అవమానకరంగా, ఆశ్చర్యంగా కనిపించేది. కాని నిజంగా లోతుగా ఆలోచిస్తే, ఇదొక హృదయవిదారకమైన విషయం కాదూ!

సరే ఇంతకూ ఏంజరిగినా జరక్కపోయినా, సంధ్యవేళ కాగానే పాపులహృదయాల్లో ఏదో ఉద్రేకం కలుగుతుంది. ఎన్నెన్నో తలంపులు పుడతాయి. ఏదో పోగొట్టుకున్న వస్తువుకోసం చూస్తున్నట్లుగా, ఎదురు చూస్తూంటారు. ఆదుర్దాపడుతుంటారు. సోమరులు, బలహీనులు, పిచ్చి వాళ్ళు, అయిన ఈ స్త్రీలందరికీ పట్టినదుర్గతి ఇది.

## 5

కిటికీలరెక్కలు బార్లగా తీసివున్నాయి. కిటికీలకు కట్టినతెరలు, రాత్రిపూట గాలికి మెల్లగా అటూ ఇటూ ఊగుతున్నాయి. ల్యూబా ముఖమల్‌తో కుట్టిన మెత్తని రవిక తొడుక్కుంది. మాంచి ముదురయిన నీలపురంగులో కొట్టవచ్చినట్లు అగుపిస్తోంది. రవిక ముందువైపు చాలపొట్టిగా వదులుగా వుంది. న్యూరా లేతగులాబీరంగు గౌను వేసుకుంది. ఆ గౌను మోకాళ్ళవరకూ వదులుగా వేలాడుతోంది. ఉంగరాలుతిరిగిన ఆమెవెంట్రుకలు నుదుటిమీద పడుతున్నాయి. వీరిద్దరూ ఒకరిభుజంమీద ఒకరు చేయి వేసుకుని కిటికీలో కూచున్నారు. మెల్లగా పాట ప్రారంభించారు. ఆసుపత్రిమీద కట్టినపాట ఒకటుంది. ఈ ఆసుపత్రిపాట, ఆరోజుల్లో పడుపు

కత్తెలందరి నోటా ప్రసిద్ధిగా వినిపిస్తుండేవి. న్యూరా తన ముద్దుల్తో ముందు పాడుతోంది. ల్యూబా వెంటనే అందుకుని సంతపాడుతోంది.

'సోమవారం మళ్ళీ వస్తోందండీ!
నే నాసుపత్రి విడిచి వెళ్ళాలండీ!
కానీ, డాక్టర్ నను పోనివడండీ!...'

అలా ఇద్దరూ హుషారుగా పాడుతున్నారు. ఇళ్ళల్లో కిటికీలన్నీ వెలుగుతో ప్రకాశిస్తున్నాయి. ప్రతియింటికీ గుమ్మంముందు ఎర్రిలాంతర్లు వేలాడుతున్నాయి. ల్యూబాకు న్యూరాకు ఎగురుగావున్న సోఫియా వాసి లెవ్‌నా ఇల్లు స్పష్టంగా అగుపిస్తోంది. విటులువచ్చి కూచునే మొదటిహాల్లో చేసిన వివిధ అలంకారాలు, గోడలకు వేలాడుతోన్న శృంగారచిత్రాలు, నల్లగా మెరుస్తోన్న పియానో అన్నీ స్పష్టంగా కనిపిస్తున్నాయి.

చీకటిపడినప్పటికీ ఇంకా వెచ్చనిగాలి వీస్తోంది. ఎక్కడో దూర దూరంగా రైలుపట్టాలు కన్పిస్తున్నాయి. వాటి వెనకాల మసకమసగ్గావున్న ఇళ్ళకప్పులు, నల్లగావున్న చెట్లు కనిపిస్తున్నాయి. నగరంలోంచి వస్తోన్న వివిధరకాల ధ్వనులు మందంగా వినిపిస్తున్నాయి. గాలిమరలు తిరుగు తోంటే వస్తోన్న గరగరధ్వనులు, అంబాఅని అరుస్తోన్న ఆవులు, రాళ్ళబా టలో నడుస్తోన్న మనుషుల బూట్లచప్పుడు, బండిచక్రాల బరబరధ్వనులు, యీమా అంతటా మెల్లగా చల్లగా వినిపిస్తున్నాయి. రాత్రిపూట వినిపించే ఈ సందడి అంతా ఏదో సంతోషాన్ని కలిగిస్తోంది. రైలుపట్టాల పక్కన వరుసగా వెలుగుతోన్న ఎర్రని, ఆకుపచ్చని దీపకాంతులు, రైలుబండ్ల కూతలు, చీకటిరాత్రికి ఏదో శోభను చేకూరుస్తున్నాయి.

'నర్సు ఇప్పుడు వస్తుందండీ!
రొట్టె, పాలు, తెస్తుందండీ!
రొట్టె, పాలు తెస్తుందండీ!
రోగు లందరికి ఇస్తుందండీ!'

ఇద్దరు పిల్లలూ పాడుతున్నారు.

'ఏయ్! ప్రొఖోర్ ఇవానిచ్, ఇవానిచ! ఇలారా' అంటూ పెద్దగా అరిచింది న్యూరా పాట ఆపుచేసి. పనివాడు ఇవానిచ్ బీరుసాపునుంచి పరుగెత్తుకుంటూ ఇంటికి పోతున్నాడు. అతన్ని చూచి న్యూరా పిలిచింది.

"ఏమిటే నీ గోల? ఏమిటో చెప్పు?" అడిగాడు ఇవానిచ్ వీధిలో నిలబడి.

"నీ స్నేహితుడొకడు నిన్న నాకు కనిపించాడు. నిన్నుగురించి అడిగాడు" అంది న్యూరా తిరిగీ.

'ఎవరు? ఏ స్నేహితుడు?' అడిగాడు ఇవానిచ్ ఆదుర్దాగా.

'అతనే, అతనే! నల్లని వెంట్రుకలు, చక్కని కళ్లూ. మరి ఎక్కడ చూచావని అడగవేం?' అంది న్యూరా త్వరత్వరగా.

"సరేలేవే! ఎక్కడ చూచావో చెప్పు" అన్నాడు ఇవానిచ్ కొంచెం విసుగ్గా.

"తొందరపడితే ఎట్లా? తాపీగా విను చెప్తాను. ఆ గుంటమూ చచ్చిన పిల్లికూనల్ని పారేసే మన కుళ్ళుగుంటలో కనిపించాడు" అంటూ పగలబడి నవ్వడం మొదలెట్టింది న్యూరా.

కుడిచి కూచోని పరిహాసాలాడడం న్యూరాకు మామూలు. అందులోనూ, ఇవానిచ్ అంటే ఆ పిల్లకు తగని ఇష్టం, సరదా.

'ఓ! నీ పరిహాసాలు పాడుగాను. ఇహా ఊరుకోవే పాపిష్టిదానా' అన్నాడు ఇవానిచ్.

న్యూరా ఇంకా విరగబడి నవ్వుతూనేవుంది. ఆమె నవ్వు యీసారి వీధుల్లో మారుమ్రోగింది. కిటికీలో నుంచుని తన పొడుగాటి కాళ్ళు బయటికి చాపింది న్యూరా. కాళ్ళకు తొడుక్కున్న నల్లటి మేజోళ్ళు తళతళ మెరుస్తున్నాయి. అలా నవ్వుతూనే కిటికీలోంచి వంగి వీధిలోకి చూస్తూ, రహస్యంగా ఇలా అంది.

'ఈ సంగతి నీకు తెలుసునా? నిరుడుగాక ముందేడు అతనొక ఆడమనిషిగొంతు కోశాడు.'

'ఏమిటీ! ఆమె చచ్చిపోయిందా?' కిటికీకింద నిలబడి అడిగాడు ఇవానిచ్.

'అహా! చావలేదు. అలెగ్జాండ్రోవిస్కీ ఆసుపత్రిలో రెండు నెలలు పడుంది. చాలా ప్రమాదమైన గాయం. కొంచెంలో గండం తప్పింది. లేకపోతే చచ్చిఊరుకునేది.'

'ఎందుకు చేశాడు అపని?'

'ఏమో, ఎవడికి తెలుసు? అతను ఆమెకు ప్రియుడు. ఆమె ఏదైనా తప్పుడు పనులు చేసిందేమో? లేకపోతే అతనే ఆమెను తారుస్తాడు కూడా. డబ్బు దగ్గర ఇద్దరికీ పేచీ వచ్చిందో?'

'ఇలా చేసినందువల్ల అతనికి వచ్చే లాభం ఏమిటి?'

'లాభమూ లేదు పాడూ లేదు. అసలు ఇతనే ఆపని చేసినట్లు దాఖలా కూడా లేదు. ఆరోజున అక్కడ పెద్ద దెబ్బలాట జరిగింది. ఓ వందమంది జనం పోగయి ఒకరినొకరు తన్నుకున్నారు. తన్ను ఎవరు కొట్టిందీ తెలీదని, ఆమె పోలీసువాళ్ళతో చెప్పింది. కాని ప్రాంఖోర్ మాత్రం ఆ తరువాత బడాయిలు కొట్టాడు......"డుంకాను ఆ తడవ పాపమని తలిచి వదిలిపెట్టాను. కాని ఈసారి దాన్ని చంపితీరుతాను. ఎవడు అడ్డంవస్తాడో, దీని సంపాదన ఏమవుతుందో చూస్తాను" అంటూ మీసాలు దువ్వాడు.

అలా చెప్పేసరికి న్యూరా వళ్ళంతా వణికిపోయింది.

"అసలు ఈ తార్పుడుగాళ్ళంతా అంతే. ఎంతకైనా తెగిస్తారు" అంది తిరిగీ గద్గద స్వరంతో.

'నిజానికి అంతే! నీకు తెలుసునో లేదో? నేను సిమన్‌ను ప్రాణంతో సమానంగా ప్రేమించాను. ఒక సంవత్సరం సొంతం అతనితో వున్నాను. నా వంటిమీద దెబ్బతగలని స్థలంలేదు. పుండుపడని అవయవంలేదు. పోనీ, నేనేమైనా అతనికి ఇష్టంలేనిపని చేశానా అంటే అదీ లేదు. ఆవొక్క సరదా కోసం అతనలా ప్రవర్తించాడు. ఉదయాన్నే నా గదిలోకి వచ్చేవాడు. లోపల తాళంపెట్టేవాడు. నన్ను నానావిధాల హింసించేవాడు. నా చేతులు పట్టుకుని అటూ ఇటూ విరగతీసేవాడు. నా రొమ్ములమీద పొడిచేవాడు. తన రెండుచేతులూ నా మెడకు పెనవేసి బలంగా అదుముకునేవాడు. ఇహ ముద్దులసంగతి చెప్పనక్కర్లేదు. పళ్ళు తెలియకుండా గట్టిగా ముద్దు పెట్టుకునేవాడు. ఓ! ఒకసారి కాదు, రెండుసార్లు కాదు, వందలసార్లు. ఒక్కొక్కమాటు బలంగా కొరికేసేవాడు. నా పెదవులనుండి రక్తం కారేది......ఓ! వెక్కి వెక్కి ఏడ్చేదాన్ని... అది అతనికి కావల్సిన ఆనందం. మృగంలా నామీదపడి ఇష్టంవచ్చినట్లు చేసేవాడు. చివరకు నా దగ్గరున్న డబ్బు సొంతం కాజేశాడు. కనీసం ఒక సిగరెట్టుపెట్టె కొనుక్కోడానికి కూడా లేకుండా చేశాడు. అలా కాజేసిన డబ్బంతా తనపేర బ్యాంకులో వేసుకున్నాడు.

వేయిరూబుల్సు పోగయింతర్వాత సన్యాసులమఠంలో చేరతానని చెప్పాడు. దుర్మార్గుడు! వాడుచేసిన పాపాలకు పరిహారంకావాలట. అప్పుడప్పుడు దైవ ప్రార్థనలు చేసేవాడు. ఓ! వాడు చేసిన పాపాలకు అంతులేదు. ఖూనీలు చేశాడు. అందుకే దేవుడంటే భయంపుట్టింది.'

'ఏమిటీ? ఖూనీలు చేశాడా?'

'వద్దు. ఇహ అతనిమాట ఎత్తవద్దు. పాపం వస్తుంది. ఇవానిచ్! ఇహ ఆ విషయం పోనీలే! మంచి పాట పాడుకుందాం' అంటూ స్యూరా తిరిగీ పాడడం మొదలెట్టింది.

"మందులషాపుకు వెడతానండీ!
మాత్ర ఒక్కటి తెస్తానండీ!
అది విషం, విషం, విషం!
నాకు నేనే, నేను నాకే
విషంపెట్టుకు చస్తానండీ!"

అప్పటికే ఆలస్యం అయిందని ఇవానిచ్ తనదోవను తాను పోయాడు. జెన్నీ మొదటిహాలులో అటూ ఇటూ పచారుచేస్తూ, అద్దాలముందు నిల బడి తన సౌందర్యాన్ని చూచుకుని మురిసిపోతోంది. నారింజపండు రంగులోవున్న పట్టుగౌను తొడుక్కుంది జెన్నీ. ఇహ చిన్నమంకా మళ్ళీ పేకాటలో కూచుంది. మంకాకు పేకాటపిచ్చి జాస్తి. విసుకులేకుండా రాత్రింబగళ్ళు ఆడుతూ కూచుంటుంది. ఇప్పుడామె తన స్నేహితురాలు పాషాతో కలిసి ఆడుతోంది. ఆటపేరు అదే. 'అరవైఆరు ఓకులు'. మంకా సాధారణమైన దుస్తులు ధరించింది. నల్లని అల్లికజాకెట్టు తొడుక్కుంది. గోధుమరంగు పరికిణీ కట్టుకుంది. మాపుకు ఆగడానికి నడుముకు 'అప్రాన్' చుట్టుకుంది. ఈ దుస్తుల్లో మంకా చిన్నపిల్లలా కనిపిస్తోంది. హైస్కూల్లో చదువుకునేఅమ్మాయిలా వుంది.

ఇహ పోతే చీట్లాడుతున్న రెండోపిల్ల పాషా చరిత్ర చాలా వుంది. ఈమె సంగతి వింతగా ఉంటుంది. ఈ అమ్మాయికి చాలాకాలం క్రిందట నరములకుసంబంధించిన వ్యాధి వచ్చింది. ఆ జబ్బుతో విపరీతంగా బాధ పడింది. ఆసుపత్రిలో వుండడానికి మారుగా దురదృష్టవశాత్తూ సానికొంప లో వచ్చిపడింది. ఈ జబ్బువల్ల ఈమె కొక వెర్రిఆవేశం, తృష్ణ బయలు

దేరుతాయి. మగాడు కనిపిస్తే చాలు తన వాంఛ తీర్చుకోడానికి పశువులా ప్రవర్తిస్తుంది. అప్పుడీమెకు అణుమాత్రం విచక్షణాజ్ఞానంవుండదు. ఆ మగాడు ఎటువంటివాడా అనే ఆలోచ నేరాదు. ఈ విషయం తెలుసుకుని ఆమె స్నేహితులంతా ఎగతాళిపట్టిస్తుంటారు. అసలు మరో వదంతికూడా ఉంది. పాపాకు వ్యభిచారంచేయాల్సినంతగతిపట్టి అందులో దిగలేదనీ, ఆమెనెవరూ చెరచి చెడగొట్టలేదనీ, ఎవరూ బలాత్కరించి ఈ పనిలో దించలేదనీ ఆమె బుద్ధిపూర్వకంగా కావాలని ఈపనిలోకి దిగిందనీ అంతా చెప్పుకుంటారు. ఆమెకు ప్రాప్తించిన విచిత్రమైన వ్యాధి అలా చేయిస్తోందనీ అంటారు. ఏమైనా మగాళ్ళను చూస్తే పడిచచ్చే గుణం పాపాకు వుంది. ఈ బలహీనతను ఆసరాగా తీసుకుని, యజమానురాలు ఈమెను తన ఇష్టం వచ్చినట్లు ఉపయోగించుకుంది. పాపం ఇంట్లో ఎవరూ ఈమెను సరిగా చూడరు. ఈమెకు గల కామవికారం, దానికితోడు యజమానురాలి ప్రోత్సాహం—ఇంకేం! ఈమె వ్యభిచారం పెచ్చుమీరి విచ్చలవిడి అయిపోయింది. పండుగదినాలు, సెలవురోజులలో ఈ పిల్లకు ఖాళీవుండేదికాదు. అనేకమంది విటులు ప్రత్యేకించి ఈమెకోసం వచ్చేవారుకూడా. అప్పటికీ విరామంలేకుండా పని జాస్తిగా వుండడంవల్ల, వచ్చినవాళ్ళకు పాపాకు వంట్లో సరీగాలేదనీ, ఏదో రుగ్మతగావుందనీ సాకులుచెప్పి పంపేవారు. కాదూ మరి? ఈమె, లోపల మరొక విటుడితో వున్నదని తెలిస్తే బయట వున్నవాడికి ఆగ్రహం, అసూయ పుట్టుకొస్తుంది. అందులో ఈమెదగ్గరకు వచ్చేవారంతా పాత ఖాతాదార్లే. ఎప్పుడూ వతనగా వస్తూవుంటారు. అందరూ తమ ఇచ్ఛవచ్చినట్లు ఈమెను ఉపయోగించుకుంటారు. అయితేఏం? డబ్బుమాత్రం పుష్కలంగా ఇస్తారు. నమ్మకంగా ముట్టచెపుతారు. ఇంట్లో వున్న పిల్లలందరిలోకీ పాపా అయిదారురెట్లు ఎక్కువ సంపాయిస్తుంది. ఒక్కొక్కసారి ఆమెవద్దకు ఇద్దరు విటులు ఒకేసారి వస్తారు. ఒకేచోట, ఇంచుమించు ఒకేసమయంలో ఆ ఇద్దరితోనూ వుండి, వాళ్ళను తృప్తిపరుస్తుంది పాపా. ఆ వచ్చేవారిలో ఒకతను జార్జియాదేశస్థుడు. బ్రాందీషాపులో గుమాస్తాగావుంటున్నాడు. రెండోఅతను రైలురోడ్డు ఏజంటు. మనిషి పొడుగ్గావుంటాడు. ఇతనికి ఒక కన్ను లేదు. దానికి నల్లటి అతుకొకటి అడ్డంకట్టుకుంటాడు. ఎవరైతేఏం? వచ్చిన మనుషులు ఎలాంటివాళ్ళు,

వాళ్ల వేషభాషలు, అందచందాలు, ప్రవర్తన, స్వభావం ఇవేవీ పట్టించు కోదు పాపా. కాని యజమానురాలు మాత్రం జాగ్రత్తగా కనిపెడుతూ ఆమెకు ప్రమాదం ఏమీ రాకుండా చూచుకుంటుంది.

పాపాకు పిచ్చి—ఉన్మాదం ఉందని ఆమె మొహం చూడగానే చెప్పవచ్చు. ఒక్కొక్కసారి వికృతంగానూ, మరోసారి వింతగానూ అగుపిస్తుంది. కళ్ళు సగం మూసుకుని ఉంటుంది. అర్థనిమీలితనేత్రాలతో ఆమె అద్భుతంగా అగుపిస్తుంది. ఏదో సిగ్గు, చిరునవ్వు ఆమె పెదవులమీద తాండవం చేస్తుంటాయి. ఆమె అస్తమానం తన మెత్తని, పలుచని పెదవులను నాలుకతో తడుపుకుంటూ ఉంటుంది. ఒక్కొక్కసారి విచిత్రంగా పిచ్చిగా నవ్వుతుంది. కాని నిత్యజీవితంలో చాలా నిష్కల్మషంగా, నిజాయితీగా వుంటుంది పాపా. అందరితోనూ చనువుగా హృదయం యిచ్చి మాట్లాడుతుంది. సున్నితమైన ఆమె మనస్సే ఇందుకు కారణమేమో! డబ్బుమీద కూడా ఆపేక్షలేదు. తనకుగల విషయాసక్తిని తలుచుకుని చాలా సిగ్గుపడుతూ వుంటుంది. స్నేహితురాండ్రు అందరినీ గట్టిగా ముద్దుపెట్టుకుంటుంది. వాళ్ళను కౌగలించుకుంటుంది. ఏమాత్రం సిగ్గు, చింత, బెరుకు, బిడియం లేకుండా వాళ్ళతో కలిసి ఒకే పక్కమీద పడుకుని నిద్రపోతుంది. ఆమెకు గల ఇంద్రియలోలత్వమే ఇందుకు కారణం కావచ్చు. కాని తోటిపిల్లలంతా ఆమెను అర్థంచేసుకోలేక అవమానిస్తూవుంటారు.

"మంకా! నా ముద్దుల మంకా! నా చిట్టి మంకా! నా జాతకం ఎలావుందో చెప్పవే?" అంటూ పాపా చిలిపిగా మంకాభుజంపట్టుకుని తన అరచేయి చూపింది.

"అబ్బ! ఉండవే! ఇంకా కాసేపు ఆడదాం" అంది మంకా పేక ముక్కలు పట్టుకుని.

"మా అమ్మవుకదూ! మా బంగారానివే! మా చిన్నారివే......" అంటూ మళ్ళీ వేలబడింది పాపా పసిపిల్లమాదిరి. చివరకు మంకా పాపా చేయిపట్టుకుని అదృష్టం చెప్పింది.

"ఒక మహారాజు నీ దగ్గరికి వస్తానని వాగ్దానంచేశాడు. అతనివల్ల నీకు అమితంగా ధనం వస్తుంది" అని చెప్పింది మంకా. అది వినేసరికి పాపా మొహం ఆనందంతో వికసించింది.

"అవును. నిజంగా నా మహారాజు వస్తాడు. లెవ్‌నిష్కీ ఇవాళే వస్తానని చెప్పాడుకూడా" అంది పాషా సంతోషంతో.

"ఎవరే అతను? ఆ జార్జియాదేశస్థుడేనా?" అడిగింది మంకా.

"అవును అతనే, ఎంత అందంగావుంటాడనుకున్నావు? అతను ఎప్పుడూ నా దగ్గరేవుంటే ఎంతో బాగుంటుందే. వదిలిపెట్టడానికి బుద్ధిపుట్టదు. కిందటిసారి వచ్చినప్పుడు ఏంచెప్పాడో తెలుసా? 'నీ వీ పాడు సానికొంపల్లో వుంటే, నేను సహించను. నిన్ను చంపి, నేను చంపుకుంటాను' అన్నాడు కోపంతో. అతని కళ్లు చింతనిప్పుల్లా అయినాయి" అని చెప్పింది పాషా.

ఇదంతా వింటోన్న జెన్నీకి వళ్ళుమండిపోయింది.

'ఎవడే వాడు? అంత మొనగాడు?' అని అడిగింది జెన్నీ కొంచెం కఠినంగా.

"ఎవడేమిటి? నా చిట్టి లెవన్! జార్జియాదేశస్థుడు. నా ప్రాణానికి ప్రాణం ఇస్తాడు." అంది పాషా తిరిగీ.

"ఓసీ, పిచ్చికత్తెమ్మా! అతను జార్జియాదేశస్థుడు కానేకాదు. అతను మామూలు ఆర్మేనియా జాతివాడు" అంది జెన్నీ కొంచెం కోపంగా.

"కాదు. అతను జార్జియాన్! అతనంటే గిట్టక నీవు అలా అంటున్నావు" అంది పాషా తిరిగి మొండిగా.

"ఒసే మొద్దూ! ఎంత మొత్తుకున్నా నీకర్థంకాదు. అతను ముమ్మాటికీ ఆర్మేనియన్. కావాలంటే ప్రమాణంచేస్తాను. నాకంటె నీకు ఎక్కువ తెలుసునటే! పిచ్చిదానా! ఇహ నోరుమూసుకో" అంది జెన్నీ తిరిగి.

"ప్రమాణాలెందుకు జెన్నీ? నీవు అనవసరంగా వాగుతున్నావు. నేను ప్రమాణంచేస్తానన్నానా?"

"అవును, ముందు నీ మాట నెగ్గాలని చూచావు నీవు. నీవు అసలు బుద్ధిలేనిదానివి. వాడిమీద నీకు మనసు మళ్ళిందా ఏమిటే కొంపతీసి?"

"మళ్ళితే మళ్ళింది. ఏం? అతన్ని ప్రేమించకూడదా?"

'ఎందుకు ప్రేమించకూడదూ? సిగ్గులేనిదానా! ఆ గుడ్డివాడకే నీకు దొరికింది?

"గుడ్డివాడో, కుంటివాడో ఎవడైతేనేం? అతనంటే నాకు అభిమానం. అతను అంత మంచివాడు."

'అవును. నీవు ఆ పుస్తకాలమ్ముకునే కోతిగాణ్ణి ప్రేమించావు. ఆ కంట్రాక్టరు వెధవను ప్రేమించావు. తరువాత ఆంగ్లోస్త్రా - కానిస్ట్రాగాడంటే పడిచచ్చావు. ఆఖర్కైన ఆ దునపోతు నటుడిమీద కన్ను వేశావు కదూ? ఛీ! సిగ్గులేనిదానా! నీకు నీతీ, జాతీ నుండదటే లంజదానా? నీ వెప్పుడూ లోకప్పుట్టే పనులే చేస్తుంటావు. ఎంత దౌర్భాగ్యురాలివే! నేనైతేనా? ఈపాటికి గొంతుకు ఉరిపోసుకుని చచ్చేదాన్ని. నీవు కనుక ఇంకా బ్రతికివున్నావు. ఛీ! పశువా!'

జెన్నీ అలా అనేసరికి పాపా మాట్లాడ్లేకపోయింది. ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. తల వొంచుకొని నేలమీదికి చూస్తూ కూచుంది. అది గమనించి మంకా పాపాకు వత్తాసువచ్చింది.

'ఏమిటే జెన్నీ! ఇవాళ ఇలా తయారయ్యావేమిటి? ఎందుకు పాపాను అలా అవమానిస్తావు?......' అంటూ ఇంకా ఏదో అనబోయింది మంకా. కాని మధ్యలోనే అందుకుంది జెన్నీ.

'ఓ! మీరందరూ అంతే! సిగ్గూ ఎగ్గూ లేని లంజలు! ఆత్మగౌరవం ఏమాత్రం లేదు. నీచులు! ఎవడో రౌడీవెధవ, కేడీ, పుడాకోరు వస్తాడు. గుకా ఒంట్లోవున్న మాంసంముక్కను కొన్నట్లు మిమ్మల్ని కొంటాడు. టాక్సీవాడో, జట్కావాడో బండి అద్దెకు తీసుకున్నట్టుగా, ఓగంట ప్రయాణానికి మిమ్మల్ని బేరమాడి ధరకు మాట్లాడుకుంటారు. దాంతో మీరంతా ముక్కచెక్కలై, మురిసిపోయి, ఉబ్బితబ్బిబ్బులవుతారు. 'హా ప్రియా! హా ప్రాణనాయకా! నీ ప్రేమ అమోఘం! అద్భుతం!' అంటూ పిచ్చివాళ్ళలా వాగుతారు. ఛీ! మీ మొహాలు చూస్తే మహాపాపం' అంటూ జెన్నీ విసురుగా వాళ్ళదగ్గర్నుంచి వెళ్ళిపోయి అద్దంముందు నిలుచుంది.

అంతలో పియానోవాయించే అతను ఈసాక్ దావిడోవిచ్ ఫిడేలు వాయించే ఇసయాకలిచ్‌తో కుస్తీపట్టు ప్రారంభించాడు. ఫిడేలు శుద్ధ తప్పులు వాయిస్తున్నాడు ఇసయా. పాపం ఈసాక్ తన శాయశక్తులా సరి చేయడానికి యత్నిస్తున్నాడు.

'అబ్బెబ్బే! అది కానే కాదు ఇవయా! ఒక్క క్షణం ఫిడేలు అవతల పెట్టి, నేను వాయించేది జాగ్రత్తగా విను. దాని రాగం ఇది' అంటూ ఈసారి ఒక చేత్తో పియానో వాయిస్తూ, రెండో చేయి పైకెత్తి పెద్దగా రాగం ఆలాపించసాగాడు.

'ఎస్ టూం, ఎస్ టూం, ఎస్ టిరూం-టిరూం,' ఏదీ వాయించండి, ఒక్కసారి'

గదిలో రిహార్సల్సు జరుగుతోంది. అక్కడ ఇద్దరు అమ్మాయిలు హాజరయి సంగీతం వింటూ ఆనందిస్తున్నారు. ఒక అమ్మాయి జోయా; గుండ్రని మొహం, ఆర్చిల్లావున్న కనుబొమలు; ముస్తాబుచేసుకుని పియానో పక్కన ఆనుకుని నిలబడివుంది. రెండోపిల్ల పేరు వీరా. ఒక్క పలుచగా వుంటుంది. పందెపుగుర్రాల్ని పరుగెత్తించే జాకీ వుంటాడు చూశారూ? వాడి మాదిరి దుస్తులు వేసుకుంది. నీలం, తెలుపు చారలుకల సిల్కుచొక్కా తొడుక్కుంది. తలమీద గుండ్రగావున్న ఓ చిన్న టోపీ పెట్టుకుంది. ఆ టోపీకి ముందరిభాగం, ముందుకు పొడుచుకొచ్చి కళ్ళకు నీడపడేలా చేస్తోంది బిగుతుగా పైజమా వేసుకుంది. కాళ్ళకు మంచి చర్మంతో కుట్టిన బూట్లు తొడుక్కుంది. నిజానికి వీరా ఈ దుస్తులు వేసుకోకపోయినా జాకీ మాదిరిగానే కనిపిస్తుంది. కోలమొహం, కోటేరులాంటిముక్కు. ముక్కుకు ఇరుపక్కలా ఒరుసుకుని, చిన్నకళ్ళు మిలమిల మెరుస్తుంటాయి. మనిషి చూడబోతే పొట్టి. ఇంకేం? పొడుగు జోయా, పొట్టి వీరా; వీరిద్దరూ ఈ గది అంతా కలయతిరుగుతూ, మధ్యమధ్య సంగీతం వింటూ, ఏదో ఆనందం అనుభవిస్తున్నారు.

న్యూరా వుంది చూశారూ? ఎక్కడ ఏది జరిగినాసరే [illegible]ని కనిపెడుతుంది. ముందుగావచ్చి అందరితోనూ చెప్తుంది. అలా వార్తలు అందించడంలో దానికెక్కిన న్యూరా గభాలున కిటికీలోంచి దుమికి ఏదో ఉద్రేకంతో అరవసాగింది.

"ట్రెప్పెల్సుకు ఓ పెద్ద బండి వచ్చింది. ఆ బండికి ఎలెక్ట్రీదీపాలున్నాయి...ఓ... నా గుండె పగిలిపోతుందే...అమ్మాయిలూ! రండి, రండి...అబ్బ...అన్నీ ఎలక్ట్రిక్లైట్లే' అంటూ న్యూరా గంతులు వేస్తూ కేకలు పెట్టింది.

గర్విష్టి అయిన జెన్నీతప్ప పిల్లలంతా ఆ అరుపులు విని కిటికీలవద్దకు పరుగెత్తారు. కిటికీల్లోంచి వీధిలోకి తొంగిచూచారు. అవును, న్యూరా చెప్పింది నిజమే. ప్రసిద్ధికెక్కిన సంస్థ ట్రెపెల్స్ను. ఆ ఇంటిముందు ఒక చక్కని బండి వచ్చి ఆగింది. బండి చాలా శృంగారంగావుంది. పసుపు పచ్చని ఎలెక్ట్రి దీపాలుకూడా వున్నాయి. బండికి కట్టిన గుర్రం ఇంకా బాగుంది. పెద్ద గుర్రం. తెల్లగా తళతళ మెరుస్తోంది. చెవులు నిక్కపొడిచి, తల కిందికీ పైకీ ఊపుతోంది. బండివాడు చాలా బలంగా బలిసివున్నాడు. ముందున్న తొట్లో కూచున్నాడు. మోకాళ్ళమీద చేతులు పెట్టుకుని బొమ్మలా కూచున్నాడు.

"ఏయ్, బండి అబ్బాయ్! ఏయ్ మామా! మమ్మల్నికూడా బండిలో కూచోపెట్టుకుని ఓచుట్టు తిప్పుకురారాదూ? ఈ దిక్కుమాలిన వాళ్ళను కొంత ప్రేమలో ప్రయాణం చేయించు' న్యూరా కిటికీలోంచి చేతులూపుతూ అరిచింది.

కాని బండివాడు ఏమీ మాట్లాడ్లేదు. ఆ పిల్లవైపు ఒకసారి చూచి నవ్వాడు. అమ్మాయిలంతా ఆశ్చర్యంతో చూస్తూవుండగానే, అతను బండి తోలుకుని వెళ్ళిపోయాడు.

"ఛీ! సిగ్గుమాలిన ముండల్లారా!" అంటూ ఎమ్మా ఎడ్వర్డోవ్నా లోపల్నుంచి అరవడం వినిపించింది. 'మట్టు, మర్యాద గల పిల్లలెవరైనా ఈ విధంగా కిటికీల్లో వేలబడి, వీధిఅంతా వినిపించేలా అరుస్తారుటే? ఎంత అవమానం? ఎంత అవమానం! అసలీ పాడుముండ న్యూరాయే కారణం. అన్నిటికీ తగుదునమ్మాఅని ముందుకొస్తుంది. ఛీ! నీకు సిగ్గులేదటే' అంటూ చెడామడా తిట్టింది ఎమ్మా.

ఎమ్మా నల్లటి దుస్తులు వేసుకుని భూతంలావుంది. ఆమెను చూడగానే పిల్లలంతా ఉప్పిడిచప్పిడి కాకుండా నోళ్ళు నొక్కుకుని ఊరుకున్నారు.

కొందరు పిల్లలు గదిలోకుర్చీలమీద కూచున్నారు. జెన్నీ మాత్రం అద్దాలముందునుంచుని ఎవరితో సంబంధం లేకుండా తనలో తాను ఆనందిస్తోంది. అంతలో ఎదురుగావున్న సోఫియా ఇంటిముందు మరికొంతబండ్లు

వచ్చిఆగాయి. ఇంకో బండివచ్చి అన్నా ఇంటిముందు ఆగింది. క్రమక్రమంగా యామాలోకి బండ్లురావడం ప్రారంభించాయి. సందడి జాస్తి అవుతోంది.

బండ్లోంచి ఒకాయన అన్నా ఇంటిముందు దిగాడు. కాపలావాడు సిమన్ ఎదురుగా వెళ్ళి ఆయనకోటు అందుకుని హాల్లో ప్రవేశపెట్టాడు.

జెన్నీ, ఒకసారి ఆ వచ్చిన మనిషికేసి చూచింది. భుజాలు ఎగరేసి తల ఊపుకుంటూ లోపలికివచ్చింది.

'ఎవరో! కొత్తమనిషిలా వున్నాడు. ఇంతకుముందు ఇక్కడికి వచ్చినట్లులేదు. లావుగా, యూనిఫారం వేసుకుని వున్నాడు. బంగారపు ఫ్రేము కళ్ళజోడు పెట్టుకున్నాడు' అంది మెల్లగా జెన్నీ లోపలికివస్తూ.

ఎమ్మా పెద్దగొంతుపెట్టుకుని అధికారపూర్వకంగా ఆజ్ఞాపించింది.

'అమ్మాయిలూ! అంతా మొదటిగదిలోకిరాండి! ఊ! త్వరగా!'

పిల్లలంతా ఒకరితరువాత ఒకరు గదిలోకి వచ్చారు.

మాయముత్యాలహారం మెళ్ళోవేసుకున్న టమారా, బలిసి దుక్కలా వున్న కాట్కా లోపలికివచ్చారు. కొత్తపిల్ల నైనాకూడా వచ్చింది. ఆమె ఆకుపచ్చరంగు దుస్తులుధరించి చిలుకలావుంది. వచ్చినవాళ్లలో పెద్దమంకా కూడావుంది. ఈ ఇంట్లో ఇద్దరుమంకాలున్నారు. ఇంతకుముందు చెప్పిన మంకా చిన్నమంకా. ఈమెను పెద్దమంకా అని పిలుస్తారు. ఈ పిల్ల మొసలిపూడిరిగా వుంటుంది. అందుచాతనే ఆ పేరుపెట్టారు. అందరికంటె వెనుక, సోంకా కూడా గదిలోకి వచ్చింది.

# 6

వయసుమళ్ళిన పెద్దమనిషి ఒకాయన గదిలోకివచ్చాడు. యూనిఫారంలోవున్న దుస్తులు ధరించాడు. ఆయన దుస్తుల్నిబట్టి ధర్మాదాయ శాఖలో ఉద్యోగిఅని తోస్తోంది. మెల్లగా దిక్కులుచూచుకుంటూ వచ్చి ల్యూబా పక్కన కూలబడ్డాడు. వెంటనే ల్యూబా మర్యాదకోసం బట్టలూ అవీ సరిచేసుకుని సరీగా కూచుంది.

'ఏం అమ్మాయ్! ఖులాసాగా వున్నావా?'' అని అడిగాడు ఆయన.

'ఆ! మీరు క్షేమంగా వున్నారా?' తిరిగి కుశలప్రశ్న వేసింది ల్యూబా.

'నీకు బాగా జరుగుతోందా?'

'మీ అనుగ్రహం వుంటే చాలు కాని, జరుగుబాటుకు ఏం లోటండీ! దయచేసి ఒక సిగరెట్టు ఇప్పించండీ!'

'అయ్యో! నేను సిగరెట్టు కాల్చనే!'

'పోనీలెండి...... కాస్త లెమనేడ్ ఇప్పిస్తారా? ఐస్ వేసిన లెమనేడ్ అంటే నా కెంతో ఇష్టం.'

అందుకు అతనేమీ సమాధానం చెప్పలేదు. ఒక్క క్షణం ఆగి మళ్లీ ల్యూబా అడిగింది.

"డబ్బుకూ మీకూ లంకెలావుందే! మీరెక్కడ పనిచేస్తున్నారు? గవర్నమెంటు ఉద్యోగమా?"

"కాదు. నేను టీచరుగా పనిచేస్తున్నాను. జర్మన్ భాష బోధిస్తాను"

"మిమ్మల్ని ఎక్కడో చూసినట్లుంది. మీ ముఖం నాకు పరిచితమైందే. ఎక్కడచూశాను చెప్మా......?"

"ఏమో చెప్పలేను. బహుశా, బజార్లో చూసివుంటావు..."

"అవును. బహుశా బజార్లో చూసివుంటాను. పోనీ కనీసం ఆరెంజి అయినా ఇప్పించండి. ఆర్డరివ్వమంటారా?" మళ్ళీ అతను మాట్లాడకుండా ఊరుకున్నాడు. గది అంతా కలయచూశాడు. ఆయన మొహాన చెమట పోస్తోంది. ఏ పిల్లను ఎన్నుకుందామా అని ఆలోచిస్తున్నట్లుగావుంది. ఏ పిల్లా ఆయనకు నచ్చినట్లులేదు. మాట్లాడ్డానికికూడా ఏమీ తోచడంలేదు. ల్యూబా ప్రవర్తన, అవీ ఇవీ ఇప్పించమని అడగడం ఆయనకు నచ్చినట్లు లేదు. కొద్ది క్షణాలు అలాగే మౌనంగా కూచున్నాడు. అమ్మాయిలందరినీ పరిశీలించి చూశాడు. కొట్యా బాగా బలిసిన గేదెదూడలావుంది. ఈ పిల్ల బాగుంటుందనుకున్నాడు. కాని వెంటనే మనసు మారింది. సాధారణంగా లావుపాటి ఆడాళ్ళు రతిలో హుషారు చూపించలేరు. మొద్దుల్లా పడుకుంటారు అనుకున్నాడాయన. వేరా వంక చూశాడు. ఆమె బాగానే వుంది. బిగుతుగావున్న తొడలూ జఘనం. పడుచుపిల్ల. తరువాత తెల్లగా మెరుస్తోన్న చిన్నమంకా వైపు చూశాడు. ఏదో అమాయకత్వపు

హైస్కూలు అమ్మాయిలా కనిపించింది. జెన్నీ వైపు చూచాడు. ఆమె అందమైన మొహం, ఆ చలాకీ అతనికి బాగా నచ్చాయి. ఆమెతోటి వుండడానికి నిశ్చయించుకున్నాడు. లేవబోయాడు. కాని వెంటనే అనుమానించాడు. ఈమె కొంచెం కోపదారిలా, గర్వపోతులా కనిపిస్తోందే. తీరా రంగంలోకి దిగింతరువాత నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తుందేమో! అలా అనుమానం వచ్చి ఆగిపోయాడు. పిల్లలందరిలోకీ జెన్నీ అసాధ్యురాలుగా తోచింది అతనికి.

అసలీయన కొంచెం మితవ్యయం మనిషి. ఏంచేస్తాడు పాపం? పెద్ద సంసారం. అనేక బాధ్యతలు పైన ఉన్నాయి. భార్య చూడబోతే స్త్రీ సంబంధమైన రోగాలతో బాధపడుతోంది. అంచేత స్త్రీసుఖం లేకపోవడం, ఆయన కామతృష్ణ తీరకపోవడం జరిగింది. ఈయన రెండు బళ్ళల్లో టీచరుగా పనిచేస్తూ చదువు చెపుతున్నాడు. ఆ రెండూ ఆడపిల్లలబళ్ళే. అనుక్షణం అనేకమంది అందమైన అమ్మాయిలను చూస్తూ, వారిని పొందలేకపోవడంవల్ల ఈయనలో ఏదో నిరాశ, నిస్పృహ ఆవరించాయి. స్త్రీసంబంధమైన భంగపాటుతో బాధపడసాగాడు. స్త్రీసుఖం లేదనే మనోవేదన నిరంతరం పీడిస్తోంది. ఏంచేస్తాడు? వచ్చే ఆదాయం తక్కువ. [illegible] సంసారం ఖర్చుపెట్టుకుంటామన్నా మిగిలేదికాదు. అయినా అప్పుడప్పుడు కొద్దిగా కూడబెట్టి ఓ ఐదో, పదో రూపాయలు తన ఖర్చుకోసం వుంచుకునేవాడు. ఆ డబ్బుతో మధ్యమధ్య కాస్త బీరు తాగడం, బ్రాందీ సేవించడం, ఓ అమ్మాయితో ఒకసారి వుండడం, చేస్తూవుంటాడు. పాపం ఈ జర్మన్ దేశస్థుని మనసులో అనేక ఆలోచనలు, ఊహలు, అమాయకత్వం, భయం, పిచ్చినమ్మకాలు, కవితాభావాలు మొలకెత్తుతూ చికాకు పరుస్తుంటాయి. అందువల్లనే ఈయన ఎప్పుడూ దైన్యంగా ఏదో పోగొట్టుకున్నవాడికిమల్లే అగుపిస్తాడు. నిజానికి చాలామంది మగాళ్ళు స్త్రీ సౌఖ్యం లేనందువల్ల ఇలా అయిపోతూవుంటారు.

“పోనీ, ఒకడాన్సు పెట్టించరాదటండీ!” అనడిగింది మళ్ళీ ల్యూబా, ఆయన ముహంవంక చిలిపిగా చూస్తూ. అది ఆయనకు నచ్చింది. కాస్త నృత్యం ఏర్పాటుచేస్తే కొంతసేపు కులాసాగా కాలక్షేపం అవుతుందనుకున్నాడు.

"డాన్సు ఏర్పాటుచేస్తే ఎంత పుచ్చుకుంటాగు?" అన్నాడు ఆయన నింపాదిగా.

"పెద్దడాన్సు అయితే యాభైరూపాయలు, లేక మామూలు చిన్న డాన్సఅయితే ముప్ఫై రూపాయలు పుచ్చుకుంటారు. ఏం? నచ్చిందా?"

"అ......బాగానేవుంది......ఇదేమంత ఎక్కువ కాదులే...... మరి ఎవరితో చెప్పాలి?"

"అదుగో పాటగాళ్ళు! వాళ్ళతో చెప్పండి"

"ఏమండీ......కాస్త హుషారుగావుండేలా......ఓ చిన్న డాన్సు ఏర్పాటుచేయించండి" అంటూ ఆయన డబ్బుతీసి పియానోమీద పెట్టాడు.

"చిత్తం మీ కేరకం కావాలో చెప్పండి" అంటూ ఇవయాపవిచ్ డబ్బుతీసి జేబులో వేసుకున్నాడు. "మీకు వాల్స్ కావాలా?. పోకా కావాలా? ......"అంటూ అరడజను డాన్సులపేర్లు గబగబా వల్లించాడు ఇవయా.

పాపం నిజానికి ఆయనకు ఆడాన్సులపేర్లు ఏమీ తెలీవు.

"ఏదో అలాంటిదే ఒకటి పెట్టించండి" అన్నాడు ముక్తసరిగా.

"వాల్స్, వాల్స్" అంటూ పెద్దగా అరిచింది వేరా. వేరాకు డాన్సుఅంటే తగనిఇష్టం.

అంతలో మిగతావాళ్ళంతా పోకా, పోకా అంటూ అరిచారు.

"సరే, పోకా వాయించండి" అంది ల్యూబాకూడా, ఎక్కువమంది అభిప్రాయం గమనించి.

"ఈయన నా ప్రియుడు. నా కోసమే ఈ డాన్సు పెట్టిస్తున్నాడు. ఏమండీ! అంతేనా? చెప్పండీ!" అంటూ ల్యూబా తన రెండుచేతులూ ఆ టీచరు మెడకు చుట్టింది.

కాని ఆయన మెల్లగా, ఆమెపట్టు విడిపించుకుని తాబేలులా తల అవతలికి గుంజుకున్నాడు. వెంటనే వాయిద్యాలు మోగాయి. అటుసంగీతం, ఇటు నృత్యం ఆరంభమైనాయి. ల్యూబా తన స్నేహితురాలు న్యూరాతో కలిసి నృత్యంచేస్తోంది. తక్కినపిల్లలుకూడా రెండు, మూడు జతలుగా ఏర్పడి డాన్సుచేస్తున్నారు. గదిఅంతా ధ్వనులతో మోగిపోతోంది. ఆ సందడిలో సందుచేసుకుని టీచరు మెల్లగా చిన్నమంకా దగ్గిరికి వెళ్ళాడు.

"మనం వెడదాంరా!" అంటూ తనచేయి అందించాడు.

"అవును మనం వెడదాం' అంటూ లేచి కిలకిలనవ్వింది మంకా.

మంకా అతన్ని వెంటబెట్టుకుని తన గదిలోకి తీసుకువెళ్ళింది. రెండో రకం వ్యభిచారగృహానికి తగినట్లుగానే, పడకగది యావత్తూ అలంకరించి వుంది. రెండు అరలుకల ఒక పెద్ద పెట్టె; దానిమీద ఒక పెద్ద అద్దం అమర్చివున్నాయి. ఒక గుండ్రని టేబులు, వెనక్కు వంపు తిరిగిన కుర్చీలు మూడు వున్నాయి. బల్లమీద ఫేస్‌పౌడరుడబ్బా, ఒక విచిత్రమైన యువకుడి ఫొటో, పెట్టి వున్నాయి. మరోవైపు కాగితపు పూలగుత్తులు అమర్చి వున్నాయి. పక్కమీద గులాబీరంగు దుప్పటి పరిచివుంది. దానిమీద కొన్ని 'విజిటింగ్ కార్డులు' పడేసివున్నాయి. గోడలకు అక్కడక్కడ ఫొటోలు తగిలించారు. ఆ బొమ్మలు కొన్ని నటులవి, మరికొన్ని విటులవి. గులాబీ రంగులోవున్న లాంతరు ఒకటి పైకప్పుకు గొలుసుకట్టి వేలాడతీసివుంది. పక్క వెనకాల ఒక స్టూల్ వేసివుంది. దానిమీద ఎనామిల్‌తో చేసిన ఒక పెద్ద నీళ్ళపళ్ళెం, చెంబు పెట్టివున్నాయి. చేతులు, మొహం కడుక్కోడానికీ, అవసరమైనప్పుడు పరిశుభ్రంచేసుకోడానికి ఇది ఏర్పాటు చేశారు.

"ఏం ప్రియా! కొంచెం లెమనేడ్ తెప్పించరూ? ఇక్కడ ఇది ఆచారం. ఎవరొచ్చినా, ఏదో తాగడానికి తెప్పించి ఇస్తారు" అంది మంకా, తన జాకెట్టుగుండీలు ఊడతీస్తూ.

'తర్వాత తెప్పిస్తాలే. ముందు పని కానియ్. అంతా నీలోవుంది రాణీ! నీవు నన్ను ఎంత సంతోషపెడితే...అంత...అయినా వెధవది, ఇక్కడ లెమనేడ్ మంచిది దొరకదే...' అన్నాడు టీచరు కొంచెం నూలుగుతూ.

కాదు, కాదు; మంచి లెమనేడ్, డ్రింక్, ఆరెంజీ అన్నీ దొరుకుతాయి. ఐస్ వేసి చక్కగా తయారుచేసి ఇస్తారు. సీసా ఖరీదు రెండు రూపాయలు. మరిమీరు ఈపాటి ఖర్చుకే లోభించేట్లయితే, పోనీ కనీసం కొంచెం బీరు అయినా తెప్పించండి. తాగకుండావుంటే మజావుండదు' అంది మంకా బట్టలు విప్పుతూ.

'సరే. బీరు తెప్పిస్తాను.' అన్నాడాయన.

'మరి నాకు లెమనేడ్, ఆరంజీ తెప్పించండి. అదిలేకుండా ఉండలేను. తెప్పిద్దురూ?' అంది మంకా, పసిపిల్లలా బ్రతిమాలుతున్నట్లు.

'కాదు ముందొకసీసా లెమనేడ్ తెప్పిస్తాను. ఆ కెంజీ తర్వాత ...? అసలు నీవు సరీగావుండాలేకాని షాంపేన్ తెప్పించనూ? ముందే చెప్పానుగా అంతా నీలో ఉందని. నీవు నన్ను ఎంతబాగా సంతుష్టిపర్చితే అంత.''

అయితే నాలుగుబుడ్లు బీరు, రెండుబుడ్లు లెమనేడ్ తెప్పిస్తాను. సరేనా? పోతే ఓ చిన్న చాకలెట్ల పొట్లం నాకోసం తెప్పించుకుంటాను. ఏమంటారు?'

"అలా వీల్లేదు. రెండుబుడ్లుబీరు, ఒకసీసా లెమనేడ్ చాలు. ఇంకేం అక్కర్లేదు. దండగమారి ఖర్చులంటే నాకు తలనొప్పి. ఆ తరువాత నాకేమైనా కావాలిస్తే అర్థిస్తానులే.'

'పోనీ, నాస్నేహితురాండ్రను పిలుచుకోమంటారా?'

"వద్దు వద్దు. స్నేహితులు, గీహితులు ఎవరూ అక్కర్లేదు."

వెంటనే మంకా, గదివాకిట్లోంచి తొంగిచూస్తూ పెద్దగా కేక వేసింది.

"జోస్యా! రెండుబుడ్లు బీరు, ఒకబుడ్డి లెమనేడ్ నా గదిలోకి— త్వరగా."

జోస్యా: కాపలావాడు సిమన్ చేత పానీయాలు పట్టించుకుని మంకాగదిలోకి వచ్చింది. ఒక పళ్ళెంలో బుడ్లుపెట్టుకుని సిమన్ పట్టుకొచ్చాడు. అలవాటు వున్నవాడు గనుక సిమన్ క్షణంలో సీసాల మూతలుతీసి బల్లమీద పెట్టాడు.

"ఏమండీ! ఇక్కడ మీకు సౌకర్యంగావుందా? పెళ్ళికొడుకును సత్కరించినట్లుగా సత్కరిస్తాం మేము" అంది జోస్యా టీచరుతో.

వెంటనే మంకా అందుకుంది. 'ఏమండీ! ఈమె ఈఇంట్లో పనిమనిషి. నాకు ప్రాణస్నేహితురాలు. చాలా మంచిమనిషి. ఒక గ్లాసు బీరు ఇవ్వండి. తాగు జోస్యా!'

"చిత్తం. మీ పేరు చెప్పుకుని తాగుతానండీ! తమర్ని ఎక్కడో చూచినట్లు జ్ఞాపకం" అంటూ జోస్యా గ్లాసెడు బీరు గటగట తాగేసింది.

ఆ జర్మన్ టీచరుకూడా గ్లాసు ఖాళీచేసి మూతి తుడుచుకుంటూ మీసాలు సరిచేసుకున్నాడు, పనిమనిషి జోస్యా అవతలికి ఎప్పుడు వెళ్ళిపోతుందా అని ఎదురుచూస్తున్నాడు.

"వీటికి వెంటనే డబ్బు ఇవ్వాలి. తమరు ఏమీ అనుకోకండి. ఇప్పుడే ఇచ్చేయడం మీకూ మాకూ కూడా మంచిది. తరువాత అవసరమైన శ్రమ మాడండి!" అన్నది జోస్యా.

ముందుగానే డబ్బు అక్కడ పెట్టమని అడగడం అవమానంగా తోచింది ఆ బడిపంతులుకు. అతని సున్నితమైన మనస్సు నొచ్చుకుంది. వెంటనే కోపంకూడా వచ్చింది.

"ఏమిటీ బలవంతం? నేనేం పారిపోతాననుకున్నారా? ఎవ్వండీ కొంచెం తెలుసుకుని మాట్లాడాలి. నేను ఉద్యోగిని. మర్యాదస్తుణ్ణి. బికారినో, దేశదిమ్మరినో అనుకున్నారా? కనిపించడంలా? యూనిఫారంలో వున్నాను. కొస్త జాగ్రత్తగా మాట్లాడడం నేర్చుకోవాలి. ఇవాళైనా ఊరుకో" అన్నాడాయన గట్టిగా.

జోస్యా వెంటనే తగ్గింది. అయినా సమాధానపరచడానికి ప్రయత్నించింది.

"అదికాదు నాయనా! మీరలా కోపగిస్తే ఏం చెప్పను? మీరెంతో మోజుపడి మా చిన్నమ్మాయి దగ్గరికి వచ్చారు. నిజానికి ఈ పిల్ల వుంది చూచారూ? మాణిక్యంలాంటి పిల్ల. మీ మనస్సుకు తీరుస్తుంది. ఆమెకు మీ రెలాగూ బంగారపు తొడుగు వేస్తారు. మీరు అంతటి ఉదారస్వభావులని నేను ముందుగానే గ్రహించా. కాని మరి, ఈ డబ్బుందిచూచారూ? పానీయాలకు సంబంధించింది. ఎవరికైనా ముందుగానే అడిగి తీసుకోవడం అలవాటు. ఎందుకనుకున్నారు? అవతల నేను యజమానురాలికి లెక్క వప్ప చెప్పాలి. అందుకని అడిగాను నాయనా! రెండు బీరుబుడ్లు ఒక్కొక్కటి యాభై కోపెక్కులు. అంటే ఒక రూబులు అయింది. పోతే కిమనేడ్ ముప్పై కోపెక్కులు. మొత్తం ఒక రూబులు, ముప్పై కోపెక్కులు అయింది.

"అరి దేవుడా! ఒక బీరు బాటిలు యాభై కోపెక్కులే! ఇంత ధర ఎక్కడా లేదే? బజారుషాపులో నేను పన్నెండు కోపెక్కులకే తెస్తాను" అన్నాడాయన నోరు తెరిచి కళ్ళు పెద్దవిచేస్తూ.

"అయితే అంగట్లోకే వెళ్ళి కొనుక్కుని తాగకపోయారా? ఇది అంగడి కాదండీ. మాది ఒక సంస్థ. మర్యాదస్తులచే పరిశుభ్రంగా నడప

బడుతోంది. ఇక్కడ ఓటబుడ్డి ధర యాభై కోపెక్కులు. అసలైన సరుకు, సిసలైన ధర; ఈ విషయం అందరికీ తెలుసు. ఒక కోపెక్కు కూడా మేం ఎక్కువ పుచ్చుకోం" అంది మళ్ళీ జోస్యా కొంచెం ధీమాగా.

దాంతో టీచరు మళ్ళీ జవాబు చెప్పలేకపోయాడు. మెదలకుండా డబ్బు తీసి బల్లమీద పెట్టాడు.

"ఇదిగో! ఇప్పుడు సబబుగావుంది. మర్యాదస్థుల లక్షణమంటే అలా వుండాలి" నవ్వుతూ డబ్బు తీసుకుంది జోస్యా.

"పోతే. మీకు ఇరవై కోపెక్కులు తిరిగివస్తుంది" అంది ఆమె

"అవును. చిల్లరడబ్బులు ఇచ్చేయండి" అన్నాడు టీచరు.

"అలాగే, అలాగే! అమ్మాయితో కులాసాగా వుండండి. మంచి పిల్ల" అంటూ జోస్యా గబగబా వెళ్ళిపోయింది.

మంకా వెళ్ళి గదితలుపు వేసి గడియపెట్టింది. వచ్చి ఆయన తొడల మీద కూచుంది. తనచేయి అతని భుజంమీద వేసింది.

"నీవు ఎంతకాలంబట్టీ ఇక్కడ వుంటున్నావు?" అడిగాడు ఆయన.

పడుపుకత్తెతో కలిసి పడకగదిలో ఒంటరిగా వున్నప్పుడు ప్రతి మగాడూ ఇలాగే సంభాషణ జరుపుతాడు. స్నేహం చేసుకోవడంకోసం ఆమె పుట్టుపూర్వోత్తరాలు, పూర్వాపరాలు విచారిస్తాడు. ఇలా అడగడం విటు లందరికీ అలవాటుగా. కాని సాధారణంగా వేశ్యలంతా ఏవేవో అబద్ధాలు చెపుతారు. తమ అసలు విషయాలు దాచిపెట్టి లేనిది కల్పించి చెపుతారు.

"ఎక్కువకాలం కాలేదు. నేనిక్కడికొచ్చి ఇది మూడోమాసం. అంతే" అంది మంకా.

"నీకు ఎన్నేండ్లుంటాయి?"

"పదహారండీ"

మంకా అబద్ధం చెప్పింది. ఆమెవయస్సు ఇరవైఒకటి. అయిదు సంవత్సరాల వయసు దాచిపెట్టింది.

"నిజంగానా! చాలా చిన్నపిల్లవే!" నివ్వెరపోయి అడిగాడు ఆయన.

ఆయన బూట్లు విప్పతీసుకుంటూవుంటే, మంకా చెప్తోంది.

"మా ఊళ్లో, ఒక ఆఫీసరు వున్నాడు. ఆయన నన్ను బలాత్కారంగా చెరిచాడు. ఏంచేయను? మా అమ్మ అసాధ్యురాలు. ఆమె ఇలాంటివి సహించదు. ఆమెకు తెలిస్తే నన్ను చిత్రవధ చేస్తుంది. అందుకని భయంపుట్టి, పారిపోయి ఇక్కడికి వచ్చాను."

"అయితే నీవు ఆ ఆఫీసరును ప్రేమించావా?"

"నేను ఆయన్ని ప్రేమించనూ లేదు, ఆయనదగ్గరికి వెళ్ళనూ లేదు. అతగాడే నన్ను పెళ్ళిచేసుకుంటానని ప్రమాణంచేశాడు దుర్మార్గుడు. తన పని కాస్తా కాగానే, జాడా, జవాబూ లేకుండా నన్నొదిలిపెట్టి వెళ్ళిపోయాడు......నీచుడు!"

"అవును గాని, మొదటిసారి మగాడితో వున్నప్పుడు నీకు సిగ్గయ్యిందా

'అవును. చచ్చేసిగ్గేసింది. ఏమండీ మీకు దీపంవుంటే బాగుంటుందా, లేకుండావుంటే బాగుంటుందా? పోనీ లాంతరు కొంచెం తగ్గిస్తాను... సరేనా?'

'అలాగేకాని, నీ కిక్కడ సంతోషంగా వుందా? మరచిపోయా, నీ పేరేమిటి?'

'మంకా. అవును. నాకిక్కడ హాయిగాలేదు. అయినా నాకిక్కడ సంతోషం ఎలా వస్తుంది చెప్పండి?'

టీచరు ఆమె పెదవులను గట్టిగా ముద్దుపెట్టుకుని మళ్ళీ ఇలా అన్నాడు.

'నీవు ఎవరినైనా ప్రేమించావా? నిన్ను ఏ మగాడైనా బాగా సుఖపెట్టాడా? నీకు ఎలాంటి మగాళ్ళంటే ఇష్టం?'

"అవును కొందరు నన్ను భలే సంతోషపెట్టారు" అంటూ పెద్దగా నవ్వింది మంకా. 'ముఖ్యంగా మీవంటి మగాళ్ళే నా మనసుకు నచ్చుతారు సుమండీ! మీలాగే లావుగా, బొద్దుగా వుంటే ఎంతో బాగుంటుంది.'

'నిజంగా! నాలాంటి లావాంటివాళ్ళు నీకంత బాగుంటారా?' అంటూ ఆయన మరికొంచెం తీరు చప్పరించాడు. సానలను చేరబోయేముందు, ప్రతిమగాడూ వాళ్ళమీద ఎక్కడలేని ప్రేమ వొలకపోస్తాడు. వారే తన

ఆరాధ్యదేవతలని పొగుడుతారు. కల్లబొల్లి కబుర్లన్నీ చెప్తారు. ఇప్పు డీయనకూడా అలాగే మాట్లాడడం ప్రారంభించాడు.

"నిజంగా నీలాంటి పిల్లలంటే నా కెంతో ఇష్టం. నిన్ను మనసారా ప్రేమిస్తున్నాను రాణీ! ఏదీ, ఒక్కసారి నీతో రతిసుఖాన్ని అనుభవిస్తే నా జన్మ తరిస్తుంది."

"మీకు పెళ్ళయిందా?" ఆమె అడిగింది, అతని వేలివుంగరం చూస్తూ.

"అయింది. కాని నేను నాభార్యతో కాపరం చేయటంలేదు. ఆమె రోగిష్టిమారిమనిషి. మగాడికి కావాల్సినసుఖం ఆవిడదగ్గరలేదు."

"పాపం; దురదృష్టవంతురాలు. మీరిలా వేశ్యల్ని మరిగారని ఆమెకు తెలుసా? తెలిస్తే ఎంతగానో దుఃఖిస్తుంది."

"సరే, ఇహ ఆవిషయం పోనీలే. అప్పుడుగాని మంజూ! నీ కోసం ఓ అందమైన ఇల్లు తీసుకుంటాను. పంపూ, పాయిఖానా, గాలీ, వెలుతురూ వుండేలా చక్కని వసతి ఏర్పాటుచేస్తాను. మరి నాతో వస్తావా? పచ్చని ఇంట్లో వెచ్చని పరుపుమీద ఇద్దరం స్వేచ్ఛగా వుండొచ్చు."

"ఎందుకు రానూ? తప్పకుండా వస్తాను."

మళ్ళీ అతను బలంగా, బిగువుగా, భయంకరంగా ఆమెను ముద్దు పెట్టుకున్నాడు.

"నీదగ్గర ఏమీ జబ్బులు లేవుకదా?" అని అడిగాడు అతను ఒణుకుతున్న కంఠంతో.

"లేవు. నేను ఆరోగ్యంగావున్నాను. ప్రతి శనివారం ఇక్కడికి డాక్టరొచ్చి మమ్మల్ని పరీక్షచేస్తాడు."

ఓ అయిదు నిముషాల తరువాత మంకో పక్కమీదినుంచి లేచి తన బట్టలు కట్టుకుంది. అతను ఇచ్చిన డబ్బుమీద ఒకసారి ఉమ్మేసి తన మేజోళ్ళల్లో భద్రపరుచుకుంది. ఆరోజు తను అదే మొదటి బోణీ అవడంవల్ల ఆమె అలా డబ్బుమీద ఉమ్మేసింది. అక్కడ సానులందరికీ ఇదొక అల వాటు, మూఢనమ్మకమూను. ఆతరువాత అతను, ఆమె ఏమీ మాట్లాడుకో లేదు. చాలా సంతోషపెట్టావని కాని, తనతో రావల్సిందని కాని, అతను అడగనూలేదు, ఆమె చెప్పనూలేదు. మంకో యొక్క మందకొడితనానికి,

ఆ జర్మన్ టీచరు అమిత అసంతృప్తి చెందాడు. పనిమనిషి జోస్యాను పిలవమని ఆమెతో చెప్పాడు.

"జోస్యా! జోస్యా! ఒకసారి ఇలావచ్చిపో. నా ప్రియుడు పిలుస్తున్నాడు" అంటూ కేక వేసింది మంకా.

మంకా ముందటిహాల్లోకి వచ్చి, అద్దంముందు నిలబడి తన కురులు సరిచేసుకుంటోంది. ఈలోపల జోస్యా మంక పడకగదిలోకి వెళ్ళి ఆ పెద్ద మనిషితో మాట్లాడింది. తరువాత మరోపిల్ల పాషాను ఇవతలికి పిలిచి ఏదో చెప్పి గదిలోకి పంపించింది. పిమ్మట హాల్లోకివచ్చి మంకాతో ఇలా అంది.

'ఏం మంకా! నీవు అతన్ని సంతోషపెట్టలేవూ? అతగాడు నీమీద నిందవేస్తున్నాడు. నీవు సరిగా, సరసంగా వుండలేదట. మొద్దులా పడుకున్నావట. ఐస్‌లా అయిపోయావట. నీ దగ్గర ఏమాత్రం చురుకుదనం, కరుకుదనం లేదంటున్నాడు పాపం! మళ్ళీ ఇప్పుడతనిదగ్గరికి పాషాను పంపించాను' అంటూ జోస్యా విరగబడి నవ్వింది.

"ఛీ! రోతమనిషి!" అంటూ మంకా అవతలివైపుకు తిరిగి తుపుక్కున ఉమ్మేసింది. "వచ్చినలగాయతూ ఏదో వెధవవాగుడు మొదలెట్టాడు. నేనంటే నీకు నచ్చుతానా? ముద్దుపెట్టుకుంటే నీకెలావుంటుంది? పడుకునేటప్పుడు నీకు బాగా ఉద్రేకం వస్తుందా? ఇలాంటి వెధవ ప్రశ్నలన్నీ వేసి వేధించుకుతిన్నాడు. ముసలిగాడిద! 'నీతో రతిసుఖాన్ని అనుభవించాలనివుంది' అన్నాడు పాడుపీనుగ!" జరిగిన తంతు అంతా చెప్పింది మంకా.

"అవును మరి. వచ్చిన ప్రతివెధవా అలాగే వాగుతాడు" అంది మళ్ళీ జోస్యా.

ఇదంతా వింటోన్న జెన్నీకి ఒళ్ళు మండుకొచ్చింది. అసలు పొద్దుటి నుంచీ చిరాగ్గా చిటపటలాడుతూవుంది జెన్నీ.

'ఛీ! బుద్ధిలేనిముండల్లారా! ఇలాంటి చండాలపు లంజకొడుకు లందరికి సరసాలు కావాలట, సరసాలు!' జెన్నీ మొహం ఎర్రగా అయిపోయింది. రౌద్రాకారం దాల్చింది. 'ఏం? నీవు అందంగాలేవూ? నీ వత్తనికి సరిపోలేవూ? అవును ఎందుకుపోతావు? ఒళ్ళంతా చెమటలుకక్కి, ముక్కు వెంబడిచీముడి, నోటివెంబడి చొంగపడేలా వాడితో కసరత్తుచేసే పిల్ల అయితే

వాడికి సరిపోయేది. నాలుగు మాటలూ అనే, నాయాళ్ళు వచ్చినదోవ పట్టించకపోయావు కే.? అవును. మీ కెందుకు అనుగుతారు? మీరంతా సరసమైన సానులు! మగాళ్ళను ఉద్ధరించడానికి పుట్టిన సుగుణలు' నేనైతే వాడి తిక్క కుదిర్చేదాన్ని. ప్రేమంటే యేమిటో ప్రత్యక్షంగా చూపించేదాన్ని. లంజకొడుకును ముక్కూ చెవులూ పట్టుకుని అద్దంముందుకు తీసుకొచ్చి, వాడి ముండమోపిముఖం ఎలావుందో చూచుకోమని చెప్పేదాన్ని. తాగిన సారా కక్కించి, నిషా దించి క్రిందపడేసి పొర్లించి తన్నేదాన్ని! నోటివెంట చొంగపడేదాకా నేలకేసి బాదేదాన్ని. మీరా? మీరంతా సిగ్గువిడిచిన ముండలు!' అంటూ జెన్ని మగాళ్ళమీద తనకున్న అక్కసంతా వెళ్ళకక్కుతోంది. అంతలో ఎమ్మా వచ్చి ఆపుచేసింది.

'అయ్యో! అయ్యో! జెన్నీ! నీ నోరు పాడుగాను. ఇహ ఊరుకోవే. వచ్చిన పెద్దమనుషులు వింటే పరువుపోతుందే.'

'ఏం, ఎందుకు వూరుకోవాలి?' అంటూ ఎదురు జవాబు చెప్పింది జెన్ని. ఆమె మొహం అంతా కోపంతో వణికిపోతోంది. ఇహ అక్కడొక క్షణంకూడా వుండకుండా చరచరా అవతలికి వెళ్ళిపోయింది.

# 7

క్రమక్రమంగా హాలంతా వచ్చేగిరాకులతో నిండిపోతోంది. చాలామంది సరసులు పోగయ్యారు. ఆ వచ్చినవారిలో రోలీ-పోలీ కూడా వున్నాడు. యామాలో ఇతన్ని ఎరగనివారు లేరు. తల నెరిసిపోయిన వృద్ధుడు. సన్నగా, పొడుగ్గా వుంటాడు. ఎర్రని బుర్రముక్కు. ఫారెష్టు గార్డుగా పనిచేస్తున్నాడు. యూనిఫారం వేసుకుని, ఎత్తుబూట్లు తొడుక్కొని, పక్కజేబుకు ఒక చేతికర్ర తగిలించుకుని దర్జాగా వుంటాడు మనిషి. రాత్రింబగళ్ళు క్లబ్బుల్లో, గలాటాల్లో, సారా అంగళ్ళల్లో సాని కొంపల్లో పడి కాలం గడుపుతుంటాడు. జూదంలో, వాదంలో ఆరితేరిన ఘటం. ఎప్పుడూ తాగి సగం మత్తులో వుంటాడు. అమితమైన వాగుడు. అందరితో పరిహాసా లాడుతుంటూ, నవ్విస్తూ,

కవిస్తూ వుంటాడు. హమేషా సానికొంపలకు వస్తాడు. తమాషాలు చేస్తాడు. సానులందరితో సరసాలాడుతూ, నవ్వుతూ, వేళాకోళాలు చేస్తూ, కులాసాగా కలిసిమెలిసి వుంటాడు. కొంపలావాళ్ళు, యజమానులు, పనిమనుషులు, పసుపుకత్తెలు అంతా ఇతనితో చనువుగా వుంటారు. యజమానురాలి మొదలు పనిమనిషివరకూ అందరూ ఇతన్ని పైకి గౌరవిస్తారు. కాని ఇతని పిచ్చిచేష్టలకు అంతో, ఇంతో మనసులో అసహ్యించుకుంటారు. ఒక్కొక్కప్పుడు అమ్మాయిలదగ్గరనుంచి ఉత్తరాలు, చీట్లు వ్రాయించుకుపోయి, వారివారి ప్రియులకు, మిండగాళ్ళకు అందచేస్తాడు. అవసరంవచ్చి పనిచెపితే మార్కెట్టుకూ, మందులకొట్టుకూ పరుగెత్తుతాడు. పాపం! ఎన్ని పిచ్చిచేష్టలు చేసినా, కేతిగాడిలా తైతెక్కలాడినా, మనిషిదగ్గర బెట్టు, గర్వం లేవు. అందరికీ సహాయపడుతూ తలలోనాలుకలా వుంటాడు. అందచేతనే ఇతనిదగ్గర ఎన్ని నీచపు గుణాలున్నా, వేశ్యలంతా ఇతనిమీద దయ, దాక్షిణ్యం, జాలి, అభిమానం చూపిస్తారు. ఒక్కోసారి ఎవరైనా పరదేశీయులు వస్తే, వారికి సారథ్యం వహించి, సానికొంపలకు తీసుకొచ్చి, పని పూర్తిచేసి పంపుతాడు. ఈ శ్రమపడ్డందుకు వాళ్ళదగ్గర డబ్బులు అడుక్కుంటాడు. అయితేఏం? ఆ డబ్బు అంతా ఆక్షణంలోనే అక్కడే సానులకోసం ఖర్చుచేస్తాడు. ఏ కొద్ది చిల్లరడబ్బులో మాత్రం తన సిగరెట్లకోసం అట్టేపెట్టుకుంటాడు. కనుక ఇతనికి డబ్బు దాచుకుందామనే కాంక్షకూడా లేదు.

“అడుగో! ‘రోలీ-పోలీ’ వచ్చాడు” అని అరిచింది న్యూరా అతన్ని వాకిట్లోనే చూచి.

రోలీ-పోలీ కొంపలావాణ్ణి పలకరించి, కరస్పర్శచేసి ఠీవిగా హాల్లోకి వచ్చాడు.

“మీ అందరి యోగక్షేమాలు విచారించి రమ్మని, ప్రీక్లాస్సిలువారు నన్ను పంపారు. మీదర్శనం చేసుకుందామని వచ్చాను. నన్ను నేనే పరిచయం చేసుకోవాల్సివచ్చినందుకు చింతగావుంది” అంటూ అతను ఒక విచిత్రమైన పోజుపెట్టి మిలిటరీవాడికిమల్లే శాల్యూట్ చేశాడు.

పిల్లలందరిదగ్గరకీ పోయి, పేరుపేరున పిలిచి వారి మంచి చెడ్డలు విచారించాడు. చివరకు వచ్చి గేదెమూడేలావున్న కొట్యా పక్కన కూలబడి

బడ్డాడు. వెంటనే కొట్కా కొడిమానులావున్న తనకాలు గిర్రున అతని వైపుకు తిప్పింది. మోచేయితీసి తన మోకాలుమీద పెట్టుకుంది. గడ్డంకింద చేయి ఆనించుకుని అతనివైపు తేరిపారచూస్తూ కూచుంది.

రాత్రిఅంతా ఏకధాటిగా కూచుని చెప్పినమాట చెప్పకుండా హాస్యా లాడుతూ, అందరినీ నవ్విస్తూ పొద్దుపుచ్చటం రోలీ-పోలీకి అలవాటైపో యింది. ఎన్నో సాయంత్రాలు, రాత్రిళ్ళు అతనావిధంగా ఈ సానికొంపలో సరదాగా గడిపాడు. ఇతని వెక్కిరింతలు, వెకిలిచేష్టలు, పిచ్చిపనులు, పరా చికాలు చూచి పడుపుకత్తెలంతా పొట్టచెక్కలయ్యేట్లు నవ్వేవాళ్ళు. సరదాపడేవాళ్ళు. పిల్లలంతా అతనితో పాటు గంతులేసేవాళ్ళు. వీరందరికీ తమకు తెలీకుండానే అతనిమీద ఏదో అభిమానం ఏర్పడింది. అతనొక పరాయివాడని అనుకోకుండా, భేదం లేకుండా తమలో ఒక వ్యక్తిగా భావించుకుని ప్రవర్తించేవాళ్ళు. ఒక్కోసారి ఈ సానులు తమస్వంతడబ్బు ఖర్చుపెట్టి ఇతనికి బీరు, సోడా ఇప్పించేవాళ్ళు. అవును మరి. ఇలాంటి వాడు ఒకడైనా లేకపోతే వీరి దిగుళ్ళన్నీ మరిచిపోవడానికి వీలుండేది కాదు. ఈ దౌర్భాగ్యజీవితాలకు, ఈ మాత్రం ఆనందమైనా ఉండదు.

ఇవాళకూడా రోలీ-పోలీ హాస్యాలతో హాల్లోవాళ్ళంతా ఆనందంలో మునిగి తేలిపోతున్నారు. పొద్దుపోతోంది. కొంచెం పొద్దుపోయింతర్వాత మంగలిషాపుల్లో పనిచేసే గుంపు ఒకటి వచ్చిపడింది. ఆ రోజు ఈ పనివా ళ్ళందరికీ సెలవు. అంచాత తీరుబడిగా యామార్గాన ఉన్న సానికొంపలన్నీ చుట్టబెడదామని వచ్చారు. కాని ట్రెప్పెల్సులో ప్రవేశించడానికిమాత్రం వీరికి ధైర్యం చాల్లేదు. కాదూ మరి! అది కాస్త పెద్దఎత్తు వ్యవహారం. హైక్లాసుకు చెందిన సానికొంప. అక్కడ వ్యాపారం అంతా హైక్లాసు లోనే సాగుతుంటాయి! గడపలో కాలుపెట్టగానే డబ్బు గలగలరాల్చాలి. పాపం ఆ తాహతు వీరికెక్కడుంది? కష్టపడి పనిచేసి మిగుల్చుకున్న సొమ్ము, తృణమో, ఫలమో ఇస్తే అక్కడ సానులు పలకైనా రారు, అన్నా మార్కోవ్నా ఇల్లే వీరికి అన్నివిధాల తగినదిగా కనిపించింది. ఇంకేం! మందమందగా వచ్చి లోపల చొరబడ్డారు. మంగలివాళ్ళంతా మహాహుషా రుగా వున్నారు సుమండీ! ఇక్కడికి వచ్చికూడా వీరు సంభాషణలు, సర దాలు ఆపలేదు. మంగలిషాపుల్లో జరిగే అపభ్రంశపుపనులన్నీ చెప్పుకుని

నవ్వడం మొదలెట్టారు. తమ యజమానులనుగురించీ, వారి భార్యల పతివ్రత్య తనుగురించీ, చెప్పుకుంటూ పగలబడి నవ్వసాగారు. తరువాత ఒక పెద్ద డాన్సు పెట్టమని ఆగ్రహించారు. ఇంకేం? నృత్యం ప్రారంభమైంది. వాయిద్యాలు మోగాయి. పిల్లలంతా వరుసలారుసలుగా, జట్లుజట్లుగా వచ్చి అచ్చమైన పర్షియన్ పద్ధతిలో నృత్యప్రదర్శనం జరిపారు. వీరంతా చప్పట్లు కొడుతూ సరసాలాడుతూ ఆనందించారు. కాని వీరెవరూ సానులతో వుండలేదు. యామా అంతా ఒకచక్కరుకొట్టి, మిగతావిళ్ళుకూడా చూచుకుని తరువాత వస్తామని వాగ్దానంచేసి వెళ్ళిపోయారు.

వంగుల్లోంగుల క్రాపులు దువ్వుకుని, వన్నెగల బూట్లు తొడుక్కుని, గవర్నమెంటు గుమాస్తాలుగా పనిచేస్తోన్న వయసుకుర్రాళ్ళుకూడా కొందరు వచ్చి పోయారు. తరువాత కొందరు విద్యార్థులు, మరికొంతమంది ఆఫీసర్లు వచ్చి వేశ్యలతో వుండిపోయారు. హాలంతా జనులతోటీ, ధ్వనులతోటీ సందడిగా కల్లోలంగావుంది. ఎవరి ఆనందంలో వారు మునిగి తేలుతున్నారు. ఎప్పుడూ వతనగా వచ్చే విటుడుకూడా ఒకతను ప్రత్యక్షమయ్యాడు. ఇతను సోంకా అనే అమ్మాయిని ప్రేమిస్తున్నాడు. అందుకని సాధారణంగా ప్రతిరోజూ ఇక్కడికి వస్తుంటాడు. తన ప్రియురాలి పక్కన కూచుని, ఆమె సౌందర్యాన్ని తిలకిస్తూ, ఆనందిస్తుంటాడు. వీరిద్దరూ యూదీయులు. వీరి స్వస్థలం 'గోమెల్'. ఒకేజాతికీ, ఒకే మతానికీ చెందినవారవడంచేత, ఈశ్వరుడే వీరిద్దరికీ ఈ సన్నిహితత్వం ఏర్పరచివుండవచ్చు. దైవవశాత్తూ ఒకేచోటుకు రావడం, పరస్పరం ప్రేమించుకోవడం జరిగింది. కాని తన ప్రియురాలు, సానికొంపలో ప్రవేశించి కలుషితమైపోయిందని ఇతను బాధపడుతూవుంటాడు. మద్య-మాంసాలకు అలవాటు: —తన యూదీయమతానికి ద్రోహం చేస్తోందని ఆవేదనపడేవాడు. నిజానికి వీరిద్దరిదీ పవిత్రమైనప్రేమ. కాని కాలం, కర్మం కలిసిరాక, దారిద్ర్యం భయం మొదలైన పరిస్థితులు చుట్టుముట్టి వీరిని వేరుచేశాయి. ఇతను బ్రతుకుతెరువు కానక, నిలువనీడలేక అనేక బాధలుపడ్డాడు. చివరకు నగరంలో ఒక మందులషాపులో పని దొరికింది. అయినా ఈలోగా తన ప్రియురాలు పడుపువృత్తిలో ప్రవేశించి సానికొంపలకు అమ్ముడుపోవడం సంభవించింది. సోంకాతల్లి స్వయంగా తన కూతుర్ని సానులకు అమ్మేసింది. ఆ పిల్ల

అనేక కొంపలు తిరగడం, అనేకమందికి అమ్ముడుపోవడం, ఇవన్నీ ఇతనికి తెలుసు. ఇంకా ఆమె పతనానికి హేతువులయిన భయంకర సంఘటనలు ఇతను ఎరుగును. ఇందులో సోంకాడి ఏమాత్రం తప్పులేదనీ, వీటన్నిటికీ కారణం ఆ పిల్లతల్లి, వాళ్ళ దౌర్భాగ్య స్థితి, కుటుంబ పరిస్థితులే అనీ ఇతను అనుకునేవాడు. అంచాతనే ఇంత నీచస్థితిలోవున్న ఆ అమ్మాయిని ఇప్పటివరకూ మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాడు. ఇతనికి మతాభిమానం మెండు. అందులోనూ సనాతన యూదీయమతానికి ఏమాత్రం భంగం కలిగినా భరించలేనంత బాధపడేవాడు. అనేక మూఢనమ్మకాలు ఇతని మనసులో మెదులుతూవుండేవి. వీటన్నిటి మూలాన సోంకాదుస్థితిని తలుచుకుని దుఃఖించేవాడు. ఏమిటో పాపం! ఆ పిల్ల పక్కన కూచుంటే, ఆమెను తిలకిస్తుంటే ఇతని కేదో అవ్యక్తమైన ఆనందం కలిగేది.

ఒక్కొక్కసారి పనిమనిషి జోస్యా వచ్చి అతనితో ఇలా అనేది.

'ఏం నాయనా? అస్తమానం ఆమెపక్కన కూచోకపోతే, ఆ పిల్లను ఇంట్లోకి పిలుచుకుపోయి సుఖంగా గడపరాదూ?''

అయినా ఇతను ఏమీ మాట్లాడేవాడుకాదు. ప్రతిరోజూ అక్కడికి రావడం, ఆపిల్లను చూస్తూ కూచోవడం, ఇదే అతనికి ఆనందం. అప్పుడప్పుడు తన సంపాదనలో ఒకరూబులు మిగుల్చుకుని తెచ్చేవాడు. సోంకాను లోపలికి పిలుచుకుపోయేవాడు. ఆ రూబులు ఆమె చేతిలో పెట్టేవాడు. ఇద్దరూ ముద్దులాడేవారు. సంతోషంతో కౌగలించుకుని ఆనందించేవారు. అంతే. పాపం! వీరికి మనశ్శాంతిలేదు. శాశ్వతమైన ఆనందంలేదు. వెంటనే ఒకరి సమాచారాలు ఒకరితో చెప్పుకునేవారు. మంచిచెడ్డలు విచారించుకునేవారు. మనసిచ్చి మాట్లాడుకునేవారు. తమ నికృష్టమైన జీవితాలు తలుచుకుని, కుమిలికుమిలి ఏడ్చేవారు. తమదేశం, తమమతం, తమ ఆచారాలు, జరిగిపోయిన సంగతులు, ఇవన్నీ చెప్పుకుని, భగవంతుడిలాచేశాడని వెక్కివెక్కి ఏడ్చేవారు.

ఆతరువాత సోంకా తిరిగీ హాల్లోకివచ్చి కూచుంటే, ఆమెకళ్ళువాచి, ఎర్రగా జోత్యిల్లా వుండడం అందరికి అగుపించేది.

తనవద్దడబ్బువున్నా, లేకపోయినా ఇతనుమాత్రం ఇక్కడికిరాకుండా వుండడు. ఆ పిల్లపక్కనకూచోవడం మానడు. అలా గంటలతరబడి

కూచుని ఓర్పుతో జరిగేవన్నీ గమనిస్తూవుంటాడు. అప్పుడప్పుడు కొందరు విటులువచ్చి సోంకాను లోపలికి పిలుచుకుపోయేవారు. తన ప్రియురాలు అలా పరాయివాడిసొత్తు అయిపోవడంచూచి ఇతను అసూయపడేవాడు. ఆమె తన పడకగదిలోంచి ఇవతలికొచ్చి మళ్ళీ తనపక్కనకూచునేసరికి, ఇతని వంటిమీద తేళ్ళూ, జెర్రిలూ పాకినట్లు అనిపించేది. అయినా ఆమెను ద్వేషించేవాడుకాడు. ఆమెవంక తేరిపారచూస్తూ కూచునేవాడు. అతని కళ్ళల్లో ఏదోబాధ, ఆబాధలోనే ఏదో సంతృప్తి అగుపించేది.

సులోచనాలషాపులో పనిచేసే జర్మనుల తుగిడీ ఒకటి వచ్చిపడింది. ఈ గుంపంతా తాగి తందనాలాడి, సానులతో గడుపుతున్నారు. తరువాత మరోఇద్దరు ప్రిబుద్ధులుకూడా వచ్చారు. ఒకతనిపేరు కోల్కా. మరొకతని పేరు మిష్కా. ఇద్దరూ యువకులే. కోల్కా పుస్తకాలమ్ముకునేవాడు. మిష్కా సంగీతపాటకుడు. వీరిద్దరూ యామాకు చిరపరిచితులు. ఇద్దరివీ బట్ట తలలు. సన్నంగా వుంటారు.

వీరిద్దరినీ వాకిట్లోనేచూచి న్యూరా ఎగిరిగంతేసింది. 'ఒసేయ్ జెంకా! మీఆయన వచ్చాడేలా రా. ఒసేయ్ చిన్నమంకా! నీప్రాణసఖుడు వచ్చాడు చూడవే' అంటూ అరిచింది న్యూరా.

మిష్కా సంగీతపాటకుడూకాదు, పాడూకాదు. ఇతనొక మందుల షాపు యజమాని. అయినా పాడుతూంటాడు.

"నిజం నిజం! నిజంగా నిజం!......
ఆదిగదిగో, అరుణోదయం!"

అన్నా ఇంటికి వచ్చినప్పుడల్లా ఈపాటే పాడుతూవుంటాడు మిష్కా.

టమారాప్రియుడు శంకొకూడా వచ్చాడు. ఇతను అనవసరమైన వాటికి సొమ్ము ఖర్చుచేసేరకంకాదు. పిల్లలకు చాకొలెట్లు కొనివ్వడంగాని అలాంటివి ఏమీ చేయడు. ఇతని వ్యాపారం ఏదో తారుమారు అయిందని వినికిడి. కాసేపు ఇవయాసలిచ్ వాయించే సంగీతం విన్నాడు. తరువాత తన ప్రియురాలు టమారాను తీసుకొని పడకగదిలోకి వెళ్ళాడు.

ఎగ్మాంట్ అనే నటుడుకూడా ఇక్కడే దాపురించాడు. పొడుగ్గా వుంటాడు. శుభ్రంగా గడ్డం గీసుకుని వచ్చాడు. ఇతని మొహంమాత్రం అసహ్యంగా వుంటుంది.

దుకాణాల్లోనూ, పెద్దపెద్ద వ్యాపారసంస్థల్లోనూ పనిచేసే గుమాస్తాలు చాలమంది వచ్చారు. అందరూ నృత్యంలో పాల్గొని, సానులను చంకనవేసుకుని సరదాలు తీర్చుకుంటున్నారు. చేతిరుమాళ్ళు అటూఇటూ విసురుతూ, చమత్కారంగా కసురుతూ ఆడాళ్ళతో కసరత్తు చేస్తున్నారు.

అప్పటికి చాలా రాత్రి అయింది. యామాలో జరగాల్సిన దారుణాలు అన్నీ జరిగాయి. చాలా కొంపల్లో కొట్లాటలు జరిగాయి. ఒకడికి ఒళ్ళంతా రక్తమయమైంది. మొహంనిండా గాయాలుపడి నెత్తురు చిమ్ముతోంది. తలమీద టోపీ ఎటో ఎగిరిపోయింది. ఎక్కడపడిందో అని వెతుక్కున్నాడు. అమ్మ, ఆలి బూతులు తిట్టుకుంటూ, గాయాలు తడుముకుంటూ, బజారుకు అడ్డంగాపడి పరుగుతీస్తున్నాడు. చిన్నవీధి అయిన మలాయా యామ్‌స్కాయాలో కొందరు సైనికదళంలో పనిచేసేవారికీ, మరికొందరు నావికులకూ పెద్ద యుద్ధం జరిగింది. పియానోలు, ఫిడేళ్ళు వాయించేవారు పూర్తిగా అలిసిపోయారు. అలవాటుచొప్పున ఏదో వాయిస్తున్నారేకాని, వారి సంగీతంలో జీవంలేదు. అర్ధరాత్రి దాటిపోయింది. తెల్లవారుఝాము కావస్తోంది. అప్పుడొక చిత్రం జరిగింది. అకస్మాత్తుగా, తలవనితలంపుగా ఓ ఏడుగురు విద్యార్థులు, ఒక ప్రొఫెసరు. స్థానిక పత్రికలో పనిచేసే ఒక రిపోర్టర్‌ను వెంటపెట్టుకుని అన్నామార్కోవ్‌నా ఇంట్లో ప్రవేశించారు.

## 8

ఆరోజు మే దినోత్సవం. పత్రిక ఆఫీసులోని రిపోర్టరు మినహా, తక్కినవారంతా మేడినోత్సవాల్లో పాల్గొన్నారు. ఉదయంనుంచే ఉత్సవాలు ప్రారంభమైనాయి. ప్రతివారూ తమస్నేహితురాండ్రైనయువతులతో కలిసి కులాసాగా గడపడం ప్రారంభించారు. దాపులోనే నీపర్ నది ప్రవహిస్తోంది. అందరూ నదివగ్గరకు వెళ్ళారు. పడవలమీద షికారుచేస్తూ అవతలిఒడ్డుకు చేరారు. నదిచుట్టూ పచ్చనిగడ్డీ, పరిమళం వెదజల్లే పొదలూ, వున్నాయి. అక్కడకూచుని వనభోజనాలు ఏర్పాట్లుచేసుకున్నారు. వెచ్చగా వేగంగా ప్రవహిస్తోన్న నదీజలంలో స్త్రీ, పురుషులుకలిసి జలకాలు ఆడారు. రకరకాల పదార్థాలు చేయించుకుని భుజించారు. స్వంతంగా ఇళ్ళల్లోతయారుచేసిన బ్రాందీ సేవించారు. కమ్మని పాటలు పాడారు. అలాగా

సాయంత్రంవరకూ ఆనందాతిశయంతో హాయిగా, తీయగా కాలంగడిపారు. పొద్దుపోయింది. మళ్ళీ అందరూ పడవలమీద తిరుగుప్రయాణం కట్టారు. వినీలాకాశం నిర్మలంగా వుంది. నక్షత్రాలు మిలమిల మెరుస్తున్నాయి. నదీప్రవాహంలో పడవలు అటూఇటూ ఊగుతూ, తేలుతూ ప్రయాణం చేస్తున్నాయి. నదిమీదినుంచి చల్లని, మెల్లనిగాలివీస్తూ హృదయాహ్లాదాన్ని కలిగిస్తోంది. విద్యుద్దీపకాంతులు, లంగరు వేయడానికి గుర్తుకోసం పెట్టిన దీపాలవెలుతురు నదీజలంలో ప్రతిఫలిస్తూ, శోభనుకలిగిస్తున్నాయి. పడవలన్నీ ఇవతలిఒడ్డుకు వచ్చాయి. అంతా పడవలుదిగారు, కొందరు చెట్టాపట్టాలు పట్టుకుని దిగారు. మరికొందరు పురుషులు స్త్రీలకు తమ చేతులు అందించి వారిని దింపారు. పగలంతా హాయిగాకలిసిమెలిసి తిరగడంవల్ల కాబోలు! వారి హృదయాల్లో ఏదో ఆనందం తొణికిసలాడుతోంది. పరస్పర స్పర్శవల్ల శరీరాలు వేడెక్కివున్నాయి. నరాల్లో వెచ్చనిరక్తం ప్రవహిస్తోంది. సంతోషంతో వళ్ళంతా బరువెక్కివుంది.

తరువాత వీరంతా ఆ యువతులను వారివారి ఇళ్ళవద్దకు తీసుకెళ్ళి దిగబెట్టారు. వీధివాకిళ్ళలో నిలబడి వీడ్కోలుఇచ్చారు. కరస్పర్శలు చేసుకుని కడసారిమాటలు మాట్లాడుకున్నారు. పాపం, వీరందరికీ యువతుల ఎడబాటు ఎంతోకష్టం కలిగించింది. కాదూ మరి? పగలంతా వారితో తిరిగి చనువుగా, సంతోషంగా గడిపారాయె! నిర్మలమైన నదీతీరంలో, పచ్చని పచ్చికబయళ్ళలో పగలంతా విహరించారు. మందంగా వీస్తోన్న మలయమారుతం, ఏటిమీదిగాలి, చుట్టూ రకరకాల పరిమళాలు వెదజల్లుతోన్న గడ్డిపూలు, పక్కనకూచుని పకపకనవ్వుతోన్న పడుచుపిల్లలు, ఇవన్నీ ఆ కతిహృదయాల్లో ఏవేవో తీయతీయని కోర్కెలను పుట్టించాయి. ఒక్కొక్కరు తన నేర్పును, బలాన్ని ఉపయోగిస్తూ నదీజలాల్లో ఈదారు. పడవషికార్లు చేశారు. పైగా ఈ యువతులు ఎటువంటివారనుకున్నారు? అందగత్తెలు. తెలివైనవారు. చదువుకున్నవారు; గౌరవనీయమైన కుటుంబాల్లో జన్మించారు. వీరి తల్లిదండ్రులతోటి యువకులందరికీ అంతో, ఇంతో పరిచయముంది. అమ్మాయిలంతా నిర్మలమైన ప్రేమతో, నిష్కల్మషమైన హృదయాలతో మనసిచ్చి మాట్లాడారు. పడవ ఎక్కేటప్పుడో దిగేటప్పుడో యువతుల నడుముచుట్టూ చేయివేసి వారికి సహాయపడడం

జరిగింది. ఒకరినొకరు తాకారు. ఒకరిపక్కన ఒకరు కూచున్నారు. కలిసి తిన్నారు, కలిసితాగారు. ఈపనులన్నీ అనుకోకుండా, కాకతాళీయంగా జరిగిపోయాయి. సాధారణంగా స్కూలుపిల్లలు, యువతీయువకులు వనభోజనాలకూ విహారస్థలాలకూ వెళ్ళినప్పుడు ఎలా సంచరిస్తారో వీరూ అలాగే విహరించారు. వీరిహృదయాల్లో అసూయ, ద్వేషం, దుర్మార్గం అణుమాత్రమైనా లేవు. ఇల్లాగడిపిన స్త్రీ పురుషులకు ఎడబాటు సంభవిస్తే ఎలాంటి బాధకలుగుతుందో ఊహించండి. అందాకనే తీరా యువకులంతా వెళ్ళిపోయేసరికి ఈవిద్యార్థుల హృదయాలలో కల్లోలం బయలుదేరింది. రమణీయమైన ప్రకృతిసౌందర్యం, కమనీయమైన పరిసరాలు, ఎంతటిమగాణ్ణయినా ఇంతలో మారుస్తాయి. కనుకనే ఈ పసిహృదయాలలో, నిర్లిప్తంగా, నిగూఢంగా పశుప్రవృత్తి ప్రవేశించింది. కామవాంఛ రేకెత్తింది.

ఏడుగురు విద్యార్థులు, ఒక ప్రొఫెసరు, మొత్తం ఎనిమిదిమందీ రాత్రి రెండుగంటలవరకూ 'స్పానోస్' హోటల్లో కులాసాగా గడిపారు. పలురకాల పదార్థాలు భుజించారు. బీరు- బ్రాందీ సేవించారు. చక్కటి రాత్రి! చల్లని రాత్రి! అటుచూస్తే బయట విద్యుద్దీపాలు, ఆకాశంలో నక్షత్రకాంతులు. ఇటుచూస్తే హోటల్లో హాయిగొలిపే సంగీతం. వీటన్నిటి మధ్యా మత్తుగా, వొత్తుగా, తూగుతూ, తాగుతూ, నవ్వుతూ, పేలుతూ కులాసాగా గడిపారు. హోటలుకూడా మూసివేయబోతున్నారు. ఇహ ఎవరిఇళ్ళకువాళ్ళు వెళ్ళిపోవాలి. అంతా విడిపోవాలి. ఎలా వెళ్ళడం? ఎవరికీ కాలు ఆనడంలేదు. అందరి మనసులలోనుఏదోబాధ, భయంవేధిస్తున్నాయి. మధురమైనరోజు! ఆరోజంతా కలిసి కట్టుగావుండి, గంటలు నిముషాలుగా గడిపి, ఇహ ఇప్పుడు విడిపోవడమా? అసంభవం. ఎవరూ అందుకు సిద్ధపడలేకపోయారు. ఇంత రాత్రివేళ తీరా ఇంటికివెడితేమాత్రం ఏమిటి సుఖం? తల్లిదండ్రులు, పెద్దవాళ్ళు కోపంచేస్తారు. కాలు చప్పుడుకాకుండా, పిల్లిలా మెల్లెక్కి మేడలమీదికి పోవాలి. ఎందుకీఅవస్థ? ఈ కాస్తరాత్రికూడా ఎక్కడో హాయిగా గడిపితే, తీరిపోదూ? 'తవోలీ' అనే శృంగారమైన తోటవుంది. అక్కడికి వెడితే హాయిగానేవుంటుంది. కాని చాలా దూరం వెళ్ళాలి. పోనీ మరికొన్ని పెద్దహోటళ్ళు తెరచివుంటాయి. వాటిలోకి వెడితే? ఊహు! వాటిలో ప్రవేశిస్తే భరించలేని ఖర్చు. అయినా

ఎందుకు? హోటలులో కులాసాగా గడపడం ఇంతకుముందే అయిపోయిందిగా?

ఇలా విద్యార్థుల మనసులలో వివిధరకాల ఊహాలు బయలుదేరాయి. 'వొలోడ్యాపావ్లోవ్' అనే విద్యార్థి మిత్రులందరినీ తన ఇంటికి రమ్మని ఆహ్వానించాడు. తన గదిలో డజను బీరుబుడ్లు, మరికొంత బ్రాందీ కూడా వుందని చెప్పాడు. కాని ఎవరూ అంగీకరించలేదు. ఆవేళప్పుడు, అందులోనూ తాగివుండి, ఇంటికి వెడితే మరీ అభాసవుతుందని, పెద్దవాళ్ళు లేచి నానా చీవాట్లు పెడతారనీ అందరూ అభిప్రాయపడ్డారు. ఇళ్ళకు వెళ్ళే పరిస్థితే లేదు. అందుకు అంతా అంగీకరించారు. మరి ఇహ ఎక్కడికి వెళ్ళడం? "అయితే యామాకు వెడదామోయ్! పసందైన పడుపుకత్తెలున్నారు. ఇదే మంచి ఆలోచన." అని సూచించాడు చివరకు లిఖోనిన్ అనే విద్యార్థి.

లిఖోనిన్ పొడుగ్గా, వంగి ఉంటాడు. కొంచెం పొడుగ్గా పెరిగిన గడ్డం, మొహంలో దిగులు కనిపిస్తూవుంటుంది. ఇతనికి ఒక్క సిద్ధాంతంమీద నమ్మకంలేదు. పరిపాలన కట్టుబాట్లు వుండకూడదనే అరాజకవాది. అందుకు తగినట్లుగానే ప్రవర్తిస్తూంటాడు. రాత్రి ఆటలు, గుర్రపు పందాలు, జూదం, లాటరి, వీటిల్లో మునిగి తేలుతుంటాడు. వీటికోసం విపరీతంగా డబ్బారా ఖర్చు చేస్తూ జులాయిగా తిరుగుతూంటాడు. అంతకు క్రితంరోజే, క్లబ్బులో ఆటలలో కూర్చొని వేయి రూబుల్సు గెల్చుకున్నాడు. ఆ డబ్బు ఇప్పుడితని జేబులోనే గలగల్లాడుతూ ఉంది. ఎప్పుడు ఖర్చుపెడదామా, ఎలా ఖర్చుపెడదామా అని ఉబలాటపడుతున్నాడు పాపం. అందుకే యామాలో సానికొంపలకు పోదామని స్నేహితులకు సలహాయిచ్చాడు.

'ఏం? ఎందుకు వెళ్ళకూడదూ? తప్పకుండా వెడదాం. పదండిరా నాయనా!' అన్నాడు మరోవిద్యార్థి.

"పోయినందుకు కాస్త మజాగా వుంటుందా? లేక వృధా కాళ్ళ తిప్పటయేనా?" అని అడిగాడు మరోఅతను, అక్కడ ఎలావుంటుందో తెలీక.

మరోవిద్యార్థి కళ్ళు మూస్తూ తెరుస్తూ నిద్రమత్తుగావున్నాడు. కళ్లు నులుచుకుని పెద్దగా ఆవులించాడు. పాపం ఇతనికి బద్ధకంగావుంది.

"అబ్బ! కళ్ళు మూసుకుపోతున్నాయి. ఇహ ఇంటికి పోదాం పదండి. రోజంతా గడిపాంగా చాలదూ?" అన్నాడతను ఆవులిస్తూనే.

"నీకు నిద్రతప్ప మరోపనిలేదు. ఎప్పుడున్నా నిద్రేకదోయ్, పాడు నిద్ర. ఏమండీ! ప్రొఫెసరుగారూ! మరి మీరు రారూ?" అడిగాడు మళ్ళీ లిఖోనిన్.

ప్రొఫెసరుపేరు యార్చెంకో. లిఖోనిన్ సలహా వినేసరికి ఈయనకు కోపంవచ్చింది. ఆత్మలో ఏం దాగివుందో ఎవరికీ తెలీదుకాని పైకిమాత్రం చాలా అయిష్టంగా మాట్లాడాడు.

"నన్ను వదిలిపెట్టు లిఖోనిన్! అబ్బాయిలూ! మీకో విషయం చెప్ప దలుచుకున్నాను. మీరు సూచించిన సలహా నాకేమాత్రం నచ్చలేదు. ఈ రోజంతా మనం ఎంతో హాయిగా గడిపాంకదా! ఇది చాలదూ? ఏమిటీ పిచ్చిపనులు? ఇప్పుడుపోయి ఆ సానికొంపల్లో జొరబడతామంటారేం, ఏమైనా అర్థంవుందీ? నేనుమాత్రం రాను. తరువాత మీ ఇష్టం" ఖచ్చితంగా చెప్పాడు ప్రొఫెసర్ యార్చెంకో.

'ప్రొఫెసరుగారూ! శ్రీరంగనీతులు ఎన్నిఅయినా వల్లించవచ్చు, ఆచరణలోకి వచ్చేసరికే చిక్కొస్తుంది. మీరొక్కరే మడికట్టుకున్నట్లు మాట్లాడతారేం?' అన్నాడు లిఖోనిన్ ప్రొఫెసరును ఎత్తిపొడుస్తూ.

లిఖోనిన్ అన్నదాంట్లో కొంత సత్యం లేకపోలేదు. ప్రొఫెసరు ఏం తక్కువవాడు కాదు. చదువుకునేరోజుల్లోనూ, ఆతరువాత యూనివర్సిటీలో ప్రొఫెసరుగా వుంటున్నప్పుడుకూడా అనేక దుర్వ్యసనాలకు లోనయి చెడతిరిగాడు. ఈయన అందగాడుకూడా. పొట్టిగా, ఎర్రగా, బొద్దుగా వుంటాడు. గుండ్రటి మొహం. కళ్ళల్లో ఏదో కారుణ్యం తొణికిస లాడుతూ వుంటుంది. మంచి వాగ్ధాటి కలవాడు. మందహాసంచేస్తూ మహా సరదాగావుంటాడు మనిషి. ఇలాంటి యార్చెంకో నగరంలో వీధులు, విరామస్థలాలు, హోటళ్ళు, అంగళ్ళు, క్లబ్బులు, థియేటర్లు మొదలైన వినోదాలన్నిటిలో పాల్గొనేవాడు. అన్నిరకాల సరదాలు అనుభవించి పైలా పచ్చీసుగా తిరిగిన ఘటం. ఇలా వ్యర్థంగా కాలంగడిపినవాడికి, చదువు మీద ధ్యాస ఎలావుంటుంది? చదవడానికి తీరుబడి ఎక్కడుంటుంది? అయినా ఏమిటో ఆ మహాత్తు. అన్ని పరీక్షలు టకటకా ప్యాసయి పైకిపోయాడు.

అంతేకాదు ప్రతి పరీక్షలోనూ అన్ని సబ్జెక్టుల్లో ఫస్టుమార్కులు కొట్టేవాడు. క్లాసు వచ్చేది. స్నేహితులు, తోటి విద్యార్థులు, ముక్కుమీద వేలేసుకునేవారు. ఎంత మేధావి! ఎప్పుడూ తిరగడంతప్ప పుస్తకం తెరిచినట్లే కనపడదే!

యూనివర్సిటీలో ప్రొఫెసర్లు, అధికార్లు ఇతన్ని మెచ్చుకునేవారు. అందరికన్నా ప్రత్యేకంగా చూస్తూ గౌరవించేవారు. ఆ తరువాత క్రమ క్రమంగా యార్చెంకో తన పాత అలవాట్లనూ, అరకమైన స్నేహితులను విడిచిపెట్టి మంచిపద్ధతిలోకి మారాడు. ఇప్పుడీయనకు పెద్దపెద్ద ప్రొఫెసర్ల తోటీ, వారి కుటుంబాలతోటీ, పండితులతోటీ, విద్యావంతులతోటీ సంబంధాలు పెంపొందాయి. మర్యాదస్థులమధ్య తిరుగుతూ ఒకరకమైన గౌరవాన్ని సంపాదించుకున్నాడు. అయినా విద్యార్థులనుండి పూర్తిగా విడిపోలేదు. వారితో సన్నిహితంగావుంటూ అందరిచేతా గౌరవాన్ని పొందుతున్నాడు. ఎలాగైనా ప్రస్తుతం ఈయనకు తానున్న పరిస్థితిలో లిఖోనిన్ సూచించిన దుర్వ్యసనానికి లొంగడం అయిష్టంగా తోచింది.

"అవును లిఖోనిన్! నేను బుద్ధిమంతుడనని చెప్పడంలేదు. చిన్నతనంలో తెలిసో, తెలియకో అనేక తప్పులు చేశాం. మనం అందరంకూడా పొరపాట్లు చేసినవాళ్ళమే. చిన్నచిన్న వస్తువులు దొంగిలించాం. చొక్కాలు లాగులు బురదబురద చేసుకుంటూ ఎగిరాం, గెంతాం. తూనీగలను పట్టుకుని రెక్కలు విరగ్గొట్టేవాళ్ళం. ఇంకా ఎన్నెన్నో పిచ్చిపిచ్చి చేష్టలు చేశాం. కాని ఆకాలం పోయింది మనకు వయస్సు వచ్చింది. బుద్ధి వికసించింది. మరి అప్పుడెప్పుడో చేశామని ఇప్పుడుకూడా ఛిలిపిచేష్టలు, చెడుపనులు, చేయమంటావా? మరోవిషయం. వ్యభిచారం చాలా చెడ్డదనీ, మానవజాతి పతనానికి హేతువనీ, మానవ సంస్కృతీ నాగరికతలను విచ్ఛిన్నంచేస్తుందనీ, మనందరికి తెలుసు. ఒప్పుకుంటాం. ఇందుకు కారణం స్త్రీలు కారనీ, ఈ తప్పు వారిదికాదనీ, పురుషులయొక్క విషయలోలత్వంవల్లనే ఇది సంభవించిందనీకూడా మనమంతా అంగీకరిస్తాం. మరి నేనిప్పుడు ఒక గ్లాసు బ్రాందీ తాగాను. నా వళ్ళు గులగులలాడుతోంది. అందుకని నేను సానికొంపకు పరుగెత్తాలి. ఒక రూబుల్ పారేసి ఆడదాని శరీరం కొనాలి. ఒకగంటో, రెండుగంటలో నా ఇష్టంవచ్చినట్లు అనుభవించాలి. ఇదేనా నేను చేయాల్సిన

పని? ఇదేనా నా ధర్మం? ఇదేనా నా జీవితలక్ష్యం? ఇలా చేయడంవల్ల ఎన్ని తప్పులు చేసినవాడని అవుతానో చెప్తాను వినండి. ఒకటి, ఈపని నా సంకల్పానికే, నిశ్చయానికే విరుద్ధమైంది. రెండోది, విషయవాంఛకు దాసుణ్ణి అయ్యాను. మూడోది స్త్రీజాతికి ద్రోహంచేశాను. స్త్రీజాతికే కాదు. మానవకోటికే తీరని కళంకం తెచ్చిపెట్టాను. నాలుగోది, ఇందువల్ల వ్యభిచారాన్ని ప్రోత్సహించినవాడనయ్యాను. అయిదోది, ఈ ఘోర కృత్యాలవల్ల నా జీవితాన్ని నేనే పాపభూయిష్టం చేసుకుని, నా పతనానికి నేనే దారిచేసుకున్నవాణ్ణి అయ్యాను. కనుక లిఖోనిన్! ఈ పని నా సంకల్పానికీ, నా ఆదర్శాలకూ విరుద్ధమైనది” అంటూ యార్చెంకో గంభీరమైన ఉపన్యాసం ఇచ్చాడు.

అదివిని వెంటనే ‘బోరిస్ సొబాష్నికోవ్’ అనే యువకుడు అందుకున్నాడు.

“ప్రొఫెసరుగారూ! మీ అభిప్రాయాలు సమంజసమైనవికావు. మీరు చెప్పినట్లు నడిస్తే మగాళ్ళంతా వట్టిగొడ్డుపోవాల్సిందే. ప్రతిమనిషీ భౌతికసుఖాన్ని కోరుకుంటాడు. మరి అతని కోరికలు ఏం కావాలి? వాంఛలు తీర్చుకోకుండా అల్లాడి చావమంటారా? ఏ మనిషిదగ్గరకో వెళితే బండెను తిట్టిపోస్తుంది. లేక పరాయివాడిభార్యవెంట పడితే ఫెడేల్‌మని దవడమీద కొడుతుంది. మరింకేం చేయాలి? వేశ్యల దగ్గరికి స్వేచ్ఛగా వెళ్ళవచ్చు. అనుభవించి రావచ్చు.” అన్నాడు బోరిస్.

బోరిస్ పొడుగ్గా వుంటాడు. పొగరుబోతు. మిలిటరీవాళ్ళ లాగు తొడుక్కున్నాడు. వేసుకున్నాడు. దానిమీద పొట్టి బుష్‌కోటులాంటిది తొడుక్కున్నాడు. నెత్తిమీద టోపీ వుంది.

ఇతని సమాధానం వినేసరికి ప్రొఫెసరుకు మరీ కోపం వచ్చింది.

“అవును. వేశ్యలవద్దకు వెళ్ళొచ్చు. స్వేచ్ఛగా అనుభవించవచ్చు. ఎవరు అడ్డుపెడతారు? కాని, దీన్ని ప్రేమ అనరు. పశుప్రవృత్తి అంటారు. ఇలా చేయడం, కేవలం మదం, మౌఢ్యం” అన్నాడు తిరిగి ప్రొఫెసరు గట్టిగా.

అంతలో రాంజెస్ అనే కుర్రాడు జోక్యం కలిగించుకుని, వీరిద్దరి మధ్య రాజీ కుదిర్చటానికి ప్రయత్నించాడు. ఇతని అసలుపేరు ఏదో

వుంది. అందరూ ముద్దుగా, మారుపేరుతో రాంసెస్ అని పిలుస్తారు. పొట్టిగా వుంటాడు. పచ్చని ఛాయ. గడ్డం మొనతేలివుంటుంది.

'అదికాదు గురువుగారూ! మిమ్మల్ని పాపం చేయమని ఎవరూ బలవంతపెట్టడంలేదు. మరి మీరెందుకు అంత బాధగా, బరువుగా మాట్లాడుతున్నారో తెలీడంలేదు. ఇది మనకు అనవసరమైన వాదన. ఇప్పుడు మనం అనుకున్న ఆలోచన అతి స్వల్పమైన విషయం. మనమంతా యువకులం. స్నేహితులం. పగలంతా కలిసి కులాసాగా గడిపాం. గాలెన్లకొద్దీ బ్రాంది, బీరూ తాగాం. అంతా బాగానే జరిగిపోయింది. ఈ కాస్త రాత్రికూడా సంతోషంగా గడపడానికి సానికొంపలుతప్ప ఇంకేం లేవు. అందరం వెడదామనుకున్నామాయె! దీని కిన్ని సిద్ధాంతాలు, రాద్ధాంతాలు దేనికి చెప్పండి?' అన్నాడు రాంసెస్, ప్రొఫెసరుతో.

'పగలల్లా సంతోషంగా గడిపాం కనుక, ఇప్పుడుమాత్రం ఊరుకోవడం ఎందుకు, కాబట్టి లంజల దగ్గరికి పోదాం అంటావు నీవు—అంతేనా?' అన్నాడు ప్రొఫెసరు వికృతంగా నవ్వుతూ.

'అవును, వెడితే తప్పేముంది? వెనుకటికొక విషయం వుండేది. కొందరు సంగీత పాటకులు ఒక వేదాంతిని అవమానించాలనుకున్నారట. అందుకని భోజనాలు చేసేటప్పుడు అతన్ని అందరికంటె చివరవున్న బల్లదగ్గర కూచోబెట్టారట. అప్పుడా వేదాంతి ఏం చేశాడో తెలుసా? బల్లవైపు తిరిగి ఇటునుంచి లెక్క పెడితే ఇదే మొదటిది అవుతుంది అన్నాట్ట. అలాగే ఇప్పుడు నేనూ చెబుతున్నాను. ఆడదాన్ని కొన్నట్లవుతుందని నమ్ముతూ, అందుకు మీ అంతరాత్మ అంగీకరించకపోతే, అక్కడికివచ్చి ఊరకేకూచోండి. ఇంకేం, సరేనా?' అన్నాడు మళ్ళీ రాంసెస్.

"నీవు అధికప్రసంగం చేస్తున్నావు రాంసెస్.. పగలంతా పెద్దమనుషుల్లా తిరుగుతూ, సభల్లో, సమావేశాల్లో ఆదర్శాలను వల్లిస్తూ చీకటి పడగానే, ఇలాంటి నీచకార్యానికి పూనుకోడం ఎంతమోసమో నీవే ఆలోచించు. వ్యభిచారం చాలా దుర్మార్గమైనది రాంసెస్! దీన్ని ప్రోత్సహించడంవల్ల మనం రష్యాదేశానికి ద్రోహం చేసినవారం అవుతాం" అన్నాడు తిరిగీ ప్రొఫెసరు.

'వ్యభిచారం, దేశద్రోహం అంటూ గావుకేకలు పెడుతున్నారు మీరు. లిఖోనిన్, నేనూ, బోరిస్, ప్లాటొనోవ్, పెట్రోవస్కీ— అందరం కలిసి ఏడుగురం. మా అందరికీ లేని దేశద్రోహం మీ ఒక్కరికే వచ్చిపడింది కాబోలు పాపం! వ్యభిచారంవల్ల దేశం నాశనం అవుతుందని అంటున్నారు. అసలు పడుపువృత్తి లేని దేశంపేరు ఒక్కటి చెప్పండి. అన్ని దేశాల్లోనూ ఇలాగే వుంటుంది' అంటూ బ్రహ్మాండంగా అరిచాడు రాంసెస్.

"అరే, రాంసెస్! పులిబిడ్డవురా! భలేగా మాట్లాడావు. ఇదంతా ఎందుకు? ప్రొఫెసరుగారిని కాళ్ళూ చేతులూ కట్టేసి బండ్లో పడేస్తేసరి, తీరిపోతుంది" అంటూ పెద్దగా నవ్వాడు లిఖోనిన్.

విద్యార్థులందరూ యార్చెంకోను చుట్టుముట్టారు. ఒకడు ఆయన రెక్క పుచ్చుకున్నాడు. మరొకడు నడుం పట్టుకున్నాడు. ఇంకొందరు వాటేసుకున్నారు. మొత్తానికి అందరూ కలిసి ఆయన్ను లాక్కునివెడుతున్నారు. యార్చెంకో వాళ్ళపట్టు వదిలించుకోవాలని పెనుగులాడాడు కాని లాభం లేకపోయింది. అంతలో ఒక పోలీసువాడు, వాళ్ళకు రోడ్డుమీద కనిపించాడు. అతను అక్కడ నిలుచుని కొంతసేపటినుంచీ వీళ్ళచర్యలు గమనిస్తూనే ఉన్నాడు. 'అబ్బాయిలూ! మీరంతా స్టూడెంట్లు. ఇంత రాత్రివేళ నడిరోడ్డుమీద ఇలా ప్రవర్తించటం బాగాలేదు. కాస్త జాగ్రత్తగా మసలుకోవాలి' అని హెచ్చరించాడు పోలీసు.

ఆతనికేమీ సమాధానం చెప్పకుండా విద్యార్థులు గుంపుగా ముందుకు తోసుకుపోయారు. యార్చెంకో మెల్లమెల్లగా మెత్తపడి దారికి రాసాగాడు.

"అబ్బాయిలూ! ఎందుకు మనకీ తర్జన భర్జనలు? నా అభిప్రాయం నేను చెప్పాను. మీరంతా కాదని పట్టుపట్టారు. ఎలాగైనా నేను మిమ్మల్ని విడిచి వుండలేనని తెలుసుకదా? సరే. మీతోపాటే వస్తాను పదండి. ఏం చేస్తాం? కర్మ!" అంటూ ప్రొఫెసరు మెత్తపడి యామాకు వెళ్ళడానికి అంగీకరించాడు.

"కాని ఒక షరతుమీద వస్తున్నాను. మీరంతా సానికొంపల్లో అల్లరిచేసి అసభ్యంగా ప్రవర్తిస్తేమాత్రం నేను సహించను. తాగడంలో, నవ్వడంలో, సరసాలాడడంలో అన్నిట్లోనూ మితంగా, మప్పితంగావుండాలి సుమా! ఏమాత్రం శృతిమించినా నాకు పెద్దకోపంవస్తుంది. ముందే చెపు

తున్నాను. మనమంతా విద్యావంతులం. రష్యాలో మేధావులవర్గానికి చెందినవాళ్ళం. ఆ పేరు నిలబెట్టండి. అప్రతిష్ఠ తీసుకురాకండి' అన్నాడు తిరిగి ప్రొఫెసరు.

"ఓ! అలాగే! నేను చాలా జాగ్రత్తగావుంటాను" అన్నాడు లిఖోనిన్.

"నేనూఅంతే. ప్రమాణంచేస్తున్నాను" అన్నాడు రాంజెస్ వెంటనే.

విద్యార్థులంతా యార్చెంకో చెప్పిన షరతులకు అంగీకరించారు. అంతా యామాకు బయలుదేరారు. ఈ ఎనిమిదిమందీ రెండు మూడు బండ్లల్లో సర్దుకుని కూచున్నారు. అప్పటిదాకా బాడుగబండ్లు కొన్ని వరుసగా వారివెంట వస్తున్నాయి. ఏమైనా బేరంతగులుతుందేమో అని మెల్లగా పోనిస్తున్నారు బండ్లవాళ్లు. తీరా వీరంతా రెండుమూడుబండ్లు మాట్లాడుకునేసరికి, బాడుగలేని తక్కిన బండ్లవాళ్ళకు కోపంవచ్చింది. కాసేపు ఒకరినొకరు బూతులు తిట్టుకున్నారు. ఆ తరువాత విద్యార్థులు ఎక్కిన బండ్లు కదిలిపోయాయి.

మధ్యలో 'డ్రాకోవెంకో' హోటలు వుంది. ఇది రాత్రిఅంతా వుండే హోటలు. ఈ హోటలుముందు బండ్లు ఆపి విద్యార్థులంతా దిగారు. యదార్థానికి తాగాలనికాని, తినాలనికాని వాళ్ళకు లేదు. అయినా ఏమిటో పిచ్చి! ఆ ఉన్మాదంలో తెలీకుండానే వాళ్ళ కాళ్ళు లోపలికి ఈడ్చుకుపోయాయి.

బల్లలముందు కూచుని అందరూ బీరు, వోడ్కా, మొదలైన పానీయాలు సేవించారు. బీరు తాగుతూ రాంజెస్ హోటలులో ఒక మూలకు దృష్టి సారించాడు. అక్కడ ఒకాయన బూడిదరంగుసూటు వేసుకుని కూచునివున్నాడు. ఆయనపక్కన మరెవరో వృద్ధుడుకూడా వున్నాడు. సూటు వేసుకున్న వ్యక్తి బ్రాందీ సేవిస్తూ సన్నగా సంగీతం పాడుతున్నాడు. కొంచెంసేపు అతనివైపే దృష్టి నిగిడ్చి చూచాడు రాంజెస్. ఎవరో ఎరిగిన మనిషిలా తోచింది అతనికి. తాగడం పూర్తిచేసి అతని దగ్గరకు వెళ్లాడు.

"ఓ, అవును! ప్లాటొనోవ్! పత్రికా ఆఫీసులో పనిచేసే రిపోర్టరు"

రాంజెస్ అతన్ని బాగాఎరుగును. కరస్పర్శచేసి, ఆయన్ను తన మిత్రుల దగ్గరికి తీసుకొచ్చి అందరికీ పరిచయంచేశాడు. "ఇతను నా మిత్రుడు ప్లాటొనోవ్. రిపోర్టరు. పత్రికా నిర్వహణలో చాలాసమర్థుడు."

విద్యార్థులందరూ ప్లాటొనోవ్‌తో కరస్పర్శ చేసి సంతోషంగా కుశల ప్రశ్నలు వేశారు. "అబ్బాయిలూ! మన కొత్తమిత్రుడికోసం మరో డోస్ వేసుకుందాం" అని సూచించాడు లిఖోనిన్.

ఇంకేం, మళ్ళీ అంతా కుర్చీలలో చేంగిలబడి బల్లచుట్టూ కూచున్నారు. పానీయాలు సేవించారు.

"మేమంతా యామాకు వెళుతున్నాం. మీరుకూడా రావాలని మా కోరిక" అన్నారు, ప్రొఫెసరు, లిఖోనిన్.

రిపోర్టరు ప్లాటొనోవ్ వారికోర్కెను తిరస్కరించలేదు. "దానికేం? అలాగే వస్తాను" అన్నాడు కుష్టంగా. తరువాత అతను వెళ్ళి తనతో కూచున్న వృద్ధుడికి కొంతడబ్బు ఇచ్చాడు. 'మరి వస్తాను తాతగారూ! ఇప్పుడు నేను వెళ్ళేచోటుకు మీరు రావడం భావ్యంకాదు. రేపు మనిద్దరం మళ్ళీ అదే స్థలంలో తప్పకుండా కలుసుకుందాం. మరి సెలవు.' అంటూ ప్లాటొనోవ్ వృద్ధుడిదగ్గర సెలవుతీసుకొని, మళ్ళీ విద్యార్థులలోకివచ్చి కలిశాడు.

అందరూ కలిసి యామాకు వెళ్ళారు.

# 9

విద్యార్థులంతా అన్నామార్కోవ్నా ఇంట్లోకి వెళ్ళడానికి ఉపక్రమించారు. అదిచూచి ప్రొఫెసరు ఇలా అన్నాడు.

"అబ్బాయిలూ! మీ వ్యవహారం నాకేం నచ్చలేదు. ఈ కొంప మరీ ఛండాలంగా వుంటుంది. రొచ్చుగుంటకూ దీనికీ తేడా ఏం లేదు. వచ్చిన వాళ్ళం ఎలాగూ వచ్చాం. ఆ ఏడ్పేదేమిటో కాస్త పరిశుభ్రంగావున్న కొంపలోకి వెళ్ళి ఏడవడం మంచిది. పక్కయిల్లు ట్రిప్పెల్సు ఉంది చూచారూ? పరిశుభ్రంగా ఉంటుంది. చక్కని వెలుతురుకూడా ఉంటుంది. అక్కడికి వెడదాం పదండి. అంతేగాని, ఈ పాడుకొంపలో నేను కాలు పెట్టను."

"మరేంపర్వాలేదు. దయచేయండి ప్రొఫెసరుగారూ!" అంటూ లిఖోనిన్ ప్రొఫెసరుచెయ్యిపట్టుకుని అన్నాఇంట్లోకి తీసుకుపోవడానికి

ప్రయత్నించాడు. "ఊహుఁ. వదలండి... నేను రాను... ప్రెప్వెల్సులో ఆడాళ్ళు కాస్త కంటికైనా ఇంపుగా వుంటారు... ఈ కొంప మరీ ఘోరంగా ఉంటుంది." అంటూ ప్రొఫెసరు మొండికేశాడు.

అది చూచి వెనుక వస్తోన్న రాంసెన్ నవ్వి ఇలా అన్నాడు— 'రైటో, రైట్! ప్రొఫెసరుగారూ! మీరెలాగైనా రసజ్ఞులు. అప్పుడే అమ్మాయిలను గురించి వర్ణిస్తున్నారు. చివరివరకూ ఈ ఉత్సాహాన్ని నిలబెట్టుకోవాలి సుమా! మధ్యలో జారిపోయేరు. మీరన్నట్లు ప్రెప్వెల్సులో పిల్లలు అందంగా వుండేమాట వాస్తవమే కాని, ఒకవిషయం. ఇందాకటినుంచీ, ఆడాళ్ళనుముట్టుకోకూడదన్నారు. ఇప్పుడేమో అందమైనఅమ్మాయిలైతేపరవాలేదంటున్నారు. ఆకలితో కడుపుమండే బిచ్చగాడు, పాచిపోయిన రొట్టెముక్కనైనా దొంగిలిస్తాడు. అదే, కాస్త ఘరానాగాబ్రతుకుతున్న బ్యాంకు ఏజంటు ఓ యాభైలక్షల రూబుల్సు కొట్టేస్తాడు. రెంటికీ తేడా ఏముంది? ఏదైనా దొంగతనమేగా!'

"అంటే ఏమిటి నీ ఉద్దేశ్యం?" అన్నాడు ప్రొఫెసరు కొంచెం కష్టంగా. "సరే...నాదేంపోయింది! మీ ఇష్టం వచ్చినట్లే కానీయండి." అన్నాడాయన తిరిగీ, అన్నాగుమ్మంలో అడుగుపెడుతూ.

"అదీ, అసలైన సరసుడి లక్షణం." అన్నాడు లిఖోనిన్, ప్రొఫెసరును వెంటబెట్టుకుని వెడుతూ.

స్టూడెంట్సు రావటం కాపలావాడు సిమన్ చూచాడు. గుంపుగా విటులు రావటమంటే అతనికి అంతగా నచ్చదు. తరువాత ఏదో గొడవలు లేవదీస్తారని అతని ఉద్దేశ్యం. అందులోనూ ముఖ్యంగా స్టూడెంట్లంటే అతనికి మరీ భయం. వాళ్ళను అల్లంత దూరాన్నే కనిపెడతాడు. వాళ్ళపోజులు, పోకిరీచేష్టలు అన్నీ అతనికి అవగాహనే. పైగా విద్యార్థులంతా ప్రభుత్వాన్ని, చట్టాలను ధిక్కరిస్తారనికూడా అతనికి తెలుసు. లోగడ ఒకసారి విద్యార్థులకూ, కోసక్కులకూ గొప్ప యుద్ధం జరిగిన విషయం ఇంకా అతనికి గుర్తుంది. ఆరోజు జరిగినగోల ఇంతా అంతా కాదు. విద్యార్థులు ఇళ్ళమీదా, అంగళ్ళమీదా పడి నానాభీభత్సం చేశారు. మొత్తానికి విద్యార్థులంటే సిమన్‌కు మంచి అభిప్రాయం లేదు. ప్రభుత్వోద్యోగులను, మర్యా

దగా సంచరించే పెద్దమనుషులను మాత్రం గౌరవిస్తారు. వారిని "యువర్ ఎక్సలెన్సీ" అనికూడా సంబోధిస్తాడు.

సిమన్ ఎదురుగా వెళ్ళి ప్రొఫెసరు యార్చెంకోతో అందుకున్నాడు. ఇంట్లోకి దోవచూపిస్తూ, వారందరినీ హాలులో ప్రవేశపెట్టాడు.

అప్పటికే హాలంతా జనంతో కిటకిటలాడుతోంది. గుమాస్తాలు నృత్యం చేసిచేసి అలసిపోయి ఆడపిల్లలను పక్కన కూచోబెట్టుకుని గోడలకు చేరగిలబడ్డారు. పాపం వళ్ళంతా చెమటలుపోస్తున్నందున చేతిరుమాళ్ళతో విసురుకుంటూ విశ్రాంతితీసుకుంటున్నారు. సంగీత పాఠకుడు మిష్కా, పుస్తకాలు అమ్ముకునే కోల్కా ఒకరికొకరు ఎదురుబదురుగా కూచున్నారు. తూలుతున్నారు. వాళ్ళ గుడ్లు కూరుకుపోతున్నాయి. మిష్కా మెల్లగా ఏదో పాట పాడడానికి యత్నిస్తున్నాడు. ఇంటి పెత్తందారు ఎమ్మా, పనిమనిషి జోస్యా వారిద్దరూ తాగుడుమైకంలో అసభ్యతగా ప్రవర్తించకుండా కాయశక్తులా ప్రయత్నిస్తున్నారు.

వచ్చిన విద్యార్థులలో కొందరిని వేశ్యలు గుర్తించారు. వారిని కలుసుకోవాలనే కుతూహలంతో లేచి ఎదురుగా వెళ్ళారు.

'టమారా! అదుగో నేవ్! నీ ప్రియుడొచ్చాడు. న్యూరా! నీ జతగాడుకూడా వచ్చాడే!' అంటూ వేశ్యలంతా ఒకరికొకరు చెప్పుకున్నారు.

న్యూరా తన ప్రియుడైన పెట్రోవస్కీకి ఎదురుగావెళ్ళి అతన్ని ఆలింగనంచేసుకుంది.

"ఏం ప్రియా! ఎంతకాలంఅయింది మనం కలుసుకుని! నాకు కళ్ళు పోయినట్లున్నాయ్" అంది న్యూరా సంతోషంతో పొంగిపోతూ.

అంతమందిజనంమధ్య జరిగే ఈ అపభ్రంశపు పనులన్నీ చూచేసరికి ప్రొఫెసరు యార్చెంకోకు కష్టంవేసింది.

"ఏమమ్మా! నీకామాత్రం తెలీదూ? మాఅందరికీ ప్రత్యేకంగా ఒకగది కావాలి... పోతే డ్రాక్షసారాయి, కొంచెం కాఫీకూడా తెప్పించు" అన్నాడు ప్రొఫెసరు ఇంటి పెత్తందారు ఎమ్మాతో.

మర్యాదగా, పెద్దమనిషిలా అగుపిస్తోన్న ప్రొఫెసరునుచూచి ఎమ్మా భయభక్తులతో మెలగసాగింది.

'చిత్తం! చిత్తం! మీకు కావల్సినవన్నీ ఏర్పాటుచేస్తాను. లోపల డాయినింగ్ రూంలోకి దయచేయండి' అంటూ ఎమ్మా గుర్రింలా తలూపింది.

'అందమైన అమ్మాయిలున్నారు. మీరు వాళ్ళతో ఉండాలను కుంటే లోపలికి పిలుస్తాను. పిలవమంటూరా?' అనడిగింది మళ్ళీ ఎమ్మా చేతు లూపుకుంటూ.

'తప్పనిసరి అయితే అలాగేచూద్దాంలే. ఆ విషయం తరువాత చెపు తాను. ముందు ఈ ఏర్పాట్లు చేయించు' అన్నాడు ప్రొఫెసరు.

ఎమ్మా లోపలికి దోవ చూపించింది. ప్రొఫెసరు, మిగతా విద్యా ర్థులు డాయింగురూంలో ప్రవేశించారు. అది కనిపెట్టి పడుపుకత్తెలు కూడా ఒకరితరువాత ఒకరు మెల్లగా లోపలికి చొరబడ్డారు. ఆ గది కాస్త చిన్నది. కుర్చీలు, బల్లలు అమర్చివుంచారు. నీలిరంగు లాంతరు వెలుగు తోంది.

వేశ్యలంతా మగాళ్ళ దాపుకు వెళ్ళి వినపడీ వినపడనట్లు తమ తమ పేర్లు చెప్పుకుని పరిచయం చేసుకున్నారు. మంకా, కాట్కా, ల్యూబా, ఇంకా...ఇంకా. ఆ తరువాత వీరంతా పురుషులతొడలమీద కూచుని వయ్యారంగా తమచేతులు వారిమెడలకు పెనవేసి, ఇచ్చకాలాడుతూ వలపించసాగారు.

'ఏమండీ! మీరెంత అందంగా వున్నారనుకున్నారూ! ఏదీ, నాకో ఆరెంజి ఇప్పించరూ?' అంది ఒకామె తన సరసుడితో.

'వొలోడెంకా! మీరు నాకెంతో ముద్దొస్తున్నారండీ! ఏదీ, కాసిని చాక్ లెట్లు తెప్పిద్దురూ!' అంది మరో ఆడది తన విటుడితో.

"ఏం ప్రియా! మిమ్మల్ని చూస్తోంటే నన్ను నేనే మరిచిపోతున్నాను. నాకో స్నేహితురాలుంది. పాపం ఆమెకు జబ్బుచేసి లేవడంలేదు. ఓ అర డజను యాపిల్ పండ్లు ఆర్డరివ్వండి. పట్టుకెళ్ళి ఆమెకిస్తాను.' అంది వేరా, ప్రొఫెసరు యార్చెంకో తొడమీద కూచుని కులుకుతూ.

"నీ వేషాలన్నీ నాకు తెలుసులే. అన్నీ దొంగ అబద్ధాలు. స్నేహితు రాలూ లేదు, పాడూ లేదు గాని, అల్లరిచేయకుండా అవతలికెళ్ళి కుర్చీలో బుద్ధిమంతురాలిలా కూచో." అన్నాడు ప్రొఫెసరు ఆమెతో.

"అమ్మో! మిమ్మల్ని వదిలేసి దూరంగా వెళ్ళడమే! నా చేతకాదు బాబూ!" అంది మళ్ళీ వేరా.

వేశ్యలంతా తమ అలవాటు ప్రకారం వలపులు కురిపిస్తూ, తళుకులు మెరిపిస్తూవున్నారు. పాపం, ఏంచేస్తారు? ఇలా చేయడంవల్ల ప్రత్యేకంగా వీరికి ఒరిగేది ఏమీలేదు. విటులనుండి సంపాయించిన సొమ్మంతా యజమానురాలికి పోతుంది. అయినా ఇది వీరి అలవాటు. వృత్తిధర్మంకూడా. అప్రయత్నంగానే పసిపిల్లల్లా వెకిలిచేష్టలు, వెక్కిరింతలు చేస్తూ విచిత్రంగా ప్రవర్తిస్తుంటారు.

సిమన్ ఒక పళ్ళెంలో పెట్టుకుని కాఫీ, బీరు, బ్రాందీ మొదలైన వన్నీ పట్టుకొచ్చాడు. బ్రాందీసీసాలు, బీరుబుడ్ల మూతలుతీసి సిద్ధంగా వుంచాడు.

'మీరుకూడా కొంచెం సేవించరూ?' అన్నాడు యార్చెంకో రిపోర్టరు ప్లాటొనోవ్‌ను.

"తమపేరు...ప్లాటొనోవ్ కదూ?" అన్నాడాయన మళ్ళీ.

'అవును' అనిజవాబు చెప్పాడు ప్లాటొనోవ్.

"ఓ కప్పు కాఫీ తాగి, ఓ గ్లాసు బ్రాందీ సేవించండి" అన్నాడు తిరిగీ యార్చెంకో.

"క్షమించండి... నేను తాగేరకం వేరేవుంది. సిమన్‌కు తెలుసు." అన్నాడు ప్లాటొనోవ్.

"అవును. ఆయన తాగేది కొగ్నాక్" అంది న్యూరా వెంటనే.

కొగ్నాక్ అనేది ఒకరకమైన సారాయి. ప్లాటొనోవ్ ఎప్పుడూ ఇదే తాగుతూవుంటాడు. ఆ ఇంట్లో అందరికీ ఈ విషయం తెలుసు.

"ఇదుగో, మీరకం కూడా తెచ్చాను." అంటూ సిమన్, రిపోర్టరుకోసం తెచ్చిన వేరరకం బ్రాందీసీసా మూతతీసి అక్కడ వుంచాడు.

'అరె! ఈ రకం బ్రాందీ ఇక్కడ వుండడం ఇంతకుముందు నేను చూళ్ళేదే!' అన్నాడు లిఖోనిన్, ఆశ్చర్య పడుతూ.

"మన రిపోర్టరుగారికోసం ఇది ప్రత్యేకంగా తెప్పించివుంటారు." అన్నాడు బోరిస్ అనే మరోవిద్యార్థి.

'నాలో ప్రత్యేకత వుండికాదు, ఇది తెప్పించింది. నాకు ఈరకం అలవాటు. ఒకోసారి నేను గుర్రంలా తాగుతాను. మరొకప్పుడు దాన్ని అసలు ముట్టుకోను కూడా. తాగినా తాగకపోయినా, నేను ఒకలాగే వుండ గలను. ఒకరిజోలికి పోవడంగాని, ఒళ్ళు తెలీకుండా ప్రవర్తించడంగాని చేయను. ఇదే నాలోవున్న విశేషం. అంచాతనే ఇక్కడివారంతా నామీద కాస్త గౌరవం వుంచుతారు.' అన్నాడు ప్లాటొనోవ్ కొంచెం ధీమాగా.

"అయితే కావచ్చు...కాని మా బ్రాందీకూడా కొంచెం రుచి చూడండి." అన్నాడు లిఖొనిన్ నవ్వుమొహంపెట్టి.

'ఓ! తప్పకుండా. సంతోషంగా సేవిస్తాను.' అంటూ ప్లాటొనోవ్ లిఖోనిన్ అందించిన బ్రాందీగ్లాసు తీసుకున్నాడు.

"ఇంతకు ముందెప్పుడూ నేను మిమ్మల్ని అన్నాఇంట్లో కలుసుకో లేదు. అదే నాకు ఆశ్చర్యంగావుంది. మీరు తరచు ఇక్కడికి రారనుకుం టాను?" అన్నాడు మళ్లీ లిఖొనిన్.

'అవును. ఇక్కడికి అరుదుగా వస్తూవుంటాను,' సమాధానం చెప్పాడు ప్లాటొనోవ్.

"మా ఇంటికివచ్చే ముఖ్యమైన అతిథుల్లో వీరొకరు. ప్లాటొనోవ్ గారు మాతో అతి చనువుగా, సోదరుడికి మల్లే వుంటూవుంటారు." అంది న్యూరా మధ్యలో అందుకుని.

"ఇహ నీవు నోరు మూయవే మొద్దూ" టమారా న్యూరాను కోప్ప డింది.

"నేను నిత్యం ఇక్కడికి వచ్చేవారిలో ఒకణ్ణి. కాని మీకు ఇక్కడ గల గౌరవం, చనువు చూస్తే నాకు కన్ను కుడుతోంది"అన్నాడు లిఖొనిన్.

"ఇంటిమీద పెత్తనం చేస్తుంటాడోయ్" అన్నాడు బోరిస్ ప్లాటొనోవ్‌ను ఎత్తిపొడుస్తూ.

కాని ఈమాట మెల్లగా అతనికి వినిపించకుండావుండేలా అన్నాడు. అయినా ప్లాటొనోవ్ ఇది విని వినపడనట్లు నటించాడు.

రిపోర్టరుమీద బోరిస్‌కు సదభిప్రాయం లేదు. ఆ సానికొంపలో పనివాడిమొదలుకొని, యజమానురాలివరకూ అతనిపట్ల గౌరవంచూపించడం బోరిస్‌కు గిట్టలేదు. ఎవరో ఒక పడుపుకత్తె బ్రాంది గ్లాసులోపోసి అతనికి

అందించేది. మరోఅమ్మాయి ఇంకేదో సేవచేసేది. అంతా అతనిఎడల ఏదో తెలీని భక్తీ, వినయం ప్రదర్శిస్తున్నారు. పైగా ఎవరూకూడా అతన్ని డబ్బివ్వమని అడగడంగాని, లేక మరేదైనా కొనిపెట్టమని కోరటంకాని లేదు. దీన్నిబట్టి ఈ రిపోర్టరుగాడు ఒక 'డాఫర్' అనుకున్నాడు బోరిస్. వేశ్యలకు విటులను తార్చడమే ఇతని ఉద్యోగమని అభిప్రాయపడ్డాడు.

రిపోర్టరుమాత్రం తక్కువవాడా? బోరిస్ స్నేహపాత్రుడుకాదని ఎప్పుడో గ్రహించాడు. బోరిస్ తననుగురించి అన్నమాట వినికూడా విన నట్లు నటించాడు. జేబులోంచి రుమాలుతీసి చమత్కారంగా చేత్తో పట్టుకున్నాడు. బోరిస్ వంక అదోమాదిరి చూచాడు.

"అవును, నిజమే. నేనిక్కడ వీరి కుటుంబంలో ఒకణ్ణిగా మెలగుతున్నాను. మీరు ఊహించలేని విషయం మరొకటుంది. గత నాలుగు మాసాలనుంచి నేను ఇక్కడే, ఈ ఇంట్లోనే, వీరితోపాటే భోంచేస్తున్నాను." అన్నాడు ప్లాటొనోవ్.

"నిజంగా?" ప్రొఫెసరు నివ్వెరపోతూ అడిగాడు.

"యదార్థం! పైగా నాకు వీళ్ళుపెట్టేభోజనం ఎలాంటి దనుకున్నారూ? మంచి భోజనం. నాకోసం ప్రత్యేకంగా వంట తయారుచేస్తారు"

"చాలా విచిత్రంగావుందే మీ వ్యవహారం. ఏమిటి దీనికి కారణం?"

"ఏముంది? ఈ ఇంటి యజమానురాలు అన్నావుంది చూచారూ? ఆమెకూతురుకు నేను చదువు చెపుతున్నాను. హైస్కూలులో పరీక్షలకు తయారుచేస్తున్నాను. ఆమె నా కివ్వాల్సిన జీతంక్రింద ఇక్కడే భోంచేస్తుంటాను, అదీ విషయం."

"అలాగా! చాలా తమాషాగా వుందే! అయితే ఏమండీ! మరో మాట అడుగుతాను. వేరేవిధంగా అనుకోకండేం?"

"మరేం పర్వాలేదు. అవశ్యం అడగండి."

"మీరు బుద్ధిపూర్వకంగా ఇలా చేస్తున్నారా? లేక...జరుగుబాటుకు ఇబ్బందిగావుండి ఈ పనికి ఒప్పుకున్నారా?"

"జరుగుబాటు లేకకాదు, కావాలనే ఈ పని చేస్తున్నాను. అన్నా నన్ను నాలుగు మూడుసార్లు పిల్లకు చదువు చెప్పమని బ్రతిమాలింది. అదీకాక మరో ముఖ్యమైన విషయం కూడా వుంది. ఈ సానివాడ అంతా ఒక

విచిత్రమైన ప్రపంచంలా అగుపిస్తుంది నాకు. వీళ్ళమధ్య కొంతకాలం జీవించాలనే కుతూహలం కలిగింది. ఇంకేం? చుట్టరికం, పేరంటం రెండూ కలిసివస్తాయన్నట్లు, ఈ పనికి అంగీకరించాను."

"ఓ! ఇప్పుడు నాకు అర్థమైంది. ఈ పాపపు జీవితాల్ని పరిశోధించి విషయసంగ్రహణ చేస్తున్నారు కదూ?" అన్నాడు యార్చెంకో, ఉత్సాహంగా—"అబ్బాయిలూ! మన రిపోర్టరుగారు కొద్దిరోజుల్లో ఒక ఉద్గ్రంథాన్ని వ్రాయబోతున్నారు. త్వరలోనే వారి రచన చదివి ఆనందించే భాగ్యం మనందరికీ కలుగుతుంది." అన్నాడు తిరిగి, విద్యార్థులవైపు చూస్తూ.

"బహుశా ఆ పుస్తకంలో పడుపుకత్తెల విషాద జీవితం వర్ణిస్తారు కాబోలు!" అన్నాడు బోరిస్ నటుడిలా వదనంలో విషాదం కనపరుస్తూ.

అంతలో టమారా లేచి మెల్లగా బోరిస్ దగ్గరకు వెళ్ళింది. అతని చెవిలో నోరుపెట్టి రహస్యంగా అంది. 'మీరు ఆయన్ను ఒంటరిగా వుండనీయండి. ప్రమాణంచేసి చెబుతున్నాను. అది మీకే మంచిది.'

"అంటే ఏమిటి నీ ఉద్దేశ్యం? అతను నీ ప్రియుడా లేక తార్పుడు గాడా?" కోపంతో అడిగాడు బోరిస్.

మీ రాయన్ను గురించి దురభిప్రాయపడుతున్నారు. దైవసాక్షిగా చెబుతున్నాను. ఆయన అలాంటివాడు కాదు. ఇంతవరకూ ఏ పడుపుకత్తెతోనూ వుండలేదు. నేను కోరేది ఒక్కటే. అతన్ని అనవసరంగా బాధించవద్దు." అంది మళ్ళీ టమారా.

"ఏమిటి నీవాగుడు? అతనంటే ఎందుకు మీ అందరికీ అంత అభిమానం? ఏం? ఆయన ఒక్కడి నెత్తినే కొమ్ములు మొలిచాయా? చూడబోతే, యామాలోవుండే సానులంతా అతనిపక్షాన నిలబడి యుద్ధం చేసేలా కనిపిస్తూవుందే?" అన్నాడు బోరిస్, టమారాను విదలించివేస్తూ.

"నా అభిప్రాయం అదికాదండీ! ఆయన చాలా తమాషా అయిన మనిషి. ఎవరిలోనూ కలిసే రకంకాదు. కోపం రాదుగాని, వస్తే ఎవరమూ ఆపలేం. చెవులు పట్టుకుని కిటికీలోంచి విసరి అవతల పారేస్తాడు. ఇదివరకొకసారి ఇలా జరిగింది. అందుకని చెప్తున్నా" అంది టమారా ఎలాగైనా బోరిస్‌ను శాంతపర్చాలని.

"ముందు నీ దిక్కుణ్నుంచి వెడతావా లేదా?" గుర్రుమన్నాడు బోరిస్.

"సరే. ఎందుకంతకోపం? వెడతానులెండి." అని టమారా మెల్లగా అతనిదగ్గర్నుంచి అవతలికి వెళ్ళిపోయింది.

ఒకక్షణం విద్యార్థులంతా బోరిస్ వైపు తీక్షణంగా చూచారు.

"నీతో పెద్ద చిక్కొచ్చిందోయ్! కాస్త మర్యాదగా మాట్లాడ రాదూ?" బోరిస్‌ను హెచ్చరించాడు లిఖోనిన్. "ఊఁ. చెప్పండి తరువాత? మీ విషయం వినాలని కుతూహలంగా వుంది" అన్నాడు మళ్ళీ రిపోర్టరు వైపు తిరిగి.

"అబ్బె! అలాంటిదేమీ లేదు. నేను పుస్తకం వ్రాయడంలేదు కూడా. వీరు ఎలాంటి బ్రతుకు బ్రతుకుతున్నారో ఊరకే చూస్తున్నాను." అంటూ ప్లాటొనోవ్ ప్రశాంతంగా, గంభీరంగా మాట్లాడసాగాడు. "ఈ సానుల జీవితాల్ని గురించి తెలుసుకోవాలంటే చాలా వుంది. నిజంగా వీరి బ్రతుకులో ఏదో పరమసత్యం దాగివుంది. మొదటినుంచీ చివరవరకూ ఒక గీతంలా, సంగీతంలా వుంటుంది. దాన్ని వింటూంటే, చూస్తూ అనుభవిస్తూ వుంటే ఏ మానవుడికైనా నరనరాలు స్పందిస్తాయి. తీరని భయంతో గుండె బరువెక్కిపోతుంది. ఈ స్త్రీలంతా తమ జీవితాలను తివాచీల్లా పరిచారు. వాటి మీద ఎందరెందరో పురుషులు స్వేచ్ఛగా నడిచిపోతున్నారు. ఏదో హాయి, ఆనందం అనుభవిస్తున్నారు. ఇదొక అనంతమైన యాత్ర. ఇది ఎక్కడ మొదలు పెట్టిందో, ఎక్కడ అంతమవుతుందో ఎవరూ చెప్పలేరు... ఈ వ్యభిచారం పట్టణాల్లో పుండుమాదిరి పుట్టింది. మానని పుండు, మందులేని పుండు... వేలవేల హస్తాలు ఈ వ్రణాన్ని కెలుకుతున్నాయి... అబ్బ!... దుర్భరమైన బాధ!... భయంకరం! ... చివరి కిదొక వ్యాపారంగా వర్ధిల్లింది. దేశంలోని వివిధ వ్యాపారాలకుమల్లే, ఇదీ స్వేచ్ఛగా, సాఫీగా సాగిపోతోంది... చూచారా? ఆడవాళ్ళ సంత... ఆడవాళ్ళ అంగడి..."

"నిజం, ముమ్మాటికీ నిజం!" అన్నాడు మధ్యలో లిఖోనిన్.

ప్లాటొనోవ్ గ్లాసులో, బ్రాందీ వైపుచూస్తూ మళ్ళీ చెప్పసాగాడు—

"వార్తాపత్రికల్లో, వారపత్రికల్లో అప్పుడప్పుడు మనం వేశ్యలను గురించి భయంకరమైన విషయాలు చదువుతూవుంటాం. అందులో అణుమాత్రం అసత్యంలేదు. కొందరు వేశ్యలనుగురించి క్రూరమైన గాధ

లున్నాయి. వీరు గర్భవతులవుతూంటారు. కడుపులు దిగతాగి, శిశుహత్యకు పాల్పడుతూవుంటారు. లేడీడాక్టర్లు, మంత్రసానులు వీరికీ పనిలో అండగా నిలబడి, దండిగా సహకారం ఇస్తూవుంటారు. నిజం ఆలోచిస్తే, వీరు ఈ పడుపుకత్తెల రక్తాన్ని పీల్చే జలగలు...ఇలాంటి గాథలు, బాధలు ఎన్నో ఉన్నాయి...కాపలావాడు సిమన్ వున్నాడు చూచారూ? అతనితో నాకూ బాగా పరిచయముంది. అలాంటి నీచుడు, దౌర్భాగ్యుడు, పతనమైపోయిన మనిషి పృథ్విలో మరెక్కడా వుండడేమో అనిపిస్తుంది. వాడు చేసే ఘోరాలు వర్ణించలేను. స్త్రీలను బలాత్కారంగా ఈ మురికికూపంలోకి తీసుకొస్తాడు. వాళ్ళను భయంకరంగా కొడతాడు. వాళ్ళ కష్టాన్ని దోచుకుంటాడు. అవసరమైనప్పుడు ఖూనీచేస్తాడు కూడా. ఇన్ని చేస్తూనే ఆ నీచుడు మళ్ళీ మహా వేదాంతిలా, దైవభక్తుడిలా ప్రవర్తిస్తాడు. మతాన్ని గురించీ, దేవుణ్ణిగురించీ చర్చిస్తాడు, ఆలోచిస్తాడు. దైవప్రార్థనలు జరుపుతాడు. బైబిల్‌లోని గీతాలు పాడుతాడు. పరవశుడవుతాడు. చూడండి! ఒకదానికొకటి ఎంత విరుద్ధమో!”

“అవును. అలాంటి దుర్మార్గులు, దైవప్రార్థన చేస్తూనే క్షణంలో ఎవడిగొంతో కోసివేసి, చేతులు కడుక్కొని, కొవ్వొత్తి వెలిగిస్తారు. నీచులు!” అన్నాడు రాంసెస్ అనే విద్యార్థి.

నిజంగా అంతే. చేసిన పాపాలకు ప్రాయశ్చిత్తంగా ఆపని చేస్తుంటాడు. మతాన్ని గురించి అతను మాట్లాడినట్లుగా మరెవ్వరూ మాట్లాళ్ళేరు. అతనికీ నాకూ స్నేహం అయింది ఈ మత చర్చల్లోనే,” అన్నాడు తిరిగీ ప్లాటొనోవ్.

“మీరు తప్పకుండా ఇలాంటి పాపపు జీవితాలు పరిశీలించాల్సిందే” అన్నాడు ప్రొఫెసరు యార్చెంకో, వేశ్యలందరివైపు చూస్తూ.

“కాని సిమనూ, నేనూ వెనుకటిలా ఇప్పుడు స్నేహితులంకాము” అన్నాడు మళ్ళీ ప్లాటొనోవ్.

“అదేమిటి? ఎందుకలా జరిగింది?”అడిగాడు అప్పటివరకూమాట్లాడని పావ్లోవ్ అనేవిద్యార్థి.

“కారణమా? ...అది అంత చెప్పదగింది కాదు లెండి......ఏదో

"చిన్న విషయంలోనే చెడింది వ్యవహారం..." అన్నాడు ప్లాటొనోవ్ చిరు నవ్వు నవ్వుతూ.

ఆతరువాత ఆయన ప్రొఫెసరుదగ్గరవున్న బ్రాందీగ్లాసుకూడా తీసు కుని తాగడం మొదలెట్టాడు.

ఇదంతా వింటోన్న న్యూరా ఊరుకున్నదికాదు. అసలు ఏ విషయ మైనా, ముందువెనుకలు ఆలోచించకుండా వెళ్ళగక్కే స్వభావం ఆమెది. సిమన్‌తో, రిపోర్టరుతో తగాదా ఎందుకొచ్చిందీ చెప్పడం మొదలెట్టింది.

'అవునవును ఆవిషయం నేను చెప్తాను వినండి. నైనా విషయంలో వారిద్దరికీ తగువు వచ్చింది...ఒకరాత్రి, ఒక ముసలాడు నైనాదగ్గరికి వచ్చాడు...నైనాకు అతనంటే ఇష్టంలేదు....కాని అతను [illegible]నను హింసిం చాడు. నైనా పెద్దపెట్టున ఏడ్వసాగింది...'

న్యూరా అలా చెప్తుంటే, ప్లాటొనోవ్ ఆపుచేశాడు.

"ఇక ఊరుకో న్యూరా! ఆ విషయాలు ఇప్పుడేమీ ఎత్తకు... అదంతా ఒక పాడుకథ" అన్నాడు ప్లాటొనోవ్.

'ఇక నోరుమూయవే!' అంది టమారాకూడా.

కాని న్యూరాను నోరుమూయించడం ఎవరికీ సాధ్యంకాదు. ఆమె ఒకవిషయం చెప్పడం మొదలెడితే మధ్య ఆపనే ఆపదు.

"నైనా ఎంతకూ ఆ ముసలాడికి లొంగలేదు. 'నన్ను విూరు నరకండి; కొయ్యండి; నేను మాత్రం ఒప్పుకోను' అంటూ నైనా అతని చేతుల్లోంచి తప్పించుకుని పరుగెత్తింది. ఆ ముసలాడు సిమన్‌దగ్గరికి వెళ్ళి జరిగినసంగ తంతా చెప్పుకున్నాడు. అప్పుడు సిమన్ ఆగ్రహంతో వచ్చి నైనాను చావ చితకకొట్టాడు. ఇది వాడికి మామూలే. పిల్లలందరినీ చంపుకుతింటూంటాడు. అప్పుడు ప్లాటొనోవ్‌గారు ఏదో వ్రాసుకుంటూకూచున్నారు. ఈ గోలంతా ఆయనకు వినిపించింది—"

"జోయా! నీవైనా ఆ న్యూరానోరు మూయ్యి" అన్నాడు ప్లాటొ నోవ్, ఇక అంతటితోనైనా ఆ విషయం ఆపుచేయించాలని.

వెంటనే జోయా తన రెండుచేతులతో గట్టిగా న్యూరానోరు మూసింది.

విద్యార్థులంతా ఫక్కున నవ్వారు. ఒక్క బోరిస్ మాత్రం మొహం ఏదో అసహ్యంగా పెట్టి తనలో తాను గొణుక్కున్నాడు. అప్పటికే బోరిస్ విపరీతంగా తాగి తూలుతూవున్నాడు. రెండుచేతులూ పాంటు జేబుల్లో దోపుకున్నాడు. నోట్లో సిగరెట్టుంది. గోడకు ఆనుకుని నిలబడివున్నాడు.

"నైనా అంటే ఎవరు? ఎక్కడుంది ఆ అమ్మాయి?" అనడిగాడు రాంసెస్, ఆశ్చర్యంగా.

'లేదు, ఇప్పుడిక్కడలేదు. చిన్నపిల్ల, అమాయకంగా, పల్లెటూరి రకంగా కనిపిస్తుంది.' అంటూ రిపోర్టరు పెద్దగానవ్వాడు. "నవ్వుతున్నందుకు క్షమించండి. మరేం కాదు. ఏవో విచిత్రమైన విషయాలు గుర్తుకొస్తే నవ్వాను. ఆ ముసలి వాడింకా నా కళ్ళల్లో మెదులుతున్నాడు. అతన్ని నేను బాగా ఎరుగుదును. చాలా తమాషా అయిన మనిషిలెండి. అతను ఎక్కడ పనిచేస్తున్నదీకూడా నాకు తెలుసు. మీరందరూకూడా అతన్ని ఎరుగుదురు...... పరమనీచుడు......ఇలాంటి ఘోరాలు ఇక్కడ అతిసామాన్యంగా జరుగుతుంటాయి. రకరకాల మనుషులు, రకరకాల అనుభవాలు, ఓ!......... కాని, సిమన్‌లాంటి వ్యక్తి నూటికో, కోటికో కాని కనిపించడు... యజమానురాలు అన్నా మార్కోవ్‌నా వుంది చూచారూ? ఆమె కొక్కతేకూతురు ఆపిల్లపేరు బెర్తా. ఆపిల్లకోసం అన్నా పడేబాధలు ఇన్నీ అన్నీ కావు. ఆమె ఒక గయ్యాళిగంప. శివమెక్కిన సివంగి. రక్తంతాగే రాక్షసి. అయితే ఏం? తన ముద్దుబిడ్డకోసమే ఇదంతా చేస్తోంది. తను సాగించే నీచప్రవృత్తి, కుమార్తెకంటపడకుండా వేయికళ్ళతో కనిపెడుతోంది. ఆపిల్లఎదుట అతి జాగ్రత్తగా మసలుకుంటుంది. మాటల్లో, చేతల్లో ఏమాత్రం తనగుట్టు బయటపడకుండా ప్రవర్తిస్తోంది. అవును, ఆపసిపిల్లకు ఈ వ్యవహారమంతా తెలిస్తే ఇంకేమైనా ఉందా? ఆ చంటిబిడ్డ తనసర్వస్వం. ఆమె భావిజీవితం ఒక నందనవనం కావాలని కోరుకుంటోంది. తనుచేసే ప్రతిపనీ ఆమెకోసమే. కూతురుకు దాసీలా సేవచేస్తుంది. భక్తురాలికి మల్లే కొలుస్తుంది. ఆమెకోసం కావల్సినంత ధనం ఆర్జించింది. తనకూడా ముసలితనం ప్రాప్తిస్తోంది. ఈ వృత్తినుంచి విరమించుకుని విశ్రాంతితీసుకోకూడదూ? ఊహు, ఉన్నదిచాలదు మరో వేయి రూబుల్సు సంపాయించాలి......ఇంకో వెయ్యి......ఇంకో వెయ్యి...అంతులేనిధనం ఆర్జించాలి. అంతా తన బంగారుకొండ బెర్తా

కోసమే. బెర్తా స్వాలీచేయడానికి ఒక గుర్రింపుంది.ఆమెను అలనా, పాలనా చేయడానికి ఇంగ్లీషు నర్సునుకూడా వుంచింది. ప్రతి సంవత్సరం తనబిడ్డ విదేశాలకువెళ్ళి కులాసాగా షికారుచేసి వస్తూవుంటుంది. ఆ పిల్లకు నలభై వేలరూబుల్స్ విలువచేసే వజ్రాలు పోగుచేసి వుంచింది. ఆ విలువైన వజ్రాలు ఎవరివో, ఎక్కడివో ఆ దేవుడికే తెలియాలి.

తన కూతురుసుఖంకోసం అన్నా ఎలాంటి నీచానికి, ఘోరకృత్యానికీ ఒడికట్టిందో చూచారా? మన చెల్లెళ్ళు, కూతుళ్ళవంటి ఆడపిల్లలను కొనుక్కుంది. అంగట్లోపెట్టి వాళ్ళశీలాన్ని వేలంవేస్తోంది. పశుప్రవృత్తికి పునాదివేసి పాపంపెంచినట్లు పెంచుతోంది. ఈ వేశ్యలంతా దుర్భరమైన సుఖవ్యాధులతో బాధపడుతున్నారు. ఈ అంటువ్యాధులు వీరినుండి మనకూ, మన సంతానానికీ సంప్రాప్తమవుతున్నాయి. ఇలా చేస్తున్నందుకు మనమంతా అన్నాను ఒక నరరూపరాక్షసిగా భావిస్తాం, కాని, ఈ పని ఆమె ఎందుకోసం చేస్తోంది? తన కూతురుకోసం. బిడ్డమీదవున్న మాతృప్రేమ ఆమెను అంధురాలుగా, పిచ్చిదానిగా, రాక్షసిగా మార్చింది. మనల్ని మన తల్లులు ప్రేమించినట్లే, ఆమె తన కూతురుని ప్రేమిస్తోంది. ఆ మమకారమే ఆమెచేత ఈ మహాపాపాన్ని చేయిస్తోంది. చూచారా గమ్మత్తు? ఇది గ్రహించినప్పుడు మనకు ఎంత విచిత్రంగా తోస్తుందో?'' గంభీరంగా సత్యసూత్రాలు పలుకుతున్నవాడికిమల్లే మాట్లాడాడు ప్లాటూనోవ్.

'అన్నానుకూడా అందరితల్లులతో పోలుస్తున్నారా? హు!' అన్నాడు బోరిస్ పళ్ళు బిగబట్టి.

'క్షమించండి. నా ఉద్దేశం అదికాదు. ఈ జీవితాలకు వెనుక దాగివున్న సత్యాన్ని వెల్లడించాను. అంతకన్నా మరేంలేదు. ప్రపంచంలో నిస్వార్థంగా బిడ్డల్ని ప్రేమించే తల్లులున్నారు. పవిత్రజీవితాన్ని గడుపుతూవున్న తల్లులు లేకపోలేదు. అయినా ఈ విషయం ఇంత సులభంగా తేలేదికాదు. ఇది చాలా చిక్కుసమస్య. పోనీయండి. ఇహ దీన్నిగురించి చర్చించవద్దు' అన్నాడు మళ్ళీ ప్లాటూనోవ్.

''అలాకాదు, మిగతా వివరాలుకూడా చెప్పండి. మాకెంతో కుతూహలంగావుంది. ఈ విషయాలు మీరు బాగా తరచిచూచి ఒక అభిప్రాయానికి వచ్చినట్లు తోస్తోంది''అన్నాడు అంతలో లిఖోనిన్.

"అభిప్రాయం ఏముంది? ఇవాళ సాయంత్రంకూడా నా మిత్రుడు ఒక ప్రొఫెసరు కనిపించి ఇదేప్రశ్న అడిగాడు. ఒక పుస్తకం వ్రాద్దామనే ఉద్దేశ్యంతో వీళ్ళ జీవితాలు పరిశోధిస్తున్నావా అని అడిగాడు. అసలు నా ఉద్దేశ్యం పుస్తకం వ్రాయాలనికాదు. కేవలం వీరి జీవితాల్లోని విచిత్రాలు పరిశీలిస్తున్నాను. ముఖ్యంగా యజమానురాలు అన్నా, కొపలావాడు సిమన్ నన్ను ఆకర్షించారు. ఎందుకో చెప్పలేనుకాని, వారి జీవితాలవెనుక ఏదో అద్భుతశక్తి ఒకటి దాగివున్నట్లు నాకు తోచింది. ఇదేమిటో నేను సరీగా వ్యక్తంచేయలేను. వీరి జీవితాల్లో జరిగే ఏ చిన్న సంఘటన తీసుకున్నా అదొక పెద్ద సత్యమై, నిత్యమై వుండిపోతుంది. ఇవన్నీ ఒక గ్రంథంగా వ్రాస్తే, చదువరి దాన్ని చదువుతూ తనకు తెలీకుండానే నోరు తెరచి, నివ్వెరపోతాడు." అలా మెల్లగా మాట్లాడుతూ మాట్లాడుతూ ప్లాటొనోవ్ మధ్యలో అకస్మాత్తుగా ఉద్రిక్తుడయ్యాడు.

"ఈ యువతులందరినీ మీరు పడకగదిలోకి తీసుకెళ్ళండి; వారివైపు చూడండి. పరీక్షగా చూడండి. అంతా పసిపిల్లల్లా అగుపిస్తారు. పదకొండేండ్ల బాలికల్లా తోస్తారు! విధి వీరందరినీ ఈ పడుపువృత్తిలోకి తరిమింది. అప్పటినుంచి విచిత్రంగా, వెర్రిగా, కృత్రిమంగా అమాయకులై, మూర్ఖులై పిచ్చివాళ్ళయి, బొమ్మరింట్లోవున్న బొమ్మలమాదిరి పడున్నారు. వీరి మనస్సులు వికసించినవికావు. పరిపూర్ణమైన జీవితానుభవాలు వీరికి లేవు. అంచేతనే పసిపిల్లలమాదిరి ప్రవర్తిస్తారు. వారు చేసేదేమిటో వారికే తెలీదు. అర గంటక్రితం జరిగింది, చేసిందే మళ్ళీ చెప్పలేరు. ప్రకాశవంతమైన అతి విచిత్రమైన పసితనం వీళ్ళల్లో నాకు స్పష్టంగా కనిపిస్తుంది. అయితే ఒక విషయం. పతనమై, వ్యాధిగ్రస్తులై, వికలమై, విరిగి, మురిగిపోయిన వీరి హృదయాల్లో అసహాయత, జాలి, బాధ, మానవులు పొందే వేదన, మానవులకు ఉండాల్సిన సహజమైన ప్రేమ ఇవిమాత్రం అంతరించలేదు...ఉదాహరణకు..." అని చెపుతూ ప్లాటొనోవ్ ఒకమాటు గదిచుట్టూ కలయ చూచాడు. చేయి మొహానికి అడ్డంపెట్టుకుని అలిసిపోయిన కంఠస్వరంతో ఇలా అన్నాడు మళ్ళీ.

"అబ్బ! పోనీయండి ఇవాళ అంతులేకుండా మాట్లాడాను...అనవసరంగా వాగాను."

శ్రీ వేమన గ్రంథాలయము
తెలప్రోలు. (కృష్ణాజిల్లా)

'అయితే ప్లాటొనోవ్ గారూ! ఇదంతా ఒక గ్రంథంగా ఎందుకు వ్రాయకూడదూ? ఈ సమస్య మీ హృదయానికి గాఢంగా హత్తుకుని వేధిస్తున్నట్లుగావుంది?'' అన్నాడు ప్రొఫెసరు యార్చెంకో.

''ప్రయత్నించి చూచాను. కాని ప్రయోజనం లేకపోయింది. ఏమిటి? ఎప్పుడు? ఎందుకు? ఇలాంటి చాలాప్రశ్నలు ఎదుర్కొన్నాయి. వర్ణనలు వివర్ణమైనాయి. మాటలు చల్లగా చల్లారిపోయినాయి. అంతా ఏదో పశువులు నమిలి పారేసిన పదార్థంలా కనుపించింది......... కాని నాకు నమ్మకముంది. ఇప్పుడు కాకపోయినా, ఇంకతొందరలో కాకపోయినా, ఓ యాభైఏండ్ల తరువాతనైనా, ఒకరష్యన్ మేధావి—ఒక సుప్రసిద్ధ రచయిత అవతరిస్తాడు. ఈ పతితలజీవితం, వారిఆత్మవేదన, అతనుఅవగాహన చేసుకుంటాడు. వారిలో లీనమైపోతాడు. వీరందరిని, మరణంలేని శాశ్వతమైన పాత్రలుగాచేసి, ఉత్తమ కళాసృష్టి చేస్తాడు. ఇది నిజం! ఇది తప్పదు! ఆ కళాఖండంలో మనమంతా భయంకరమైన సత్యాన్ని దర్శిస్తాం. నేను ఇప్పుడు పొందుతూవున్న హృదయవేదన, నన్ను పీడిస్తున్న సమస్యలు, ఇవన్నీ ఆ మహారచయితకలంనుండి వెలికివస్తాయని నానమ్మకం. నేనుమాత్రం ఈ పనిచేయడానికి అసమర్థుణ్ణి.'

'ఓ! అత్యద్భుతంగావుంది. అందరం మరో డోస్ వేసుకుందాం పట్టండి' అంటూ లిఖోనిన్ ఉత్సాహంగా బ్రాందీగ్లాసు పైకెత్తాడు.

''నిజంగా ఏరచయిత అయినా పూనుకుని, మా నికృష్ట జీవితాలను గురించి యదార్థం చిత్రిస్తే ఎంత బాగుండును! అప్పుడైనా మా భయంకరమైన బ్రతుకును తెలుసుకుని, లోకం మమ్మలను దయతలుస్తుందేమో!'' అంది చిన్నమంకా, ఖిన్నురాలై. అంతలో గది తలుపు చప్పుడైంది. కళ్ళు మిరుమిట్లుగొలిపేలా నారింజపండురంగు దుస్తులు ధరించిన జెన్నీ లోపలికి వచ్చింది.

# 10

గదిలోకి రాగానే జెన్నీ అందరివైపు ఆప్యాయతగా చూచింది. ముఖకవళికలతోనే స్నేహపూర్వకంగా పరిచయం చేసుకుంది. వేశ్యలందరిలోనూ ఒక విశిష్టమైన స్థానాన్ని, ఒక ప్రముఖ పాత్రను కలిగివున్నట్లుగా ఆమె నడక, తీరు, రూపురేఖావిలాసాదులు అన్నీ స్పష్టంచేస్తున్నాయి. ఆతరువాత ఆమెవచ్చి రిపోర్టరు ప్లాటొనోవ్‌కు వెనుకపక్కన కూచుంది. ఆ రోజు పొద్దుగూకగానే వచ్చిన ఆ జర్మన్ టీచరుతో ఆమె అప్పటివరకూ గడిపివచ్చింది. అతను ముందు మంకాతో వుండడం, ఆమె సంతృప్తిపరచనందున జోస్యా సలహాపై పాషాతోకూడా గడపడం జరిగింది కదూ? అయినా ఆ ఇద్దరితోనూ అతనికి తృప్తితీరలేదు. అతని మనస్సంతా జెన్నీపైనే వుంది. ఏంచేస్తాడు పాపం? బయటికివెళ్ళి, బీరుషాపులలో, హోటళ్ళలో రెండుమూడుగంటలు కులాసాగా గడిపాడు. ధైర్యంతెచ్చుకుని, బలం కూడగట్టుకుని మళ్ళీ అన్నా ఇంటికి వచ్చాడు. కాని అప్పటికి జెన్నీతో వుండడానికి అవకాశంచిక్కలేదు. జెన్నీకోసం నిత్యంవచ్చేవిటుడు ఒకాయన వున్నాడు. అతని పేరు కారల్ కార్లొవిచ్. సుగంధనాల షాపులో పనిచేస్తున్నాడు. అతను మామూలుప్రకారం వచ్చి జెన్నీతో సుఖం అనుభవించి వెళ్ళిపోయాడు. పాపం అప్పటివరకూ ఈ జర్మన్‌టీచరు కాటిదగ్గరనక్కలాగా కాచుకూర్చున్నాడు. ఎలాగైతేనేం అతను వెళ్ళిపోయినతరువాత ఆ అవకాశంచూచుకుని జెన్నీదగ్గరకువెళ్లాడు. అప్పుడామె ఇతన్ని తన పడకగదిలోకి తీసుకెళ్ళింది. అతన్నిసంతృప్తిపరచి ఇప్పుడిక్కడికి వచ్చింది.

టమారా జెన్నీవైపుచూచి, అతను వెళ్ళిపోయాడా అని కళ్ళతో ప్రశ్నించింది.

"ఆ! వెళ్ళిపోయాడు......హు!" తటూపుకూ జవాబుచెప్పింది జెన్నీ!

ప్లాటొనోవ్ పక్కకుతిరిగి తదేకదృష్టితో జెన్నీవైపు చూడసాగాడు. అసలు జెన్నీఅంటే అతని కొక అభిమానంవుంది. ఆమెలో ఒక ప్రత్యేకత

అగుపిస్తుంది. అతనికి ఆమె సౌందర్యం, దుస్తులుధరించే తీరు, మాట్లాడే వైఖరి, ఆ గంభీరత, గడుసుతనం, ఆ నిబ్బరం, నిండుదనం—అన్నీ అతనికినచ్చాయి. అతనొక్కణ్ణేకాదు. సాధారణంగా విటులందరినీ ఆమె ఆకర్షిస్తూవుంటుంది. ఒకసారి ఆమెవైపు కన్నెత్తిచూస్తేచాలు, ఎంతటివాడైనాచిత్తయిపోతాడు. అందులోనూ ఇవాళ మరీ అందంగా, అప్సరసలా అగుపిస్తోంది జెన్నీ. ఒక్క లిఖోనిన్‌తప్ప తక్కిన విద్యార్థులంతా ఆమెవైపు ఆహారకంగా కుతూహలపడుతూ చూచారు. అందరిమనస్సుల్లోనూ ఏహో రహస్యమైన ఆలోచనలు, ఆకాంక్షలు దాగివున్నాయి. కొందరు వాటిని బహిటికివ్యక్తం చేస్తూ చూచారు. మరికొందరు వాటిని పైకికనిపించనీకుండా దొంగచూపులు చూచారు. ఇదంతా ప్లాటొనోవ్ గమనిస్తూనే వున్నాడు.

జెన్నీ మొహంమీద చెమటలుపోస్తున్నాయి. ఆమెబుగ్గలమీద ఎర్రిగా కందిన గాట్లు కన్పిస్తున్నాయి. పెదవులు వణుకుతున్నాయి.

"ఏం జెన్నీ? ఏమైనా కష్టంకలిగిందా?" అన్నాడు ప్లాటొనోవ్ మెల్లగా.

"ఎబ్బెబ్బే! ఏమీలేదు......మీరు ఇవేమీ ఆలోచించకండి... ఏవో మా ఆడవాళ్ళ గొడవలు......" అంటూ జెన్నీ తనచేయి నతని భుజంమీద వేసి, ప్రేమతో తడిమింది.

గభాలున టమారావైపుతిరిగి, పడుపుకత్తెలందరికీ పరిపాటయిన అపభ్రంశపు భాషలో, అస్పష్టంగా, అతిత్వరగా మాట్లాడుతోంది. ఆమె సంభాషణలో అక్కడక్కడ హీబ్రూ, రోమన్, రుమేనియన్ మాటలు కలిసివున్నాయి.

పక్కన రిపోర్టరు వున్నాడని టమారా తన కళ్ళతో జెన్నీకి సైగ చేసింది.

అవును టమారాచెప్పింది నిజమే. ఆ భాష ప్లాటొనోవ్ అర్థంచేసుకోగలడు. ఇప్పుడు జెన్నీ మాట్లాడిందంతా అతను గ్రహించాడుకూడా. జెన్నీ పాషానుగురించి చెప్తోంది. ఆరాత్రి చాలమంది బికారివెధవలు పాషాకోసం వచ్చారు. రకరకాల విటులు వచ్చి, మొత్తం పదిసార్లకుపైగా ఆ పిల్లను పడకగదిలోకి తీసుకుపోయారు. కొద్దినిముషాలక్రితం ఆ అమ్మాయికి ఫిట్సు—మూర్ఛవచ్చి పడిపోయింది. అప్పుడు ఎమ్మా ఎడ్వర్డోవ్నా

జటామాంసి వేరు అరగదీసి, మందిచ్చింది. ఆ పిల్ల కొంచెం తేరుకోగానే మరల హాల్లోకి పంపింది. ఈ ఘోరాన్ని చూచి, జెన్నీ సహించలేక ఎమ్మాను ఎదిరించింది. కాని ఆ దయ్యం లెక్కచేయలేదు. జెన్నీని నానా తిట్లూ తిట్టి, బెదిరించి తనపని తాను చేసుకుపోతుంది. ఇదీ జరిగిన సంగతి. ఈవిషయమంతా జెన్నీ టమారాకు భాషలో చెప్పింది. అయినప్పటికీ ప్లాటొనోవ్‌కు అది అర్థమైనందున సంగతంతా తెలుసుకున్నాడు.

"ఏమిటి ఆ పిల్ల మాట్లాడుతున్నది?" అనడిగాడు ప్రొఫెసరు ఏమీ అర్థంకాక.

"ఏంలేదు, మీకు సంబంధించిందికాదులెండి...ఏదో మా సంసారం గొడవలు" అంది జెన్నీ విషయం కప్పిపుచ్చుతూ.

"ప్లాటొనోవ్‌గారూ! మీ బ్రాందీ కొంచెం తాగుతాను" అంటూ జెన్నీ, ఒక అరగ్లాసు కొగ్నాక్ పోసుకొని అమాంతం తాగేసింది.

ప్లాటొనోవ్ మెల్లగాలేచి ద్వారందాకా వెళ్ళాడు. 'వద్దు, మీరు వెళ్ళకండి. ఈ విషయాన్ని ఇంతటితో వదిలేసెయ్యండి.' అంది జెన్నీ. ఆయన్ను ఆపుచేయాలని.

'ఏం? ఎందుకు వెళ్ళొద్దూ? అవసరమైతే పాపాను ఇక్కడికి తీసుకొస్తాను...కావాలంటే ఆడబ్బ మీయజమానురాలి మొహాన నేనే పారేస్తాను. ఆ పిల్ల ఇక్కడ కాసేపు సోఫామీద పడుకుని విశ్రాంతి తీసుకుంటుంది.......న్యూరా! నీవు వెళ్ళి త్వరగా ఒక దిండు పట్టుకురా.......'
అలా అంటూనే ప్లాటొనోవ్ అవతలికి వెళ్ళిపోయాడు.

ఇదంతా చూస్తోన్న బోరిస్‌కు అసహ్యం పుట్టుకొచ్చింది. ప్లాటొనోవ్‌కు ఆ ఇంట్లోవున్న గౌరవం, వేశ్యలంతా అతనిపట్ల చూపిస్తోన్న ఆదరణ, అభిమానం, ఇవన్నీ అతనికి ద్వేషాన్ని, అసూయను కలిగించాయి.

'ఏమిటీ వెధవగోల? మనమంతా ఇక్కడ హాయిగా గడుపుకుందామని వచ్చాం. మధ్యలో ఈ చెత్తా కొనీ వెధవ ఒకడు దాపురించాడు. ఏమిటీ పీడ? అసలు అతనువెవరు? కాకాపట్టే వెధవలా కనిపిస్తున్నాడు. దీనికంతకూ కారణం నీవే లిఖోనిన్! నీచనువు చూచుకొనే, అతనిలా ప్రవర్తిస్తున్నాడు' అన్నాడు బోరిస్, ద్వేషం వెళ్ళగక్కుతూ.

'బోరయా! అతని విషయం నీకెందుకోయ్?' అన్నాడు లిఖోనిన్.

‘ఒక్క లిఖోనిన్‌కే అతన్ని పరిచయం చేయలేదు. మిత్రులందరికీ నేనే అతన్ని పరిచయం చేశాను.’ అన్నాడు రాంసెస్.

‘నాన్‌సెన్స్! ఇలాంటివాడితో మనకు స్నేహమేమిటోయ్? మంది సొమ్ము ఖర్చుపెట్టి మహాదర్జాగా తాగుతున్నాడు. హు! అతని మొహమే చెప్తోంది. తార్పుడుగాడు! వేశ్యలను, మిండగాళ్ళను తార్చి అందుకు ప్రతిఫలంగా, తాగుతూ తింటూ కాలం గడుపుతున్నాడు’ అన్నాడు బోరిస్ తిరిగి కోపంగా.

‘ఏమిటా మాటలు? అనవసరంగా పేలకు బోరిస్!’ హెచ్చరించాడు ప్రొఫెసర్ యార్చెంకో.

కాని బోరిస్ ఎవరి మాటా లెక్కచేయకుండా, ప్లాటొనోవ్‌ను గురించి ఇష్టంవచ్చినట్లు వాగడం మొదలెట్టాడు. బోరిస్ అసలే పొగరుబోతు. పైగా తాగుడుకూడా తలకెక్కింది. ఇంకేం? దెబ్బలాటకు దేవులాడుతున్నాడు. కయ్యానికి కాలు దువ్వుతున్నాడు. సాధారణంగా ఇద్దరుముగ్గురు కలిసి సానికొంపలోకి వస్తే, తగాదా వచ్చితీరుతుంది. ఒకడికి కాస్త మర్యాద జరిగితే రెండోవాడికి చురుక్కుమంటుంది. ఒకవేశ్య ఒకడిమీద కన్ను వేస్తే, రెండోవాడికి వళ్ళుమండుతుంది. ఇప్పుడు బోరిస్ పరిస్థితికూడా అలాగేవుంది.

‘‘అతను మాట్లాడే వైఖరి చూశారూ? ఏమిటో ఆ దర్జా? తాను లోకాన్ని అంతా జయించినవాడిమల్లే విర్రవీగాడు. గురువు శిష్యులకు ఉపదేశించినట్లు మాట్లాడాడు. వాడేమో గురువైనట్లు, మనమంతా శుంఠలమైనట్లూ. హు! దరిద్రపుగొట్టు పెద్దమ్మ!’’ అన్నాడు మళ్ళీ బోరిస్, పళ్ళు కొరుకుతూ.

బోరిస్‌వైపే చూస్తూ అతని మాట వింటోన్న జెన్నీ గభాలున చప్పట్లు కొట్టింది.

‘‘భలే! భలే! విద్యార్థివీరా! వీరుడవంటే నీవే! అతనంటే అంత అక్కసుగా వుందా? రానీ చెప్తాను. నీ వన్నవన్నీ అతనితో చెపుతాలే’’ అంది జెన్నీ పకపక నవ్వుతూ.

‘‘చెప్పుకో పో! నాకేం భయమనుకున్నావా? ఇలాంటి వాళ్ళను చాలామందిని చూచాను.’’ అంటూ బోరిస్ పళ్ళు పటపట కొరికి, గుడ్లు తాటికాయలంతచేశాడు.

"అదీ అసలైన వీరుడి లక్షణం! ధైర్యం అంటే అలా ఉండాలి." అంది మళ్ళీ జెన్నీ అతన్ని వుసికొల్పుతూ.

దెబ్బలాటంటే జెన్నీకి మహా ఇష్టం. ఇద్దరు తగాదా పెట్టుకుంటూ వుంటే, తమాషా చూస్తుంది. ఒకరిమీద ఒకరిని ఉసికొలిపి దెబ్బలాట పెంచుతుంది. అందుకు గుర్తుగా ఆమె ముక్కులు వణుకుతున్నాయి. కళ్ళు చింతనిప్పుల్లా జ్వలిస్తున్నాయి.

"బోరీ! అనవసరంగా గొడవలు తీసుకురాకు. మనమంతా స్నేహితులం, ఇక్కడ పొచ్చుతగ్గు లెవరికీలేవు. అంతా మనమే" అన్నాడు ళిఖోనిన్, సర్దుబాటు చేస్తూ.

ఇంతలో న్యూరా తలగడ తీసుకొచ్చి సోఫామీద పెట్టింది. 'ఏమిటది? ఆ దిండు అక్కణ్ణుంచి తీసెయ్! ఇదేం పడకగది అనుకున్నావా?' అరిచాడు బోరిస్.

'ఎందుకు ప్రియా అంతకోపం? ఆ విషయాలతో మనకెందుకు? నేను మీ పక్కన కూచుంటాను. మనిద్దరం హాయిగా మాట్లాడుకుందాం' అంటూ జెన్నీ తలగడ టమారా వెనకాల దాచిపెట్టింది. బోరిస్ దగ్గరకు వెళ్ళి అతన్ని బలవంతాన కూచోపెట్టి తను అతని తొడమీద కూచుంది. రెండు చేతులతో గట్టిగా కౌగలించుకుని బలంగా ముద్దు పెట్టుకుంది. ఆమె ముక్కుల్లోంచి వెలువడుతోన్న ఉచ్ఛ్వాస నిశ్వాసాలు వెచ్చగా బోరిస్ మొహానికి తగిలాయి. ఆడదాని అనుభవం అంతగా లేని ఆ యువకుడికి ఒక క్షణంవరకూ ఊపిరి సలపలేదు. ఏదో భయం, ఉద్రేకం మనసులో ముసిరాయి. అతని శరీరం పట్టుతప్పిపోతున్నట్లుగా వుంది. ఎంతో కష్టంమీద ఆమెపట్టు విడిపించుకున్నాడు. "అబ్బ! నీకు ఎంత ఉద్రేకం! జెన్నీ అంటే నీవేకదూ? భలేపిల్లవు!" అన్నాడు బోరిస్ ఐస్‌లా అయిపోయి.

ప్లాటొనోవ్ పాషాను వెంటబెట్టుకుని గదిలోకి వచ్చాడు. పాపం ఆ పిల్ల పరిస్థితి మరీ ఘోరంగా వుంది. ఆమెనుచూస్తే ఎవరికైనా జాలి, జుగుప్స రెండూ పుట్టుకొస్తాయి. మొహమంతా నల్లగా కప్పువేసినట్లు మాడిపోయివుంది. కళ్ళు సగం మూతలుపడివున్నాయి. తెరచివున్న ఆమె పెదవులు చీలిన ఎర్రగుడ్డపీలికల్లా వున్నాయి. వాటిమీద ఏదో వికృతమైన చిరునవ్వు కనిపిస్తోంది. ఆమె నడవలేకపోతోంది. కాళ్ళు మెలికలు పడు

తున్నాయి. ఒక అడుగు దూరంగా, మరో అడుగు దగ్గిరిగా వేస్తోంది. మెల్లగావచ్చి సోఫామీద పడుకుంది. దిండుమీద తలపెట్టుకుంది. ఆమె శరీరం చలువలు కమ్మివుందని దూరంనుంచే తెలుసుకోవచ్చు.

లిఖోనిన్ తన కోటు విప్పతీసి, ఆమెపంటిమీద కప్పాడు. 'టమారా! ఈమెకు చాక్లెట్లూ, కొంచెం 'వైను' ఇవ్వు' అన్నాడు లిఖోనిన్.

బోరిస్ పోజుపెట్టి ఒకమూల నిలుచున్నాడు. ఈ తంతు అంతా చూస్తోంటే అతనితల తిరిగిపోతోంది. ప్లాటొనోవ్ వైపు తిరిగి, అతన్నిసూటిగా అడిగాడు.

'హు! నీపేరేమిటి? ఈపిల్ల నీ ఉంపుడుగత్తా?' అంటూ తన బూటు కాలు కొంచెం పైకెత్తి పాషావైపు చూపించాడు.

"ఏమిటీ?" అన్నాడు ప్లాటొనోవ్ మొహం చిట్లిస్తూ.

"పోనీ, నీ వామెకు ప్రియుడివేమోలే! కాకపోతే ఎందుకిలా అవస్థ పడతావు. అవునుగాని, వాళ్ళ సంపాదనలో నీ కెంతభాగం?" అనడిగాడు మళ్ళీ బోరిస్.

అది విని ప్లాటొనోవ్ బోరిస్‌వైపు తీక్షణంగా చూచాడు. ఆ చూపులో ఏదో బరువూ, బాధా స్పష్టంగా కనిపిస్తున్నాయి.

"నీవు వచ్చినప్పటినుంచీ చూస్తున్నాను. నీవు తగాదాకు సిద్ధం కావడం ఇది మొదటిసారికాదు. ఒకటి నీవు తాగివున్నావనీ, రెండోది నీ స్నేహితులమొహాలు చూచీ నిన్ను వదలిపెట్టాను. లేకపోతే సున్నంలోకి ఎముక లేకుండా తన్నేవాణ్ణి; జాగ్రత్త! మళ్ళీ ఇలా మాట్లాడావూ అంటే మనిషివే మిగలవు......ఎందుకైనా మంచిది, ఆ కళ్ళజోడు తీసి అవతలపెట్టు." అన్నాడు ప్లాటొనోవ్ గంభీరంగా.

"ఏం? నాకళ్ళజోడుతో నీ కేంపని?" అన్నాడు బోరిస్ అర్థంకాక.

"ఎందుకా? నిన్ను మొహం పగిలేటట్టు తంతే, ఆ అద్దాలొచ్చి నీ కళ్ళల్లో గుచ్చుకుంటాయి. అందుకని చెప్పాను." అన్నాడు ప్లాటొనోవ్ హేళనగా.

అకస్మాత్తుగా పుట్టిన ఈ తగాదా చూచి ఎవరూ నవ్వలేదు. మంకా మాత్రం ఆశ్చర్యంగా చూసింది. జెన్నీ అందరి మొహాలు పరిశీలిస్తూ ఏం

జరుగుతుందో అని చూస్తోంది. 'ఎవరు ఎవర్ని కొట్టేదీ ఇప్పుడే తేల్చివేయ గలను. కాని నీలాంటి పనికిమాలినవాడిమీద చేయిచేసుకుని, చేతులు పాడు చేసుకోడం నా కిష్టంలేదు......' పసిపిల్లాడిలా అరిచాడు బోరిస్. ఇంకేదో అనబోయాడు. కాని మాటలు తడబడ్డాయి. 'అబ్బాయిలూ! ఇక నే నిక్కడ ఒక్కక్షణంకూడా వుండదలుచుకోలేదు' అంటూ బోరిస్ గదితలుపుదాకా వెళ్ళాడు. ఒకవైపున కూచుని తీక్షణంగా తనవైపు చూస్తోన్న ప్లాటోనోవ్‌ను సమీపించాడు. అకస్మాత్తుగా అతనిమీదపడి, కొట్టాలనుకున్నాడు. కాని మళ్ళీ పస్తాయించాడు. గదిలో వున్నవారంతా అతని పక్షం వహించి, తనకు ఎదురు తిరుగుతారని గ్రహించాడు. పైగా ప్లాటోనోవ్ బలమైన శరీరం, తీక్షణమైన చూపులు ఆ యువకుడి మనస్సులో భయాన్ని రేకెత్తించాయి. మారు మాటాడకుండా, మొద్దులా, తలుపు తెరుచుకుని, అవతలికి వెళ్ళి పోయాడు.

'పోయాడు! పీడవదిలింది!' అంది జెన్నీ నవ్వుతూ.

'టమారా! మరోగ్లాసు 'కాగ్నాక్' పొయ్యవే' అంది తిరిగి.

పొడుగ్గా వున్న పెట్రోవస్కీ లేచి, తన మిత్రుడు బోరిస్‌ను సమర్థించ సాగాడు. బోరిస్ వెళ్ళిపోవడం ఇతనికి చిన్నతనంగా తోచింది.

'మిత్రులారా! నేనూ బోరిస్‌తోపాటే వెళ్ళిపోతున్నాను. అతనిది తప్పో, రైటో అలా వుంచండి. ఏమైనా, కొత్తస్థలంలో మొహం ఎరుగని వాళ్ళ ఎదుట మన మిత్రుడికి అవమానం జరుగుతోంటే, మీరంతా పట్ట నట్లు ఊరుకున్నారు. ఇది నేను సహించలేను. మీ ఇష్టం. ఏమైనాచేసు కోండి. నేనూ వెళ్ళి పోతున్నాను.'

'అరెరె! అదేమిటి పెట్రో!' వెంటనే ఆశ్చర్యపోతూఅందుకున్నాడు లిఖోనిన్-'ఇదేం న్యాయం? బోరిస్ వచ్చినలగాయతు 'చాలాఅసహ్యంగా మనందరికీ తలవంపులు తెచ్చేలా ప్రవర్తించాడు. సర్దుబాటుచేయడంపోయి నీవుకూడా అతనితో వెడతానంటున్నావా! హు! పత్రికాఫీసుల్లో, రాజ కీయసభల్లో, మీటింగుల్లో, 'వాకౌట్' చేయడంకద్దు. ఇక ఈ పాడు సానికొంపల్లోకూడా సమిష్టిగా వాకౌట్ సాగించారబ్బోయ్! మన మేం సైనికదళంలో పనిచేసే ఆఫీసర్ల మనుకున్నారా! ఒకడుచేసిన పిచ్చిపనులు

రెండోవాడు కప్పిపుచ్చి సమర్థించడానికి!' నిర్మొహమాటంగా, తీవ్రంగా హెచ్చరించాడు లిఖోనిన్.

అయినా పెట్రొవస్కీ అతనిమాటలు ఖాతరుచేయలేదు. విసురుగా గదిలోంచి వెళ్ళిపోయాడు.

'హు! ఇద్దరూ కట్టకట్టుకుని చావండి' అంది జెన్నీ.

మనుషుల మనస్సుల్లో చీకటిమూలలు వుంటాయి. ఆమూలల్లో అనేక రహస్యమైన ఆలోచనలు బూజులా దాక్కునివుంటాయి. బోరిస్, అతని పెట్రొవస్కీ, ఇద్దరూ అవతలికి వెళ్ళిపోయారేకాని, ఆ ఇరువురి మనసుల్లో వున్న ఆలోచనలు వేరు. బోరిస్‌కు జెన్నీమీద మనసుమళ్ళింది. ఆ పిల్లను చూచినలగాయతు అతనికి పిచ్చెక్కినట్లుగావుంది. ఎలాగైనా యజమానురాలితో మాట్లాడి జెన్నీతో వేరే గదిలో పడక యేర్పాటుచేసుకోవాలని నిశ్చయించుకున్నాడు. ఇక పెట్రొవస్కీ పరిస్థితికూడా అలాగేవుంది. అతనికీ జెన్నీమీద మోహం పుట్టింది. కాని అతని దగ్గర డబ్బులేదు. స్నేహితుడు బోరిస్‌ను అడిగి ఒక మూడు రూబుల్సు అప్పు తీసుకోవాలనుకున్నాడు. ఇంకేం? ఇద్దరూ హాలులో కలుసుకుని తమ అభిప్రాయాలు ఒకరితోఒకరు చెప్పుకుని ఒక నిశ్చయానికి వచ్చారు.

ఆ తరువాత పనిమనిషి జోస్యా డ్రాయింగ్‌రూంలోకివచ్చి జెన్నీని, న్యూరాను, ఏదో పనివుంది రమ్మని పిలిచింది.

బోరిస్, పెట్రొవస్కీ వెళ్ళిపోయింతర్వాత గదిలో కాసేపటివరకూ ఎవరూ మాట్లాడలేదు. ప్లాటొనోవ్‌మనసుమాత్రం ఏదో బాధగా వుంది- అనవసరంగా ఇవాళ, మిత్రులమధ్య కల్లోలం బయులుదేరిందే అని. అతని ఆత్మక్షోభపెట్టసాగింది. ఇలా జరిగినందుకు కొంచెం సిగ్గుపడ్డాడుకూడా. "నేనుకూడా వెళ్ళిపోవడం మంచిదని తోస్తోంది. నావల్ల మీ స్నేహాలు చెడిపోవడం నా కేమాత్రం ఇష్టంలేదు. బహుశా నేనే పొరపాటుగా ప్రవర్తించానేమో! ఇవ్వాల్సిన బిల్లును గురించి మీరేమీ విచారించకండి. ఇందాక నేను పాపాకోసం బయటికి వెళ్ళినప్పుడు, ఇవ్వాల్సిన డబ్బంతా సిమన్‌కు ఇచ్చేశాను." అన్నాడు ప్లాటొనోవ్, ఇక వెళ్ళిపోవాలనే తలంపుతో.

కాని లిఖోనిన్ వెంటనే లేచి నిలబడ్డాడు.

"మీరేం బాధపడకండి, నే నిప్పుడే వెళ్ళి మావాణ్ణి తీసుకొస్తాను. కుర్రకుంక. నిజానికి ఇద్దరూ మంచివాళ్ళే. మాకు ప్రాణస్నేహితులు. కాని చూడండి! ఇంకా పిల్లచేష్టలు పోలేదు. కుక్కపిల్లల్లా తమ తోకల్ని తామే కొరుక్కుంటూరు. ఇప్పుడే వెళ్ళి ఇద్దరినీ తీసుకొస్తాను. చేసినతప్పుకు బోరిస్ మిమ్మల్ని క్షమాపణ వేడుకుంటాడుకూడా. సందేహంలేదు" అన్నాడు లిఖోనిన్.

లిఖోనిన్ గదిలోంచి వెళ్ళిపోయి, కొద్దినిముషాలతరువాత తిరిగి వచ్చాడు.

"లాభంలేదు. ఇద్దరూ అవతల విశ్రాంతి తీసుకుంటున్నారు. ప్రస్తుతం ఇక్కడికి వచ్చేలా లేరు" అన్నాడు లిఖోనిన్ కొంచెం కష్టంగా.

ఇలా అయిందని అతను కొంచెం నిరుత్సాహపడ్డాడు.

# 11

అప్పుడే కాపలావాడు సిమన్ అక్కడికి వచ్చాడు. అతని చేతిలో ఓ పెద్ద విజిటింగుకార్డు వుంది.

"అయ్యా! ఇక్కడ యార్చెంకోగారు అనే ఆయనఉన్నారా? ఉంటే ఎవరో చెప్పండి." అని అడిగాడు సిమన్ అందరిమొహాలవైపు చూస్తూ.

'నేనే' అన్నాడు యార్చెంకో.

"ఈ కార్డు తమకిమ్మని ఒక నటుడు పంపించాడు." అంటూ కార్డు అందించాడు సిమన్.

దాన్ని తీసుకుని యార్చెంకో బిగ్గరగా చదివాడు. అందులో ఇలా వుంది—

"ఎగ్మాంట్ లావ్రెటిస్కీ
డ్రామా యాక్టర్, మెట్రోపాలిటన్ థియేటర్స్"

"అః! పేరు భలే తమాషాగా వుందే! రష్యన్ యాక్టర్సులో ఇలాగే విచిత్రంగా వుంటాయి." అన్నాడు లిఖోనిన్.

"అసలు ఇతనుఎవరో నాకు తెలీదే? ఎవరుచెప్మా? మెట్రోపాలిటన్ థియేటర్సులో ఏ యాక్టర్‌తోటీ నాకు పరిచయంలేదే." అంటూ

యార్చెంకో కార్డు రెండోవైపు తిప్పి చూచాడు. దానిమీద ఇలా వ్రాసి వుంది.

"మిమ్మల్ని ఇంతకుముందే లోపలికి వెళుతూవుండగా చూచాను. కలుసుకుందా మనుకున్నాను. కాని అవకాశం లేకపోయింది. బహుశా నేను మీకు గుర్తులేనేమో! పీపుల్స్ థియేటర్ జ్ఞాపకంతెచ్చుకోండి. "దరిద్రంలోనే శాంతి" అనే నాటకం ఆడాం. మీరుకూడా వచ్చారు. ఆ నాటకంలో ఆఫ్రికావాడివేషం వేసింది నేనే."

ఇప్పుడు యార్చెంకోకు జ్ఞాపకంవచ్చింది. 'అవును, అతను చెప్పింది నిజమే. ఆ నాటకానికి నేను వెళ్ళాను. ఇతనిమొహం శుభ్రంగా గడ్డం గీచుకుని, నున్నగా వుంటుంది. కొంత పొగరుబోతులా అగుపిస్తాడు...... అబ్బాయిలూ ! ఇప్పుడేమిటిచేయడం?' అని మిత్రుల్ని అడిగాడు యార్చెంకో.

"దీనికి ఆలోచన ఎందుకు? ఇక్కడికే రమ్మనండి. సరదాగా వుంటాడేమో!" అన్నాడు లిఖోనిన్.

"మీరేమంటారు?" మళ్ళీ ప్లాటోనోవ్‌నుచూచి ప్రశ్నించాడు యార్చెంకో.

"నాకేం అభ్యంతరంలేదు. పిలిపించండి. అతను నాకు చూచాయగా తెలుసు. ఫరవాలేదు. సరదామనిషే" అన్నాడు ప్లాటోనోవ్.

ఎలాగైతేనేం అక్కడున్న విద్యార్థులంతా అంగీకరించారు. ఆ నటకుడు అక్కడికి రావడానికి ఎవరికీ అభ్యంతరంలేదని తెలియజేశారు.

ఇహనేం? యార్చెంకో, నటుణ్ణి లోపలికి రావలసినదిగా ఓ చీటీ ముక్క వ్రాసి సిమన్‌చేత పంపించాడు.

వెంటనే నటుడు ఎగ్మోంట్ డ్రాయింగ్ రూంలో ప్రవేశించాడు. అతని అలవాటుప్రకారం అంగవిన్యాసాలు, హస్తవిన్యాసాలు చేసుకుంటూ, హావభావాలు ప్రదర్శిస్తూ గదిలో ప్రవేశించాడు. పొడుగాటి కోటు ధరించివున్నాడు. ఒపేరాలలో పెట్టుకునే టోపీ పెట్టుకున్నాడు. సింహంలా, సంఘపెద్దలా, బ్యాంకు డైరెక్టర్ లా వున్నాడు.

"మిత్రులారా! నన్ను మీ బృందంలోకి రానిస్తారా?" అంటూ ఒక పోజుపెట్టి, అందరికీ వంగి శాల్యూట్ చేశాడు. విద్యార్థులు అతన్ని

గదిలోకి ఆహ్వానించారు. ఆ నటుడు తనకుతానే పరిచయంచేసుకుని అందరితో కరస్పర్శ చేశాడు. అతని మొహం చాలా బిరుసుగావుంది. మందంగా విశాలంగావున్న కనుబొమ్మలు, కనురెప్పలు ఏదో వికృతంగా, మొరటుగా వున్నాయి. మొహమంతా నూనెపూసినట్లు జిడ్డుకారుతోంది. అతనివెంట ఇద్దరు అమ్మాయిలుకూడా వచ్చారు. ఒకామెపేరు హెన్రీటా, అన్నా ఇంట్లోవుండే సానులందరిలోకీ పెద్దది. అయినా ఆమె అందం చెడలేదు. గంభీరమైన కంఠస్వరం. రకరకాల అనుభవాలుకల మనిషి. ఎన్నో విషయాలు చూచింది. జీర్ణించుకుంది. అన్నిట్లోనూ ఆరితేరినఘటం. ఇహ రెండో పిల్లపేరు మంకా. చిన్నమంకా కాదు, పెద్దమంకా. అంటే ముసలిమంకా. హెన్రీటాను ఈ నటుడు గతరాత్రి తనవెంట తీసుకువెళ్ళాడు. ఒక హోటల్లో మకాంపెట్టి మళ్ళీ వచ్చాడు. అప్పటినుంచీ ఈమె అతనితోనే వుంది. ఆయనవచ్చి యార్చెంకోపక్కన కూచున్నాడు.

"మిత్రులారా! నాకు తెలుసు. మీరంతా విద్యార్థులు, నవయౌవ్వనంలోవున్న కుర్రాళ్ళు. విద్యార్థులంటే నేను పడిచస్తాను. మనలాంటి రష్యన్ యువకులకు కావల్సిందేముంది? బూందీలాంటి పిల్లలు, బ్రాందీలాంటి పానీయం...... షాంపేన్!" అంటూ అతను పిడికిలితో బల్లమీద గుద్దాడు. ఇంకేం? విద్యార్థులందరికీ హుషారెక్కింది. అందరూ గొల్లున లేచారు. ఎవరిపోర్షన్ వారు అందుకున్నారు. ఎవరిపాత్రవారు అభినయించసాగారు. మాటల్లోనూ చేతల్లోనూ నటుడు ముందు దారి చూపుతున్నాడు. తక్కినవారంతా అతన్ని అనుసరిస్తున్నారు. యార్చెంకో, లిఖోనిన్‌కూడా ప్రధాన పాత్రలు తీసుకుని పోషిస్తున్నారు. పాటకుడు మిష్కా పెద్దగా గొంతెత్తి పాట లంకించుకున్నాడు. పుస్తకాలమ్ముకునే కోల్కాకూడా అక్కడ హాజరై ఆనందిస్తున్నాడు. కొంచెంసేపట్లో రోలీ-పోలీకూడా వచ్చి వీళ్ళల్లో చేరాడు. గదంతా కోలాహలంగావుంది. తింటున్నారు. తాగుతున్నారు, వాగుతున్నారు. వేశ్యలు విలాసంగా అందరిచుట్టూ తిరుగుతూ నృత్యంచేస్తున్నారు. అందరిదగ్గరికీ వెళ్ళి ముద్దులందిస్తున్నారు. ఈ గందరగోళంచూచి కాపలావాడు సిమన్ జాగ్రత్తకోసం కిటికీలు, అద్దాలతలుపులు అన్నీ మూశాడు. తెరలు దించాడు.

లోపల జరుగుతోన్న ఈ మహాసభలో పాల్గొనడానికి అనేకమంది విటులు, వేశ్యలు హాల్లోంచి వచ్చేశారు. కొందరు సిగరెట్లు కాలుస్తూ పొగ విడుస్తున్నారు. మరికొందరు కబుర్లు చెప్పుకుంటున్నారు. మరికొంతమంది ఘనులు వేశ్యల్ని పక్కన కూచోబెట్టుకుని గిల్లుతూ, గిచ్చుతూ ఆనందిస్తున్నారు. కొందరు వేశ్యలు విటులతొడలమీద కూచొని వయ్యారంగా, విలాసంగా సరసాలాడుతున్నారు. హాల్లోంచివచ్చిన కొందరుగుమాస్తాలు, విద్యార్థులతో వాదనకు దిగారు. మాటలు ముదురుతున్నాయి. తగాదాకు దిగుతున్నారు. అది కనిపెట్టి సిమన్ వాళ్ళను మంచిమాటలతో కొంత సర్దుబాటుచేశాడు.

“న్యూరా” తన పడకగదిలోంచి ఇవతలికివచ్చింది. ఆమెవచ్చిన కాసేపటికి పెట్రోవస్కీ కూడా వచ్చాడు. అంతవరకూ వీధిలో షికారుచేస్తున్నానని, జరిగిన తగాదానుగురించి ఆలోచిస్తున్నానని మిత్రులతో చెప్పాడు. బోరిస్ దే తప్పు అని ఇప్పుడు తాను గ్రహించాననికూడా చెప్పాడు. తరువాత కొద్ది క్షణాలకు జెన్నీకూడా తనపడకగదిలోంచివచ్చింది. బోరిస్ ఆమెగదిలో పడుకుని నిద్రపోతున్నాడు.

నటుడు వివిధరకాల పోజులుపెట్టి రకరకాల పాత్రలు అభినయించాడు. అనేకమందిని అనుకరిస్తూ, అచ్చం వాళ్ళమాదిరిగానే హాస్యం కురిపించాడు. టెలిఫోనులో మాట్లాడ్డం, గ్రామఫోను రికార్డులా పాటపాడడం, ఈగలు ముసిరినట్లు బొంయ్యిమని అరవడం; ఇవన్నీ అభినయించాడు. చివరకు కోతిని వెంటపెట్టుకున్న పెషియన్ కుర్రాడిమాదిరిగా నటించాడు. అందరూ అతని ప్రదర్శనాలను మెచ్చుకున్నారు. పగలబడినవ్వారు. ఆనందించారు. తరువాత ఒక్కొక్కరూ ఒక్కొక్క అమ్మాయిని వెంట తీసుకుని తమాషాగా అదృశ్యంకావడం మొదలెట్టారు. వెల్ట్ మాన్ అనే విద్యార్థి పాషాతో గుసగుసలాడి అవతలికి పోయాడు. అతనివెనకనే ఆమె కూడా, ఆ పిచ్చినవ్వుతోనే వెళ్ళిపోయింది.

తక్కిన విద్యార్థులుకూడా ఒక్కొక్కరే జారుకున్నారు. ఏవేవో వంకలుచెప్పి తప్పించుకున్నారు. కొందరు తలనొప్పిగా వున్నదన్నారు. మరికొందరు పొద్దున్నే లేచి పనిలోకి పోవాలనీ, అందుచేత రెండుమూడు గంటలైనా నిద్రపోవాల్సిన అవసరంవుందనిచెప్పి వెళ్ళారు. మరికొందరు

పోల్లోకిపోయి సంగీతం వింటామని చెప్పారు. అందరూ దొంగలు. అన్నీ అబద్ధాలే. వీరంతా పడుపుకత్తెలను వెంటబెట్టుకుని పడకగదుల్లోకి చేరారు. రాంసెస్‌కూడా జెన్నీకి సైగచేసి అవతలికి తప్పుకున్నాడు. ఇహ అక్కడ మిగిలిందల్లా లిఖోనిన్ అనే విద్యార్థి, రిపోర్టరు ప్లాటోనోవ్. వీరిద్దరు, మరికొందరు వేశ్యలు వున్నారు.

'ఏం, లిఖోనిన్! నీ మిత్రులంతా ఎవరివాటా వారు పట్టుకు పోయారు. ఇహ నీ వంతే మిగిలివుంది నీవూ ఓ అమ్మాయిని జతచేసుకో" అన్నాడు ప్లాటోనోవ్.

"లేదు బ్రదర్! నన్ను పొరపాటుగా అర్థంచేసుకుంటున్నారు. నేను ఈపని చేయను. చేయలేను. ఇందులో తప్పువున్నదనే అభిప్రాయంకూడా కాదు. ఒక ఆదర్శంకోసం అంతకన్నా కాదు. నాకు ఓ సిద్ధాంతం, ఓ పద్ధతి అంటూ లేదు. సాధారణంగా దేనికీ కట్టుబడివుండను. ప్రపంచంలో అందరూ అసహ్యించుకునే విషయాలు, నీచమైనపనులు—వీటినే నేను స్వీకరిస్తాను. వీటిల్లోనే ఆనందం వుందని భావిస్తాను. అంచేత వ్యభిచారం చేస్తే తప్పుఅని కాదు, నేను మానుకున్నది. ఏమిటో చిత్రం! ఆ పనిలో నాకు ఆసక్తిలేదు. పైగా చూచారూ? నా ఉత్సాహం, నా ఆనందం, అంతా జూదంలోనే. జూదంతో, తాగుడుతో నాజీవితం తెల్లవారిపోతోంది. ఎందుకో వ్యభిచారం అంటే నాకు జుగుప్స ఏర్పడింది ప్లాటోనోవ్! అదే మిమ్మల్ని అడుగుదామనుకుంటున్నాను" అన్నాడు లిఖోనిన్.

'నేనూ అంతే. ఒకొక్కసారి అలసిపోయి రాత్రిళ్ళుకూడా ఇక్కడే పడుకుంటాను. కాని ఇంతవరకూ స్త్రీసౌఖ్యం ఎరగను. ఏ వేశ్యతోకూడా వుండలేదు. ఇషయాను అడిగి అతను పడుకునే చిన్నగది తాళంచెవులు తీసుకుంటాను. వెళ్ళి ఆ గదిలో పడుకుంటాను' అన్నాడు ప్లాటోనోవ్.

"నిజంగా! ...... ఒక్కసారికూడా?" ఆశ్చర్యంగా అడిగాడు మళ్లీ లిఖోనిన్.

"అవును. ఒక్కసారికూడా ఆ పాడుపని చేయలేదు" నింపాదిగా జవాబుచెప్పాడు ప్లాటోనోవ్.

"అవును. ఆయన చెప్పింది వేదవాక్కు. పరమసత్యం! ఎన్నడూ స్త్రీని ముట్టలేదు. ఆయన ఒకమహర్షిలాంటివాడు" అంది న్యూరా మధ్యలో.

తిరిగీ ప్లాటొనోవ్ చెప్పడం ప్రారంభించాడు.

"ఓ అయిదేండ్ల క్రితం నాకిలాంటి అనుభవం కలిగింది. కాని చూచారూ? అది నాకెంతో అసహ్యంగాను, దుర్భరంగాను అగుపించింది... ఇందాక ఆ నటుడు ఈగలు ముసరడం అభినయించాడే, ఫస్తు అలాగే అనిపించింది నాకు. అబ్బ! రొచ్చుగుంటచుట్టూదోమలు, ఈగలు ముసిరినట్లుగా వుంది. ఏమిటి ఇందులోవున్న సుఖం? ఇదీ ఒక ప్రేమేనా? మొత్తానికి ఏమిటో ఈ వృత్తి నాకు సరిపళ్ళేదు. వేశ్యలకుకూడా నేనంటే ఏవగింపుగానేవుంది. నేను వాళ్ళకు తగినవాణ్ణి కాదని తేల్చుకున్నారు. కథానాయకుడికిమల్లే, వీరోచితంగా, సాహసంగా ప్రవర్తించలేకపోయాను. స్త్రీల ఎదుట నాకు సిగ్గు, బిడియం, భయం, అనుమానం ఇవన్నీ కలిగాయి. అబ్బబ్బ! పశుప్రవృత్తితప్ప, ప్రేమఅనేది నాకు కనిపించలేదు. ద్వేషం, విషం, కన్నీళ్ళు, రక్తపాతం, బలిదానం...ఇవే ఇందులోవున్నాయి. ఒక్కమాటలో చెప్పాలంటే ఇదొకజబ్బు—ప్రేమజబ్బు. మూర్ఛవ్యాధి. ఈ వేశ్యల హృదయాల్లో స్వచ్ఛమైన ప్రేమలేదు. వాళ్ళ హృదయాలు కరుడు కట్టిపోతాయి. ప్రతిరోజూ అర్థంలేని ఒకేరకమైన మాటలు వారి నోటినుండి వెలువడుతుంటాయి. ఇలాంటి యాంత్రికమైన ప్రవృత్తిలో వాళ్ళకు ఏదో చురుక్కుమనే ప్రేమ కావాలి. అదే వాళ్ళు వాంఛిస్తారు. కామవికారం కలిగించే మాటలు చెపితే వారికి సరిపోదు. కామవికారాన్ని రేకెత్తించేపని కావాలి. కఠినమైన, విషాదకరమైన పని కావాలి. అంచేతనే ఈ స్త్రీలు విచిత్రమైన విటులను ప్రేమిస్తారు తెలుసా? వీరికి నచ్చేవాళ్ళు దొంగలు, ఖూనీకోర్లు, భటాచోర్లు, పచ్చిరక్తం తాగేవాళ్లు. ఇలాంటి విటులంటే వీరు పడిచస్తారు...కనుక ఈ పనికి నేను తగనివాణ్ణి."

ప్లాటొనోవ్ చెప్పింది విని లిఖోనిన్ ఇలా అడిగాడు.

"ఏమోనండీ! మీమాటలు నమ్మలేకుండా వున్నాను రోజులతరబడి రాత్రింబగళ్ళు ఇక్కడే గడుపుతూ, వేశ్యలను ముట్టుకోకుండా వుండటం సాధ్యమా? పైగా మీరు రచయితఅయినా అయితే, ఏదో నిర్లిప్తంగా పరిశోధనచేస్తున్నారని అనుకోవచ్చు."

"అవును. నేను రచయితనుకాదని చెప్పానుగా!"

"మరి ఇహ అలాంటప్పుడు, మీ రిక్కడ ఉండటంలో అర్థంలేదు. ఇష్టంలేకపోయినా, ఈ వెధవకొంపల్లోపడి పొర్లడం దేనికి? తాగుడు, జూదం, ద్వేషం, వ్యభిచారం మొదలైనవాటికి ఆలవాలమై, దుర్గంధ భూయిష్ఠమైన ఈ నరకంలో వుండడానికి కారణం ఏమిటో కనిపించడం లేదు. ఇక్కడ మీరు పరిశీలించేది ఏమిటో తెలీటంలేదు."

దీనికి ప్లాటొనోవ్ వెంటనే జవాబు చెప్పలేదు. మెల్లగా మధ్య మధ్య ఆగుతూ మాట్లాడసాగాడు.

"చూడండీ, మీరుఅడిగిన ప్రశ్నకు ఎలా సమాధానం చెప్పాల్సిందీ చేతకాకుండావుంది. వీరిజీవితంలో నన్ను ఆకర్షించిందీ, ఆసక్తి కలిగించిందీ ఏమిటంటే...... అబ్బ! ఎలా చెప్పను? ఏమని చెప్పను?......వీరి జీవితంలోని భయంకరమైన నగ్నసత్యం నన్ను ఆకర్షించింది. సత్యాన్ని దాచిపెట్టే ముసుగు లేదిక్కడ. అబద్ధం, ఆడంబరం, మోసం, డంబాచారం; ఇవి మచ్చుకైనా ఇక్కడ అగుపించవు. వంశపారంపర్యంగా వచ్చిన నిరంకుశాధికారంగాని లేక ప్రజాభిప్రాయంగాని, ఇవేవీకాక, ఎవరికివారు బుద్ధిపూర్వకంగా నిర్ణయించుకున్న అభిప్రాయంగాని వీరిలో పనిచేయదు. వీటితో సంబంధం లేని జీవితం వీరిది. వీరిబ్రతుకులో భ్రాంతి, పటాటోపం, ఇవేవీ లేవు. "నేనొకపడుపుకత్తెను. అందరికీ ఉపయోగమైన పాత్రను. నగరంలోని భోగాసక్తిని తీర్చడానికై భద్రంగా దాచిపెట్టబడిన వస్తువును నేను. రండి! కావల్సినవారంతా రండి! అనుభవించండి! సిద్ధంగా ఉన్నాను. ఎవరినీ కాదనను. మిమ్మలను తృప్తిపరచడమే నా విధి. ఎవరైతేయేం? అందరికీ ఆనందం పంచిపెడతాను. కాని ఒకవిషయం. మీరుపొందే ఈ క్షణికమైన ఆనందానికి ప్రతిఫలం నాకు ఏమి ఇవ్వాల్సివుంటుందో తెలుసా? డబ్బు, జబ్బు, అసహ్యం, అవమానం! ఇవిమాత్రం ఇచ్చిపోవాలి; అంతే." అంటుంది ప్రతిసాని. చూచారా? ఇక్కడవుండే ప్రతిప్రాణివెనుకా భయంకరమైన సత్యం, మానవజీవితానికి ప్రధానమైన సత్యం, స్వచ్ఛమైనసత్యం ప్రకాశించడం లేదూ?"

"ఏమోనబ్బా! ఈ వేశ్యలు పచ్చిఅబద్ధాలు ఆడతారు. ఏవేశ్యనైనా 'నిన్నుమొదట చెరిచింది ఎవ'రని అడగండి.........ఓ! దానిమీద ఆమె బ్రహ్మాండంగా కల్లబొల్లికథలు అల్లి చెపుతుంది"

"అవును, ఆ విషయం అడగకండి. దాంతో మీకేంపని? వాళ్ళ జీవితరహస్యాలతో మీకేమిటి అవసరం? వాటినిగురించి మీరు తెలుసుకోడానికి ప్రయత్నిస్తే, వాళ్ళు అబద్ధంఆడేమాట నిజమే. కాని వీరి అబద్ధాలు ఎలావుంటాయో తెలుసా? చంటివాళ్ళు అబద్ధంఆడినట్లుంటుంది. ప్రపంచంలో అబద్ధాలాడడంలో పసిపిల్లలది పెట్టినపేరని మీకు తెలుసు. వారిలాగా తీయగా, చమత్కారంగా అబద్ధాలు చెప్పేవారు మరెవరూ వుండరు. కాని చంటిపిల్లలలోవున్న నిజాయితీ, నిష్కాపట్యం భూమిమీద మరెక్కడైనా వుందీ? అలాగే వేశ్యలుకూడా! ఈ విషయంలో పసిపిల్లలకూ, పడుపుకత్తెలకూ తేడా ఏమాత్రం లేదు. ఇద్దరూ ఒకటే. వీరి అబద్ధాలలో చక్కని నీతీ, నిజాయితీ, అమాయకత్వం, అవ్యాజమైన ప్రేమ కనుపిస్తాయి. వీరి అబద్ధంలోనే నిజంవుంది. వీరి అబద్ధంలో అందం, ఆనందం వున్నాయి. మరోవిషయం. మనతోనే వీరిలా అసత్యాలు పలుకుతారు. వారిలోవారు చస్తే అబద్ధాలు చెప్పుకోరు. ఇక మనం ఉన్నాం చూడండి. మనబ్రతుకే ఒక అబద్ధం. నిత్యం అబద్ధాలతో ఒకరినొకరం మోసగించుకుంటూ నీచంగా కృత్రిమంగా కుట్రతో జీవిస్తున్నాం. అసలు వీరు ఈ అబద్ధాలు ఎందుకు ఆడతారనుకున్నారు? మనకోసం, మనం అలా కోరుతున్నాంకనుక. అబద్ధాలాడమని మనమే వీరిని ఉసికొల్పుతున్నాం. ఒత్తిడి చేస్తున్నాం"

"అదేమిటి? మనం వీరిని అబద్ధమాడమని అడుగుతున్నామా? అదెలాగా?"

"అదే చెపుతాను వినండి. ఆమె తన మొహానికి రంగు పులుముకుంటుంది దేనికి? మనకు అందంగా అగుపించాలకనుక. కాని ఈ రంగు ఒక్కొక్కసారి ఆమెమొహాన్ని పాడుచేయడమేకాకుండా, అనారోగ్యంకూడా తెచ్చిపెడుతుంది. ఇది తెలిసికూడా ఆమె మనకోసం ఇలాచేస్తోంది. ఆమెకోసం వచ్చేవాళ్ళు ఎవరు? మిలిటరీవాళ్లు, విద్యార్థులు, పనికిమాలిన గవర్నమెంటు గుమాస్తాలు, గర్భవతిగావున్న ఇల్లాండ్ర భర్తలు, పదిమంది బిడ్డల్ని కన్న తండ్రులు, వీరంతా ఇక్కడికొస్తారు. స్వచ్ఛమైనప్రేమ వీళ్ళకు అక్కర్లేదు. కేవలం కామవాంఛ తీర్చుకున్నంతమాత్రాన వీరు తృప్తిపడరు. ఈ నీచులందరికీ ఒక అందం కావాలి. ఒక తళుకు, కులుకు, వలపు ఇవన్నీ కావాలి. ఇలాంటి అందంలో ఒక ఆనందం కలుగుతుంది వాళ్ళకు. అంచేతనే

పాపం వేశ్య! ఎర్రగా, బుర్రగా, తళతళలాడే రంగులు అద్దుకుని, తక్కుతూ, తారుకూ దగ్గరకు వస్తుంది. ఇదొక కారణం.

"ఇహ రెండోది. ఆ వచ్చినవిటుడు అంతటితో ఊరుకోడు. అందం తోపాటు ప్రేమ కావాలంటాడు. అదీ ఎలాంటి ప్రేమ? గీతాల్లో, కావ్యాల్లో వర్ణించిన ప్రేమ. కామవాంఛలోని నిప్పుకణికెల్లాంటి ప్రేమ కావాలి అతనికి. "సరే, అదీ ఇస్తాను, ఆగండి" అంటుంది ఆమె. తన హావ భావాలలోనూ, మాటలలోను, చేష్టలలోనూ, నిట్టూర్పులలోనూ, మూల్గుళ్ళలోనూ—అన్నిట్లోనూ ఎక్కడాలేని ప్రేమ ఒలకపోస్తుంది ఆమె. తెచ్చిపెట్టుకుని నటిస్తుంది. ఆఖరుకు తన అవయవాలుకూడా అనేక భంగిమలలో ఆడిస్తూ, వాటికూడా ప్రేమవుందని చెపుతుంది ఆమె. అయితే ఈవిషయం ఆ వచ్చిన రసికుడికి తెలీదనుకుంటు న్నారా? తెలుసు. బాగా తెలుసు. ఆమె చూపే వలపంతా నిజమైన ప్రేమ కాదనీ, అంతా నటన అనీ, అతనికితెలుసు. అయినా ఏమీఅనడు. తన్ను తాను మోసంచేసుకుంటాడు. "నిజంగా! నేను అంతఅందంగా అగుపిస్తున్నానా? అవును, నేనంటే ఆడాళ్ళుపడిచస్తారు. నా సౌందర్యం ఆడాళ్ళను పిచ్చెక్కి స్తుంది. పద! నీవు అద్భుతమైన అమ్మాయివి!" అంటూ ఆమెను చేరతాడు. మరి ఈ అబద్ధానికి కారణం ఎవరంటారు? అతగాడేగా?

"ఇహ మూడోవిషయం. సరీగా ఇందాక మీరడిగిన ప్రశ్నే! వారి జీవిత రహస్యాల్నిగురించి అడిగితే, అబద్ధాలు చెప్తారని మీ రన్నారుకదూ, జవాబు చెప్తాను వినండి. ఆ వచ్చినవిటుడు ఆమెకులుపుతో సంతృప్తిపడి అంతటితో ఊరుకోవచ్చుగా! ఊహూ! ఆమెరహస్యాలు తెలుసుకోవాలని ప్రశ్నలు ప్రారంభిస్తాడు. "నిన్ను ఎవరుచెరిచారు? నీ విక్కడికి ఎలా వచ్చావు? మొగాడితో మొదటిసారి వున్నప్పుడు నీకెలావుంది?" ఇలాంటి దుర్మార్గమైన ప్రశ్నలు వేసి వేధిస్తాడు. ఈ ప్రశ్నలు అడగడానికి అతనికేం హక్కుంది చెప్పండి? పాపం! ఆమె అతన్నిగురించి ఏమీ అడగదే. అతని చెల్లెల్నిగురించి, అక్కల్నిగురించిగాని, భార్యల్నిగురించిగాని, వారి శీలాన్ని గురించిగాని ఆమె ప్రశ్నించదే. అలాంటప్పుడు అతని కెందుకు ఆమెవిష యాలలో జోక్యం? ఎందుకంటే అతను డబ్బిస్తున్నాడనేగా? అవును, పోలీ సులు, ప్రభుత్వం, డాక్టర్లు, తార్పుడుగాళ్ళు, సంఘం, అంతా అతనివెన

కాల అండగా నిలబడివుంది. అంచేత అతను ఏదైనా ఆడగొచ్చు. క్షణం సుఖంకోసం ఎలాగైనా వేధించవచ్చు. హు! "నీవిచ్చేడబ్బుకు ప్రేమ, వలపు, ఇవేకాకుండా నిజంగా కావాలటయ్యా? అయితే సరే. విను. కల్లబొల్లికథల్లి నమ్మిస్తాను విను" అనుకుంటుంది ఆమె. నిన్ను తృప్తిపరచడంకోసం అబద్ధాలు చెపుతుంది. అవునా? మరి, ఈకూడు అబద్ధాలకూ కారణం నీవా? ఆమెయా? ఇప్పుడు చెప్పు? నీవంటేనీవు కాదు. మీరంతా... మనమంతా...... ఇక్కడికి వస్తోన్న ఈ విటులంతా......చేస్తున్నపని ఇదేగా!"

అలా గంభీరంగా మాట్లాడి ప్లాటోనోవ్ బ్రాందీ త్రాగాడు; లిఖోనిన్ కూడా తాగాడు.

"క్షమించు లిఖోనిన్! నీకు విసుగు కలిగిస్తున్నానా? చాలాసేపు మాట్లాడానుకదూ?" అన్నాడు ప్లాటోనోవ్.

"ఫరవాలేదు చెప్పండి." అన్నాడు లిఖోనిన్.

"అవును. ఇహ అసలుప్రశ్న అలాగే వుండిపోయింది. ఇక్కడ నే నుండడానికి కారణం చెప్పలేదు. ఏంచెప్పను లిఖోనిన్? మానవుడు ఆనందం అనుభవించడంకోసం పుట్టాడు. ఈశ్వరదత్తమైన ఈ అనంత సృష్టిలో అతనే ఈశ్వరుడు. ప్రేమమూర్తి. ప్రకృతిలోని ప్రతివస్తువును స్వేచ్ఛగా, స్వచ్ఛంగా ప్రేమిస్తాడు. రాత్రింబగళ్ళు, సూర్యచంద్రులు, భూమి, ఆకాశం, చెట్లు, జంతువులు, తోటిమానవులు, సృష్టికి ఆధారమైన మాతృత్వం ఇవన్నీ తిలకిస్తాడు. ప్రతిదానితో ఒక అద్భుతం, ఒక పరమార్థం, ఒక వెలుగు అతనికి అగుపిస్తాయి. కాని అలాంటిమనిషి, అబద్ధంతో, మోసంతో, కుట్రతో, ద్వేషంతో జీవయాత్ర సాగిస్తున్నాడు. తన పతనాన్ని తానే సృష్టించుకుంటున్నాడు. ఓ! లిఖోనిన్! ఇదంతా నాకు అయోమయంగావుంది. ఈ ఆలోచనలతో అలసిపోయాను లిఖోనిన్!"

కొంచెంఆగి మళ్ళీ చెప్పసాగాడు ప్లాటోనోవ్.

ఏంచెప్పను లిఖోనిన్! నా జీవితం బహు చిత్రమైంది. పుట్టుతోనే కొన్ని విచిత్రమైన గుణాలతో పుట్టాను. జీవితాన్ని గాఢంగా, పిచ్చిగా ప్రేమించాను. చిన్నతనంనుంచీ అంతే. జీవితం తీయగా, దేవతలా అగుపించేది నాకు. జీవితంమీదవున్న ఈ వెర్రిప్రేమే నామనసును

అనేకవిషయాలపైఉసికొలిపింది. అనేకదోవలుపట్టించింది. నేను చేయనిపనంటూ లేదు. వడ్రంగం, కమ్మరంపనులు చేశాను. అచ్చాఫీసులో పనివాడుగా వున్నాను. పొగాకుపండించి దాంతో వర్తకంచేశాను. స్టీమరులో బొగ్గు వేసేవాడుగా పనిచేస్తూ సముద్రాలమీద ప్రయాణం చేశాను. నల్లసముద్రంలో చేపలు పట్టే బెస్తవాడుగా జీవించాను. "నీపర్" నదిలో పడవలపైన, పండూ ఫలాలు, ఇటుకలు, ఇతరసామానులు ఎగుమతిచేస్తూ బ్రతికాను. ఒకసర్కస్ కంపెనీవెంట దేశదేశాలు తిరిగాను. ఒకప్పుడు నేను యాక్టర్‌నుకూడా. రంగస్థలంపై రంగుపూసి అనేక వేషాలువేసి నటించాను. లిఖానిన్! ఇంకా ఎన్నో పనులుచేశాను. నాకు గుర్తులేదుకూడా. ఇవన్నీ చేయడం దేనికనుకున్నారు? తిండికిలేక కాదు. దారిద్ర్యంవల్లకాదు. జీవితంమీదవుండే తీపి, ఆకాంక్ష, గాఢమైనప్రేమ, అంతులేని పిపాస నన్నిలా లాక్కొనిపోయాయి. నిజం చెపుతున్నాను. నేను ఏచెట్టునో, చేపనో పుట్టనో, పురుగునో అయిపోయి కొంతకాలం జీవించమంటేకూడా నేనెంతో ఇష్టపడతాను. నేనొక స్త్రీగా మారిపోయి, పిల్లల్నికంటే ఎంతో బాగుంటుందని కూడా అనుకునేవాణ్ణి. ప్రపంచంలోవున్న ప్రతిప్రాణిలోను ప్రవేశించి, ఆయాప్రాణుల అంతర్జీవితాన్ని పరిశోధించాలని నా ఆరాటం. నా కళ్ళతో ప్రతిజీవిని పరిశీలించి ఆయాజీవుల బాహ్య జీవితాన్ని తెలుసుకోవాలని నా ఆకాంక్ష. ఆ ఉద్దేశ్యంతోనే ప్రతిపట్టణం చూశాను. ప్రతిచోటూ పరిశీలిస్తూ స్వేచ్ఛగా తిరిగాను. విధి నన్ను ఎక్కడికితీసుకువెడితే అక్కడికల్లా వెళ్ళాను. ఇప్పుడీ సానివాడలో ప్రవేశించాను......ఇక్కడ జీవితాన్ని చూస్తోన్నకొద్దీ నాలో కల్లోలం ఎక్కువౌతోంది...ఇక్కడి జీవితంకూడా కొద్దిరోజులలో అయిపోతుంది...తరువాత ఒక స్నేహితుడిదగ్గరికి వెళదామనుకుంటున్నాను...అతను ఒక మిల్లులో పనిచేస్తున్నాడు. నాకేదైనా ఉద్యోగం ఇప్పిస్తాడు."

ప్లాటొనోవ్ సంభాషణ పూర్తిచేసేసరికి ఎదురుగావున్నగదిలో యాక్టర్ ఎగ్మాంట్, ప్రొఫెసర్ యార్చెంకో, మరికొందరు వేశ్యలు వున్నారు. ఎగ్మాంట్ అప్పటివరకూ అనేక వేషాలువేసి నటించాడు. అతనికి తాగుడు పూర్తిగా తలకెక్కింది. కళ్ళకు మైకం కమ్మింది. నిలుచోలేకపోతున్నాడు. ఆతని కంఠస్వరం గాద్గదికమైపోయింది.

'నేను అద్భుతంగా నటించలేదూ? పూర్వం నా నటనచూచి ప్రజలు మూర్ఛపోయేవారు... కాని అదెప్పటిమాటో......ఇప్పుడో......అంతా పోయింది. అయినా నేను గొప్పనటుణ్ణి...ఏదీ యూర్చెంకో! నిన్నొకసారి ముద్దుపెట్టుకోనీయి' అంటూ అతను ప్రొఫెసరును ముద్దుపెట్టుకోబోయాడు. అతని అవయవాలు స్వాధీనంతప్పుతున్నాయి.

"నేను మూర్ఖుణ్ణి, మీరంతా మంచివాళ్ళు, గొప్పవాళ్ళు. నేను తాగాను...నేను అమ్ముడుపోయాను. ఈ మురికికూపంలో ఒక పశువులా పడివున్నాను ... ఓ! నాభార్య...దేవత...మహాపతివ్రత...అందమైన పిల్ల...గుడ్డలకొట్లో పనిచేస్తోంది...గుడ్డలుకుడుతోంటే ఆమె మృదువైన వేళ్ళు రక్తమయమైపోతాయి...ఎంత మంచి ఇల్లాలు! నేనో...ఒక స్కౌండ్రల్‌ను! ప్రొఫెసరుగారూ! నన్ను ముద్దుపెట్టుకోనివ్వరూ? మీరొక్కరే నన్ను అర్థంచేసుకోగలరు. రండి, మిమ్మల్ని నా భార్యను పరిచయంచేస్తాను. ఆమె ఎలాంటిదో, మీకే అర్థమవుతుంది. నిజంగా ఆమె దేవత...రాత్రిళ్లు నిద్రపోకుండా నాకోసం ఎదురుచూస్తూవుంటుంది. దేవుడిఎదుట ప్రార్థనలు చేస్తుంది. 'ప్రభూ! నాభర్తను కాపాడు' అంటూ మొరపెట్టుకుంటుంది. ఆమె మహా ఇల్లాలు!" అంటూ ఎగ్మాంట్ పసివాడిలా ఏడ్చాడు.

'ఛీ! ఇహ ఊరుకో! పెళ్ళాంమట. మహా పతివ్రత అట!' అంది తప్ప తాగివున్న చిన్నమంకా. 'ఆమె దైవప్రార్థనలు చేస్తున్నదట. అంతా అబద్ధం. ఆమెచేసేదేమిటో నేను చెప్తాను విను. మిండగాణ్ణి పక్కన పడుకోబెట్టుకుని హాయిగా నిద్రపోతోంది' అంది ఆమె తిరిగి కోపంగా.

"కోస్త్రంయ్! లంజ!" అరిచాడు ఎగ్మాంట్. అతనికళ్ళు ఎర్రగా చింతనిప్పుల్లా వున్నాయి. ఒక ఖాళీసీసా తీసుకుని మంకాను కొట్టాలని పైకెత్తాడు. 'ఎవరూ నాకు అడ్డురాకండి, దీనితల ముక్కలు ముక్కలు చేస్తాను. సిగ్గులేనిముండ! నా భార్యను అంతమాట అనడానికి నీకు నోరు ఎలావచ్చిందే? లంజవి నీవూ నాకు నీతులు చెప్పొచ్చావుటే' అంటూ అరిచాడు మళ్ళీ ఎగ్మాంట్. కాని మంకా ఆగలేదు. బాగా తాగివుంది. మత్తులో వళ్ళు తెలియడంలేదు. 'పోరా వెధవా! నీవు చెప్పొచ్చావా? హు! సానికొంపల్లో పడిపొర్లే నీబోటి చవటవెధవకు మంచిభార్యకూడానా? ఏ ఇల్లాలు నీతో సంసారంచేస్తుంది? నీబుద్ధే ఆమెకూడా పట్టుబడుతుంది.

పైగా నామీద పళ్ళుకొరుకుతున్నావా? నిన్నుచూచి భయపడతాననుకున్నావేమో? నీబోటి బడుద్ధాయిలను సవాలక్షమందిని చూచాను. హు! నీవే లంజకొడుకువు!' అంటూ అరిచింది మంకా.

ఆ ఇద్దరినీ సర్దుబాటుచేసేసరికి యార్చెంకోకు తలప్రాణం తోకకు వచ్చింది. బ్రాందీయే ఇంతపని చేసిందని అతను గ్రహించి, ఇద్దర్ని సర్ది తగాదా చల్లార్చాడు. ఎగ్మాంట్ కిందపడి పసివాడిలా పెద్దగా ఏడ్వడం మొదలెట్టాడు: పాపం! అతను చాలా బలహీనమైపోయాడు. అప్పుడు హెన్రీటా వచ్చి అతన్ని మెల్లగా తన గదిలోకి తీసుకెళ్ళింది. అంతా అలసిపోయారు. విద్యార్థులుకూడా తమ తమ పడకగదుల్లోంచి బయటికొచ్చారు. వారిమొహాలు చూస్తే, ఏదో జబ్బుమనుషుల్లా అగుపిస్తున్నారు. ఆడాళ్ళు, మగాళ్ళుకూడా తూలుతూ, తేలుతూ నడుస్తున్నారు. ఒకరితో ఒకరు వీడ్కోలు చెప్పుకుని వెళ్ళిపోతున్నారు.

ప్లాటొనోవ్‌కూడా లేచాడు. అదిచూచి లిఖోనిన్ మెల్లగా అడిగాడు. 'మీరిప్పుడు ఎక్కడికి వెడతారు?'

"సరిగా చెప్పలేను. 'ఇసకా'గదిలోకి వెళ్ళి పడుకోవాలనివుంది. కాని ఇప్పుడు పడుకుంటే ఉదయాన్నే లేవలేను. బంగారంలాంటి ప్రాతఃకాలాన్ని వృథాచేయడం నాకిష్టంలేదు. అంచేత స్నానంచేసి, పడవమీద నది అవతలికి వెళ్ళాలనుకుంటున్నాను. అక్కడొక స్నేహితుణ్ణి కలుసుకోవాలి. ఏం? ఎందుకు?" అనడిగాడు ప్లాటొనోవ్.

"అందరూ వెళ్ళిపోయింతరువాత కొంతసేపు మీతో ఏకాంతంగా గడపాలనుకుంటున్నాను. ఒకముఖ్య విషయాన్ని గురించి మీతో కాస్త మాట్లాడాలనివుంది." అన్నాడు లిఖోనిన్.

"సరే. అలాగే చేద్దాం."

అందరికన్నా వెనక యార్చెంకో వెళ్ళిపోయాడు. తలనొప్పిగాను, అలసటగాను వుందని చెప్పాడు. కాని అతను బయటికి వెళ్ళగానే, ప్లాటొనోవ్ లిఖోనిన్ చేయిపుచ్చుకుని కిటికీ దగ్గరకు తీసుకెళ్ళాడు. "చూడండి! మీ ప్రొఫెసర్ ఎక్కడికి వెడతాడో!" అన్నాడు ప్లాటొనోవ్.

యార్చెంకో అన్నా ఇంట్లోంచి బయటికివచ్చి, సరాసరి ట్రెప్పెల్సు భవనంముందుకెళ్ళి తలుపుతట్టాడు. కిటికీలోంచి చూస్తోంటే లిఖోనిన్‌కు

స్పష్టంగా అగుపించింది. ప్రొఫెసరుకూడా అలా చేస్తాడని అతను అనుకో లేదు. అంచేత ఆశ్చర్యపోయాడు.

"మీరెలా కనిపెట్టారీవిషయం?" అన్నాడు లిఖోనిన్ నివ్వెరపోతూ.

"అవును. అది చాలా సులభం. మనుషులసంగతి నాకు బాగా తెలుసు. అతనిమొహం నేను కనిపెడుతూనే ఉన్నాను. ఆ పెద్దమనిషి కూచున్నంత సేపూ ఏంచేశాడో తెలుసా? 'వేరా' కాళ్ళను, తనకాళ్ళతో గీరడం మొదలెట్టాడు" అన్నాడు ప్లాటొనోవ్.

"సరే. మనం అవతలిగదిలోకి వెళదాం రండి. కొంచెం మాట్లాడాలి" అంటూ ప్లాటొనోవ్‌ను పిలుచుకుపోయాడు లిఖోనిన్.

# 12

లిఖోనిన్, ప్లాటొనోవ్ ఇద్దరూకలిసి రహస్య సమాలోచనలు జరిపే ప్రత్యేకమైన గదిలోకి వెళ్లారు. అప్పటికి ఆగదిలో ఇద్దరుఅమ్మాయిలుమాత్రం మిగిలిపోయారు. ఒకామె జెన్నీ. అప్పుడే అవతలనుంచి వచ్చింది. పడుకునేటప్పుడు వేసుకునే జాకెట్టు తొడుక్కుంది. ఇక రెండో అమ్మాయి 'ల్యూబా' పడకకుర్చీలోపడుకుని గాఢంగా నిద్రపోతోంది. ఆమెమొహంలో ఏదో అమాయకత్వం అగుపిస్తోంది. పెదవులపై ప్రశాంతమైన చిరునవ్వు ప్రకాశిస్తోంది. గదిఅంతా సిగరెట్లపొగతోను, కొవ్వొత్తులు కాలి, కరిగి జారిన బొట్లతోను వాసనకొడుతోంది. టేబుల్ మీద ఒలికిపోయిన కాఫీ, బ్రాందీ మరకలుకట్టి ఉన్నాయి. నారింజలు, మొదలైన పండ్లు వలిచి తినిపారేసిన తొక్కలు పడివున్నాయి. గదిఅంతా చూడ్డానికి చాలా అసహ్యంగా వుంది.

ఓమూలవున్న సోఫామీద జెన్నీ కాళ్ళుముడుచుకుని కూచుని వుంది. ప్లాటొనోవ్ కుర్చీమీదకూచుంటూ ఉజ్వలంగా ప్రకాశిస్తోన్న జెన్నీ కళ్ళల్లోకి ఒక క్షణం చూచాడు.

"ఈ కొవ్వొత్తులు ఆర్పేయనా?" అన్నాడు లిఖోనిన్. ఆర్పేయమన్నట్లు తల ఊపాడు ప్లాటొనోవ్. లిఖోనిన్ కొవ్వొత్తులను ఆర్పేశాడు. వాటినుంచి సన్నని పొగలు గిరలుగిరలుగా పైకిపోయి మాయమైనాయి.

తెల్లవారడానికి ఆట్టే వ్యవధిలేదు. మెల్లగా మందమందంగా వ్యాపిస్తోన్న ఉదయకాంతులు, తలుపుల సందులలోంచి, కిటికీ పగుళ్ళలోంచి గదిలో ప్రవేశిస్తున్నాయి. తడిగాలివల్ల గదిలో తేమగావుంది.

"ఇప్పుడు బాగుంది" అన్నాడు లిఖోనిన్. కొవ్వొత్తులు ఆర్పేసి కుర్చీలో కూచుంటూ "మీతో మాట్లాడడం త్వరగానే ముగిస్తానులెండి. మీకు ఎక్కువ శ్రమ కలిగించను—కాని ఎలా ప్రారంభించాలా అని ఆలోచిస్తున్నాను" అన్నాడు మళ్ళీ లిఖోనిన్. అలా అంటూ అతను జెన్నీ వంక ఒకసారి చూచాడు.

జెన్నీ వెంటనే గ్రహించింది.

"నేనుంటే మీ సంభాషణకు ఆటంకమేమో! వెళ్ళమంటారా?" అన్నది ఆమె.

"ఫరవాలేదు కూచో" అన్నాడు రిపోర్టరు ఆమెతో.

"ఆమె మనమాటలకు అడ్డురాదులెండి. అయినా మీరు మాట్లాడేది వ్యభిచారాన్నిగురించే అనుకుంటాను" అన్నాడు మళ్ళీ.

"అవును...ఒకవిధంగా అదే".

"అయితే మరీమంచిది. జెన్నీకూడా మన సంభాషణకు సహకారిగా వుంటుంది. చూచారూ? ఆమెకు మనుషులమీద మంచి అభిప్రాయంలేదు. వారిని ద్వేషిస్తుంది. కాని ఒక్కొక్కసారి అద్భుతంగా మాట్లాడుతుంది. అమూల్యమైన సలహాలు ఇస్తుంది" అన్నాడు ప్లాటొనోవ్. లిఖోనిన్ తన రెండుచేతులతో గట్టిగా మొహాన్ని రుద్దుకున్నాడు. రెండుసార్లు వేళ్ళు విరుచుకున్నాడు. వ్యధపడుతూ ఏదో చెప్పడానికి ప్రయత్నిస్తూ మళ్ళీ చెప్పలేక బాధపడుతున్నాడు.

ఉన్నట్లుండి తీవ్రంగా అడిగాడు "ఎలాగైతేనేంలెండి. ఇదేమంత పెద్దవిషయంకాదు. చెప్తాను వినండి; ఇవాళ మీరు 'ఈ వేశ్యలనుగురించి మాట్లాడారు...నేను విన్నాను...కాని మీరు చెప్పిందాట్లో కొత్తసంగతి నాకేమీ కనిపించలేదు...హాయిగా గడుస్తోన్న నా జీవితంలో తొలిసారిగా ఇవాళ ఈ ప్రశ్న కళ్ళారా చూడగలుగుతున్నాను. చెప్పండి, ఈ పడుపు వృత్తి ఏమిటి? ఎందుకొచ్చింది? దీనికి అంతువుందా? ఉంటే ఎప్పుడు? ప్రతి నగరంలో విచిత్రంగా వృద్ధిపొందిన వెర్రితనమా ఇది? లేక తరతరాలచరిత్ర

నుండి స్వతహాగా వస్తోన్న సత్యమా ఇది? దీనికి అంతేసూ లేదా? లేక మాన వులు అంతిమైనప్పుడే ఇదీ నశిస్తుందా? ఎవరు చెపుతారు దీనికి సమాధానం?

అతని ప్రశ్నలుదిని ప్లాటొనోవ్, అతనివంక తేరిపార చూచాడు. ఈ విషయాన్ని గురించి లిఖోనిన్ ఆత్మలో ఇంతగా ఆవేదన బయలుదేర డానికి కారణం ఏమిటాఅని ఆశ్చర్యపోయాడు.

"వ్యభిచారం ఎప్పుడు నశిస్తుందో ఎవరూ చెప్పలేరు! సోషలిస్టులు, కమ్యూనిస్టులు అద్భుతమైన కలలుకంటున్నారు. స్వర్గాన్ని నిర్మిస్తామంటు న్నారు! బహుశా వారికలలు నిజమైననాడు ఈ వ్యభిచారం అంతం కావచ్చు. ఈ ప్రపంచం ఏ ఒకరిదిమాత్రమే కాక, అందరూ సమానహక్కులతో అనుభ వించినప్పుడుకూడా ఇది అంతంకావచ్చు. లేక ప్రేమఅనేది అందరికీ, కోరికల ప్రమాణాన్నిబట్టి స్వేచ్ఛగా దొరికినప్పుడూ నశించవచ్చు. లేక దివి భువి మీదికి దిగివచ్చి, లోకమంతా స్వర్గతుల్యమైనప్పుడు, నీవూ నేనూ అనేభేదం లేకుండా, విశ్వమానవకోటి ఏకకుటుంబమై మనగలిగినపుడు, మానవుడు యోగియై, మహర్షియై, దిగంబరుడై, పాపరహితుడై, పవిత్రుడైనప్పుడు ఈ వ్యభిచారం నాశనమైపోవచ్చు." అని జవాబుచెప్పాడు ప్లాటొనోవ్.

"కాని ఇప్పుడో?... ఇప్పుడు మనం ఏమీ చేయలేమా?" లిఖోనిన్ ఆసక్తితో అడిగాడు. "అంతవరకూ మనం చేతులుముడుచుకుని కూచోవల సిందేనా? మనపని కానట్లు, మనకు సంబంధంలేనటు ఊరుకోవలసిందేనా? ఇదొక అనివార్యమైన చెడుగు అనుకుని భరించాల్సిందేనా? దీన్ని ఒప్పుకుని ఆశీర్వదిస్తూ సహించాల్సిందేనా? తరుణోపాయమే లేదా ప్లాటొనోవ్? చెప్పరేం?"

"లేదు లిఖోనిన్! మనం చేయగలిగింది ఏమీలేదు." ప్రశాంతంగా చెప్పాడు రిపోర్టరు. "స్వంతఆస్తులు ఉన్నంతవరకూ దారిద్ర్యంకూడా వుంటుంది. అలాగే వైవాహిక వ్యవస్థ వున్నంతవరకూ 'వ్యభిచారంకూడా వుంటుంది. ఈ దుర్మార్గాన్ని ఎవరు ప్రోత్సహిస్తున్నారో నీకు తెలుసా? నిత్యం మనమధ్య తిరుగుతూ మనచేత గొప్పవారనిపించుకునే ఆ పెద్దమను షులే. నీతులువల్లిస్తూ మర్యాదస్తులుగా వ్యవహరిస్తున్న సంసారులు, కుటుంబ పెద్దలు, తండ్రులు, కొడుకులు, భర్తలు వీరంతా ఈవృత్తిని దొంగచాటుగా నిలబడి పోషిస్తున్నారు. ఈ వృత్తి సక్రమం గాను, చట్టబద్ధంగాను నడిచేలా

నిత్యం చూస్తూవుంటారు. అందుకువీలుగా చట్టాలు, అధికారాలు హస్తగతం చేసుకుని దీన్ని నడిపిస్తూవుంటారు. వీరు ఇలా చేయకపోతే ఏంజరుగుతుందో తెలుసా? ఈ పశుప్రవృత్తి వీరి పడకగదుల్లోనే ప్రవేశించి, ఒక్కసారిగా ఇల్లంతా అల్లుకుని దుర్గంధం బయటపడుతుంది. ఈ భయంవల్లనే వీరు ఇలా చేస్తుంటారు. ఇంట్లోమాత్రం రహస్యంగా ఈ వ్యాపారం సాగుతూనేవుంటుంది. పదిమంది బిడ్డల్నికన్న తండ్రికూడా సిగ్గులేకుండా ఇంట్లోపనిమనిషితో ఏడుస్తుంటాడు. మరికొందరు తమభార్యల స్నేహితురాండ్రను మచ్చికచేసుకుని మెదులుతూవుంటారు. ఈ గొప్పవారిళ్ళన్నీ ఈవిధమైన కుళ్ళుతో మురుగుతూ వుంటాయి. పైకిమాత్రం పెద్దమనుషుల్లా నీతులు చెప్పతుంటారు. వ్యభిచారం పనికిరాదని ఉపన్యాసాలు ఇస్తారు. పతితలను ఉద్ధరించడానికి ఒక సంఘంకూడా పెట్టి, దానికి పెద్దగా వ్యవరిస్తూవుంటారు."

"అవును, ఈవిషయాలు నాకూ తెలుసు. కాని ఇలాంటిఅవినీతిని ఎలా అరికట్టడం? ఇదొక బడబాగ్ని. దేశాన్ని, మానవజాతినీ దహించివేస్తోంది. దీన్ని చల్లార్చే మార్గంకావాలి? అదే నాప్రశ్న!" అన్నాడు లిఖోనిన్.

"నిజమేకాని, ఒకమనిషి ఏం చేయగలడు? ఒకమనిషివెళ్ళి దోసెడు నీళ్ళుపోస్తే ఈ బడబానలం చల్లారుతుందా?

"చల్లారదు. కాని ఎవరు చెప్పగలరు?......ఒక నిప్పుకణికైనా చల్లారవచ్చు......అలాగే నేనూ ఒక పతితురాలి బ్రతుకునైనా బాగుచేయవచ్చుగా! ఒక్క పశుప్రకృతినైనా ఉద్ధరించవచ్చుగా! అదే ప్లాటొనోవ్! నాఉద్దేశ్యం అదే. ఈ విషయమే మీతో చెప్పదామనుకున్నది. మిమ్మల్ని వేడుకుంటున్నాను ప్లాటొనోవ్! నన్ను నిరుత్సాహపర్చకండి. నాకు చేయూతనివ్వండి" అన్నాడు లిఖోనిన్ ఉద్రేకంగా.

"అయితే ఒక అమ్మాయిని ఇక్కణ్ణుంచి తీసుకుపోవాలనుకుంటున్నావు అంతేనా? ఆ పిల్లను రక్షిస్తానంటావు, అవునా?" అనడిగాడు ప్లాటొనోవ్, అతని మొహంలోకి సూటిగా చూస్తూ.

లిఖోనిన్ తనతో మాట్లాడాలనుకున్న విషయం ఏమిటో, ప్లాటొనోవ్కు ఇప్పుడు పూర్తిగా అర్థమైంది.

'అవును...శాయశక్తులా ప్రయత్నించి చూస్తాను...సాధ్యంకాకపోతుందా?' అన్నాడు ఆ విద్యార్థి.

"కాని ఆ అమ్మాయి నీదగ్గర్నుంచి మళ్లీ ఈ మురికికూపంలోకి రావాల్సివుంటుంది"

"అవును, తప్పదు, వచ్చితీరుతుంది" అంది జెన్నీ దృఢనిశ్చయంతో.

"లిఖోనిన్ గభాలున లేచి జెన్నీ దగ్గరకు వెళ్ళాడు. ఆమె రెండు చేతులూ పట్టుకున్నాడు. ఉద్రేకంకొద్దీ అతని కంఠస్వరం వణుకుతోంది.

"జెనీచ్కా!...ఏమంటావు? అపార్థంచేసుకోకు. నా ప్రియురాలిగా కాదు. నిన్ను నా సోదరిగా, స్నేహితురాలిగా చూచుకుంటాను...ఓ ఆరు నెలలపాటు చూద్దాం. ఏం జరుగుతుందో... తరువాత ఏదో పని చేసుకుం దువుగాని... లేదా మనిద్దరం కలిసి చదువుకుందాం" అన్నాడు లిఖోనిన్.

జెన్నీకి కోపంవచ్చింది. అతనిచేతులు విదిలించేసింది.

"హు! మిమ్మల్ని బాగా ఎరుగుదును నేను. మనుషులంటే ఏమిటో, ఎలాంటివాళ్ళో నాకు బాగా తెలుసు! నీకు బూట్లు తొడగమంటావు, వంట చేసిపెట్టమంటావు. లాంతర్లు తుడిచి ముట్టించమంటావు. నీవు రాత్రింబగళ్ళు కులాసాగా స్నేహితులతో తిరుగుతూవుంటే నన్ను నీగదికి కాపలా కాచో మంటావు. నీవువచ్చేసరికి అన్నీ సిద్ధంచేసిపెట్టి దాసీలా పనిచేయమంటావు. ఆ తరువాత నీవు చదువుపూర్తిచేసుకొని ఏ డాక్టరువో, ప్లీడరువో, లేక గవర్నమెంటు ఆఫీసరువో అయిపోతావు. అప్పుడు నేను నీకు అక్కర్లేదు. నన్ను మెడపట్టి గెంటేస్తావు. 'పోవే లంజా! వీధివెంటపడితిరుగు. నీ వెందుకు నాదగ్గర? నీవల్ల నాజీవితం పాడయిపోయింది. నా పరువుప్రతిష్ఠలు మంటకలిశాయి. జాతి, నీతి, కులం, గోత్రం, పరువు, ప్రతిష్ఠకల ఓ చక్కని అమ్మాయిని వెదికి పెళ్ళిచేసుకుంటాను' అంటావు నీవు; అవునా?" అంది జెన్నీ క్రోధంగా.

"లేదు జెన్నీ, నిన్ను వదిలిపెట్టను. అలాంటిపని ఎన్నడూ చేయను. నిన్ను నా సోదరిలా చూచుకుంటాను..." అన్నాడు మళ్లీ లిఖోనిన్ కొంచెం కంగారుపడుతూ.

"నాకు తెలుసు...సోదరి...ఈ అభిప్రాయం మొదటిరాత్రిమాత్రం వుంటుంది. మరునాటినుంచీ ప్రేమకలాపాలు ప్రారంభిస్తావు. నన్ను నీ ఉంపుడుకత్తెగా చేసుకుంటావు...ఛీ! ఇలాంటి పిచ్చివాగుడు నాదగ్గర వాగకు...తలనొప్పి" అంది మళ్ళీ జెన్నీ చీదరింపుగా.

“ఏం లిఖోనిన్? ఇప్పుడేమంటావు? ఎలాగైనా ఈ కార్యభారాన్ని నీవు నిర్వహించలేవు. నాకు తెలుసు. నేను చాలమందిని చూచాను. మొదట్లో అంతా నీలాగే ఆదర్శాలు చెప్తారు. ఆచరణలోకి వచ్చేసరికి దెబ్బతింటారు. పీపుల్స్ పార్టీలో చాలమంది సభ్యులను నే నెరుగుదును. ఆదర్శంకోసం వాళ్ళు చదువురాని రైతుబిడ్డల్ని పెళ్ళిచేసుకున్నారు. కాని తరువాత వారితో సంసారం నెగ్గతీయలేక దెబ్బతిన్నారు. ఆ ఇల్లాండ్రుకూడా చెడిపోయి పనివాళ్ళతో, బంట్రోతులతో రహస్యవర్తనం సాగించారు. ఇప్పుడు నీ వ్యవహారంకూడా అలాగే అవుతుంది. నీవు చెడిపోవడమే కాకుండా ఆ పిల్ల జీవితాన్నికూడా మరీ పాడుచేస్తావు” అన్నాడు ప్లాటొనోవ్.

కొద్దిక్షణాలు ఆ ముగ్గురూ మాట్లాడకుండా మౌనంగా వున్నారు. లిఖోనిన్ మొహాన చెమటలు పోశాయి. కళావిహీనమైంది. జేబురుమాలుతో చెమట తుడుచుకున్నాడు.

“నో. మీ అభిప్రాయాలు నే నంగీకరించను. మీరు చెప్పినట్లు జరుగుతుందని నాకు నమ్మకంలేదు. మీమాటలతో నాకు పనిలేదుకూడా,” అంటూ ‘ల్యూబా’ అని పిలిచాడు లిఖోనిన్ పెద్దగా.

నిద్రపోతున్న ల్యూబా మేల్కొంది. చేత్తో పెదవులు తుడుచుకుంది. ఆవులించింది. ఓ చిరునవ్వు నవ్వింది. “నేను నిద్రపోవడంలేదు. అంతా వింటూనే వున్నాను. కళ్ళు మూరుకుపోతుంటే పడుకున్నాను. అంతే’ అంది ల్యూబా.

‘ల్యూబా. నీవైనా చెప్పు. నాతో రావడం నీ కిష్టమేనా? ఇది నీజీవితంలో మంచికోసం వచ్చినమార్పు. మళ్ళీ ఈ సానికొంపలో అడుగు పెట్టొద్దు. ఏమంటావు?” అడిగాడు లిఖోనిన్ ఆమె చెయ్యిపట్టుకుని.

అదివిని ల్యూబా కొంచెం కలవరపడింది. ‘దీనిభావమేమి’ అన్నట్లు జెన్నీ వంక చూచింది తరువాత ఇలాఅంది. “నీ వింకా విద్యార్థివి. చదువుకుంటున్నావు. ఓ ఆడపిల్లను తీసుకెళ్ళి ఎలా ఉంచుకోగలవు?”

“నా అభిప్రాయం అదికాదు ల్యూబా! నీకు సహాయం చేస్తాను. నీ జీవితం ఇక్కడ దుర్భరంగాలేదూ? బాగుచేస్తాను”

“అవును. ఇక్కడ బ్రతుకు దుర్భరంగా వుండక తీయగావుంటుందా?

నేను జెన్నీ మాదిరి ధైర్యశాలినికాను. పాపామాదిరి అందకత్తెనుకాను. అంచేత నాకిక్కడ బ్రతుకు మరీ సంకటంగావుంది."

"అయితే ఇంకేం? నాతో వచ్చేయ్. నీకు కుట్టుపనీ అదీ వచ్చుకదూ"

"ఊహూ! నాకలాంటివి ఏమీరావు. ఓర్రె తుబిడ్డకు ఏం తెలుసో నాకూ అంతే తెలుసు. కొస్త వంటచేసి పెట్టగలను. ఇదివరకు ఒకమతగురువు దగ్గర వంటమనిషిగా పనిచేశాను" అంది ల్యూబా సిగ్గుతో నవ్వుతూ. పనేమీ రాదని చెప్పడానికి ఆమె బిడియపడింది. నోటికి చేయి అడ్డంపెట్టుకుంది.

"అద్భుతం! అంతకన్నా ఏంకావాలి? వంటచేయడం వచ్చు అన్నావుగా? మన మొక చిన్న హోటలు పెడదాం. నేనూ స్టూడెంట్సు అందరికీ ఈవిషయంచెప్పి ప్రచారం చేస్తాను. విద్యార్థులంతా మనహోటలుకే వచ్చి భోంచేస్తారు. నీవూ నేనూ హాయిగా జీవించవచ్చు." అన్నాడు మళ్ళీ లిఖోనిన్ సంతోషంగా.

'పోదురూ! నాతో ఎందుకు ఈ వేళాకోళాలు? అంది ల్యూబా.

అతనిమాటలు ఆమె నమ్మలేదు. తమాషాగా అంటున్నాడనుకుంది. మళ్ళీ ప్రశ్నార్థకంగా జెన్నీవైపు చూచింది.

"ఎగతాళికాదు ల్యూబా! అతను నిజంగానే చెపుతున్నాడు." అంది జెన్నీ వణుకుతున్న స్వరంతో.

"నిజం చెపుతున్నాను ల్యూబా! మాట తప్పను. దేవుడిమీద ప్రమాణంచేసి చెపుతున్నాను." అన్నాడు లిఖోనిన్.

ఇప్పుడు జెన్నీకికూడా అతనిమాటమీద కొస్త నమ్మకం కలిగింది.

'అయితేమంచిదే. ల్యూబాను నీతో తీసుకెళ్ళు. అది నాలాంటిదికాదు. నేను ఆరితేరిన సర్కస్‌గుర్రింవంటిదాన్ని. కొరడాలు, కళ్లాలు నాముందు పనిచేయవు. నన్ను మార్చలేవు. ల్యూబా అతిసామాన్యమైనపిల్ల. మామూలుగా ఈ మురికిజీవితానికి ఇంకా అలవాటుపడ్డేదు. మాట్లాడవేమే మొద్దూ? అలా గుడ్లు మిటకరించుకుని నావైపు చూస్తావేం? ఆయన నిన్నే అడుగుతున్నాడు. ఏం చెపుతావో చెప్పు. ఆయనతో వెడతావా? లేదా?' అన్నది జెన్నీ.

'ఉవుహ......నీ సలహా ఏమిటో చెప్పు జెనీచ్కా!' అనడిగింది తిరిగీ ల్యూబా అమాయకంగా.

'ఓసి మొద్దూ!' జెన్నీకి కోపం వచ్చింది. 'నా సలహా ఏమిటే? నీ జీవితం నీకు తెలియడంలేదూ? ఈ నరకంలో కొట్టుకుని కొట్టుకుని చివరకు కన్నో కాలో పోతుంది. లేకపోతే ఏ గోడకిందనో దిక్కులేని కుక్క చావు చస్తావు. ఇదీ ఇక్కడి జీవితం. మరి ఇది మార్చుకోవడం మంచిదా కాదా? నీకు గౌరవంగా బ్రతకాలని లేదూ? ఇలా అడిగినందుకు అతనికి కృతజ్ఞత తెలుపుకో. గాడిదలా నోరు మూసుకుని అతని వెంట వెళ్ళు.

అమాయకురాలైన ల్యూబా, మెల్లగా లేచి లిఖోనిన్ దగ్గరకి వెళ్ళింది అతనిచేయి తీసుకుని ముద్దుపెట్టుకుంది.

'ఇప్పుడు నాకెంతో సంతోషంగావుంది ల్యూబా! సరాసరి వెళ్ళి యజమానురాలితో చెప్పు. ఇక్కణ్ణుంచి వెళ్ళిపోతున్నానని చెప్పు. నీకు అత్యవసరమైన వస్తువులు ఒకటి రెండు తీసుకో. కాలం మారిందనీ, కడుపు కత్తెక్కూడా స్వేచ్ఛవుందనీ, మీ యజమానురాలికి బుద్ధొస్తుంది.

'పద. ఆలస్యంచేయకు.' అన్నాడు లిఖోనిన్ ఉత్సాహంగా.

'వద్దు. వద్దు. అది కాదుసరైనమార్గం.' అంటూ ఆపుచేసింది జెన్నీ. 'ఎవరిఇష్టమొచ్చినప్పుడు వారు వెళ్ళిపోవచ్చు. అది నిజమే. కాని దీనివల్ల ముందు కొన్ని చిక్కులొస్తాయి. ఎలాచేస్తే బాగుంటుందో నేను చెప్తాను. లిఖోనిన్! మీరొక పది రూబుల్సు ఖర్చుపెట్టలేరూ?

'ఓ! నిరభ్యంతరంగా' అంటూ లిఖోనిన్ జేబులోంచి పది రూబుల్సు తీశాడు.

"అయితే ఒకపనిచెయ్యి. ల్యూబాను ఈ రాత్రికి నీగదికి తీసుకెళుతున్నానని యజమానురాలితో చెప్పు. అందుకు చార్జీ పదిరూబుల్సు ఎవరికైనా ఇదే రేటు. ఆడబ్బు ఆమెమొహాన పారెయ్యి. తరువాత ఆమెకు టికెట్ కొనడంకోసం మీరు రేపురావచ్చు. అప్పుడుమేం అన్నివ్యవహారాలు జాగ్రత్తగా పూర్తిచేస్తాం. ఆ తరువాత ఆ టికెట్ తీసుకుని మీరు పోలీసుల దగ్గరకు వెళ్ళండి. ల్యూబా అనే ఫలానాపిల్లను దాసీగా వుండడానికి కుదుర్చుకున్నాననీ, టికెట్ను ప్యాస్పోర్టుగా మార్చమనీ కోరండి, తీరిపోతుంది. ఊ! ఊ! త్వరగా తెములండి. ఇహ ఆలస్యంఎందుకు? నిలబడతావేమే మొద్దూ! ఆ డబ్బుతీసుకుని 'ఎమ్మా' దగ్గరికి వెళ్ళు. కాస్త తెలివి వుపయోగించి మాట్లాడు. అది అసలే అసాధ్యురాలు. కళ్ళల్లోనే సంగతంతా

కనిపెట్టేస్తుంది. పోవే ముండ! నేచెప్పినట్లు జాగ్రత్తగా ప్రవర్తించు." జెన్నీ విషయమంతా చెప్పి వారి ప్రయాణానికి తొందరచేసింది.

ఓ అరగంటతరువాత ల్యూబా, లిఖోనిన్ బండ్లోఎక్కారు. జెన్నీ, రిపోర్టరు గుమ్మంలో నిలబడ్డారు.

"నీవు తెలివిగలపని చేయడంలేదు లిఖోనిన్! కాని నీ ధైర్యానికీ, మంచితనానికీ మెచ్చుకుంటున్నాను. ఆచరణలో నీ ఆదర్శాలన్నీ చూపించాలిసుమా!" అన్నాడు రిపోర్టరు.

"జీవితాన్ని సుఖంగా కొత్తపంథాలో ప్రారంభించండి." అంది జెన్నీ నవ్వుతూ. విందుకు నన్నుకూడా ఆహ్వానిస్తారుకదూ?"

"మేం విందుచేసేంతవరకూ నీవు అలాగేవుండాలి" అన్నాడు లిఖోనిన్ తిరిగి నవ్వుతూ. తలమీదిటోపీతీసి ఊపాడు అతను బండి కదలబోతుంటే.

బండి బరబర కదిలిపోయింది. రిపోర్టరు జెన్నీవంక చూచాడు. ఆమె కళ్ళవెంట నీళ్ళు కారడంచూచి నివ్వెరపోయాడు. అవును మరి. అంతసమం ఎప్పుడూ ఆమె కంటతడిపెట్టగా అతను చూళ్ళేదు.

"భగవంతుడు ఆమెకు మేలు చేకూరుస్తాడు" అంది జెన్నీ మెల్లగా.

"ఏంజెన్నీ? నీమనసు బాగాలేదా? దిగులుగావుందా? నా సహాయం ఏమైనా కావాలా?" అనడిగాడు రిపోర్టరు ఆప్యాయతతో.

ఆమె అతనివంక చూడకుండా వెనక్కు మళ్ళింది. "అవసరమైతే మీకు జాబువ్రాస్తాను. ఎక్కడికి వ్రాయాలి?" అడిగిందామె, మొహంతిప్పి.

"ఓ! అదా! మామూలు అడ్రెస్సుకే వ్రాయి. 'ఎకో' పత్రికాఆఫీసుకు వ్రాస్తే నాకుచేరుతుంది."

"నేను... నేను... నేను..." అంటూ జెన్నీ పసిపిల్లలా భోరున ఏడ్చింది. రెండుచేతులతో మొహాన్ని కప్పుకుంది. "జాబు వ్రాస్తానులెండి" అందామె ఏడుస్తూనే.

అలాఅంటూనే ఆమె వేగంగా మెట్లెక్కి, గభాలున తలుపుమూసి ఇంట్లోకి పరుగెత్తింది.

# రెండో భాగం

ప్యాసింజరుబండి శరవేగంతో ఉత్తరదిశగా ప్రయాణంచేస్తోంది. బంగారంలా మెరుస్తున్న గోధుమపొలాల్లోంచి, శృంగారంగా పెరిగివున్న చెరకుతోపుల మధ్యగా పోతోంది. నదులు, వంతెనలు దాటి భుగభుగమని పొగలు విడుస్తూ పరుగెడుతోంది.

రెండోతరగతి పెట్టెలో కిటికీ లన్నీ తెరచివున్నాయి. అయినా పెట్టెలో వెచ్చగావుంది. ఇంజన్నుంచివస్తోన్న పొగ ప్రయాణీకుల గొంతుల్లో చొరబడి సంకటం కలిగిస్తోంది. ప్రయాణీకులంతా అలసివున్నారు. ఒకతను మాత్రం చాలా ఉత్సాహంగా హుషారుగా వున్నాడు. మంచి దుస్తులు ధరించాడు. అందరితో చనువుగావుంటూ, వినయవిధేయతలు చూపిస్తున్నాడు. నట్టులేకుండా ధారాళంగా మాట్లాడుతున్నాడు. ఆయనవెంట ఒక యువతి కూడా వుంది. చూస్తే వారిద్దరూ నవ దంపతులవలె అగుపిస్తున్నారు. ఆమె తరుచు భర్తవంక చూస్తూ అతని చర్యలు కనిపెడుతోంది. అతనివైపు చూచినప్పుడల్లా ఆమెకళ్ళు నక్షత్రాల్లా మెరుస్తున్నాయి. ఆమె మొహం చాలా అందంగావుంది. అప్పుడప్పుడే ప్రేమ అంకురిస్తోన్న యువతిలా వుంది. పల్చని పెదవులు, నల్లగా మెరుస్తోన్న పెద్దకళ్ళు. గులాబీరంగులో వుంది ఆమె మొహం.

ఆ పెట్టెలో మరో ముగ్గురు ప్రయాణీకులున్నారు. ఆ కొత్తవాళ్ళు ఏమైనా అనుకుంటారనికూడా సంకోచించకుండా, ఇతను తన భార్యను గురించి అనవసరమైన జాగ్రత్తలు తీసుకుంటున్నాడు. ఆమెతో మోటుగా ప్రవర్తిస్తున్నాడు. తనే ఆపిడ భర్తననీ, ఆమె తనను అధికంగా ప్రేమిస్తోందనీ అందరికీ తెలియాలని తంటాలుపడుతున్నాడు. గర్వం, అహంకారం వెళ్ళగక్కుతున్నాడు. 'చూడు! మనం ఎంత హాయిగావున్నామో! నీకు మాత్రం సంతోషంగాలేదూ?' అంటూ తనచేయి ఆమెతొడమీద వేయడమో, ఆమెదుస్తులు ముట్టుకోవడమో, లేక ఆమె బుగ్గలు గిల్లడమో, ఇలాంటి అవకతవకపనులు చేస్తున్నాడు. బిరుసుగా పొడుగ్గావున్న తన మీసాలు మధ్య మధ్య ఆమెకు తాకిస్తూ చక్కలిగింతలు పెడుతున్నాడు.

ఈ దంపతులకు ఎదురుగా ముగ్గురు ప్రయాణీకులు కూచునివున్నారు. ఒకాయన వృద్ధుడు. జనరల్‌గా పనిచేసి పింఛను పుచ్చుకున్నాడు. శుభ్రంగా తల దువ్వుకుని ముచ్చటగా కూచున్నాడు. రెండో ఆయన భూస్వామి. లావుగా వున్నాడు. అతనికి చాలా వేడిగావున్నట్లుంది. తడి రుమాలు తీయకుండా మొహానవేసుకుని ఒత్తుకుంటున్నాడు. మనిషి కాస్త ఆయాసపడుతున్నాడు కూడా. ఇహపోతే మూడో అతను ఒక యువకుడు. పదాతిదళంలో ఆఫీసరుగా పనిచేస్తున్నాడు. అంతులేకుండా గోరిజాంట్ (తన పేరు గోరిజాంట్ అని, ఆదివరకే చెప్పి తన్నుతానే పరిచయం చేసుకున్నాడు.) మాట్లాడుతోంటే, ఆ ముగ్గురు ప్రయాణీకులకు విసుగు, చిరాకు కలుగుతోంది. గోరిజాంట్ వసపిట్టలా వాగుతున్నాడు. ఈగలు ముసిరినట్లు గోలపెడుతున్నాడు. మాటల్లో చమత్కారం, హాస్యం కురిపిస్తూ రకరకాల కథలు అల్లి చెపుతున్నాడు. అతను మాట్లాడని విషయమేమీ లేదు. అతని భార్య విసనకర్రతో విసురుతోంది. రుమాలుతో అతని మొహంమీద చెమట తుడుస్తోంది. అటూ ఇటూ చెదురుతూ, ముడతలుపడుతోన్న అతని 'టై' అస్తమానం సరిచేస్తోంది. ఇతని చేష్టలు చూస్తే అందరికీ నవ్వువస్తోంది. కాని ఇతని వ్యవహారం ఆ ముగ్గురు ప్రయాణీకులకు నచ్చలేదు. అసలే పెట్టెలో వేడిగా, ఉక్కపోసి, ఊపిరాడకుండా చస్తోవుంటే పైగా చెవులు గింగుర్లు పుట్టేలా ఇతని గోల ఒకటి. ఏమి టీ పాడుపీడ? ప్రయాణం చేసిన కాసేపూ కాస్తయినా విశ్రాంతి లేకుండా బడాయికొట్టే బడుద్ధాయిలా వున్నాడు చూడబోతే.

"ఏమండీ? మీరు ఏంచేస్తుంటారో అడగొచ్చా?" అన్నాడు వృద్ధుడు నెమ్మదిగా.

"ఓ! అదా? ఈరోజుల్లో పేదవాళ్ళు చేసేపని ఏముంటుంది? నేనేదో చిన్న వ్యాపారం చేసుకుంటున్నాను లెండి. బ్రోకరుగా, సేల్సుమాన్‌గా వుండి బేరాలు కుదురుస్తుంటాను. సరుకులు అమ్ముతుంటాను. కమీషన్ వస్తుంది. ...అయినా ప్రస్తుతం నేను వ్యాపారంపనిమీద వెళ్ళడంలేదు... మీకు తెలుసునో లేదో?... మేం నూతనదంపతులం. భార్యతో కలిసి ప్రయాణం చేయడం నాకిదే మొదటిసారి... కులాసాగా, షికారు వెడుతున్నాం. అహ్హహ్హ!... నేను సిడ్రిస్ అనే గొప్ప వ్యాపారసంస్థ తరఫున, మరి రెండు

ఇంగ్లీషు కంపెనీల తరఫున పనిచేస్తున్నాను. కొన్నివస్తువుల శాంపిల్సు ఇక్కడ నాదగ్గరే ఉన్నాయి, చూస్తారా?" అంటూ అతను వెంటనే తన దగ్గరవున్న ఒక తోలుసంచి తీశాడు. అందులోంచి కార్డుబోర్డుకాగితంతో కుట్టిన మడత పుస్తకాలు బయటికితీసి వాటిని తెరచి చూపించసాగాడు.

"చూడండి! ఎంత మంచిరకాలో! దిగుమతి అయ్యే చెత్తరకాలు కావు. దయచేసి గమనించండి. ఇది ఇంగ్లండులో తయారైంది. ఇది రష్యాలో తయారుచేసింది" అంటూ వివిధరకాల ఊలు, ఊలుతో తయారుచేసిన గుడ్డ ముక్కలు చూపించాడు. "బాగా పరిశీలించండి. ఈ రెండురకాలకూ ఎంత తేడావుందో! ఇంగ్లండులో తయారైనదానికంటె రష్యాలో తయారైన రకం ఘనంగాలేదూ? అంటే మనదేశం పారిశ్రామికంగా ముందడుగు వేసిందన్నమాట. నవీన నాగరికతలో పురోగమిస్తోందన్నమాట. హు. ఐరోపా దేశస్థులు మనల్ని మోటువాళ్ళంటారు. అర్థంలేదు.

"కనుక మా ప్రయాణంలో మధ్యలో దిగి బంధువులను చూడాలనుకుంటున్నాం. తరువాత వోల్గానదీతీరంలోకూడా బంధువులున్నారు. వారిని చూచి తిరిగీ మా స్వస్థలమైన 'ఒడెస్సా' వెడతాం."

"అయితే చాలా మంచిప్రయాణమే" అన్నాడు ఆఫీసర్.

'అవును. మంచిప్రయాణమే కాని, వెనకటికి ఏదో సామెతచెప్పినట్లు ఎంత మంచి గులాబీకైనా ముళ్ళు వుంటాయి. అలాగే ప్రయాణంలోకూడా కొన్ని ఇబ్బందులు లేకపోలేదు. మావ్యాపారంవుంది చూచారూ? శ్రమతో కూడినపని. సేల్సుమాన్‌గా పనిచేయడమంటే సామాన్యమైనవిషయంకాదు. అంతంతమాత్రపువాళ్ళయితే ఇందులోతట్టుకోలేరు. నేనంటేమొండిఘటాన్ని. వ్యాపారపు కిటుకులన్ని నా కొనవేళ్ళల్లోవున్నాయి. చూచారూ? ఈపనికి చదువుకాదు కావాల్సింది. బుర్ర! ఎంతబుర్రకలవాడైతేఅంతబాగా వర్తకం సాగుతుంది. కేవలం వర్తకానికి సంబంధించిన తెలివిమాత్రమే చాలదు. ఎంతో అనుభవం ప్రపంచజ్ఞానం కావాలి. అవతలివాణ్ణి ఆకర్షించగల నేర్పు, వాగ్ధాటి కావాలి. నే నన్నాను చూచారూ? ఎంతో నీతీ, నిజాయితీ, చూపిస్తూ ఈ వ్యాపారం నడుపుకొస్తున్నా. నా వ్యవహారంలో ఎవరితోనూ ఎంతమాత్రం మాట తబ్బిబ్బులు రాదు. ఎవరినైనా నన్నుగురించి అడగండి, ఫలానా గోరిజాంట్ ఎలాంటివాడు? అంటే చాలు. ఎవరైనా చెపుతారు.

'అతనా? ఎంత నిక్కచ్చి! ఎంత నిజాయితీ! అతను కల్తీలేని బంగారంలాంటి వాడండి. స్వార్థంకోసం చస్తే పనిచేయడు. గోరిజాంట్ అంటే వజ్రపు తునక కదండీ.' అంటారు అందరూ. ఎక్కడికోట అయినా మీరు ఇదేమాట వింటారు" అంటూ అతను ఆ పుస్తకాలు మూసేసి, మరికొన్ని పెద్ద అట్ట ముక్కలు బయటికి తీశాడు. వాటికి రంగు రంగుల గుండీలు, అతికించి వున్నాయి. అవన్నీ వారికి చూపించాడు.

ఓ అరగంట గడచిందరువాత మళ్ళీ సంభాషణ ప్రారంభించాడు గోరిజాంట్.

'మీరు తరుచుగా 'క—'(నగరం పేరు)వస్తూవుంటారా?' అనడిగాడు యువకుడైన ఆఫీసరును.

'లేదండీ! ఇదే మొదటిసారి. మా పటాలం 'చెర్నోబాబ్' దగ్గర మకాంచేసింది. నేను 'మాస్కో'నుంచి వస్తున్నాను" అని జవాబు చెప్పాడు ఆఫీసరు.

"అరెరె! అయితే చాలాదూరంనుంచి వస్తున్నారన్నమాట?"

"ఏం చేస్తామండీ! మిలిటరీ స్కూలునుంచి మొన్ననే పట్టభద్రుణ్నయి బయటికొచ్చాను. ఈ పటాలం నాకు వప్పచెప్పారు."

"చెర్నొబాబ్ వుంది చూశారూ? చాల అసహ్యమైన ఊరండీ. మురికికూపంలా వుంటుంది."

"ఏం చేస్తాం? తప్పదు."

"అయితే ఇప్పుడు 'క'లో దిగి కొన్నిరోజులు గడపరూ?"

"అవును. రెండుమూడురోజులు గడుపుదా మనుకుంటున్నా. నాకు ఎక్కువ వ్యవధిలేదు. అయినా ఈ నగరం చూడాలనివుంది. చాలా అంద మైన పట్టణమని విన్నాను.

"అయ్యగొర్యో! విన్నానంటారేం? అద్భుతమైన పట్టణం కదండీ. అంతా యూరోపియన్ పద్ధతిలో వుంటుంది. విశాలమైన వీధులు, విద్యు ద్దీపాలు, సిటీబస్సులు. ఒకటోరకం సినిమాథియేటర్లు, హోటళ్ళు, అందమైన నైట్ క్లబ్బులూ, విహారస్థలాలు! ఓ!మీరు నిజంగా మూర్ఛపోతారనుకోండి పోతే నది సమీపంలోవున్న ప్రాంతంతప్పక చూడాల్సిందే. ఓ! ఏంఆడాళ్లు ఏం ఆడాళ్ళు! ఆడాళ్ళుకాదండీ అప్సరసలు!"

గోరిజాంట్ అలా చెప్పేసరికి ఆ యువకుడు కొంచెం సిగ్గుపడ్డాడు. కొంచెం వణుకుతోన్న కంఠంతో ఇలా అడిగాడు.

“అవునండీ! నేనూ విన్నాను. నిజంగా వాళ్ళు అంత అందంగా వుంటారా?”

ఓ! ఉండేదేమిటండీ! చిన్నగా అంటున్నారా? నేనైతే వాళ్ళను చూచి మూర్ఛపోతాను. పైప్రాణాలు పైనే ఎగిరిపోతాయి. ఆ అందం, ఆ చందం! ముఖ్యంగా ఏమిటంటే, ఈ పిల్లలందరూ వివిధ జాతులకు చెందినవారు. పోలిష్, యూక్రేనియన్, జూయిష్; ఓ! ఏం చెప్పమంటారు. రంగు రంగుల పిల్లలు. రకరకాల రక్తాన్ని రుచిచూడవచ్చు. అబ్బ! ఏం ప్రేమ చూపిస్తారనుకున్నారు? నిప్పులు కురిపిస్తారనుకోండి. ఇలాంటి అందకత్తెలను మీరు లండన్, పారిస్ నగరాల్లోకూడా చూచివుండరు. అనేకమంది అక్కడికి వెళ్ళి అనుభవించినవాళ్ళు చెప్పగా విన్నాను’ అంటూ గోరిజాంట్ కంఠస్వరం తగ్గించి, రహస్యంగా మళ్ళీ అతనితో చెప్పసాగాడు.

“ఈ ఆడాళ్ళలోవున్న విశేషం ఏమిటంటే, వచ్చినవిటులతో, ఒక కొత్తపద్ధతిలో వ్యవహరిస్తారట. ఎంతోమంది చెప్పారు. అదే గొప్పసంగతి. అసలెందుకు? వాళ్ళనుచూస్తేనే మనసు పిచ్చెక్కుతుందండీ?” అంటూ అతను ఒకసారి అటూఇటూ చూచాడు. ఆ తరువాత మెల్లగా తనకోటు జేబులోంచి ఒక చిన్న అట్టపెట్టెను బయటికితీశాడు. అది మామూలు చీట్ల పేకముక్కలు పెట్టే పెట్టెలావుంది. గోరిజాంట్ అందులోంచి కొన్ని ఫొటోలుతీసి, ఆఫీసరుకిచ్చాడు. “చూడండి! ఒక్కసారి ఈ బొమ్మలు చూస్తే మీకే తెలిసిపోతుంది......దయచేసి ఒకసారి......ఊరకే...అలా చూడండి...చాలు” అన్నాడు గోరిజాంట్ ఏదో పోజుపెట్టి.

ఆ యువకుడు ఫొటోలు చూడ్డం మొదలెట్టాడు. నల్లటి ఫొటోలు, అందమైన అమ్మాయిలు. అనేకమంది అమ్మాయిల ఫొటోలు అవి. నగ్న సౌందర్యాన్ని నిష్పక్షపాతంగా కురిపించి ముసిపిస్తున్నారు. ఆ యువతుల మొహాలు రకరకాల పోజులలో ఉన్నాయి. ఓ! ఏం మజా! అవయవాలు అనేక భంగిమలలో తిప్పిచూపిస్తున్నారు. బహిరంగంగా ప్రేమను గుమ్మరిస్తున్నారు. మగాళ్ళ కళ్లు జిగేల్మంటాయి. వళ్ళు పులకరిస్తుంది సుమా!

బహిరంగంగా పశుప్రవృత్తిని ప్రేరేపిస్తూ, పురుషులను రెచ్చగొట్టే ఆ బొమ్మలను ఒక్కొక్కటి తిరగేసి చూస్తున్నాడు ఆఫీసర్. గోరిజాంట్ అతని భుజాలమీదనుంచి తొంగిచూస్తూ మధ్యమధ్య సైగచేస్తూ, రహస్యంగా ఇలా అన్నాడు.

'ఫొటోలు ఎలావున్నాయి? అద్భుతంగా లేవూ? నిజంగా ఇలాంటి స్త్రీలను పారిస్, వియన్నా నగరాల్లో కూడా చూడం'

మొదటినుంచి చివరిదాకా ఫొటోలన్నీ తిరగేశాడు ఆఫీసరు. తరువాత బొమ్మలన్నీ ఆ పెట్టెలో భద్రంగా సర్దిపెట్టి గోరిజాంట్‌కు తిరిగి ఇచ్చాడు. అప్పటికి ఆయన మొహం అంతా చెమటపట్టింది. చేతులు వణుకుతున్నాయి. కళ్ళల్లోనూ, పెదవులలోనూ ఏదో సిగ్గు కనపడింది. అతనికి ఒక విధమైన తృష్ణ కలిగినట్లు మొహం స్పష్టపరుస్తోంది.

'ఏం? ఏదో సందేహిస్తున్నారు? నేనిప్పుడు అన్నివిధాల పతనమై, భ్రష్టుడైనవాణ్ణి. నేను కట్టుకున్న భవనాలన్నీ కూలిపోయాయి. నా ఆశా సౌధాలు కూలిపోయాయి. అన్నీ వదిలిపెట్టాను. భగవధ్యానంతో కాలం గడుపుతున్నాను. మనసు బాగాలేక అప్పుడప్పుడు ఈ బొమ్మలు చూస్తూ కాలక్షేపం చేసేవాణ్ణి...దీని ఖరీదు ఏమంత ఎక్కువ కాదులెండి...నేను కొన్న ఖరీదులో సగం ఇస్తే చాలు...తీసుకుంటారా?' అన్నాడు గోరిజాంట్.

"ఎందుకు?...నేను...అంటే...సరే. తీసుకుంటాను.'

"చాల సంతోషం. మన స్నేహానికి గుర్తుగా మీ దగ్గర వుంటాయి. మీరు నాకు ఎక్కువ ఇవ్వక్కరలేదు లెండి...ఒక్కొక్క ఫొటోకు యాభై కోపెక్కులు ఇవ్వండి. ఏమంటారు?...ఎక్కువఖరీదు అంటారా? సరే... మీఇష్టంప్రకారమే కానీయండి...నేను మీదగ్గర ఎక్కువ పుచ్చుకుంటానా? మీ సొమ్ము అన్యాయంగా దోచుకుంటానా?......ఒక్కొదానికి ముప్ఫయి కోపెక్కులివ్వండి...ఏం?...ఇంకా ఎక్కువనుకుంటారా? మీఇష్టం...ఇరవైఅయిదు చొప్పున ఇవ్వండి...ఏమిటీ? ఇది ఎక్కువేనా?... సరే...ఇహ నేను మాట్లాడను...ఇరవై కోపెక్కులచొప్పున ఇవ్వండి. ఇంత చౌకగా ఇచ్చినందుకు తరువాత మీరే నన్ను మెచ్చుకుంటారు. మరో విషయం. నేను 'కీవ్'లో వున్నప్పుడు 'హెర్మిటేజ్' హోటల్లో బసచేస్తాను.

పొద్దున్నే గాని, లేక సాయంత్రం 8 గంటలకుగాని నన్ను మీరు కలుసుకో వచ్చు. ప్రతిరోజూ ఆ టయిముకు నేను అక్కడే వుంటాను. నాకు చాల మంది అందమైన యువతులు తెలుసు. వాళ్లతో మీకు పరిచయం చేస్తాను... ఏమంటారు? మీరేం ఎక్కువడబ్బు ఖర్చుకానక్కర్లెండి. మీలాంటి అందమైన, ఆరోగ్యవంతులైన యువకులు కొంతసేపు సరదాగా, జల్సాగా కాలంగడపాలి. తప్పదు. ఆ యువతులకు ఒక గ్లాసు బ్రాందీ తాగడానికి, లేకపోతే ఒక బాటిల్ షాంపేన్ సేవించడానికి ఇస్తే చాలు, ఎంతో సంతోషిస్తారు. సరే...గుర్తుంచుకోండి. హెర్మిటేజ్ హోటల్! గోరిజాంట్! ఒకవేళ తమకు ఆ అమ్మాయిలమీద మక్కువ లేకపోయినా, నా పేరు, అడ్రెస్సుమాత్రం మరిచిపోకండి. మీకు ఏదోరకంగా నేను ఉపయోగపడగలను. ఆ...ఇహ ఈ ఫోటోలంటారా?...వీటికి మీరు పెట్టిన ఖర్చు లెక్కలోది కాదు...కొందరికి ఇవంటే ప్రాణం...అవసరమైనవాళ్ళు ఒక్కొక్క ఫోటో మూడురూబుల్సు ఇచ్చి తీసుకుంటారు. అయితే కాస్త ఉన్నవాళ్ళే అలా చేయగలరనుకోండి'' అంటూ గోరిజాంట్ ఆయనమీదికి వంగి చెవిలో ఇలా అన్నాడు. 'మీరు నవయౌవ్వనంలో వున్నారు. మీరు రకరకాల స్త్రీలతో సౌఖ్యం అనుభవించాలి.'

ఆఫీసర్ ఫోటోలుతీసుకుని డబ్బిచ్చాడు. గోరిజాంట్ దాన్ని జాగ్రత్తగా లెక్కపెట్టుకుని జేబులో భద్రపరచుకున్నాడు. మరోసారి సంతోషంగా ఆఫీసర్‌తో కరస్పర్శ చేశాడు.

ఇహ ఆఫీసర్ అతనితో మాట్లాడ్లేదు. ఏదో సిగ్గు, భయం. అతనివైపు కన్నెత్తికూడా చూడ్లేకపోయాడు. తరువాత గోరిజాంట్ తిరిగీ తనపెట్టెలోకి వెళ్ళిపోయాడు.

ప్రయాణంచేసిన ఇరవైనాలుగు గంటలలో గోరిజాంట్ అనేకసార్లు రెండోతరగతిపెట్టెలోంచి మూడో తరగతిలోకి, మూడోతరగతి పెట్టెలోంచి రెండోతరగతిలోకి తిరుగుతూనే వున్నాడు. ఇప్పుడు మళ్లీ అతను మూడోతరగతి పెట్టెలో ప్రవేశించాడు. ముగ్గురు అందమైనస్త్రీలు, ఒక పురుషుడు కలిసి ఒకచోట కూచునివున్నారు. అతనిది నల్లటిగడ్డం. మౌనంగా, ఖిన్నవదనుడై కూచున్నాడు. గోరిజాంట్ అతనివద్దకువెళ్ళి ఏదో విచిత్రమైనభాషలో స్వల్ప సంభాషణ జరిపాడు. ఆ ముగ్గురుస్త్రీలు గోరిజాంట్

వైపు ఏదో ఆత్రుతతో తేరిపార చూస్తున్నారు. అతన్ని ఏదో అడగాలని వారి మనసులో వుంది. కాని అతనితో చెప్పడానికి ధైర్యం చాలక నోళ్ళు కట్టేసుకుని ఆదేపనిగా చూస్తున్నారు. అప్పటికి మధ్యాహ్నం అయింది. ఆ ముగ్గురిలో ఒకామె కొంచెం తెంపుచేసి గోరిజాంట్‌ను ఇలా అడిగింది.

"అయితే అదినిజమేనా? ఆ ప్రదేశాన్ని గురించి విపులంగా చెప్పండి. నాకెంత బాధగావుందో మీకు కనిపించడం లేదూ?"

"ఓ! ఏమిటిసంగతి మార్గరీటా! మహాజోరుగా వుందే వ్యవహారం? ఏదో చెప్పాననా? అంతటితో ఊరుకోరాదూ? ఇదేం ప్రామిసరీనోటను కున్నావా? లేక పత్రికాప్రకటన అనుకున్నావా?" అంటూ గోరిజాంట్ కసురుకొన్నాడు. తరువాత ఆ పురుషుడివైపుతిరిగి ఇలా అన్నాడు. 'లాంబర్, ఇంకోనిముషంలో స్టేషన్ వస్తుంది. వెళ్ళి వాళ్ళకు కావల్సినవి ఏమిటో పట్టుకురా. రొట్టె, మాంసం, అన్నీ దొరుకుతాయి ఇక్కడ. బండికూడా దాదాపు అరగంట ఆగుతుంది"

"నాకు మాంసంతో కాల్చిన చాప కావాలి" అంది ఆ ముగ్గురిలో ఒక అందకత్తె. ఆమె వెంట్రుకలు పండిన గోధుమరంగులో వున్నాయి. ఆమె కళ్ళు గడ్డిపూలలా మెరుస్తున్నాయి.

"నీకు ఏంకావల్సుంటే అది తీసుకో బెల్లా! దానికింత రాద్ధాంతం ఎందుకు? నేనుకూడా స్టేషన్‌లో దిగి భోజనానికి ఆర్డరిస్తాను" అన్నాడు గోరిజాంట్ ఆమెతో.

ఆ మూడోతరగతిపెట్టె చాలా పెద్దది. పొడుగ్గా రైల్లోసగం ఆక్రమించుకుని వుంది. అక్కణ్ణుంచి గోరిజాంట్ అదేపెట్టెలో అవతలివైపుకు వెళ్ళాడు. అక్కడొక ఆడవాళ్ళమంద వుంది. దాదాపు పన్నెండుమంది ఒకేచోట కూచున్నారు. వాళ్ళందరిమీదా పెద్దగావుండి, పెత్తనం చేయడానికి ఒకవృద్ధురాలుకూడా వుంది. ఆమె లావుగా బలిసివుంది. పెద్దపొట్ట, మందంగా, విశాలంగా వున్న కనుబొమలు. ఆమె మాట్లాడుతోంటే భలే గమ్మత్తుగా వుంటుంది. రైలుబండి కదలికవల్ల ఆమెవళ్ళంతా అటూ ఇటూ ఊగుతోంది. ముఖ్యంగా ముడతలుపడివున్న ఆమెపెద్దపొట్ట నాట్యంచేసినట్లు అటుఇటూ తిరుగుతోంది.

ఈ పన్నెండుమంది స్త్రీలు బెంచీలమీదకూచుని సిగరెట్లుకాలుస్తూ పేకాట ఆడుకుంటున్నారు. మధ్య మధ్య బీరు తాగుతున్నారు. పెట్టెలో వున్న మగాళ్ళు అప్పుడప్పుడు వీరితో హాస్యాలాడుతున్నారు. అందుకు సమాధానంగా ఈ స్త్రీలు వాళ్ళను బూతులు తిడుతున్నారు. పెద్దగొంతుతో మొరటుగా, నిర్లక్ష్యంగా జవాబుచెపుతున్నారు. పెట్టెలో కొందరు యువకులున్నారు చూచారూ? వాళ్ళకు ఈ స్త్రీలంటే సరదాగానేవుంది. బ్రాందీ, సిగరెట్లు వాళ్ళకు అందిస్తూ ఆనందిస్తున్నారు.

వీరిదగ్గరికి వచ్చేసరికి గోరెజాంట్ ప్రవర్తన పూర్తిగా మారిపోయింది. ఠీవిగా వాళ్ళదగ్గరకువెళ్ళి కూచున్నాడు. కులాసాగా మాట్లాడాడు. పాడుతూ, అభినయిస్తూ ముచ్చట్లు చెప్పాడు. వారంతాకూడా ఇతనిపట్ల ఆదరం, అభిమానం చూపిస్తూ ప్రసంగించారు. యూదీయులు, రుమేనియనులు; పోలిష్, రష్యన్ మొదలైన వివిధజాతులకు చెందినస్త్రీలు వీరిలో ఉన్నారు. అందరితోనూ, అన్నిభాషలలోను మాట్లాడాడు గోరిజాంట్. ఫలహారాలను భోజనాలను ఆర్డరిచ్చాడు. స్టేషనువచ్చింది. బండిఆగగానే వీరికి కావలసినవన్నీ ఇప్పించాడు.

తరువాత మళ్ళీవచ్చి తన మామూలుచోట భార్యపక్కనే కూచున్నాడు. యథావిధి ఆమెతో కబుర్లు, కథలు ప్రారంభించాడు.

సాయంత్రమైంది. సూర్యుడు పశ్చిమాద్రిని చేరబోతూ ఎర్రనికాంతులు వెదజల్లుతున్నాడు. రైలుబండి ఓ పెద్ద స్టేషన్ సమీపించబోతోంది. ఒక పురాతనమైన నగరం డాపులోవున్నట్లు గుర్తులు స్పష్టంగా అగుపిస్తున్నాయి. ఎత్తుగా కొండమీద కట్టిన చర్చి భవనాలు గోపురాలు, సాయంత్రపు నీరెండకు తళతళ మెరుస్తున్నాయి. కొండదిగువను ఏపుగా పెరిగివున్న చెట్లు, తోటలు, తోపులు కన్నులపండువుగా కనిపిస్తున్నాయి. దట్టంగా అల్లుకునివున్న పొదలు, పెనవేసుకునివున్న తీగెలు చక్కని శోభను చేకూరుస్తున్నాయి. కొండమీదనుంచి ఏటవాలుగా నీలిరంగులో ఒక నది ప్రవహిస్తూ కిందికిదూకి, చెట్లు, పొదలు, వీటి మధ్యగుండా అదృశ్యమవుతోంది.

రైలుబండి స్టేషన్‌లోకివచ్చి ఆగింది. వెంటనే గోరిజాంట్ కూలీలను పిలిచాడు. తన పెట్టెలు, సామానులు చూపించి, ఒకటోతరగతి వెయిటింగ్ రూంలో పెట్టమని ఆజ్ఞాపించాడు. భార్యను కూలీలతోవెళ్ళి, వెయిటింగ్

రూంలో కూచోమని చెప్పాడు. తనుమాత్రం పెట్టె తలుపు దగ్గరే నిలుచొని ఆడవాళ్ళు దిగిందాకా ఊరుకున్నాడు. ఆడవాళ్ళు రెండు పార్టీలుగా దిగారు. పన్నెండు మంది ఆడవాళ్ళు, వృద్ధురాలు ఒకసారి దిగారు. తరువాత ముగ్గురు ఆడవాళ్ళు, వాళ్ళతో వున్న గడ్డపువాడు— లాజర్ దిగారు. గోరిజాంటు ఆ వృద్ధురాలితో ఇలా చెప్పాడు.

"గుర్తుంచుకో మేడమ్ బెర్మన్!- ఆషెరికన్ హోటలు, ఇవానో వస్కాయావీధి, ఇరవైరెండో నెంబరు. మరిచిపోయేవు జాగ్రత్త!"

ఆతరువాత గడ్డపువాడైన లాజర్‌తో ఇలా అన్నాడు.

"లాజర్! ఆ ముగ్గురు అమ్మాయిలను మంచిభోజనం పెట్టించు. తరువాత సినిమాకు తీసుకెళ్ళు. రాత్రి పదకొండుగంటలకు నేనొస్తాను. మాట్లాడదాం. ఊఁ, ఈలోగా ఎవరైనా అవసరంఅని అడిగితే, నా అడ్రెసు నీకు తెలుసుగా! హెర్మిటేజ్ హోటలు. అక్కడికి కబురుపంపించు. ఒక వేళ నేనక్కడ లేకపోతే "రీమన్స్ కేఫ్"లోగాని, దానికి ఎదురుగావున్న రెస్టారెంటులోగాని చూడండి. తప్పక ఉంటాను. ఊఁ, మరిచిపోయేవు. ఆ పిల్లలకుమాత్రం జల్సాచేయించి అడిగినవన్నీ ఇప్పించు. వస్తాను మరి" అని చెప్పి గోరిజాంట్ వెళ్ళిపోయాడు.

## 2

గోరిజాంట్ చెప్పిన కథలన్నీ కటికి అబద్ధాలు. ఒక్కమాట కూడా నిజంలేదు. వ్యాపారమూ లేదు పాడూ లేదు. పచ్చిఅబద్ధాలు పలుకుతూ పైకి ఒక పెద్దమనిషిలా నటిస్తున్నాడు, అంతే. అతను చూపించిన గుండీలు, ఊలుశాంపిల్సు, ఇవన్నీ అసలు వ్యాపారానికి సంబంధించినవి కానేకావు. అతనుచేసే అసలైన సిసలైన వ్యాపారం వేరేవుంది. అదేమిటంటే ఆడపిల్లలను ఎత్తుకుపోయి అమ్మడం, ఇదే అతని అసలువృత్తి. దీన్ని కప్పిపుచ్చడం కోసం, అనేక నాటకాలు ఆడుతుంటాడు. అనేకబూటకాలు చెపుతుంటాడు. అయితే ఒకటిమాత్రం నిజం. ఎప్పుడో పదేండ్లక్రితం ఇలాను వ్యాపారంచేస్తూ రష్యాఅంతా తిరిగాడు. ఏదో పేరుతెలీని కంపెనీకి ఏజంటుగా వుండి,

బ్రాందీ, విస్కీ అమ్మకం చేస్తుండేవాడు. సహజంగా ఇతను చురుకైనవాడు. మంచి మాటకారి. ఇంకేం? ఇవి వ్యాపారంలో అక్కరకువచ్చాయి. కొంత పేరు, ప్రతిభ సంపాయించుకున్నాడు. ఆ తరువాత ఈ విచిత్రమైన వృత్తిలోకి దిగాడు. అయినప్పటికీ వెనుక తనుచేసిన వ్యాపారంపేరు చెప్పుకుని పైకి పెద్దమనిషిలా నటిస్తూ తిరుగుతున్నాడు. పూర్వం ఒకప్పుడు ఏంజరిగిందనుకున్నారు! అప్పటికి గోరిజాంట్ మాంచి వయసులో ఉన్నాడు. ఒకసారి ప్రయాణం చేస్తూవుండగా, దోవలో గుడ్డలుకుట్టే ఒకఅమ్మాయి తగిలింది. చూడగానే ఇతనిమీద ఆపిల్లకు మనసు మళ్ళింది. ప్రేమించి దగ్గరకొచ్చింది. ఆమె చూడ్డానికి అందంగా నేవుంది. ఆమెచరిత్రఏమిటో ఏవరికీ తెలీదుగాని, ఒక పడుపుకత్తెఅని పోలీసులు అధికారపూర్వకంగా తమలిస్టులో మాత్రం ఎక్కించలేదు. ఇంకేం? గోరిజాంట్, ఈ అమ్మాయిని తనతో లేవదీసుకుపోయాడు. తనతోపాటు దేశదేశాలు తిప్పాడు. ఓ ఆరుమాసాలు గడిచేసరికి, ఇతనికి ఆపిల్లమీద వ్యామోహం పోయింది. స్వేచ్ఛగా తిరిగే తనకు ఆమె ఒక ఆటంకంగా అగుపించింది. తలమీదికెత్తుకున్న బరువులా, మెడకు తగిలించుకున్న గుదిబండలా తోచింది. అప్పటినుంచీ ఆమెపీడ వదిలించుకోవడం ఎలాగాఅని, అహర్నిశలు ఆలోచించసాగాడు. ఆపిల్లపై అసూయ ద్వేషం, అపనమ్మకం కలిగాయి. క్రమక్రమంగా ఆమెనుకొట్టి హింసించడం మొదలెట్టాడు. మొదట్లో ఆమె అతని ప్రవర్తనకు, మార్పుకు, ఆశ్చర్యపడింది కాని, రాను రాను, తన్నులకు అలవాటుపడి పూర్తిగా లొంగిపోయింది. ఇలా ప్రేమించి వచ్చిన స్త్రీలలో సాధారణంగా రెండురకాల వాళ్ళు వుంటారు. ఒకరకంవాళ్లు, తమ ప్రియులతో జంకూగొంకూ లేకుండా, పచ్చి అబద్ధాలు చెప్తారు. ఎంతకైనా తెగిస్తారు. సిగ్గువిడిచి ప్రవర్తిస్తారు. పాపపు ఆలోచన వీరిమనసులో నిత్యం నీడలా వదలకుండా వుంటుంది. ప్రియుడికి తెలీకుండా రహస్యంగా, వ్యాపారం సాగిస్తూవుంటారు. కాని పైకి మాత్రం అగుపించరు. ప్రియుడితో ఇచ్చకాలు ఆడుతూ, ప్రేమిస్తున్నట్లు నటిస్తూ కపటంగా జీవిస్తారు. ఇక రెండవరకం స్త్రీలున్నారు చూశారూ? ప్రియుణ్ణి పిచ్చిగా ప్రేమిస్తారు. అతనికోసం తమ సర్వస్వం వదులుకుంటారు. అతను కొట్టినా, తిట్టినా పడుంటారు. అడుగులకు మడుగులొత్తుకూ దాసీలమాదిరి సేవిస్తారు. వీరికి అహంకారం, ఆత్మాభిమానం లేవు.

పాపం! వట్టి మూర్ఖులు, అమాయకులు. గోరిజాంట్‌ను ప్రేమించిన స్త్రీ ఈ రెండో తరగతికి చెందినమనిషి. అంచాతనే అతను కొట్టినా, కోసినా పడివుండగలుగుతోంది. నీచుడైన గోరిజాంట్ ఈమెను అంతటితో వదిలి పెట్టలేదు. అంగట్లోవస్తువుగా చేశాడు. ఈమె శీలాన్ని బహిరంగంగా అమ్మకానికి పెట్టాడు. ఇంకేం? ఈమె అతనికోర్కెను తిరస్కరించలేక ఒప్పుకుంది. అతనికి తలవొంచింది. అలా వ్యభిచారానికి దిగిన మొదటి నాడే, అయిదురూబుల్సు తెచ్చి గోరిజాంట్ చేతుల్లోపెట్టింది. ఆరోజు లగాయతు అతను ఈ వ్యాపారంలోకి దిగాడు. ఇది అతనికి సులువుగా, ధనార్జనకు వీలుగా అగుపించింది. అప్పటినుంచి ఇప్పటిదాకా ఇతను ఎంత మంది స్త్రీలను కలుసుకున్నాడో లెక్కలేదు. ఎన్నివందలమంది ఆడ వాళ్ళో ఇతనిచేతుల్లోకి వచ్చారు.

ప్రేమించివచ్చిన ఆ స్త్రీని అతను ఎన్నిరకాల హింసించాడో వర్ణించ లేము. ఆమె ఎన్నడూ ఎదురుతిరగలేదు. అతని పాదాలమీదపడి ఏడ్చింది. అతనిచేతులు ముద్దుపెట్టుకుంది. ఆమె ఇలాలొంగిపోతున్నకొద్దీ అతనికి అసూయ, ద్వేషం ఎక్కువైనాయి. ఆఖరుకు నడివీధిలోకి నెట్టాడు. కాని ఆమె వెళ్ళి పోయేదికాదు. కొంతసేపటికి మళ్ళీవచ్చేది. వర్షంలో తడిసి, చలికి వణు కుతూ, కళ్ళనీళ్ళు కారుస్తూ వచ్చేది. ఆఖరుకు అతనికి విసుగుపుట్టింది. ఆమెను ఒకసానికొంపకు అమ్మేశాడు.

ఈవృత్తిలోకి దిగిన తొలిరోజులలో గోరిజాంట్ ఈపనిలో తనకు కలిసివస్తుందో రాదో అని సందేహించాడు. కృతకృత్యుడ నవుతానో కానో అని భయపడ్డాడు. కాని పోనుపోను ఈ వ్యాపారంలో అఖండమైన విజ యాన్ని సాధించాడు.

ఖార్కోవ్‌లో ఒక బోగంకొంప వుంది. ఆ ఇంటి యజమానురాలు గోరిజాంట్‌ను బాగా ఎరుగును. గోరిజాంట్ ఏం తక్కువవాడా? మంచి డాన్సరు. పియానో అద్భుతంగా వాయిస్తాడు. చమత్కారమైన మాటలు చెప్పుతూ, చెణుకులు విసురుతూ అందరిని నవ్విస్తాడు. ఆకర్షిస్తాడు. ఆడ వాళ్ళను అమ్మడంలోను, మార్పిడి చేయడంలోనూ, ఎలాంటి చిక్కులు రాకుండా చూచుకోగల ఘటికుడు. వేరే రాజ్యాల్లోను, డబ్బు దాలకం లోను, రెండోవాళ్ళకు చిక్కకుండా సానులకు ఏ ముప్పూ రాకుండా

చూసుకోగల సమర్థుడు. ఇంకేం? ఇలాంటివాడు ఉండటం అవసరమని భావించింది ఆ భోగంకొంప యజమానురాలు. పిల్లల్ని చేరానికి తెచ్చిపెడతానని ఇతను చెప్పడం, వెంటనే ఆమె అంగీకరించడం జరిగిపోయింది. మొదట తనభార్యను ఈ భోగందానికే అమ్మాడు. కాని, పాపం! ఆ ఇల్లాలు ఒప్పుకోలేదు. అతన్ని వదిలిపెట్టి ఆ కొంపలో ఉండనని ఏడ్చింది. మొత్తుకుంది. ఆఖరుకు ఇలాచేస్తే ఆత్మహత్య చేసుకుంటానని, విషంతిని చస్తాననీ, పోలీసులకుకూడా రిపోర్టుచేస్తాననీ ఖచ్చితంగాచెప్పింది. అప్పుడితను ఏంచేశాడో తెలుసా? ప్లేటుమార్చాడు, మరోపన్నాగం పన్నాడు. ప్రస్తుతం తనేదో చిక్కుల్లో వున్నాననీ, పోలీసులు తనను వెంటాడుతున్నారనీ ఆమెతో చెప్పాడు. కనపడితే తనను జైల్లో పెడతారనికూడా బొంకాడు. అందుకోసం కొన్ని నెలలపాటు ఎవరికీ అగుపించకుండా, ఎక్కడో తలదాచుకోవాలని అన్నాడు. పైగా దూరదేశంలో ఒక వ్యాపారంకూడా వుందనీ, అక్కడికివెడితే కొన్నివందల రూబుల్సు లాభంవస్తుందనీ ఇచ్చకాలు పలికాడు. పాపం, ఆ ఇల్లాలు ఇతను చెప్పినవన్నీ నిజమని నమ్మింది. ప్రియుడికోసం, తను ఈ కొంపలో కొంతకాలం తలదాచుకోవడం మంచిదని భావించింది. అతని కష్టాలలో భాగం పంచుకోవాల్సిన అవసరం తనకు వుందనీ, అతనికోసం తను కష్టాలుపడడం, త్యాగంచేయడం ధర్మమనీ తలచింది. పిమ్మట తన ప్రియుడికి కష్టాలు తొలగిపోతాయనీ, తిరిగీ వచ్చి తన్ను ఆదరించి తీసుకువెడతాడనీ, విశ్వసించింది. సానికొంపలో ఉండడానికి అంగీకరించింది.

అలా గోరిజాంట్ ఆమెను అనేకవిధాల మోసగించాడు. ఆమెతో నాటకాలు ఆడాడు. ఒకనాడు 'స్నేహితుల్ని చూడ్డానికి వెళ్ళాలి. దుస్తులు ధరించి ముస్తాబు కమ్మ'ని ఆమెతో చెప్పాడు. ఆమెను ఒక స్నేహితుడి ఇంటికి తీసుకెళ్ళాడు; అక్కడ మాయచేసి, మోసగించి, ఆమె పాస్‌పోర్టును పోలీసు స్టేషనులో పచ్చటికెట్టుగా మార్చాడు. పిమ్మట తను వెళ్ళిపోతున్నానని ఆమెతో చెప్పాడు. ఆమె కంటతడిపెట్టింది. తనూ, నిజమైన ప్రేమకలవాడిలా ఆమెను ఓదార్చి, కౌగలించుకుని మాటలు చెప్పాడు. తరువాత రహస్యంగావచ్చి యజమానురాలిని కలుసుకున్నాడు. రెండొందల రూబుల్సు ఇవ్వమని అడిగాడు. కాని ఆమె యాభైమాత్రమే ఇచ్చింది.

మారుమాట్లాడకుండా అంతే చాలునని తీసుకున్నాడు. అవును, ఇది తొలి బేరంకదా, ఇప్పుడే గట్టిపట్టుపడితే ప్రమాదం వస్తుందని అతని అభిప్రాయం. పైగా ముందుచేయబోయే వ్యాపారానికి ఇది పునాదిఅనికూడా భావించి వెళ్ళిపోయాడు.

తరువాత అతను, ఆమెను పూర్తిగా మరచిపోయాడు. సంవత్సరం దాటిపోయినా ఆమె ఇతనికి గుర్తుకురాలేదు. కనీసం ఎలావుందో చూడాలని కూడా అభిలాష కలగలేదు.

దక్షిణ రష్యాలో పశుప్రవృత్తితో బ్రతుకుతోన్న ప్రధాన వ్యక్తులలో ఒకడైపోయాడు గోరిజాంట్. సానులను సప్లయిచేయడంలో ప్రతిభావంతుడని కీర్తిగడించాడు. కాన్‌స్టాంట్‌నోపిల్‌తోటి, అర్జెంటీనాతోటి, ఇతనికి ఎడతెగని వర్తకసంబంధాలున్నాయి. ఒడెస్సాలో బోగంకొంపలు అసంఖ్యాకంగా వున్నాయి. అక్కణ్ణుంచి వేశ్యలను జట్లు జట్లుగా ఓడల మీద రవాణా చేస్తాడు. 'కీవ్'కు తీసుకోస్తాడు. కీవ్‌నుంచి మళ్ళీకొందరు పిల్లలను 'ఖార్కోవ్'కు పంపిస్తాడు. తిరిగీ ఖార్కోవ్‌లోవున్న సానులను 'ఒడెస్సా'కు ఎగుమతి చేస్తాడు. ఇదీ ఇతనివర్తకం. చూచారా, ఎంతపెద్ద వ్యాపారమో. అంతేకాదు. అప్పుడప్పుడు 'ఈ సరుకును' ప్రఖ్యాతి వహించిన, రెండో రాజధాని నగరాలని పేరుగాంచిన పెద్ద పెద్ద పట్టణాలలో కూడా పెడతాడు. ఈ నగరాలలో ఇతనికి రకరకాల ఖాతాదార్లువున్నారు. అనేకమంది పురప్రముఖులు, పెద్దమనుషులు, అధికార్లు, ఆఫీసర్లు, లెఫ్టినెంట్లు గవర్నర్లు, పేరుపొందిన ప్లీడర్లు, ప్రఖ్యాతివహించిన డాక్టర్లు, సిరిసంపదలతో తులతూగే భూస్వాములు, మహదైశ్వర్యంతోను, మద్యమాంసాలతోను మత్తెక్కిన షావుకార్లు; వీరంతా ఇతనికి చిరపరిచితులు, ప్రాణస్నేహితులు. వీరంతా వేశ్యలను అనుభవించడానికి ఇతనిదగ్గరకువచ్చి లావాదేవీలు జరుపుతుంటారు. పురుషుల కామవాంఛను తీర్చే ఈ వేశ్యా ప్రపంచానికి ఇతను సంపూర్ణాధికారి. నదురు బెదురులేని ఏకచ్ఛత్రాధిపతి. పసుపుకత్తెలు, పతితలు, వేశ్యావృత్తిని నడిపే వృద్ధమాతలు, దూతికలు, తార్పుడుకత్తెలు, తక్కువరకపు డాన్సర్లు, ఎక్స్‌ట్రాతారలు, నాటకాల్లో చిన్నచిన్న వేషాలు వేసే నటీమణులు, కోరసుపాడే అమ్మాయిలు, తెర వెనుకపాటలుపాడే గాయకురాండ్రు, వీరందరితోను ఇతనికి దోస్తీ. ఖగోళ

శాస్త్రజ్ఞుడికి ఆకాశంలోని నక్షత్రాలు అరచేతిలోవున్నట్లే, వీరంతా ఇతని గుప్పిట్లోవుంటారు. ఈ యువతులపేర్లు, మారుపేర్లు, వీరి చిరునామాలు, స్వభావాలు, రూపురేఖలు, అన్నీ అచ్చుగుద్దినట్లు ఇతని మనసులో మెదులుతూవుంటాయి. ఇతని మెదడుకు ఇంత జ్ఞాపకశక్తి ఎక్కడిదో ఆశ్చర్యం! నిజానికి వీటికోసం ఒక చిఠా, ఖాతా, ఆవర్జా పెట్టి అకౌంటు నడపాల్సిన అవసరంవుంది. కాని వీటితో పనిలేకుండానే ఈ వివరాలన్నీ ఇతను ఎప్పటికప్పుడు.గడగడ వప్పచెపుతాడు. వేశ్యలకోసం ఇతనిదగ్గరకు వరసగా వచ్చే పురుషులకు రకరకాల అభిరుచులు వుంటాయి. ఎవరి అభిరుచి ఎలాంటిదో, ఎవరికి ఎలాంటి అమ్మాయి నచ్చుతుందో ఇవన్నీ ఇతనికి కొట్టినపిండి. తిరుగుబోతులైన మగాళ్ళున్నారు చూచారూ? వీరికి ఒక్కొక్కరికి ఒక్కోరకమైన అభిరుచివుంది. వీరి ఇష్టాలు బహువిచిత్రంగా వుంటాయి. కొందరికి కాస్త హైక్లాస్ అమ్మాయి కావాలి. కొందరికి సామాన్యమైన యువతి చాలు. మరికొందరికి తనకంటె వయసుముదిరిన, వళ్ళువచ్చిన స్త్రీ అయితేగాని సరిపోదు, ఇంకా కొందరికి అమాయకంగావుండే అమ్మాయిలు కావాలంటారు. మరికొంతమంది అయితే వయసుకూడారాని పసిపిల్లలను తెచ్చిపెట్టమని పట్టుపడతారు. కొందరు విటులు చపలచిత్తంగాను, చెడ్డ వెగటుగాను ప్రవర్తించే స్త్రీలు కావాలంటారు. ఇంకా కొందరు మోటుగా, విపరీతంగా, విపత్కరంగా సంభోగం జరిపే వేశ్యలు కావాలని కోరతారు. కాని ఒకవిషయం. ఇలాంటి విచిత్రమైన, విడ్డూరమైన కోర్కెలు తీర్చడానికి మామూలుగా ఇచ్చేదానికన్నా, ఎంతో ఎక్కువ డబ్బు ఇస్తేగాని ఒప్పుకోడు. మొత్తానికి ఎంతయితేనేం, ఏ పురుషుడు ఎలాంటి స్త్రీ కావాలన్నా కాదనడు, లేదనడు. సప్తసముద్రాలయినా దాటి, వెదకి శోధించి, సాధించి పట్టుకొచ్చి ఇస్తాడు. ఇలాంటి ఘోరమైన నేరాలు చేస్తూవున్నందుకు ఇతన్ని రెండుమూడుసార్లు జైలులోకూడా పెట్టారు. అయితేఏం? ఇతడు ఏమాత్రం చలించలేదు. పైగా దానివల్ల ఇంకా ధైర్యంవచ్చింది. నేరవిచారణలు జరుగుతూ, శిక్షలు పడుతూవున్న కొద్దీ ఇతనిలో సాహసం, తెగింపు వృద్ధిఅవుతూవచ్చాయి. ఏటికేడు పైన పడుతున్నకొద్దీ, అనుభవం గడుస్తున్నకొద్దీ, ఇతనీ వ్యాపారంలో ఆరితేరి, అఖండుడైనాడు. అమితమైన లాభం పొందుతూవచ్చాడు.

ఈకాలంలో ఇతను దాదాపు పదిహేను పెళ్ళిళ్ళు చేసుకున్నాడు. ప్రతిదఫా కొంచెంకట్నంకూడా గుంజాడు. భార్య రాగానే ఆమె ఆస్తిపాస్తులన్నీ కాజేసి హఠాత్తుగా మాయమయ్యేవాడు. లేక సాధ్యపడితే ఆమెను రహస్యంగావున్న సానికొంపకు తీసుకెళ్ళి అమ్మేసేవాడు. పదిహేను మంది భార్యలనూ ఇతను ఇలాగే మోసగించాడు. కొన్నిసార్లు ఆ అమ్మాయిల తల్లిదండ్రులకు ఈ విషయం తెలిసి వాళ్ళు రావడంకూడా జరిగింది. అప్పుడు వాళ్ళు జరిగిన అన్యాయానికి, ద్రోహానికి ఇతనిమీద పోలీసులకు ఫిర్యాదు చేయడం, పోలీసులు ఇతన్ని వెదికి పట్టుకోవాలని ప్రయత్నించడం జరిగింది. అప్పుడీఘనుడు దొరికేవాడుకాదు. రకరకాల పేర్లు పెట్టుకుని ఎవరికీ చిక్కకుండా ఒకఊరినుంచి మరొకఊరికి తిరుగుతూవుండేవాడు. మారుపేర్లతో, మారువేషాలతో ఎవరికీ అంతుచిక్కకుండా తిరిగేవాడు. ఈవిధంగా ఇతను ఎన్నిపేర్లుపెట్టుకున్నాడో, ఎన్నిసార్లు పేరుమార్చుకున్నాడో ఇతనికే తెలీదు. జ్ఞాపకంలేదు. అసలు తన స్వంతపేరు ఏమిటోకూడా ఇతనికి గుర్తులేదు. అంచాత ఇతని అసలుపేరు ఏమిటో ఈశ్వరుడికే తెలియాలి.

ఇంతటి నీచకార్యాలు చేస్తున్నా, ఇవన్నీ నేరాలు అనిగాని, తప్పులనిగాని ఇతను భావించడు. గోధుమపిండి, మాంసం, చేపలు, సున్నం, కలపసామానులు మొదలైన వ్యాపారాలన్నీ ఎంతో, ఇదీ అంతే అనుకుంటాడు. తక్కిన వ్యాపారాలమీద తిరిగేవాళ్ళు ఎలాంటివాళ్ళో, తనూ అలాంటివాడేనేనని; అంతకన్నా అధికమైన నేరం తన దేమీలేదనీ ఇతని నమ్మకం. ఏమైతేనేం? ఈ వృత్తి ఇతనికి న్యాయమైందిగానే తోచింది. తన వృత్తిలో తాను హుందాగానే ప్రవర్తిస్తాడు. తన వృత్తికి సంబంధించిన నీతి, నిజాయితీ ఇతనికీవున్నాయి. పండుగలలోను, పవిత్రమైన దినాలలోను తను ఎక్కడున్నాసరే, ఎన్నిపనులలోవున్నాసరే, చర్చికి పోకుండావుండడు. ప్రార్థన చేసుకోవడం మరిచిపోడు. ఇతనికి తల్లివుంది. ఒక సోదరికూడా వుంది. తల్లి వృద్ధురాలు. సోదరికి గూనివచ్చింది. వీరిద్దరూ ఒడెస్సాలో వున్నారు. వీరిద్దరి పోషణకూ, ఇతను ఎప్పటికప్పుడు డబ్బు పంపిస్తూవుంటాడు. ఒక్కోసారి పెద్దమొత్తాలు పంపుతాడు. మరోసారి స్వల్పమొత్తంకూడా పంపడంకద్దు. ఏమైనా, తను ఏఊరిలో మకాంచేస్తే ఆవూరినుంచి ఇంటికి తప్పకుండా పైకం పంపుతుంటాడు. ఆవిషయంలో

ఏమాత్రం అశ్రద్ధ చేయడు. ఇతనికి బ్యాంకులో డబ్బు నిల్వవుంది. ఆ సొమ్మును వడ్డీకూడా ముట్టుకోకుండా, క్రమక్రమంగా వృద్ధిచేస్తూవచ్చాడు. అత్యాశ, లోభితనం ఇతని స్వభావంలోనే లేవు. నిజానికి ధనార్జనకోసమని ఇదొక సులువైన వర్తకమని, ఇతను ఈ వృత్తి చేపట్టలేదు. ఇతనిది విచిత్రమైన ప్రకృతి. ఆ చురుకుదనం, ఆ సాహసం, ప్రమాదాలను, ఆటంకాలను ఎదుర్కొంటూవుంటే కలిగే ఆనందం ఇవన్నీ ఇతన్ని ఈ వృత్తిలోకి దింపాయి. ఈపని కులాసాగా, తమాషాగా, ఒక ఆట ఆడుతున్నట్లుగా వుంటుంది ఇతనికి. ఈవృత్తిలో తనకు అపజయం లేదనే గర్వంకూడా వుంది.

ఇహ ఆడవాళ్ళను ఆకర్షించడంలో గోరిజాంట్‌కు ఒక ప్రత్యేకత వుంది. ఎంతలావు ఆడదాన్ని అయినా ఇట్టే వల్లో వేసుకుంటాడు. వాళ్ళను ఒక ఆట ఆడిస్తాడు. సర్కస్ చేయిస్తాడు. ఇలాంటి ప్రజ్ఞకనుక లేకపోయినట్లయితే ఇతను ఈపనిలో ఎప్పుడో దెబ్బతినేవాడు. కాదూ మరి? స్త్రీలంటే సామాన్యమా? అందులోనూ వేశ్యలు! హు! ఒక్కొక్క వేశ్య ఎన్ని జిత్తులు పన్నుతుంది! ఎన్ని గమ్మత్తులు చేస్తుంది! ఎంతోమంది కొమ్ములు తిరిగిన మగాళ్ళను చిత్తుచేసిన ఘటాలు ఇవి. అయితే ఏం? ఎంతకిలాడీ అయిన ఆడది అయినాసరే, గోరిజాంట్ చేతుల్లో పిల్లికూనలా పడివుండాల్సిందే. వేశ్యలందరికీ గురువు గోరిజాంట్. అతను ఏపని చేయమంటే వాళ్ళు ఆపనిచేస్తారు. అతను పిలవగానే దగ్గరికొస్తారు. అతనికి మచ్చిక అవుతారు. లొంగిపోతారు. దాసీలై, బానిసలై, భయభక్తులతో పడివుంటారు. అతను కూడా వాళ్ళను, తగిన కట్టుబాట్లలోనే వుంచుతాడు. అనవసరంగా చనువు ఇవ్వడు. గొప్ప ఆత్మవిశ్వాసం, సాహసం, అధికారం వెళ్ళగక్కుతూ వాళ్ళ మీద పెత్తనంచేస్తాడు. కీలుబొమ్మల్లా ఆడిస్తాడు. సర్కస్‌లో జంతువు వుంటుంది చూచారూ? తన పొగరంతా చంపుకుని యజమానికి దాసోహం అంటుంది. అతని చూపులు, కంఠస్వరం, తాకడం, వీటినిబట్టే అది తన యజమాని అభిప్రాయాలుగుర్తించి అప్రకారంనడుచుకుంటుంది. అలాగే ఈవేశ్యలుకూడా సర్కస్‌లో జంతువుల మాదిరి ఇతనికి బానిసలై ఇతని ఉద్దేశ్యాలను నెరవేరుస్తూ పడివుంటారు.

గోరిజాంట్ తాగుతాడు. కాని ఒంటరిగా తాగడు. మిత్రులతో కలిసివున్నపుడుమాత్రమే మితంగా తాగుతాడు. భోజనంవిషయంలోకూడా

పెద్ద పట్టింపులేదు. వేళకు ఏదివుంటే అది సరిపుచ్చుకుంటాడు. కాని ప్రతి మనిషికీ ఏదోఒక బలహీనత వున్నట్టే, ఇతనికికూడా షోకులపిచ్చి జాస్తి. మంచిగుడ్డ కంటికి కనపడితే వదిలిపెట్టడు. ఎప్పుడూ మంచిమంచిసూట్లు వేస్తాడు. ఖరీదైన దుస్తులు ధరిస్తాడు. రకరకాల నెక్ టైలు మారుస్తాడు. డ్రాయర్లు, ప్యాంట్లు, చొక్కాలు, కోట్లు, అన్నీ సరికొత్తరకాలు సంపాయించి ధరిస్తాడు. కొత్తకొత్త చేతిగడియారాలు పెడుతుంటాడు. చాలా అందమైన, విలువైన బూట్లు ధరించడంకూడా ఇతనికి అలవాటు.

గోరిజాంట్, తన భార్యను వెంటతీసుకుని స్టేషనునుంచి సరాసరి హెర్మిటేజ్ హోటలుకు వెళ్ళాడు. హోటలులో పనివాళ్లు అంతా ఒకేరకమైన నీలిరంగుదుస్తులు వేసుకుని, టోపీలు పెట్టుకుని యూనిఫారంలో వున్నారు. వాళ్ళు ఇతని సామాను మోసుకుని హోటలుముందున్న వసారాలో దింపారు. గోరిజాంట్ తన భార్యచేయిపట్టుకుని ఠీవిగా వారివెంట వెళ్లాడు. ఈ దంపతులిద్దరూ మంచిదుస్తుల్లో వున్నారు. గోరిజాంట్ పొడుగాటి ఇంగ్లీషు ఓవర్ కోటు ధరించాడు. సరికొత్త పెనామాహేట్ పెట్టుకున్నాడు. చేతిలో నాజూకైన చిన్న పేముబెత్తం వుంది. దానికి వెండి పొన్నుకూడా వేయించాడు. నిజంగా ఈ దుస్తుల్లో వయ్యారంగా గోరిజాంట్ నడిచివెళుతూంటే ఎంతటివాడికైనా కళ్ళు చెదురుతాయి.

'ముందు యజమానిదగ్గర ఉత్తర్వుతీసుకుని, పేరు రిజిష్టరులో చేర్పించుకుంటేగాని హోటల్లోకి రావడానికి వీల్లేదు' అన్నాడు దున్నపోతులా వున్న హోటలుకాపలావాడు. కాని గోరిజాంట్ అతనిమాటకు చలించలేదు. అతని వ్యవహారం తనకు తెలియకపోతేకదూ?

'ఓ! జాఖర్! నీ కథ ఎప్పుడూవున్నపాటే కదోయ్!' అన్నాడు గోరిజాంట్, సరదాగా, సంతోషంగా, అతని భుజంతట్టుతూ. 'ఏం! జాఖర్! యజమాని ఉత్తర్వు వుంటేగాని వీల్లేదు అంటావే ఎప్పుడుబట్టినా? నేనేం కొత్తవాణ్ణనుకున్నావా? ఎప్పుడొచ్చినా ఇక్కడే దిగుతానని నీకు తెలుసుగా! సరేలే; నేను మూడురోజులు మాత్రమే ఇక్కడుంటాను. నీ ఇల్లు బంగారంగాను, గోలచేయక ఊరుకో. ఆ తరువాత గదులన్నీ నీయిష్టం. ఏమైనా చేసుకోవచ్చు. ఒక్క మూడురోజులు,అంతే. జాఖర్! ఇటు మాడు;

నీకోసం, ఒడెస్సానుంచి ఓ మంచివస్తువు పట్టుకొచ్చానోయ్! చూస్తే కళ్ళు చెదురుతాయి, ఏమనుకున్నావో!' అంటూ గోరిజాంట్ కాపలావాడి చేతిలో ఒక బంగారపు కణిక పడేశాడు.

అలాంటిది ఎప్పుడు పడుతుందా అనే వాడు ఎదురుచూస్తున్నాడాయె! దాన్ని తీసుక్కొని జేబులో పడేసుకుని, మళ్ళీ మారుపలకకుండా ఊరుకున్నాడు.

# 3

గోరిజాంట్ ఆ హోటల్లో మూడురోజులున్నాడు. ఈ మూడు రోజుల్లోనూ అతను కనీసం మూడొందలమంది మనుషులను కలుసుకున్నాడు. అది అసలే ఒక పెద్ద రేవుపట్నం. సొగసుకు, శృంగారానికి నిలయం. ఇతని రాకతో ఆ నగరం అల్లకల్లోలమైంది. అక్కడి ప్రజానీకంలో ఓ కొత్తజీవితం ప్రారంభమైంది. ఇళ్ళల్లో పనిచేయడానికి దాసీలను సమకూర్చే ఏజన్సీలు కొన్నివున్నాయి. వాటి యజమానురాండ్రు ఇతన్ని చూడ్డానికి వచ్చారు. వేశ్యాగృహాలు నడిపే యజమానురాండ్రు, పడుపుకత్తెలను తార్చే దూతికలు, ఈ వృత్తిలో ఆరితేరి తలపండిపోయిన వృద్ధురాండ్రు అనేకమందివచ్చి ఇతన్ని కలుసుకున్నారు. గోరిజాంట్ తన శక్తి వంచనలేకుండా అందరికోర్కెలు తీర్చడానికి, అందరిపనులు నెరవేర్చడానికి కృషిచేశాడు. ఈపనిఅంతా అత్యాశవల్ల కాదు చేసింది. సహజంగా అతనికి ఈవృత్తిలోవున్న అపేక్ష, అహంకారంవల్లనే అలా చేశాడు. అందరితోనూ గీచిగీచి గట్టిగా బేరంచేశాడు. ఆడవాళ్ళను వీలైనంత చౌకగా కొనాలని, తనకు వచ్చే కమీషన్లో కాస్తఅయినా తగ్గిపోగూడదని గట్టిగా పట్టుపట్టి ఖచ్చితంగా బేరాలు ఆడాడు. అయితే మంచిబేరంగా తోచినప్పుడు అవసరమైనప్పుడు పది పదిహేను రూబుల్సు తేడాకోసం వ్యాపారం పాడుచేసుకోడు. ఈవృత్తిలో ఇతనికి పోటీగా మరొకతను ఉన్నాడు. అతని పేరు యామ్పొలొస్కీ. అతన్ని ఎలాగైనా పడగొట్టాలని గోరిజాంట్

ఉద్దేశ్యం. అతను తనకు పోటీగా వచ్చినప్పుడు కాస్త ఎక్కువయినా, తక్కువయినాసరే లెక్కచేయకుండా బేరం కుదుర్చుకుంటాడు.

వచ్చిననాడే గోరిజాంట్ బెల్లా అనే అందమైన పిల్లను వెంటబెట్టుకుని ఒక ఫొటోగ్రాఫరుదగ్గరకు వెళ్ళాడు. అతనిపేరు మెజర్. అక్కడ ఆ అమ్మాయితోకలిసి రకరకాల పోజులలో ఫొటోలు తీయించుకున్నాడు. ఆవిధంగా యిరవై ఫొటోలు ఎత్తించాడు. ఫొటోగ్రాఫరువద్దనుంచి ప్రతి ఒక్క ఫొటోకు అయిదురూపాయల చొప్పున డబ్బు గుంజాడు. ఆ డబ్బులో ఫొటోకు ఒక్కొక్క రూపాయచొప్పున మాత్రమే బెల్లాకు యిచ్చాడు. మిగతాదంతా తనదే. ఆతరువాత బార్సులోనా చూడ్డానికి వెళ్ళాడు.

ఆమె ఒక వేశ్య. ఒకప్పుడు బ్రహ్మాండంగా పడుపువృత్తి సాగించి పదివేళ్ళతో సొమ్ము సంపాదించినఆడది. ఇప్పుడు విశ్రాంతి తీసుకుంటోంది. బాగా వృద్ధురాలు అయిపోవడంవల్ల వ్యాపారం తగ్గించింది. 'పాల్' అనే అందమైన వయసు కుర్రాణ్ణి, ఇంట్లోపెట్టుకుని, అతన్నే భర్తగా చూచుకుంటూ పోషిస్తోంది. అతనిచేత ఒక నైట్ క్లబ్ కూడా నడిపిస్తోంది. ఈమెకు ఏవిషయంలోను కొదవలేదు. కావల్సినంత ధనం ఆర్జించడంవల్ల విలాసంగా వినోదంగా జీవిస్తూవుంది. గోరిజాంట్ వెళ్ళి ఆమెను కలుసుకున్నాడు. ఇద్దరూ నిర్భయంగా, స్వేచ్ఛగా, సిగ్గు, బిడియం లేకుండా, పాతస్నేహితులకుమల్లె మాట్లాడుకున్నారు.

'ఏవమ్మా! నాదగ్గర ముగ్గురు అందమైన స్త్రీలు వున్నారు. నీవు కావాలంటే ఇచ్చేస్తాను. ఒకామె బాగామంచివున్న మందయాన. చెప్పినట్లు అణగిమణగి వుంటుంది రెండోది కుర్రాది. మంచి వయసులోవున్న కోమలి. దేనికైనాసిద్ధం. మాట తబ్బీలువస్తే నన్ను అడుగు. ఇహ మూడో ఆమె ఒక అద్భుతమైన అమ్మాయి. పల్లెత్తి మాట్లాడదు. ఎప్పుడూ చిరునవ్వుతో వుంటుంది. కాని ప్రాణం అయినా యిస్తుందిసుమా! అందమైన అమ్మాయికూడాను!' అన్నాడు గోరిజాంట్ ఆ వృద్ధవేశ్యతో.

ఆమె ఒకసారి అతనివైపు చూచి లాభంలేదన్నట్లు తలూపింది.

'ఎందుకు గోరిజాంట్! మళ్ళీ నన్నెందుకు ఈ రొంపిలోకి లాగుతావ్? యిదివరకు చేసినట్లే చేయడానికా?'

'ఆరిదేవుడా! నేను బ్రతికుండగా నిన్ను మోసంచేస్తానటమ్మా? అసలువిషయం చెపుతాను విను. ఈనలుగురితోపాటు మరో చదువుకున్న స్త్రీనికూడా నీకు వప్పచెపుతాను. మంచి విద్యావంతురాలు. ఆమెతో నీవు ఏంకావాలంటే అది చేయించుకోవచ్చు. సంగీతం, సాహిత్యం, నృత్యం, చిత్రకళ అన్నిటిలోనూ ఆరితేరిన స్త్రీ. నామాట నమ్ము... కావల్సినంత ధనం గడించవచ్చు...'

'మళ్ళీ ఒక పెళ్లాన్ని తెచ్చావూ?' అంది ఆమె నవ్వుతూ.

'కాదు. ఆమె గొప్పయింటపుట్టిన పిల్ల.'

'అయితే యింకేం? మళ్ళీ పోలీసులతో చిక్కులు తెచ్చిపెడతావు.'

'ఆరిదేవుడా! నా మాట నమ్మవేం? నీవు ఎక్కువడబ్బు పెట్టాల్సిన పనిలేదని చెపుతున్నా. ఇదీ అసలుసంగతి— ఈ నలుగురికీకలిపి ఏభవ వేయి రూబుల్సు పడేయి, చాలు.'

'ఎందుకు? మొహమాటం లేకుండా మాట్లాడుకుందాం చెప్పు. అయిదొందలిస్తాను. వంటికిమించిన లాయిలాస నాకక్కర్లేదు నాయనా!'

'నామాట వినవమ్మా తల్లీ! మనం కొత్తవాళ్ళమా చెప్పు! ఎన్నోసార్లు నీకూ నాకూ బేరాలు జరిగాయి. నిన్ను చస్తే మోసంచేయలేను. నీవు 'ఊ' అంటేచాలు. ఆమెను సరాసరి యిక్కడకు తీసుకొచ్చేస్తాను. కాని దయచేసి నీవొక పనిచేయాలి. నీవు నా పినతల్లివని చెప్పు. ఆమె దగ్గర అలాగే నటించు. ఏమంటావు? నేనిక్కడ ఓ మూడురోజులు మాత్రమే వుంటాను.'

ఆతని మాటలు విని 'బార్సకోవా' పెద్దగా పొట్టవుబ్బేలా నవ్వడం మొదలెట్టింది. అలానవ్వుతోంటే ఆమెరొమ్ములు, పొట్ట, కంపరంపుట్టినట్లు కదులుతున్నాయి. 'అనవసరంగా అడ్డదిడ్డమైన బేరంచేస్తే ప్రయోజనంలేదు. నేను నిన్ను మోసంచేయను, నీవు నన్ను మోసంచేయవు. చెప్పు. యిప్పుడు ఆడవాళ్ళకు మంచి గిరాకీవుంది. ఈగిరాకీలోనేతో సెయ్యాలి. ఏమంటావు? నేను అడిగిన మొత్తానికి యిష్టమేనా? గోజాంట్! ఒకగ్లాసు ద్రాక్షసారాయి పుచ్చుకోవూ? చాలాకాలమైంది' అన్నదామె, అతన్ని మర్యాదగా బేరానికి ఒప్పించాలని 'థ్యాంక్స్. చాల సంతోషం. నీచేతి సారా తాగి చాలాకాలమైంది.'

'లోపలికి రా! ఎంత చెడ్డా మనం పాతస్నేహితులం. అయితే గోరిజాంట్! ఏడాదికి ఏపాటిసంపాయిస్తున్నావ్?'

'ఏం చెప్పమంటావమ్మా? ఏదో వస్తూనేవుంది...... పన్నెండు వేలు, యిరవై, అలావుంటుంది మొత్తం మీద. కాని విపరీతమైన ఖర్చులున్నాయి. నీకు తెలియనిదేమున్నదీ? నా ప్రయాణపుఖర్చే బోలెడంత గుంజుకుపోతోంది'

'అయితే ఏమాత్రం మిగలడంలేదా?'

'ఆ! ఏదో కొద్దిగా...అన్నీపోను సంవత్సరానికి ఓ రెండుమూడు వేలు మిగులుతాయి.'

'నేను ఒక పదో ఇరవయ్యో మిగులుస్తావనుకుంటున్నాను...'

అలా ఆమె తన స్వసంపాదన విషయంలో అత్యాసక్తి చూపించడం గోరిజాంట్‌కు నచ్చలేదు.

'నా సంపాదనవిషయంలో నీకేమిటి అంత ఆసక్తి?' కొంచెం కోపంగానే అడిగాడు గోరిజాంట్.

బార్సకోవా కాలింగ్ బెల్ నొక్కింది. వెంటనే లోపల్నుంచి ఓ చురుకైన దాసీపిల్ల వచ్చింది. ఒకసీసా ద్రాక్షసారాయి, గట్టి మీగడ కలిపిన కాఫీ పట్టుకురమ్మని ఆమెను ఆజ్ఞాపించింది. అవును, గోరిజాంట్‌కు ఎలాంటి పానీయాలు ఇష్టమో బార్సకోవాకు బాగా తెలుసు.

'నీకు షెప్‌షెలోవిచ్ తెలుసా?' మళ్ళీ అడిగింది ఆ వృద్ధురాలు.

'ఆరిదేవుడా! అతన్నెవరు ఎరుగరు! దేవుడిలాంటివాడైతేను. అమోఘమైన బుర్రకదూ!' అన్నాడు గోరిజాంట్. ఆమె ప్రారంభించిన సంభాషణ నిజానికి అతనికి ఇష్టంలేదు. తనను ఏవేవో మాటల్లోపడేసి బుట్టలో పెట్టుకోడానికి చూస్తోందని వెంటనే గ్రహించాడు. కొంచెం ఉద్రేకంతో మళ్ళీ మాట్లాడసాగాడు.

'షెప్‌షెలోవిచ్ గతసంవత్సరం ఏంచేశాడోచూచావా? కోవ్నో, విల్‌నా, ఝటోమిర్, మొదలైన ప్రదేశాలనుంచి ముప్ఫయిమంది ఆడవాళ్ళను అర్జెంటీనా కొట్టుకుపోయాడు. అక్కడ ఒక్కొక్క అమ్మాయిని వేయి రూబుల్స్‌కు అమ్మేశాడు. ఇహ లెక్కవేసుకోవమ్మా! ఎంత డబ్బొచ్చిందో! ముప్ఫయివేల రూబుల్స్! కాని అంతటితో అతను తృప్తిపడ్డాడనుకున్నావా!

లేదు. కొంతమంది నీగ్రోపిల్లలను కొన్నాడు. వాళ్ళను మళ్ళీ వెనక్కి తీసుకొచ్చి, మాస్కో, పీటర్స్‌బర్గు, కీవ్, ఒడెస్సా పట్టణాలలో పెట్టాడు. చూచావా? ఖర్చుకు లోభించకుండా బేరంచేసి రెండుగుప్పిళ్ళతో సొమ్ము సంపాయించాడు. వాడుమనిషి కాదమ్మా! రాబందు! వ్యాపారంఅంటే అతని కొక్కడికే తెలుసు!' అదివిని ఆమె నవ్వుతూ తనచేయి అతని తొడమీద వేసింది. స్నేహాంకలు పుతూ ఇలాఅంది. "అదిసరే గోరిజాంట్!..... నాకొకటిచెప్పు...నీ దగ్గర ఎవరైనా అమాయకులు, అవివేకులు అయిన అమ్మాయిలున్నారా? అలాంటిపిల్లలకు ఇప్పుడు మాంచి గిరాకీవుంది. నా మాట అబద్ధమేమో చూస్తూవుండు. నీ ఖాతాదార్లుకూడా ఇలాంటిపిల్లలే కావాలంటూ నీదగ్గరికొస్తారు...అసలేమిటో అందరికీ ఇలాంటి పిల్లలమీద మనసుమళ్ళింది...నాకే అర్ధంకాకుండావుంది'

గోరిజాంట్ నేలమీదికిచూస్తూ తలగోక్కున్నాడు. తరువాత ఇలా అన్నాడు.

'సరే...చూడు...నా భార్యవుంది...నీవు ఇందాకనే గ్రహించావనుకుంటా?...'

'గ్రహించకపోతేయేంలే! ఇప్పుడు పోయిందేముంది? విప్పిచెప్పరాదూ?'

"ఏంచెప్పను బార్సుకోవా? నాకు సిగ్గుగా, చిన్నతనంగావుంది... భార్య అని చెప్పడానికి నోరుగావడంలేదు...నిజంగా ఆమె నాఅర్ధాంగి... ప్రధానంకూడా అయిపోయింది."

అదివిని తిరిగీ ఆమె బిగ్గరగా నవ్వసాగింది. పిమ్మట ఇలాఅంది. "గోరిజాంట్! నిజంగా నీ వింత దుర్మార్గుడవని కలలోకూడా అనుకోలేదు. సరే, మాకు నీభార్యనే వప్పచెప్పు. కాని మరి, ఆమె నీఅదుపులోవుందా?'

"ఓ! ఆవిషయంలో నాదీ పూచి! కాని వేయిరూబుల్స్!"

"ఆసొమ్ము నాకో లెక్కలోదికాదు. కాని సందేహంఅల్లా ఒక్కటే. ఆవిడను నేను వంచుకురాగలనో లేనో తేల్చిచెప్పు"

'ఆవిషయం నీవు అణుమాత్రం సందేహించాల్సిన పనిలేదు. మళ్ళీ నీవు నా పినతల్లిగా మారిపోతావు. నీదగ్గర ఆమెను వుంచివెళుతున్నట్లు, మామూలుప్రకారం నటిస్తాను. చూడు మేడమ్! ఆమె నేనంటేపడిచస్తుంది.

నన్ను చూడకపోతే ఆమెకు పిచ్చెక్కుతుంది. నాకోసం నీవు అదిచెయ్యి ఇదిచెయ్యి అనిచెప్పు. తక్షణం చేసేస్తుంది. నీకు ఏగొడవా రాదు'

గోరిజాంట్ అలా నిక్కచ్చిగా అన్నివిషయాలు చెప్పేసరికి, ఆ వృద్ధురాలు ఇహ మాట్లాడకుండా అంగీకరించింది. వెంటనే ఒక ప్రామిసరీ నోటు తెప్పించింది. దానిమీద తన పూర్తిసంతకం చేసింది. చదువురానం దున సంతకంపెట్టేసరికి ఆమె తాతలు దిగొచ్చారు. నిజానికి ఈ ప్రామిసరీ నోటుకు విలువలేదు. అయితేఏం? వీరంతా దీన్ని బాంకుకన్నా ఎక్కువగా చూచుకుంటారు. ఈ పాడువృత్తిలోవున్న నీతిఅల్లా ఇదే! ఇలాంటి వ్యవహారాల్లో ఒకరినొకరు ఎన్నడూ మోసంచేసుకోరు. అలా ఎవరైనా చేశారా? అంతటితో చెల్లు. ఆమనిషి ఏనడివీధిలోనో, లేక ఏ ఇంట్లోనో, ఏదిబ్బమీదనో చచ్చిపడుండాల్సిందే.

ఆ తరువాత బార్సుకోవా వుంచుకున్న కుర్రాడు పోల్ అక్కడికి వచ్చాడు. వంకులొంకుల క్రాఫు, కోరమీసాలు- ముచ్చటగావున్నాడు. వాళ్ళమధ్యకు వచ్చి కూచుని బ్రాందీతాగాడు. జరుగుతోన్న బేరాన్ని గురించి సంగతి సందర్భాలు అడిగి తెలుసుకున్నాడు. ఇతనే నైట్‌క్లబ్‌కు యజమాని! అక్కడేదో వ్యాపారం బాగాలేదని ఆమెతోచెప్పాడు. తరువాత గోరిజాంట్ తన హోటలుకు టెలిఫోన్‌చేసి భార్యతో మాట్లాడాడు. తాను వున్నచోటు చెప్పాడు. వెంటనే ఆమెను అక్కడికివచ్చి కలుసుకోమన్నాడు. అలానే ఆమె వచ్చింది. రాగానే ఆమెకు తన పినతల్లిఅని వృద్ధురాలిని, తన పినతల్లికొడుకనిచెప్పి పోల్‌ను పరిచయంచేశాడు. తనేదో చిక్కుల్లోవున్నాననీ, రాజకీయకారణాలవల్ల వెంటనే పట్నం వదిలిపెట్టి పోవాల్సివచ్చిందని తన మామూలుపాఠంచెప్పి ఒప్పించాడు. తను వచ్చిందాకా పినతల్లిదగ్గరే వుండమని నచ్చచెప్పాడు. ప్రేమతో ఆమెను కౌగలించుకున్నాడు. ఆమెపేరు సారా. వెళ్ళిపోతూ గోరిజాంట్ కంటతడికూడా పెట్టాడు. పాపం, ఆ ఇల్లాలు నిజమని నమ్మింది.

# 4

గోరిజాంట్ (అతని పేరేమిటో ఆ భగవంతుడికే తెలియాలి— గోగోలిదిచ్, గిడాలెరిచ్, ఒకొవ్‌నోవ్, గోస్మీటావ్‌స్కీ; ఇలాంటిపేర్లు చాలా వున్నాయి.) రాకతో 'యామా'లోకూడా పెద్ద సంచలనం కలిగింది. అక్కడ అనేకమార్పులు జరిగాయి. ఆ మార్పులు చాలా పెద్దఎత్తున జరిగాయి. ట్రెప్పెల్సులో వున్న వేశ్యలు అన్నాఇంట్లోకి, అన్నాదగ్గరున్న వేశ్యలు, ఇంకా తక్కువరకమైన అంటే ఒకరూబులు రేటుగల కొంపల్లోకి మార్చబడ్డారు. అలాగే ఈ కొంపల్లోవున్న ఆడవాళ్ళు ఇంకా నీచస్థితిలో వున్న కొంపల్లోకి, అంటే యాభైకోపెక్కుల రేటుగలచోటికి మారారు. ఒక్క అమ్మాయికూడా పైమెట్టుకు పోవడంలేదు. అంతాకిందికే. దిగజారుడే. ఈవిధంగా మార్పులుచేసి గోరిజాంట్ బాగా డబ్బుగడించాడు. ఇలా ఆ ఇంట్లోంచి, ఈ ఇంట్లోకి సానులను మార్చినందుకు, ప్రతిమార్పుకు వారి వారి గిరాకినిబట్టి అయిదురూబుల్సు మొదలు అయిదువందలవరకు గడించాడు. నిజానికి ఇలాంటిమార్పులు మారుబేరాలు చేయడానికి గొప్ప శక్తి, సాహసం, తెలివి, చాకచక్యం కావాలి. ఈపనిలో గోరిజాంట్ ప్రతిభాశాలి అని చెప్పవచ్చు. ఫిన్‌లాండ్‌లోవున్న 'ఇమాట్రా' జలపాతానికి ఎలాంటి శక్తివుందో, ఇతనికి అలాంటి శక్తివుంది. ఒకనాటి మధ్యాహ్నం గోరిజాంట్ అన్నా ఇంట్లోకూచుని కాళ్ళూపుకుంటూ, సిగరెట్ కాలుస్తూ మాట్లాడుతున్నాడు.

"సోంకా విషయం ఏమాలోచించావు 'అన్నా'? అది చాలాతక్కువరకపుపిల్ల. ఇప్పుడే దాన్ని మరోచోటుకు మార్చావూ అంటే, ఓ వంద రూబుల్సు నీకూ, ఓ పాతిక నాకూ వస్తాయి. ఏమంటావు? నిజంగా చెప్పు. ఇంతకంటె ఆపిల్లకు ఎక్కువగిరాకీ ఉండంటావా?" అన్నాను అడిగాడు గోరిజాంట్.

"అబ్బ! నీవు వేధించుకు తినడంలో మొనగాడివి పాట్‌స్కీ! ఆపిల్లను చూస్తే నాకు జాలివేస్తుంది. నిజానికి నీవనుకున్నంత చెడ్డపిల్లకాదు ఆమె" అంది అన్నా.

గోరిజాంట్ (పాట్‌స్కీ) ఒకక్షణం మౌనంగా వున్నాడు. ఆమెకు తగిన సమాధానం చెప్పాలని మంచిమాటకోసం వెదుకుతున్నాడు. కొంచెం ఆగి, గభాలున ఇలా అన్నాడు.

"ఎవడైతే పడతాడో వాణ్ణే నెట్టాలమ్మా! నామాట విను. ఆపిల్లకు ఏమాత్రం గిరాకీలేదు."

పక్కనవున్న అన్నామొగుడు ఇమయాకూడా గోరిజాంట్ అభిప్రాయంతో ఏకీభవిస్తూ అతన్ని సమర్థించసాగాడు.

'గోరిజాంట్ చెప్పింది అక్షరాల నిజం. ఆ పిల్లకు గిరాకీలేదు. ఆమె సామాను అంతాకలిసి యాభైరూబుల్స్ ఖరీదు చేస్తుంది. పాతికరూబుల్స్ పాట్‌స్కీకి పోతాయి. మనకో యాభైరూబుల్స్ మిగులుతాయి అన్నా! దేవుడిదయవల్ల ఆ పిల్లతో మనకు బాధతప్పుతుంది. ఆపిల్లకాస్తా బయటికి పోయిందంటే, ఇహ మనఇంట్లో మిగిలినదంతా కత్తిలేనిసరుకు. ఒక పిల్లకూడా వంకలేదు' అన్నాడు ఇమయా.

ఇంకేంకి సోంకాను అన్నాఇంట్లోంచి బయటికిపంపడం జరిగింది. ముందు ఒకరూబులు ఇంట్లోకి, పిమ్మట అన్నిటికంటె అధ్వాన్నమైన యాభై కోపెక్కుల కొంపలోకి మారింది. ఈ కొంపల్లోకి రాత్రిఅంతా సందు లేకుండా వట్టి అలగాజనం, చెత్తమూక వచ్చిపోతుంటారు. ఇక్కడవుండే వేశ్యలకు మంచి బలం, నరాల్లో పటుత్వం, ఎన్ని దెబ్బలకైనా తట్టుకునే ఓర్పు వుండాలి. లేకపోతే భరించడం కష్టం. వచ్చేనరాత్రి చెల్లుకోవాల్సిందే!

ఈ కొంపల్లో ఒకనాటిరాత్రి ఏంజరిగిందనుకున్నారు! ఇక్కడ ఫెక్లా అనే వేశ్య ఒకతెవుంది. పర్వతంలాంటి ఆకారం. పంచెపుగుండులా మూడొందల పౌనుల బరువు వుంటుంది. తనవద్దకు వచ్చిన విటుడితో బయటికి పరుగెడుతూ, పనిమనిషితో పెద్దగా ఇలా అంది.

"ఏవమ్మోయ్! విను. ఇతనితో మొత్తం ముప్ఫయి ఆరుగురు. జ్ఞాపకంవుంచుకో!"

అదివినేసరికి 'సోంకా' భయంతో వణికిపోయింది. 'ఎంతదారుణం! ఒకరాత్రి, ఒకస్త్రీతో ముప్ఫయిఆరుగురు మగాళ్ళే!' ఆ పిల్లగుండెలు కొట్టుకున్నాయి.

కాని అదృష్టవశాత్తూ 'సోంకా'ను ఇక్కడకూడా అనాకారికిగిం దనే జమకట్టారు. వచ్చిన విటులు చాలమంది ఆమె అంటే ఇష్టపడక, తక్కిన పిల్లలతో వుండిపోయేవాళ్ళు. అంచేత ఈమెకు, అందరికిమల్లే యమయాతన పడాల్సిన అవసరం లేకపోయింది. ఈమెను ప్రేమిస్తోన్న ఆ మందులషాపు కుర్రాడు ఇక్కడికికూడా వచ్చేవాడు. ప్రతిరోజు తనమామూలుప్రకారం రావడం, ఆ పిల్లపక్కన కూచుని గడపడం జరుగుతూనేవుంది. ఇంతనీచస్థితి లోకి దిగజారిపోయినా, ఆమెమీద అతనికి ప్రేమ పోలేదు. వెనుకటిమాదిరి గానే ప్రేమిస్తూవున్నాడు. కాని ఆపిల్లను అక్కణ్నుంచి తప్పించి, బయ టికి తీసుకపోలేదు. అతనికి సహజంగావున్న పిరికితనం, అసమర్థత, అందుకు కారణాలు అవుతూనేవచ్చాయి. అయినా ప్రేమించడంమానలేదు. ఆమెను చూస్తూ, జరుగుతూవున్న ఘోరాలన్నీ ఓర్పుతో సహిస్తూవున్నాడు. ఆడపాదడపా ఏమగాడైనా ఆపిల్లవద్దకువస్తే అసూయపడుతున్నాడు. మన సులో కుమిలిపోతున్నాడు. పాపం! ఆ దుర్బల హృదయుడు చేయ గలిగింది అంతే!

# 5

నగరంలో ప్రసిద్ధ గాయకురాలు ఒకామె వుంది. ఆమెపేరు ఎల్లెనా రోవిన్‌స్కాయా. ఆమె పాటకచ్చేరిచేస్తే జనం పగలబడి, విరగబడి వచ్చి వింటారు. అలాంటి ఆమెకు ఒకనాడు పొద్దుపోలేదు. మనసంతా చికాకుగావుంది. ఏదో కొత్తవిషయంవైపు బుద్ధిమళ్ళిస్తేగాని కులాసాచిక్క దని భావించింది. యామానుగురించి అంతా ప్రసిద్ధంగా చెప్పుకుంటారు కదూ? ఇంకేం? అక్కడవున్న వింతలు, విశేషాలు ఏమిటో వెళ్ళిచూస్తే ఆనాడు బాగా కాలక్షేపం అవుతుందని నిశ్చయించుకుంది. తన స్నేహితు లను వెంటబెట్టుకుని యామావీథులు చూడ్డానికి బయలుదేరింది.

ఎల్లెనాకు బరోనెస్ వాన్ టెస్లింగ్ అనే ఒక స్నేహితురాలు వుంది. మరోఇద్దరు స్నేహితులుకూడా ఉన్నారు. రియాసనోవ్ అనే లాయరు ఒకాయన, వొలోడ్యాఅనే సంగీత విద్వాంసుడు మరొకాయన. ఎల్లెనా

వొలోడ్యాను ప్రేమిస్తోంది. ఈ నలుగురు కలిసి యామావీధులకు షికారు వెళ్ళారు.

దోవలో ఎల్లినా తన ప్రియుడైన వొలోడ్యాతో ఇలా అంది.

"ఏం ప్రియా! యామాలో మూడురకాల వ్యభిచారగృహాలున్నాయని చెప్పుకుంటారుకదూ? నన్ను ఆ మూడురకాల ఇళ్ళల్లోకీ తీసుకెళ్ళి చూపించండి. ముందు కొంచెం మంచిఇళ్ళు, తరువాత మధ్యరకం, ఆఖరుకు తక్కువరకం, ఎలావుంటాయో చూద్దాం."

నిజానికి ఆమెను ఈ మురికికూపంలోకి తీసుకెళ్ళడం వొలోడ్యాకు ఇష్టంలేదు. కాస్తమర్యాదస్తుల్లా తిరిగేవాళ్ళు ఆ వీధులలో అడుగుపెట్టడం అవమానకరమైన విషయమని అతనికి తెలుసు. అయినా, ఆమె పట్టుపట్టడం వల్లనే అంగీకరించాడు. కాదంటే ఆవిడమనస్సు నొచ్చుకుంటుందని విధిలేక ఒప్పుకున్నాడు.

"ఎల్లినా! నీవు ఏంచేయమంటే అది చేయడానికి సిద్ధంగావున్నాను. ఎందులో దూకమన్నా దూకుతాను. నీవు కావాలంటే నా ప్రాణాలుకూడా ఇస్తాను.......కాని, ఈ పాడుకొంపలకు నిన్ను తీసుకెళ్ళడం ప్రమాదకరమైన విషయం.......అయినా ఆ కొంపల్లో చూచేదేముంది? విశేషంఏమీ వుండదు. అంతా రష్యన్‌పద్ధతిలోనే వుంటుంది. అవే ఆచారాలు, అవే అలవాట్లు. సానులున్నారు చూచావూ? మరీ మోటుగా, అసహ్యంగా ప్రవర్తిస్తారు. అదే నాభయం. ఏదో అనరాని మాట అని, నిన్ను అవమానపరుస్తారు. అక్కడికి వచ్చే విటులుకూడా అంతే. నీకళ్ళెదుటే ఏదో అపభ్రంశపు పనిచేస్తారు. చివరకు మనం బాధపడాల్సివస్తుంది. అందుకని ఇంతగా చెపుతున్నాను." అన్నాడు వొలోడ్యా, ఆమెను ఎలాగైనా అక్కడికి వెళ్ళడం మాన్పించాలని.

కాని ఆవిడ ఊరుకుంటుందా? తిరిగి ఇలా అడిగింది. "నీవు పొరపాటు పడుతున్నావు వొలోడ్యా! అలా ఎన్నటికీ జరగదు. యిలాంటివిషయాలలో నాకు బాగా అనుభవం వుంది. నేను లండన్‌లో వున్నప్పుడు, ఊరూరుతిరిగి పాటకచ్చేరీలు చేసేదాన్ని. అనేక జిల్లాలు తిరిగాను. అందరూ నా పాట మెచ్చుకొనేవారు. రకరకాల మనుషులదగ్గర్నుంచి కంట్రాక్టులు వచ్చేవి. వెళ్ళేదాన్ని. చిత్రవిచిత్రమైన మనుషుల్ని కలుసుకునేదాన్ని.

వారిలో అమాంబాపతు జనం వున్నారు. కాని ఎన్నడూ, ఎవరూ నన్ను పల్లెత్తుమాట అనలేరు. అవమానించలేరు. ఎవరు ఎంతలోవుండాలో అంత లోనే వుండేవారు. అంచేత యిప్పుడుకూడా నా కలాంటి భయం లేదు లే. నీవు అసలు పిరికివాడివి. అందుకని జడుస్తున్నావు. వెళదాం పద."

"ఛీ! అదికాదు ఎల్లినా! నీమీదవున్న ప్రేమచేత అలా హెచ్చరించాను. ఎందుకైనా మంచిదని చెప్పాను. అంతేగాని పిరికితనంవల్ల కాదు. నీవు నిప్పులో దూకమన్నా దూకుతాను ఎల్లినా! మృష్టిది యిదొకపనా? మృత్యువువగ్గరకు వెళ్ళమన్నా వెడతాను."

వారిలా మాట్లాడుకుంటూ వుండగానే, బండి యామావీథిలో ప్రవేశించి, బ్రెప్పెలున్స్ భవనం సమీపించింది.

"ఇహనేం? బ్రెప్పెలున్సవచ్చింది- మీ తనిఖీ ఇక్కణ్నుంచే ప్రారంభించండి." అన్నాడు లాయరు రియాసనోవ్, ఎగతాళిగా నవ్వుతూ.

అంతా బండిదిగి అందమైన బ్రెప్పెలున్స భవనంలో ప్రవేశించారు. అక్కడి పనివాళ్ళు వీరిని ఆహ్వానించి ఒక ప్రత్యేకగదిలో కూచోబెట్టారు. గది అందంగా అలంకరించివుంది. గోడలనిండా కెంపుదకాయరంగు కాగితాలు అతికించి వున్నాయి. వాటిమీద బంగారపురంగులో వివిధరకాల డిజైనులు వేసివున్నాయి. అదిచూడగానే ఎల్లినాకు ఒకవిషయం గుర్తొచ్చింది. వారు నలుగురూ అంతక్రితమే ఒక నైట్‌క్లబ్బులో ఫలహారాలు చేసివచ్చారు. ఆక్లబ్‌లోకూడా గోడలనిండా యిలాంటికాగితాలేవున్నాయి. ఎల్లినాకు అది జ్ఞాపకం వచ్చింది.

తరువాత నలుగురు వేశ్యలు ఆ గదిలోకి వచ్చారు. ఆ నలుగురూ బాల్టిక్ రాష్ట్రాలనుండివచ్చిన జర్మన్ యువతులు. లావుగా, బొద్దుగా వున్నారు. ఉన్నతమైన వక్షోజాలతో సొగసుగా, చూస్తోన్నకొద్దీ నోరూరే లావున్నారు. మొహాలకు దిట్టంగా, దట్టంగా పౌడరు కొట్టుకున్నారు. తళుకులతో, బెళుకులతో తన్మయత్వం కలిగిస్తూ వున్నారు.

మొదట ఆపిల్లలు ఏమీ మాట్లాడలేదు. కదలకుండా, మెదలకుండా ప్రతిమల్లా కూచున్నారు. ఆడవారుకూడా వున్నారే, వారితో ఎలా మెలగాలాఅని అర్థంకాక ఆలోచనలో పడ్డారు ఆ వేశ్యలు. యిహ ఊరుకుంటే

లాభంలేదని, ఎల్లైనాయే వారిని పల్కరించింది. ఆ నలుగురు పిల్లల్లోనూ, బాగా బలిసి, పండుగావున్న ఓ అమ్మాయిని చూస్తూ ఇలా అడిగింది.

"ఏవమ్మా? నీవు ఎక్కడిదానివి? బహుశా జర్మనీనుంచి వచ్చావనుకుంటా, అవునా?"

"లేదండీ! నేను 'రీగా' నుంచి వచ్చాను."

"ఈ వృత్తిలోకి ఎందుకుదిగావు? ఇదంత మంచిపని కాదే!"

"అవునండీ! నాకు తెలుసు. కాని ఏంచేయమంటారు? నేను 'హాన్స' అనే అతన్ని ప్రేమించాను. అతను ఇక్కడే ఒక హోటల్లో వెయిటరుగా పనిచేస్తున్నాడు. మేమిద్దరం పేదవాళ్ళం. పెళ్ళి చేసుకోడానికికూడా మా దగ్గర డబ్బులేదు. ప్రస్తుత పరిస్థితులు అనుకూలించలేదు. అంచాత ఇద్దరం సంపాదనలోకి దిగాం. నా సంపాదన అంతా నేను బ్యాంకులో దాచుకుంటున్నాను. అతనూ అలాగే చేస్తున్నాడు. ఇలా మాకు అవసరమైన పది వేల రూబుల్సు పోగుకాగానే పెళ్ళిచేసుకుంటాం. దేవుడు చల్లగా చూస్తే మా స్వంతంగా ఓ బీరుషాపుకూడా పెట్టుకోవాలనుకున్నాం. ఇంకా మేలు చేస్తే ఆ తరువాత ఓ ఇద్దరుబిడ్డలుకూడా పుడతారు—ఒక అబ్బాయి, ఒక అమ్మాయి.'

అది విని ఎల్లైనా నివ్వెరపోయి చూచింది. తిరిగీ ఇలా అడిగింది.

'అమ్మాయ్! నీవు చూడబోతే అందమైనదానివి, వయసులో వున్నావుకూడా. పైగా రెండుభాషలు వచ్చు....'

'రెండుకాదండీ! మూడుభాషల్లో మాట్లాడగలను. నాకు 'ఈస్తోనియన్' కూడా వచ్చు. మున్సిపల్ హైస్కూల్లో మూడేళ్ళు చదువుకుని పరీక్షలు ప్యాసయ్యాను' అంది ఆ యువతి గర్వంగా.

'మరి అంత చదువు చదువుకున్నదానివి ఏదైనా ఉద్యోగంకోసం యత్నించకపోయావా? ఏదైనా పనిదొరికేదేనే. అన్నంపెట్టి, వసతి ఇచ్చి, నెలకు ముప్ఫయి రూబుల్సు జీతం ఇచ్చేవాళ్ళు సులభంగా. మాటవరసకు ఏ పనిమనిషిగానో, పిల్లల దాదిగానో, లేకపోతే ఏ స్టోర్సులోఅయినా హెడ్ గుమాస్తాగానో, క్యాష్‌కీపర్ గానో, చేరితే ఎంత హాయిగా వుండేది! నీ ప్రియుడు ఫ్రిడ్ కూడా...'

'ఫ్రిడ్జ్ కాదండీ! ఫేన్సు!' ఆపిల్ల సరిచేసింది.

'ఆ! మరిచాను. ఫేన్సు. ఇద్దరూ కొంచెం పొదుపుగా వాడుకుంటే, ఆ డబ్బుతో మీ భార్యాభర్తలు సుఖంగా కాపరం చేసేవాళ్ళు. అవునా?'

'మీరీవిషయంలో కొంచెం పొరపాటుపడుతున్నారండీ! మీరు చెప్పినట్లు మంచి ఉద్యోగం చేసినా, నాకు నెలకు ఓ పదిహేను, ఇరవై రూపాయలకంటె ఎక్కువ మిగలవు. ఇప్పుడు నేనిక్కడ ఇంతసంపాయిస్తున్నానా? ఎంతపొదుపుగా వాడుకున్నా ఓ వందరూపాయలకంటె ఎక్కువ మిగలడంలేదు. దీన్నిబట్టి మీరే ఆలోచించండి. పైగా మరోవిషయం. ఎవరి దగ్గరో సేవకావృత్తి చేయడం ఎంతనీచమో మీకు తెలియందికాదు. యజమానుల అడుగులకు మడుగులొత్తుతూ, అనుక్షణం భయంతో కుంగిపోతూ, చెప్పుకింద తేలులా పడుండాలి. యజమానురాండ్రు ఉన్నారుమాళ్ళారూ ఛీ! వాళ్ళకు ఎంతచేసినా మెప్పులేదు. ఏదోవంకలుచూపిస్తూ, తప్పులు పడుతూ వుంటారు. నోటికివచ్చినట్లు తిడతారు.'

'ఏమోనమ్మాయ్! నీవు ఎన్నిచెప్పినా నాకీపనిమాత్రం నచ్చలేదు. పడుపువృత్తితో జీవిస్తోన్న స్త్రీల్నిగురించి చాలామంది చెప్పగా విన్నాను... ఈ పాడుకొంపల్లో...ఛీ! అసలివి మనుషులుండే కొంపలేనా? అబ్బబ్బ! ఎంత అసహ్యం...అసహ్యమైన మగాళ్లు...ముసలివాళ్ళు ఇక్కడికివస్తారనీ, ఇష్టంలేకపోయినా బలవంతాన మీరు వాళ్ళను ప్రేమించి, సంతుష్టిపర్చాలనీ విన్నాను... ఈవిధంగా మీ మానాన్నేకాక, డబ్బును దోచుకుంటున్నారు.' అంది ఎల్లెనా నేలమీదికిచూస్తూ.

'ఓ! అలాకాదండీ! మాడబ్బు ఎక్కడికీ పోదు. మాకు రావల్సింది సక్రమంగా వస్తుంది. ఇక్కడవున్న సానులందరికీ ఒక్కొక్కరికి ఒక్కొక్క ఆకౌంటుపుస్తకం వుంది. అందులో ఏరోజుకారోజు మాసంపాదన, మా కింద ఖర్చు అన్నీ వ్రాస్తుంటారు. మాటవరసకు చెపుతాను. క్రిందటినెలలో నేను అయిదొందలరూపాయల్ని సంపాయించాను. అందులో రివాజుప్రకారము రెండొంతులు యజమానురాలు తీసుకుంటుంది. అవును, మా పొట్ట, బట్ట, పడక, పానం ఇవన్నీ ఆమే సమకూరుస్తుందిగా! వీటికింద మూడొందల రూపాయల్ని తీసుకుంది. తక్కిన నూటయాభై నావి. అందులో నాకు

కావల్సిన దుస్తులు, ఇంకా ఇతరవస్తువులు, వీటికింద ఓ యాభై రూబుల్సు ఖర్చుపెట్టుకున్నాను. పోతే మిగిలిన వందరూబుల్సు బ్యాంకులో వేసుకున్నాను. యింట్లో వాళ్లు దోచుకోవడం ఏముంది చెప్పండి? ఇహ వచ్చే విటులంటారా? రకరకాల మగాళ్ళు వస్తారు. నాకు ఇష్టంకానిమనిషివస్తే వంట్లో బాగాలేదని చెప్పి పడుకుంటాను. నాబదులు మరెవరో కొత్తపిల్ల అతనితో వుంటుంది. సరిపోలే?'

'కాని...క్షమించు. నీపేరు ఏమిటో నాకు తెలీదు.'

'ఎల్సా'.

'ఆఁ ఎల్సా! ఇంతకూ నేచెప్పేదేమంటే, ఈపని నీలాంటి అందగత్తెకు, విద్యావతికి తగిందికాదని. నీకు ఇష్టంలేకుండా, బలాత్కారంగా యిలాంటి నీచమైనపని చేయిస్తున్నారు. నీకు అసహ్యంగాలేదూ?'

'లేదు అమ్మగారూ! ఇక్కడ మమ్మల్ని ఎవరూ, ఏవిధంగాను నిర్బంధించరు. అందరం ఒక సమిష్టికుటుంబంలో మాదిరి జీవిస్తున్నాం. మేమంతా బాల్టిక్ రాష్ట్రాలనుంచి, ఇంకా ఆ దరిదాపులనుంచి ఇక్కడికి వచ్చాం. నిజం చెపుతున్నాను. పెద్దకుటుంబంలోవారు ఎంత సుఖంగా వుంటారో, మేమూ అంత హాయిగా జీవిస్తున్నాం. యామాపీఘులను గురించి లోకం విపరీతంగా చెప్పుకుంటుందని నాకు తెలుసు. ఇక్కడ తిట్టుకోవడం, కొట్టుకోవడం అన్ని అపభ్రంశపుపనులు జరిగేమాట వాస్తవమే. కాని ఎక్కడనుకున్నారు? మరీ అధ్వాన్నంగా తగలడే, ఒక రూబులు పుచ్చుకునే ఆ పాడుకొంపల్లోనే అదంతా. ఇక్కడ అలాంటివి ఎన్నడూ చూడం...మీరు అక్కడికి పోయి చూస్తే తెలుస్తుంది. వేశ్యలంతా ఎప్పుడూ తప్పతాగి వుంటారు. పబ్లిగ్గా పక్కన మిండగాణ్ణి కూచోబెట్టుకుని సరసాలాడుతుంటారు...అందరూ తప్యన్ పిల్లలే!...వాళ్ళకు భవిష్యత్తు లేదండీ!'

'నీవు చాలా తెలివైన అమ్మాయివి. నీవు చెప్పిందంతా బాగానే వుంది. కాని హఠాత్తుగా జబ్బుపడతావనుకో. లేకపోతే ఏదైనా అంటురోగం తగులుతుందనుకో; అప్పుడు నీగతి ఏంకావాలి? అల్లాడి, మురికిచావు చావడమేగా?...ముందు నీ జీవితంలో ఏంజరుగుతుందో ఎలా చెప్పగలవు?'

'అదే, మీరు మళ్ళీ పొరపాటుపడుతున్నారు. వచ్చిన విటుణ్ణి పైనుంచి కిందిదాకా డాక్టర్ పట్టి చూస్తాడు. జబ్బులేమైనా ఉన్నా యేమో అని అతి జాగ్రత్తగా పరీక్షచేస్తాడు. తృప్తికరంగా వుంటే తప్ప, లేకపోతే అతన్ని నా పక్కదగ్గరకికూడా రానివ్వను. మరి ఇహ నాకు నష్టం ఏముందండీ? నూటికి మూడొంతులు నాకు రక్షణ వుంది.'

'నీరక్షణ పాడుగాను!' అకస్మాత్తుగా ఉలిక్కిపడి మాట్లాడింది ఎల్లెనా. ఆ వేశ్య చెప్పే మాటలన్నీ ఆమెకు వెగటుగా వున్నాయి. బల్ల మీద గట్టిగా పిడికిలితో గుద్దుతూ మళ్ళీ ఇలా అంది. 'అయితే నీప్రియుడు ఆల్బర్ట్...'

'ఆల్బర్ట్ కాదండీ! హేన్సు!' మళ్ళీ ఆపిల్ల సరిదిద్దింది. 'క్షమించు. అదే, నీ ప్రియుడు హేన్సు. నీవు యిలా ప్రవర్తిస్తూవున్నందువల్ల అతనికి ద్రోహం చేసినట్లు కాదూ?'

'ఓ! లేదండీ! నాబొందిలో ఊపిరివుండగా అతనికి ద్రోహం చేయను అమ్మగారూ! అలాచేసేది వాళ్ళు—ఆ పాడుముండలు! ముఖ్యంగా రష్యన్ పిల్లలు! ఒకచెంపన ప్రియుడున్నాడనిచెపుతూ, మరోవైపు పదిమంది మిండ గాళ్ళను పెట్టుకుని బ్రతుకుతుంటారు.'

ఆమె అలాచెప్పేసరికి ఎల్లెనాకు చాలా కష్టంకలిగింది. ఆవేశ్యమీద అసహ్యం పుట్టుకొచ్చింది. గభాలున కుర్చీనుండి లేచి 'యిహ వెడదాం. మనబిల్లు ఎంతయిందో యిచ్చేయి వోలోడ్యా!' అంది తన ప్రియుడితో.

నలుగురు ఆభవనంలోంచి బయటికొచ్చారు. వోలోడ్యా ఎల్లెనా చేయిపట్టుకుని ఇలాఅన్నాడు.

'ఎల్లెనా! ఒకయిల్లు చూచాం. అన్నిఇళ్ళూ ఇలాగే ఏడుస్తాయి. ఇహ వెడదాం పద.'

'అబ్బెబ్బె! వీళ్ళ బ్రతుకు ఎంత నీచంగా వుంది! ఎంత అసహ్యం! ఎంత దారుణం' అంది ఆమె తిరిగీ చీదరింపుగా.

'అందుకే నేను మొదటేచెప్పాను, ఇక్కడికి రావద్దని. ఇంతటనైనా ఇంటికివెడదాం పద!'

'అహా! అలాకాదు వోలోడ్యా! ఇంతకంటె తక్కువరకం సానులు కూడా ఎలావుంటారో చూచివెడదాం'

వొల్లోడ్యా ఎంతచెప్పినా ఆమె వినలేదు. ఒకచోట అనుభవం అయినా, తక్కినఇళ్లుకూడా చూడాలని అభిలషించింది. చివరకు వొల్లోడ్యా అక్కడికి కొన్నిఅనుగుల దూరంలోనేవున్న అన్నా ఇంటికి వెడదామని సూచించాక ఆమె అంగీకరించింది.

నిజానికి రకరకాల అనుభవాలు, విచిత్రమైన వేశ్యలను చూడాలంటే అందుకు అన్నా ఇల్లే పెట్టినపేరు. నలుగురూ అన్నా ఇంట్లోకి వచ్చారు. కాని వాకిట్లోనే కాపలావాడు సిమన్ వాళ్ళను అటకాయించి, బంగారపు నాణాలు చేతులో పడ్డ తరువాత లోపలికి పోనిచ్చాడు. లోపల వీరినొక ప్రత్యేకమైన గదిలోకి తీసుకెళ్ళి కూచోపెట్టారు. ట్రెప్పేల్సులో చూచినగదికీ, ఈగదికీ చాలావ్యత్యాసం వుంది. ఈగది మరీఅసహ్యంగా పొగచూరిపోయివుంది. తరువాత ఎమ్మా ఉత్తర్వుపై పడుపుకత్తెలు గుంపుగా గదిలోకి వచ్చి కూచున్నారు. ఇహనేం? అసలే అధ్వాన్నంగావున్న ఆ గదిలోకి ఈ సానిగుంపంతా వచ్చిపడేసరికి పుండుమీద కారం చల్లినట్లయింది. మరోపెద్ద పొరపాటుపని ఏమిటంటే జెన్నీనికూడా ఆ గదిలోకి పంపడం. ఆమె అసలే మనుషులను ద్వేషించేమనిషి. దానికితోడు ఆసమయంలో కోపంగా, చిరాగ్గాకూడా వుంది. ఆమె కళ్ళనుండి నిప్పులు కురుస్తున్నాయి. అందరికన్నా వెనుకవచ్చిన పిల్ల టమారా చిరునవ్వులు వొలికిస్తూ సాక్షాత్కరించింది. మొత్తానికి అన్నా ఇంట్లోవున్న ముఖ్యమైన వేశ్యలంతా అక్కడ పోగయ్యారు. వారి జీవితవివరాలనుగురించి అడగడానికి ఎల్లెనా జంకింది. అవును, వాళ్ళ చర్యలు, చేష్టలు ఆమెను భయపెట్టాయి. చివరకు ఆమె వారిని ఒకపాటపాడి వినిపించమని అడిగింది. అందుకు వాళ్ళంతా సంతోషంతో అంగీకరించారు.

అంతా సక్రమంగానే జరిగేది. కాని అంతలో అకస్మాత్తుగా చిన్న మంకా అక్కడికి రావడంతో గందరగోళం ప్రారంభమైంది. ఆపిల్ల క్రితం రాత్రి ఒక ధనికుడైన షావుకారుతోవుంది. వళ్ళుతెలీకుండా తాగి, రాత్రి అంతా ఆతనితో కుషీచేసింది. ఆమె కింకా ఆ తాగుడుమైకం వదల్లేదు. ఇప్పటివరకూ బుర్రలో పనిచేస్తూ పిచ్చి ఎక్కిస్తూనేవుంది. మంకా తూలుతూ అక్కడికి వచ్చింది. రాగానే గుంపంతా ఆమెకళ్ళపడింది. దాంతో మరీ రెచ్చిపోయింది. గదిలో నేలమీద వెల్లికిలా పడుకుని, పగల

బడి నవ్వసాగింది. తక్కిన వేశ్యలంతా ఆమెచుట్టూ చేరారు. అలా కొంత సేపు నవ్వి మంకా చివాలున లేచికూచుంది.

'సెభాష్! కొత్తముండలువచ్చి మనలో చేరారు' అంటూ బిగ్గరగా అరిచింది.

అదివినేసరికి ఆవచ్చిన నటులుకూడా ఒకరినొకరు తెల్లబోయి చూచుకున్నారు. పిమ్మట వారిలో బెప్లింగ్ కోపంతో ఇలాఅడిగింది.

'ఏమిటామాటలు? మేం ఎవరం అనుకున్నావ్? పతితలైన స్త్రీల మఠానికి నేను పోషకురాలిని.'

అదివినేసరికి జెన్ని భగ్గునమండుతూ లేచింది.

'ఓసీ ముసలిదానా! వెంటనే లేచి వచ్చినదోవన వెళ్ళిపో! సిగ్గులేక నీవూ మాట్లాడొచ్చావా? పనికిమాలినముండ! మఠమట...మఠం! నీవు పోషించే మఠంసంగతి ఎవరికి తెలీదనుకున్నావ్? అది జైలుకంటె అన్యాయం. నీమఠంలో పనిచేసే సెక్రెటరీలు ఆడపిల్లను కుళ్ళినమాంసంకంటె హీనంగాచూస్తారు. నీమఠానికి పెత్తనంచేసే ఆడాళ్ళు, కాపలావాళ్ళతోటి బళ్ళవాళ్ళతోటి వ్యభిచరిస్తారు. మీరంతా మఠంలోవుండే పిల్లలను అన్యాయంగా, అక్రమంగా, క్రూరంగా హింసిస్తారు. మీతండ్రులు, మీభర్తలు, మీసోదరులు, వీళ్ళంతా మాదగ్గరకొచ్చి పొర్లాడి రకరకాల రోగాలు తగిలించుకుని పోతుంటారు. మళ్ళీ వాళ్ళు ఆ రోగాలు మీకు అంటిస్తారు. ఇక్కడేదో నాటకంచూడ్డానికి వచ్చినట్లు వచ్చావు. ఇదె యదార్థం! ఉన్న నిజాన్ని నీ మొహాన్నే పగలేస్తున్నా' అంటూ జెన్ని వాళ్ళమీద విరుచుకుపడింది. ఇంకా ఏదో అనబోతోంటే, టమారా మధ్యలో కల్పించుకుని ఇలా అంది:

'ఇహ నీవు ఊరుకోవే జెన్నీ! నేనే వాళ్ళకు సరీగా బుద్ధిచెప్తాను. ఏవమ్మా! మీఇళ్ళలోఉండే ఆడాళ్ళకంటె మేం చెడిపోయామా? ఆవచ్చే మగాడెవడో నాదగ్గరికి దర్జాగా, పబ్లీకుగా వస్తాడు. ఒకసారికి రెండు రూబుల్సు, రాత్రికి అయిదురూబుల్సు పారేసి వుంటాడు. నాకు అతనిదగ్గర దాపరికాలు ఏమీవుండవు. అబద్ధాలు చెప్పను. నేను వేశ్యననీ, వ్యభిచారిననీ అందరికీతెలుసు. ఇహ మీసంగతి చెప్పవమ్మా! పెళ్ళిచేసుకుని భర్తతో కాపురంచేస్తోన్న మీ ఆడాళ్ళలో కనీసం ఒక్కతైనా బుద్ధికలిగివుంటుందా

చెప్పు. కామం కళ్ళకు ఎగతట్టి రహస్యంగా ఓ పశుమనుత్రాడిదగ్గర పడుకుంటుంది. లేదా డబ్బుకోసం గడ్డితిని, ఓ ముసలాడితోనైనా వుంటుంది. అవునా? ఇలా చేయని స్త్రీలు మీలో ఎంతమంది ఉన్నారు? మీ పెద్దమనిషి తరహా ఎలాంటిదో నాకు బాగా తెలుసునమ్మోయ్! మీవయసులోవున్న వాళ్ళు నూటికి యాభైమంది ప్రియులదగ్గర ఉంపుడుకత్తెలుగావుంటున్నారు. మీకంటె ముసలివాళ్ళయిన మిగతా యాభైమంది స్త్రీలు పడుచుకుర్రాళ్ళను మిండగాళ్ళగా చేసుకుని బ్రతుకుతున్నారు. మీలో చాలమంది కన్నతండ్రులతోటి, తోబుట్టువులతోటి, ఇంకా మాట్లాడితే కొడుకులతోటి కూడా కాపురంచేస్తున్నారనికూడా నాకుతెలుసు. కాని ఇవన్నీ మీరు రహస్యంగా, దొంగతనంగా చేస్తుంటారు. ఈ తప్పులన్నీ బయటపడకుండా కప్పుకుంటారు. ఈ రహస్యాన్ని, ఈ చీకటిరహస్యాన్ని మీరు మీ హృదయకూపాల్లో దాచుకుంటారు. మీకూ మాకూ తేడాఅల్లా ఏమిటంటే, మేం పతితలం. చస్తే అబద్ధాలుచెప్పం. నటించం. బహిరంగంగా తప్పుచేస్తాం. ఒప్పుకుంటాం. దాచుకోం. మీరో? పాపం చేస్తూ నే పచ్చి అబద్ధాలు చెప్తారు. ఇప్పుడు చెప్పమ్మా! ఇందులో ఎవరు ఉత్తమస్త్రీలో మీరా? మేమా?'

'భళిరె! టమారా! బాగా చెప్పుతో కొట్టావే!' అంటూ మళ్ళీ అరిచింది మంకా.

'ఊరుకుంటావేమే! ఇంకా చెప్పు. సాంతం కడిగి వదిలిపెట్టు.' అంటూ జెన్నీ మధ్యలో పురి ఎక్కించింది. ఆమెకళ్ళు నిప్పుకణాల్లా ఉన్నాయి. తిరిగి టమారా మాట్లాడసాగింది

'అవును జెనీచ్కా! నాకు భయం ఎందుకు? ఉన్నమాట చెప్తున్నాను. ఇంకా చెప్పాల్సివస్తే మాలో కడుపులు పోగొట్టుకునే స్త్రీలు వెయ్యికి ఒకరుకూడా వుండరు. మీలో అందరూ పదేపదే కడుపులు దిగదింపుకుంటారు. ఏమమ్మా? ఇది నిజంకాదూ? ఎందుకు చేస్తున్నట్లు ఈపని? దరిద్రంవల్లనా? లేక నిరాశవల్లనా? కాదు. ఎందుకు చేస్తున్నారో నే చెప్తా విను. పిల్లల్ని కంటే మీ అందం చెడిపోతుంది. అదే మీ భయం! సౌందర్యం కాస్తా పోతే, ఇంకేముంది? మీపని క్షవరమే! సౌందర్యం మీ

మూలధనం! అది కాపాడుకోవడంకోసమే, మీరీ మహాపాపాలకు ఒడిగట్టుతుంటారు.'

జెన్నీ, టమారా, చెరొకవైపు ఇలా తగులుకునేసరికి ఆ వచ్చిన నలుగురూ ఉక్కిరి బిక్కిరి అయిపోయారు. ముఖ్యంగా ఇద్దరి ఆడవాళ్ళ మొహాలూ నల్లగా మాడిపోయాయి.

'జాగ్రత్త హెల్లింగ్! ఈపిల్ల ఎవరో అసాధ్యురాలులా వుంది. చదువుకున్నట్టుగా వుందికూడా!' అంది ఎల్లెనా, తన మిత్రురాలి చెవిలో; ఆమె ఈమాటలు ఫ్రెంచిభాషలో చెప్పింది.

'అమ్మాయ్! ... నిన్నెక్కడో బాగా చూచినట్టుగా వుందే ... ఎక్కడ చెప్మా...కలలోనా?...లేక నా చిన్నతనంలో చూచానో!... గుర్తురావడంలేదు' అంది హెల్లింగ్ మళ్ళీ.

'ఓ! అదా! మీరేం కష్టపడక్కర్లేదు. నేనెవరో మీకు గుర్తు లేకపోయినా, మీరెవరో నాకు గుర్తున్నారు. చెప్తాను వినండి...ఖార్కోవ్‌లో గది...కొనియాకిన్స్ హోటలు...సాలోవిచిక్ అనే థియేటరు యజమాని...జ్ఞాపకంవచ్చానా?...అప్పుడు మీరింకా ఇంత పెద్దమనిషిని కాలేదు.' అంటూ టమారాకూడా ఫ్రెంచిభాషలోనే మాట్లాడింది. 'ఓ! ఇహ భాష ఎందుకులెండి. మామూలు రష్యన్‌లోనే మాట్లాడుకుందాం. అప్పుడు మీరు కోరస్‌గీతాలు పాడేవారు. మీరూ, నేనూ కలిసే పని చేశాం.' అంది ఆమె తిరిగీ రష్యన్‌భాషలో.

'ఆఁ దేవుడా! జ్ఞాపకంవచ్చింది. చాలా చిత్రంగావుందే మార్గరీటా! నీ విక్కడికి ఎలావచ్చావు?' అనడిగింది హెల్లింగ్ నివ్వెరపోతూ.

'అదే నేనూ ఎప్పుడూ ఆలోచిస్తుంటాను. ఎలావచ్చానో నాకే తెలీదు. బుద్ధిపుట్టింది, వచ్చాను. అంతే. అవునుగాని, మీతో ఇంతసేపూ కాలక్షేపం చేశాం కదా! మాకు ఏదో డబ్బు ముట చెప్పరూ?'

అదిగిని మళ్లీ మంకా చర్రున లేచింది. గభాలున తన కాలి మేజోడు బయటికి లాగింది. అందులోంచి రెండు బంగారునాణాలు తీసి బల్లమీదికి విసిరింది.

'నీ వూరుకోవే టమారా! వాళ్ళిచ్చేదేమిటి? మనమే వాళ్ళకు డబ్బిచ్చి పంపిస్తాం. ఇదుగోనమ్మా డబ్బు! బండిచార్జికి. ముందికక్కణ్ణుం

బయటికి కదలండి. లేదా ఇక్కడున్న సీసాలు, అద్దాలు ముక్కలు ముక్కలు చేస్తాను జాగ్రత్త!' అంటూ అరిచింది మంకా.

వెంటనే ఎల్లెనా లేచి నిలబడింది. ఆమె కళ్ళనుండి వేడిబాష్పాలు రాలాయి.

'వెడతానమ్మా వెడతాం. మార్గరిటా మాకు మంచి గుణపాఠం చెప్పిందిలే. సరే. మీరు నాకోసం ఒకపాట పాడారు. ఇహ నేనూ మీ కోసం ఒకపాట పాడి వెళ్ళిపోతాను. అంతే' అంటూ ఎల్లెనా పియానో వద్దకు వెళ్ళింది.

ఆమె ఒక మంచి ప్రేమగీతం పాడి అక్కడవున్న వేశ్యలందరినీ ఆనందంలో ఓలలాడించింది. చిన్ననాటి ప్రియులు, వారితో గడిపిన రాత్రిళ్ళు, తొలి ప్రేమలో కలిగిన ఆనందం, ప్రియుడు వెళ్ళిపోయేటప్పుడు చెప్పుకునే చివరిమాటలు, ప్రేయసీప్రియుల హృదయాల్లో స్పందించే విరహతాపం—ఇవన్నీ ఆ పాటలో వర్ణించివున్నాయి.

ఆపాట వింటూవున్నంతసేపూ వేశ్యలంతా నిశ్చేష్టులై విన్నారు. టమారా, మంకా, జెన్నీ, ఎవరూ నోరు మెదపలేదు. కాని జెన్నీమాత్రం గభాలున లేచి గొప్ప సంగీతపాటకురాలైన ఎల్లెనావద్దకు పరుగెత్తింది. ఆమెకాళ్ళమీద పడి వెక్కి వెక్కి ఏడ్వసాగింది. అవును. ఆమె పాడిన పాట జెన్నీహృదయాన్ని చీల్చివేసింది. అంత గొప్ప విద్వాంసురాలు, కళామూర్తిపట్ల తాను అవమానకరంగా ప్రవర్తించానని పశ్చాత్తాపపడింది.

ఎల్లెనా జెన్నీని లేవనెత్తి ఆప్యాయతతో ఆమెచెయ్యి ముద్దుపెట్టుకుంది. జెన్నీ ఆమెచెవిలో ఏదో రహస్యంగా బాధపడుతూ చెప్పింది.

'ఓ! అదేమంత ప్రమాదకరంకాదులేమ్మా! కొద్దినెలలపాటు మందు పుచ్చుకుంటే తగ్గిపోతుంది' అంది తిరిగి ఎల్లెనా ప్రేమతో.

'ఊహూ! అలాకాదు. దీంతో నేను అందరినీ నాశనంచేయదలుచుకున్నాను. పోనీ అంతాభ్రష్టులైయమయాతన అనుభవించనీ!' అందితిరిగిజెన్నీ.

'వద్దమ్మా! అలా చేయొద్దు. నీస్థితిలో నేనేవుంటే అలాచేయను' అంది ఎల్లెనా.

జెన్నీ ఆమెమీదికి ఎగబడి, మరీమరీ ముద్దుపెట్టుకుంది.

'మనుషులు నన్నెందుకు ఇలా బాధించుతారు? నన్నెందుకు ఈ నర

కంలో పడేశారు? ఎందుకు? ఎందుకు? చెప్పండి! చెప్పండి!' అంటూ మళ్ళీ వలవల ఏడ్చింది జెన్ని.

ఎల్లెనా ఆమె తల నిమురుతూ మెల్లగా ఇలా అంది.

ఆశ్చర్యపడకు. ఒక్కొక్కసారి భయంకరమైన మృత్యువు మనముందు సాక్షాత్కరిస్తుంది. యెటూ దోవకనుపించదు. మృత్యువుకు యెరకావడంతప్ప మరి మార్గం లేదనుకుంటాం. కాని అంతలో - అకస్మాత్తుగా - ఆమర్నాడే మార్పు వస్తుందమ్మా! కారుచీకటిలో కాంతిరేఖ కనిపిస్తుందమ్మా! మళ్ళీ మన జీవితంలో మహోదయమైన ఆనందం వెల్లివిరుస్తుందమ్మా! పిచ్చిపిల్లా! ఇంకా నీకు అనుభవంలేదు. నాసంగతి చెపుతాను విను. నేనిప్పుడు ప్రసిద్ధికెక్కిన పాటకురాలిని. కాని ఒకప్పుడు నేను పొందిన బాధలు, కష్టాలు, అవమానాలు, పతనావస్థను—ఓ! ఎన్నను నన్నావు! తలుచుకుంటే గుండెలు పగిలిపోతాయి. అదృష్టమమ్మా అదృష్టం! దానికి మించిందిలేదు. అది కల్లగా వుంటే నీజీవితం ఒక్క క్షణంలో మారుతుంది.'

మంకా కుర్చీలో కూచుని రుమాలుతో మొహం కప్పుకుంది. టమారా మొహానికి చేతులు అడ్డంపెట్టుకుని నేలమీదికి చూస్తోంది. సిమన్ గదివాకిలికి చేరువగా కాచుకొనివున్నాడు ఏమైనా గోలజరుగుతుందేమోఅని.

జెన్ని ఎల్లెనాడుస్తుల చాటున మొహంవుంచి వెక్కి వెక్కి ఏడుస్తూనే వుంది. ఎల్లెనా ఆమెను అవతలికి తీసి నుదుటిమీద పదేపదే ముద్దుపెట్టుకుంది. బుజ్జగించింది. ఈదృశ్యాన్నంతా రెప్పవాల్చకుండా వొలొడ్యా, అతని స్నేహితులు చూస్తున్నారు. తరువాత ఎల్లెనా టమారాను సమీపించి ఆమెచేయి ముద్దుపెట్టుకుంది. అంతా గదిలోంచి ఇవతలికొచ్చారు. లాయరు రియాసనోవ్ మాత్రం కొంచెం వెనుకవుండి టమారాను సమీపించాడు. ఆమెచెయ్యి ముద్దుపెట్టుకుని ఇలా అన్నాడు.

'మేం యిక్కడికి వచ్చినందుకు అపార్థంచేసుకోకు. అన్యథా భావించకు. మళ్ళీ యిలా రాము. నాతో నీకు యెప్పుడుపనివున్నా కబురుచెయ్యి. యిదుగో నా అడ్రసు కార్డు. దీన్ని మీ యజమానురాలికి చూపించకుండా దాచుకో. నీకు ఏంకావాలంటే, ఆ సహాయం చేస్తాను. ఈనాటినుంచీ నేను నీకు ప్రాణస్నేహితుణ్ణి అనుకో.' అంటూ అతను మళ్ళీ ఆమెచెయ్యిని ముద్దుపెట్టుకుని వెళ్ళిపోయాడు.

# 6

అది గురువారం. ఆరోజు ఉదయంనుంచీ సన్నని వర్షపుజల్లు పడుతోంది. అడివిబాదంచెట్లు, పోప్లార్ చెట్లు, కసిందచెట్లు, పచ్చనిఆకులతో మిలమిల మెరుస్తూ ప్రకాశిస్తున్నాయి.

అన్నా ఇంట్లో పడుపుకత్తెలంతా అలవాటుప్రకారం జెన్నీగదిలో పోగయ్యారు. ఈరోజు జెన్నీ చాలా వింతగా ప్రవర్తిస్తోంది. ఆమె నవల చదువుకోవడంలేదు, పరిహాసాలాడడంలేదు. కనీసం నవ్వడంకూడా లేదు. బోర్లా పడుకునివుంది. ఏదో చెప్పలేని బాధ, ఆవేదన, ద్వేషం, ఆమె కళ్ళల్లో కనిపిస్తున్నాయి. ఆమెను ప్రాణప్రదంగా ప్రేమించి ఆరాధించే చిన్న మంకా అక్కడే వుంది. ఆమెను ఆకర్షించి, మనసు మళ్ళించాలని విశ్వప్రయత్నం చేసింది. కాని వృథాఅయింది. ఎంతచేసినా ఆమె, తన దృష్టిని మార్చలేదు. మంకా తన స్నేహితురాండ్రితో ఏదో ముచ్చట చెప్తూనే వుంది. బయట తెరిపిలేకుండా, నిదానంగా, నిండుగా, జలు పడుతూనే వుంది. చాలావారాల తరువాత వచ్చిన వర్షం అది. జెన్నీమనసు కూడా ఆ వర్షంమాదిరి నిశ్చలంగా తొణకకుండా వుంది.

జెన్నీపక్కమీద ఆమెను ఆనుకుని టమారా కూచునివుంది. ఆమె భుజంమీద చెయ్యివేసి, వంగి చెవులో రహస్యంగా ఇలా అంది. 'అలా వున్నావేమిటి జెనీచ్కా? కొంతకాలంనుంచి నీవు సరిగా వుండడంలేదు. మామూలు మనిషిలాగా అగుపించడంలేదు. నేను కనిపెట్టాను. మంకాకూడా గమనించింది. నీవు మాట్లాడ్లేదని దానికెంతో కష్టంగావుంది. ఏమిటో నాతో చెప్పవే? నాచేతనైన సహాయం చేస్తాను.'

జెన్నీ కళ్ళుమూసుకుని ఏమీలేదన్నట్లు తలూపింది. టమారా కొంచెం పక్కకుజరిగి మళ్ళీ ఆమెభుజాన్ని తట్టింది.

'ఇది నీ స్వంతవిషయం జెనీచ్కా! నీమనసును నొప్పించాలని నాకు లేదు. కాని, నేను కోరేదల్లా ఏమంటే నీవు ఎందుచేత......'

ఆమె పూర్తిగా అడగకముందే, ఏదో నిశ్చయానికి వచ్చినట్లుగా జెన్నీ లేచికూచుంది. రెండుచేతులతో టమారాను పట్టుకుని ఊపింది.

'సరే. రావే ఒక్క క్షణం మనిద్దరం ఇక్కణ్ణుంచి అవతలికి వెడదాం. అంతా నీతో చెప్తాను. ఎంతకాలమని దాచుతాను. నీతో కాకపోతే, మరెవరితో చెపుతాను?' అంది జెన్నీ ఏదో గంభీరంగా. 'అమ్మాయిలూ! ఇక్కడే వుండండి. ఇప్పుడే వస్తాం' అంది జెన్నీ తక్కిన స్నేహితురాండ్రతో.

జెన్నీ తనగదిలోంచి నడవలోకి వెళ్ళి అక్కడ కిటికీ నానుకొని నిలబడింది. టమారా ఆమెను వెంబడించింది.

'సరే! అమ్మాయ్! వినవే! నాకు కొరుకుడువాయి వ్యాధి అంటుకుంది. ఎవడో పుణ్యాత్ముడు ఈ రోగం నాకు తగిలించాడే చెల్లీ!' అంది జెన్నీ, టమారాభుజంమీద చెయ్యివేసి.

ఆమాట చెప్పేటప్పుడు ఆమె నాలుక పిడచకట్టింది. ముఖం వివర్ణమైపోయింది.

'ఓ! ఎంత దురదృష్టశాలివే! చాలా కాలం అయిందా?' అన్నది టమారా.

'అవును. నీకు జ్ఞాపకం వుందో లేదో? కొందరు విద్యార్థులు వచ్చి ప్లాటానోవ్‌తో దెబ్బలాడారు. ఆ రోజే. ఆనాటి మధ్యాహ్నమే మొదటిసారిగా నేనిది కనిపెట్టాను.'

'అవును. నీకు తెలుసునో లేదో? ఒకనాటి సాయంత్రం మనదగ్గరకు ఒక గాయకురాలు వచ్చింది చూచావా? నీవు ఆమె కాళ్ళమీద పడి వెక్కి వెక్కి ఏడ్చావు. ఆమె చెవులో ఏదో గుసగుసలాడావు. అప్పుడే నీకేదో మునిగిందని నేను గ్రహించాను. సరే, జెనెచ్కా! ఇప్పుడైనా నీవేదో, మందో మాకో తిని జాగ్రత్తపడాలి' అంది టమారా మెల్లగా.

అనేసరికి జెన్నీ కోపంతో మండిపోయింది. కాలితో నేలమీద గట్టిగా తన్నింది. చేతులోవున్న నాజూకైన రుమాలు నడిమికి రెండుగా చింపింది.

'అహ! వీల్లేదు! మందూ గిందూ ఏమీ తినను. ఈజబ్బు మీకెవరికీ అంటించనులే. మీకెందుకా భయం? నీవు గమనించావో లేదో? కొన్ని వారాలబట్టీ నేను మీ అందరితో కలిసి భోంచెయ్యడంలేదు. అందరం కూచుని తినే బల్లమీద తినడంలేదు. అందరం కడుక్కునేచోట కడుక్కోవడం లేదు. తినడానికి, కడగటానికి వేరే గిన్నెలు పెట్టుకున్నాను. అంచేతనే

నాప్రాణసఖి మంకోను కూడా, బాలెను దూరంలో వుంచుతున్నాను. నే నాపిల్లను ఎంతగా ప్రేమిస్తానో నీకు తెలుసు. అయినా, నాజబ్బు దానికి తగులుతుందనే భయంతో, నావల్ల అదికూడా నాశనం అవుతుందనే బాధతో, ఎడమెడంగా తప్పుకుని తిరుగుతున్నాను. ఇహ మగాళ్ళు, ఈద్విపాద పశువులు! వీళ్ళసంగతా? వాళ్ళకు నేను బుద్ధిపూర్వకంగా రోగం తగిలించడంలేదు. ప్రతిసాయంత్రం వాళ్ళే కావాలని నాదగ్గరకొస్తున్నారు. ఒక్కోసారి పదిమంది, మరోసారి పదిహేనుమంది నాదగ్గరవుండి రోగం తగిలించుకొనిపోతున్నారు! చావనీ లంజాకొడుకుల్ని! ఈ భయంకరమైన సవామే వాపుజబ్బు మూటకట్టుకుపోయి, వాళ్ళ భార్యలకు, తల్లులకు, ఉంపుడుకత్తెలకు తగిలించుకుని చావనీ! అవును, అవును. ఇంకా మాట్లాడితే వాళ్ళ తల్లులు, తండ్రులు, తాతలు, ముత్తాతలు, అవ్వలు, ముత్తవ్వలు — అంతా ఈ రోగంతో కుళ్ళి, కృశించి చావనీ! లంజకొడుకులు!' అంటూ చింపిన చేతి రుమాలు విసరి అవతల పారేసింది జెన్ని.

టమూరా ఆమెతల నిమురుతూ మెల్లగా అంది.

'నీవు నిజంగా అంతపని చేయాలనుకుంటున్నావా జెనీచ్కా!'

'అవును. నాకు పాపభీతిలేదు! దయ, దాక్షిణ్యాలు లేవు. ఇహ మీ సంగతి. మీరెవరూ నన్నుగురించి భయపడనక్కర్లేదు. ఈ మగాళ్ళపని నేను పడతాను. బాగా మత్తెక్కిన వెధవలు, అందమైన మగాళ్ళు, ఐశ్వర్యవంతులు, పెద్దమనుషులని పేరుగాంచిన మొనగాళ్ళు — వీరందర అంతూ తేలుస్తాను. నిస్సందేహంగా చేస్తాను, ఏ మేమీ దిగులుపడకు. ఆ తరువాత వాళ్ళు చస్తే మీదగ్గరకిరారు. ఓ! నా తెలివితో, చేష్టలతో అద్భుతంగా నటించి వాళ్ళను మోహించి, కామించి పిచ్చికుక్కల్నిచేసి వదిలిపెడతాను. మీరే చూద్దురుగాని. ఆశ్చర్యపోతారు, ఆనందిస్తారు. వాళ్ళను కొరుకుతాను, రక్కుతాను, పిచ్చిదానిలా ఊపేసి, ఊగిస్తాను. వెధవలు! పశువులు! నిజంగా నామాట నమ్ము.'

'సరే జెనీచ్కా! నీ ఇష్టం.' అంది టమూరా ఏదో ఆలోచిస్తూ. 'బహుశా నీవు చేయనున్నపని మంచిదేకావచ్చు......ఎవరు చెప్పగలరు? కాని నాకో సంగతి చెప్పు. డాక్టరు పరీక్షచేయడానికి వస్తాడే, మరెలా తప్పించుకుంటావు?'

అదివిని జెన్నీ గభాలున కిటికీవైపు మళ్ళింది. కిటికీ తలుపులకు తల ఆనించి బిగ్గరగా వెక్కి వెక్కి ఏడ్వసాగింది. దుఃఖాగ్నిలో తుకతుక ఉడికిన కన్నీళ్ళు ధారగా కారసాగాయి. ఆమె గడగడవణుకుతోంది. వేగంగా ఊపిరిపీలుస్తోంది.

'అవును...అవును, దేవుడి దయవల్ల నే నింకా అదృష్టవంతురాలిని టమారా! ఇలా జరిగినందుకు ఆయనకు చేయెత్తి నమస్కరిస్తున్నాను...... నాకు... నాకు ఈ వ్యాధి సోకినచోటు ఏ డాక్టరూ చూడడానికి అవకాశం లేనిస్థలం టమారా! అందులో మనదగ్గరికొచ్చేడాక్టరు ముసలాడు; బుద్ధిలేనిమొద్దు. మరేం ఫరవాలేదు.'

అని జెన్నీ ఒకక్షణం ఏడుపు ఆపుకుంది. అంతలో మళ్ళీ హఠాత్తుగా ఎక్కిళ్ళుపెట్టి ఏడ్వసాగింది. 'ఇహ గదిలోకి వెళదాం టమారోచ్కా! ఈ విషయం ఎక్కడా బయటపెట్టవుకదూ?' అంది.

'అలాగే. ఎవరితోనూ చెప్పనులే.'

తిరిగీ వాళ్ళిద్దరూ గదిలోకివచ్చి కూచున్నారు. జరిగినసంగతి బయటికి తెలీకుండా ఇద్దరూ నిభాయించుకుని మౌనంగా వున్నారు.

అంతలో సిమన్ అక్కడికొచ్చాడు. ఎంత దుర్మార్గుడైనా జెన్నీతో మాత్రం మర్యాదగానే మాట్లాడాడు.

'జెనిచ్కా! హిజ్ ఎక్సలెన్సీ 'వాండా'ను చూడాలని వచ్చాడు. ఆమెను ఓ పదినిముషాలపాటు ఆతని దగ్గరకు పంపించు'

అక్కడి వేశ్యలలో 'వాండా' ఒకతె. సన్నగా నాజూగ్గావుండే పిల్ల. కళ్ళు నీలాల్లా మెరుస్తుంటాయి. మొహం చాలా విచిత్రంగా, 'లిథూనియాన్'లా వుంటుంది. ఎర్రగావున్న పెద్దనోరు. సిమన్ చెప్పినమాట విని వాండా జెన్నీవంక చూసింది. జెన్నీ వెళ్ళొద్దంటే, అక్కడే వుండిపోవాలని ఆపిల్ల ఉద్దేశ్యం. కాని జెన్నీ ఏమీ చెప్పకుండా కళ్ళు మూసుకుంది. అందుకని వాండా మెల్లగా గదిలోంచి అవతలికి వెళ్ళిపోయింది.

హిజ్ ఎక్సలెన్సీ జనరల్ వాండాకోసం నెలకు రెండుసార్లు అయినా తప్పక వస్తూంటాడు.

ఉండి ఉండి జెన్నీ తన చేతిలోవున్న పుస్తకంతీసి ఆవల పడేసింది. ఆమె కళ్ళల్లో బంగారపు తళుకులు మెరిశాయి.

'ఈ జనరల్‌ను గురించి మీరు నీచంగా చెప్పుకోవాల్సిన పనిలేదు. నేను ఇంతకంటే కిరాతకులను ఎరుగుదును. ఒకమారు నాతో విచిత్రమైన విటుడు లటస్థమయ్యాడు. వాడికంటె అడవిపందినయం! వాడు నాతో ఎలా ఉన్నాడనుకున్నారు?......నిజం చెప్పాలంటే, నా రొమ్ముల్ని గుండుసూదులతో గుచ్చిందాకా వాడికి తోచలేదు. నేను 'విల్నా'లో వున్నప్పుడు నాదగ్గరకు ఒక మతగురువు వచ్చేవాడు......అతడు ఏం చేసేవాడో తెలుసా? ......నాకు తెల్లని దుస్తులు తొడిగేవాడు. నా మొహానికి పౌడరు అద్దేవాడు. నన్ను పక్కమీద పడుకోబెట్టి కదలవద్దని చెప్పేవాడు. తరువాత నా తలదగ్గర కూడా కొవ్వొత్తులు వెలిగించి పెట్టేవాడు. అలా నేను చచ్చిపోయినట్లు భావించుకుని, పిమ్మట యెగిరి నామీదికి యెక్కేవాడు'

తెల్లమంకా అందుకొని బిగ్గరగా ఇలా అంది.

'అవును జెంకా! నీవు చెప్పింది ముమ్మాటికీ నిజం. ఒకప్పుడు నాదగ్గరకు ఒక ముసలిముద్దు వచ్చాడు. నన్ను ఏడవమనీ, అరవమనీ, పిచ్చిదానిలా నటించమని బలవంతపెట్టాడు.........చూడు జెనిచ్కా! మా అందరిలోకీ నీవు తెలివైన పిల్లవు...పందెం వేస్తాను. ఇప్పుడు నే చెప్పిన అతను ఎవరో తెలుసుకోగలవా?'

'జైలుకాపలావాడా?'

'ఊహూం.'

'మరలో నిప్పువేసేవాడా?'

అంతలో హఠాత్తుగా 'కొట్కా' నవ్వడం మొదలెట్టింది. తరువాత ఇలా అంది.

'నాకు చదువుచెప్పే టీచర్ ఒకాయన వుండేవాడు. లెక్కలో పాఠో చెప్పేవాడు—గుర్తులేదు. అతను ఏంచేసేవాడనుకున్నారు! నన్ను మగాణ్ణిగా నటించమని చెప్పేవాడు. తను ఆడదానిలా నటించేవాడు...... నేను అతన్ని ......బలాత్కారంగా......అబ్బ...దుర్మార్గుడు! ...ఇహ ఊహించుకోండి ఆ హాయిని! యెలావుంటుందో! ... నేను నీదాన్ని... నేను నీదాన్ని...నన్ను తీసుకుపో...నన్ను నీదానిగా చేసుకో...అంటూ కేకలు పెట్టేవాడు......'

'పిచ్చిముండాకొడుకు!' అంది వెర్కా అనే పిల్ల.

'పిచ్చేంపిచ్చి? పిచ్చీకాదు, పాడూకాదే! అందరుమగాళ్ళకుమల్లే అతనూ దుర్మార్గుడు. నీచుడు! ఇంట్లో సుఖంలేక విసిగిపోయి ఇక్కడికొచ్చాడు. డబ్బుపారేస్తే కోరుకున్నసుఖం ఇక్కడ లభిస్తుందని అనుకున్నాడు. అంతకన్నా మరేంలేదు. మగాళ్ళంతా ఇంతే!' అంది టమారా.

వీళ్ళ సంభాషణలో పాల్గొనకుండా వున్న జెన్నీ గభాలున పక్కమీదనుంచి లేచి కూచుంది.

'మీరు మూర్ఖులు! మీకు బుద్ధిలేదు! మీరంతా అంతే' బిగ్గరగా అరిచింది జెన్నీ— 'ఇలాంటిపనులు చేసే మగాళ్ళను మీరెందుకు క్షమించాలి? నేనూ మొదట్లో కొంచెం మెత్తగావుండేదాన్ని. కాని ఇప్పుడలా కాదు! వచ్చినవాడినల్లా చెవులుపట్టుకుని ఆడిస్తున్నాను. గుంజిళ్ళు తీయిస్తున్నాను. బలవంతాన నాకాళ్ళు పట్టుకునేలా చేస్తున్నాను. అవును. వాళ్ళు నాకాళ్లు ముద్దుపెట్టుకుంటారు! అలాంటి నీచమైన పనులు వాళ్ళకు ఇష్టం. అది ఒక ప్రేమఅని భావిస్తారు. డబ్బంటే లెక్కచేసేదాన్నికాదు. మీఅందరికీ తెలుసు. అయినప్పటికీ వాళ్ళను నిర్దాక్షిణ్యంగా దోచుకుంటున్నాను... వాళ్ళు తమ భార్యలవి, ఉంపుడుకత్తెలవి, తల్లులవి, కూతుళ్ళవి ఫొటోలుతెచ్చి నాకిస్తూ వుంటారు. వుండాకోర్లు!........ఆ నీచులకు కొస్తయినా ఇంగితజ్ఞానం వుందా?......స్త్రీఅంటే, ఒకేఒకసారి, ఒకేఒక పురుషుణ్ణి ప్రేమిస్తుంది. వాళ్ళు స్త్రీలకు ద్రోహంచేస్తారు. ఒక ప్రియురాలుతో ప్రాణంఇస్తామని చెపుతూ, రహస్యంగా మరోస్త్రీని పొందుతూవుంటారు. నీతిలేనిగాడిదలు! మగాళ్ళలో చాలమంది ఇంతే. అయితే......ఈనాటి యువకులలో కొంతమంది నిజాయితీకలవాళ్ళు ఉన్నారు...కాని బోడిముండకు దొరికేవన్నీ మొద్దుశిశినాలే అన్నట్లు, మనదగ్గరికి వచ్చే వెధవలంతా కటిక దుర్మార్గులు! క్రూరులు, మోసగాళ్ళు, వంచకులు!... ఇటీవల నేనొకపుస్తకంచదివాను. అందులో మన పడుపుకత్తెల జీవితం భయంకరంగావర్ణించబడింది... ఇప్పుడు నేను ఏసంగతులు చెపుతున్నానో... అవన్నీ అందులో వున్నాయి' అంటూ ద్వేషం వెళ్ళకక్కుతూ చెప్పింది జెన్నీ.

వాండా తిరిగివచ్చింది. మెల్లగా జెన్నీపక్కమీద లాంతరు నీడలో కూచుంది. సాధారణంగా ఉరిశిక్షపడిన నేరస్థులు, కఠినశిక్షపడిన ఖైదీలు, పడుపుకత్తెలు విచిత్రమైన మనస్తత్వం కలిగివుంటారు. ప్రతి చిన్నవిషయా

నికి వీరు అపార్థంచేసుకుంటూరు. స్వల్పవిషయాలకే వీరి సున్నితమైనమనస్సు నొచ్చుకుంటుంది. ఈ అరగంటాత్రీ ఆపిల్ల తన విటునితో ఎలా గడిపిందీ మిగతావాళ్ళు అడగలేరు. హఠాత్తుగా వాండా పాతికరూబుల్సు తీసి బల్ల మీదికి విసిరింది.

'ఒకబుడ్డి ద్రాక్షసారాయి, ఒక కమ్లాజపండు పట్టుకురావోడి' అంటూ నిర్లక్ష్యంగా ఉత్తర్వుచేసింది ఆపిల్ల.

తరువాత ఆమె తన రెండుచేతులతో మొహాన్ని కప్పుకుని నిశ్శబ్దంగా కుమిలి కుమిలి ఏడవడం మొదలెట్టింది. అప్పటికీ ఏంజరిగిందో అడగడానికి యెవరూ సాహసించలేరు. జెన్నిమాత్రం ఆగ్రహంతో వణికిపోతోంది. ఆమె మొహం తేరిపారచూడడానికి వీలులేకుండా వుంది. పళ్ళతో బలంగా కిందిపెదవి కొరుక్కుంది. అప్పుడు వాండా, ఇలా చెప్పసాగింది—

'అవును టమారా! ఇప్పుడు నిన్ను అర్థంచేసుకోగలిగాను. టమారా నన్నుక్షమించవూ? పచ్చి దొంగఅయిన ఆ శంకొగాణ్ణి నీవు ప్రేమిస్తుంటే నేను ఎగతాళిచేశేదాన్ని. నిన్ను అవమానపర్చేదాన్ని. కాని ఇప్పుడు నాకు అర్థమైంది. మగాళ్ళందరిలోకి నీతీ, నిజాయితీకలవాళ్ళు ఇద్దరే. ఒకడు దొంగ, రెండోవాడు హంతకుడు. వీరిద్దరూ ప్రియురాలితో మన నిచ్చి మాట్లాడతారు. చచ్చినా అబద్ధంచెప్పరు. అవసరమైతే ప్రియురాలి కోసం దొంగతనంగాని, హత్యగాని చేస్తారు. తమ ప్రాణాలు ఇస్తారు. కాని తక్కినవాళ్ళు పచ్చి మోసగాళ్ళు! అబద్ధాలకోర్లు! కనిపించకుండా జిత్తులు పన్నుతారు. కుట్రలతో, కుచ్ఛితాలతో మనల్ని వంచించి నాశనం చేస్తారు. ఆ కృూరుడున్నాడు చూచారూ? మూడుకుటుంబాలు నడుపుతున్నాడు. భార్య, అయిదుగురు బిడ్డలు ఉన్నారు. ఇద్దరుబిడ్డల్ని ఒక పోషకురాలుకు వప్పచెప్పి దూరదేశానికి పంపించాడు. వాళ్ళు అక్కడ వుంటున్నారు. ఇంకో అతనికి మొదటిసంబంధం భార్యకు ఒకకూతురు వుంది. ఈదుర్మార్గుడు కూతురుతోనే సంసారంచేసి ఆమెవలన ఒకబిడ్డను కూడా కన్నాడు. నగరంలో ప్రతివారికీ ఈ విషయం తెలుసు—అతని పని బిడ్డలకుతప్ప. తక్కినవారంతా ఈ సంగతి పోలునాడుగా చెప్పుకుంటూరు. ఆబిడ్డలుకూడా కొంచెం అనుమానంకలిగి ఈవిషయం గుసగుసలాడుకుంటూరు. మరి చూడండి! ఇలాంటి దుర్మార్గుణ్ణి పెదమనిషిగా, గౌరవనీయుడుగా

ప్రసిద్ధమైన వ్యక్తిగా చెప్పుకుంటుంది లోకం!...చూడండి అమ్మాయిలూ! నిజానికి మనం ఇంతకుముందు యెన్నడూ ఒకరికొకరం హృదయాలువిప్పి మాట్లాడుకోలేదు. కాని ఇప్పుడు నాచరిత్ర మీఅందరితో చెప్పదలచాను. నేను పదేళ్ళపిల్లగా వున్నప్పుడు, నాకన్నతల్లి నన్ను ఝటోమిర్ నగరంలో ఒక డాక్టర్‌కు అమ్మింది. అతని పేరు టాంబర్ కైన్. నా కప్పటికి సరిగ్గా పదేళ్ళవయస్సు. నేను డాక్టర్ కాళ్ళు పట్టుకుని ప్రార్థించాను అన్నేం పున్నేం యెరుగని అమాయకురాలిననీ, పసితనంలో ఉన్నాననీ ఏడ్చాను. కాని అతను నన్ను వదిలిపెట్టలేదు. 'పరేంపరవాలేదు, నీవు తొందరలోనే బాగా యెదిగివస్తావులే' అంటూ జవాబుచెప్పాడు...ఏంచెప్పను? ఆ వయస్సులో...అలాంటిపని....యెంత నొప్పిపుట్టిందో చెప్పలేను...అబ్బ... అసహ్యం...ఆతరువాత అతను ఏంచేశాడో తెలుసా? తనొక పెద్ద ఘన కార్యం చేసినట్లు, ఈవిషయం ఊరంతా చాటించాడు.......అవమానంతో కుమిలి, కుళ్ళి, గుండెపగిలేలా ఏడ్చాను!'

'సరే, ఎలాగూ మొదలుపెట్టనేపెట్టారుగా! అందరం చెప్పుకుం దాం' అంది జోస్యా మెల్లగా, విచారమైన మొహంతో. ఇవాన్ పెట్రో విచ్ మునిసిపల్ హైస్కూల్లో పనిచేసే ఒకటీచరు నన్ను చెరిచాడు. ఒక నాడు ఊరకనే, నన్ను తనఇంటికి రమ్మని పిలిచాడు. నేను ఎందుకో అని వెళ్ళాను. అతని భార్య మార్కెట్టుకు పోయింది. క్రిస్టమస్‌పండుగకు బాతును కొనడానికి వెళ్ళిందట. నాచేతిలో పటికిబెల్లంముక్క ఒకటి పెట్టాడు. ఏంచేయను? అతను చెప్పినట్లు చేయాల్సివచ్చింది. ఒసేవ్! మీకు తెలుసునో లేదో? ఇప్పుడంటే ఇంత గడితేరి, మన ఇష్టంవచ్చినట్లు నిర్భ యంగా ప్రవర్తిస్తున్నాం కాని, ఆరోజుల్లో టీచర్లంటే చచ్చేభయం. మేం చదువుకునేరోజుల్లో, పంతుళ్ళకు మామీదున్న అధికారం, జార్‌చక్రవర్తికి, ఆఖరుకు దేవుడికికూడా లేదు.' అంటూ జోస్యా తనచరిత్ర చెప్పింది.

'నన్నొకవిద్యార్థి చెడగొట్టాడు. నేను దాసీనిగా పనిచేస్తోన్న ఇంట్లో పిల్లలకు అతను చదువు చెపుతూండేవాడు...ఓ! చెప్తాను వినండి...' అంటూ న్యూరా తనచరిత్ర చెపుతూ మధ్యలో ఒకక్షణం ఆగింది. ఎందుకో తలతిప్పి, గదివాకిలివైపు చూచింది. వెంటనే ఆమెమొహం అదోరకంగా మారిపోయింది. ఆమె అలా చూడ్డానికి కారణం ఏమిటని, తక్షణమే జెన్నీ

కూడా వాకిలివైపు చూచింది. ఏముంది! వాకిట్లో ల్యూబా నిలబడివుంది. ఆమెమొహం వివర్ణమైపోయివుంది. విపరీతమైన బాధతో కుమిలిపోతున్నట్లు కనిపించింది. నిలబడడానికికూడా శక్తివున్నట్లు లేదు. పడిపోకుండా తలుపు బొడ్డె పట్టుకుని నిలుచుంది. లిఖోనిన్ వెంట వెళ్ళిన ల్యూబా హఠాత్తుగా అక్కడ సాక్షాత్కరించేసరికి జెన్నీ నివ్వెరపోయింది.

'ల్యూబా! ఇక్కడికొచ్చావేం? ఏంజరిగిందే పాపిష్టిదానా!' అనిఅడిగింది జెన్నీ బిగరగా. కాని ఆమెకంఠస్వరం గాద్గదికమైంది.

'నీకు తెలీదూ? అతను నన్ను వెళ్ళగొట్టాడు' అంది ల్యూబా.

ఎవరూ మాట్లాళ్ళేదు. జెన్నీ కనచేతులతో కళ్ళను కప్పుకుంది. వేగంగా ఊపిరితీస్తోంది. ఆమె ముఖకవళికలు క్షణక్షణం మారుతున్నాయి.

'జెనిచ్కా! ఇహ నాగతి ఏంకావాలి? నేను నీమీదనే ఆశపెట్టుకున్నాను. నీకంటె నాకు దిక్కెవ్వరున్నారు? ... ఎలాగైనా ఇక్కడివారంతా నిన్ను గౌరవిస్తారు...ఏమే! నాకు సహాయం చెయ్యవూ? దయచేసి...అన్నాతోటో, లేక సిమన్‌తోటో మాట్లాడు. నన్ను మళ్ళీ చేర్చుకోమని చెప్పు.' అంది ల్యూబా. ఆమె ఈమాటలు ఎంతో కష్టంతో అంది.

జెన్నీ వెంటనే లేచి కూచుంది. ఒకమాటు ల్యూబావైపు చూచింది. ఆమెకళ్ళల్లో జాలి, కోపం, ద్వేషం, అన్నీ పెనవేసుకుని వున్నాయి.

'ఇవాళ అన్నం తిన్నావటే?' అనడిగింది జెన్నీ.

'లేదు, ఇవాళా లేదు, నిన్నా లేదు.'

'జెనిచ్కా! నన్ను కొంచెం ద్రాక్షసారాయి యివ్వమంటావూ? వెర్కా వెళ్ళి వంటింట్లో మాంసం ఏమైనా వుందేమో వెదకి తెస్తుంది. ఏం, తెమ్మంటావా?' అంది వాండా జెన్నీతో.

'సరేనే! ఏదో ఒకటి చేయుండి. అమ్మాయిలూ! దాని మొహం చూడండే, ఎట్లావుందో? మంచులో తడిసి వళ్ళంతా ముద్దయిపోయింది. తల్లమంకా! ఎమేవ్ టమారా! ముందు ఒకజత బట్టలు దానికివ్వండి. ఒక జత మేజోళ్ళు, స్లిప్పర్లుకూడా పట్టుకురండి. ఊఁ. త్వరగావెళ్ళండి.'

ముందు ల్యూబాప్రాణాలు నిలవడంకోసం జెన్నీ అందరినీ తలాఒక పని చేయుమని పురమాయించింది. 'ఏమే ల్యూబా! అసలు ఏంజరిగిందో చెప్పవే ముద్దూ!' అనడిగింది మళ్ళీ జెన్నీ, ఆమెవైపుచూస్తూ.

# 7

వేసవికాలంలో ఆనాటి తెల్లవారుజామున లిఖోనిన్ అనే విద్యార్థి ల్యూబాను అన్నాయింట్లోంచి తప్పించి తనతో తీసుకువెళ్ళాడుకదూ? అది లిఖోనిన్ జీవితంలో ఒక మరపురాని సంఘటన. అతని జీవయాత్రలో ఒక మలుపు! అతని విద్యార్థిదశలో ఒకపిలుపు!

చెట్ల ఆకులన్నీ ఇంకా పచ్చగానేవున్నాయి. పసిరికనుంచీ, పచ్చని ఆకులనుంచి గాలిపాటునవచ్చే సువాసనలు హృదయాహ్లాదకరంగావున్నాయి. ఉత్సాహాన్ని కలిగిస్తున్నాయి. ఆ నిశీథిలో నిశ్చలంగా, నిశ్శబ్దంగా నిలబడి వున్న చెట్లవైపు చూచాడు లిఖోనిన్. అతనికి ఆశ్చర్యంకలిగింది. నిర్మలంగా పరమశాంతంగా వున్న ఈ ప్రకృతి సౌందర్యాన్ని, ఈశ్వరసృష్టిని మానవులు అనుభవించకుండా తృణీకరిస్తున్నారుకదా అనుకున్నాడు. అంతలోనే అతనికి విచారంకలిగింది. బండి వేగంగా పోతోంది. బండిలోంచి బయటికి పరిశీలించి చూస్తున్నాడు. దోవకు ఇరుపక్కలా చెట్లు వున్నాయి. అవి ఎంతోఎత్తున ఆకాశంలోకి తొంగిచూస్తున్నాయి. నదిలోనీరు నీలంగా, నిశ్చలంగా అగుపిస్తోంది. కిర్రవంతెనకిందినుంచి ప్రవహిస్తోన్న ఆ నీరు ఎంత మనోహరంగావుంది! ఆకాశంలో తెల్లని తెరలు, పొరలు విచ్చుతున్నాయి. తూర్పుదిశను ప్రభాతకాంతులు గోచరిస్తున్నాయి. ప్రాగ్దిశ ఉదయభానుణ్ణి తన విశాల హస్తాలతో ఆహ్వానిస్తోంది.

రాత్రిఅంతా నిద్రలేకుండా అప్పటివరకూ సెగలు, పొగలు, చప్పట్లు, కేకలు, నవ్వులు, తువ్వులు వీటితో సందడిగావున్న సానికొంపలో గడిపి బయటపడిన ఆ విద్యార్థికి ఇప్పుడెంతో హాయిగా, ఆనందంగావుంది. బయట వీస్తోన్న చల్లనిగాలి, నిర్మలమైన వాతావరణం, ప్రఫుల్లమైన ప్రాతఃకాల సౌందర్యం ఇవన్నీ అతని హృదయంలోను, ఊపిరితిత్తులలోను ప్రవేశించి సంతోషసాగరంలో ముంచివేశాయి. అంతేకాదు. వీటికితోడు అతను చేసిన ఘనకార్యం! ఒక స్త్రీని— ఒక పతితను యమకూపంలోంచి బయటపడేసి ఉద్ధరించడం! ఇది తలుచుకునేసరికి అతనిహృదయం మరీ ఉప్పొంగిపోయింది.

అవును. అతను మనిషిలా వ్యవహరించాడు. నిజమైన మానవుడిలా ప్రవర్తించాడు. ఇప్పటికీ అతను, తను చేసినపనికి చింతించడంలేదు. సంసార స్త్రీలముందు, చక్కని ఇల్లాండ్రముందు కూచుని కులాసాగా టీతాగుతూ, వ్యభిచారం చాలా చెడ్డదనీ, మహాపచారమనీ కబుర్లుచెప్పడం 'వాళ్ళకు' సులభంకావచ్చు. (ఈ 'వాళ్ళు' అంటే ఎవరో అతనికి సరీగా తెలీదు; కాని ఈ 'వాళ్ళు', లేక తన తోటివిద్యార్థులు, ఎవడైనా ఒక్కడు, ఒక్కడంటే ఒక్కడు ముందుకువచ్చి, నడుంకట్టి, ఒక్క పతితనైనా ఉద్ధరించాడూ? హు! మరి తనూ? తను అలా కాదు. కబుర్లుచెప్పటంకాదు తనపని. చేసి చూపిస్తాడు. లిఖోనిన్ అంటే, ఒక పనిచేసి చూపించేవాడు!

అతను ల్యూబా నడుంచుట్టూ తన చేతిని పోనిచ్చి, ప్రేమపూరిత నయనాలతో ఆమెవంక చూచాడు. కాని, వెంటనే, ఆక్షణంలోనే తను ఆమెను తండ్రిలా, సోదరుడిలా ప్రేమిస్తున్నానని భావించాడు.

ల్యూబా బాగా నిద్రమత్తులో వుంది. ఆమెకళ్ళు కూరుకుపోతున్నాయి. కాని ఎంతో కష్టంమీద, కళ్ళుతెరిచి మేలుకొని వుండడానికి ప్రయత్నిస్తోంది. ఆమె పెదవులమీద అలాగే అమాయకమైన, అలసిపోయిన చిరునవ్వు తాండవంచేస్తోంది. ఆమెనోట్లో ఒకవైపునుంచి సన్నని ధారగా చొంగ కారుతోంది.

'ల్యూబా! చూడు! ఇటు చూడు! మనచుట్టూ ఎంత అందంగావుందో చూడు! స్వర్గం దిగివచ్చినట్లుగా వుంది! నేను సూర్యోదయాన్ని చూచి అయిదేళ్ళయింది ల్యూబా! ఎప్పుడూ ఏదో ఒక ఆటంకంవచ్చేది. గుంపులో కూచుని పేకాట ఆడుతూవుండడమో లేక తాగుడుతో మైకంలోవుండడమో, లేక యూనివర్సిటీకి పరుగెత్తడమో సంభవించేది. సరీగా సూర్యోదయం అయ్యే సమయానికి ఎప్పుడూ ఇలాంటి ఆటంకాలే వచ్చేవి. చూడు! ఆ తూర్పుదిశను చూడు- ప్రభాతకాంతులు—ఉదయభానుని అరుణకాంతులు ఎలా వెల్లివిరుస్తున్నాయో! ఇది నీజీవితానికికూడా అరుణోదయం ల్యూబా! ఇప్పుడు నీజీవితానికి నూతనాధ్యాయం ఆరంభమైంది. ఫరవాలేదు. సందేహించకుండా, నిర్భయంగా నాచెయ్యిమీద ఆనుకుని కూచో. నీకు మంచిమార్గం చూపిస్తాను. నిన్ను ఆదర్శమార్గంలో నడిపిస్తాను. భయపడకు. జీవితంలో కష్టాలను, క్రూరమైన సంఘటనలను ధైర్యంతో, సాహ

సంతో ఎలా ఎదుర్కోవాలో నీకు నేర్పుతాను. చివరవరకూ నీకు అండగా నిలబడి పోరాడుతాను ల్యూబా! అన్నాడు లిఖోనిన్.

ల్యూబా అతనివైపు పరీక్షార్థకంగా చూచింది. 'అతను ఇంకా తాగుడుమైకంలోనే ఉన్నాడు. అంచాత ఏదో ఉద్రేకంగా మాట్లాడు తున్నాడు...అయినా ఫరవాలేదు. మంచివాడు. కొంచెం సంసారపక్షంగా వుంటాడు. అంతకన్నా ఏంలేదు.' అనుకుంది తనలో. తరువాత మత్తుగా నవ్వి, వ్యంగ్యంగా ఇలా అంది.

'అవును. మీరు నిస్సందేహంగా నన్ను మోసంచేస్తారు. మగాళ్ళంతా అంతే. మీ అవసరం తీరేవరకు,మీకుసుఖం దొరికేవరకు బాగానేచూస్తారు. తరువాత అవతలికి పొమ్మంటారు. అవునా?'

'ఏమిటీ? నేనా? బొందిలో ప్రాణంవుండగా అలా చెయ్యను!' అన్నాడు లిఖోనిన్ రోషంతో. అతను, తన పిడికిలితో గుండెమీదకొట్టుకో డానికి సిద్ధపడ్డాడుకూడా. 'నీకు ఇంకా నాసంగతి బాగా తెలీదు ల్యూబా! ఓ దిక్కులేని ఆడపిల్లను అన్యాయంగా మోసంచేసే నీచుణ్ణికాదు నేను! నీవుపడిన కష్టాలన్నీ మరిచిపోవడానికి నా శాయశక్తులా కృషిచేస్తాను. నీకు విద్యాబుద్ధులు చెప్పిస్తాను. నీకు ప్రపంచజ్ఞానం కలిగిస్తాను. నీ దారిద్ర్యం, నికృష్టజీవితం, నీ దుష్ప్రవర్తన అన్నీ మారుస్తాను ల్యూబా! నేను నీకు తండ్రిలా, సోదరుడిలా వ్యవహరిస్తాను. నీవు నిజంగా, పవిత్రంగా, హృదయపూర్వకంగా ఎవరినైనా ప్రేమించడం సంభవిస్తే, ఆనాడు నేను హర్షిస్తాను. నిన్ను ఆ యమకూపంలోంచి బయటికి తెచ్చిన శుభదినాన్ని అభినందిస్తాను.'

లిఖోనిన్ ఇలా ఉద్రిక్తుడై మాట్లాడుతోంటే, బండివాడు నిశ్శబ్దంగా తనలో నవ్వుకొనసాగాడు. అవును. వృద్ధులైన బండ్లవాళ్ళకు ఇలాంటి విషయాలు ఎన్నో తెలుసు. వాళ్ళు ఇలాంటి సంఘటనలు ఎన్నో చూచారు. ఇలా మహోపన్యాసాలు చేసే మొనగాళ్ళను ఎంతోమందిని చూచారు.

అతనుచెప్పింది విని ల్యూబా, అతనికి తనపై కోపం వచ్చిందని, లేకపోతే ఎవరో ప్రతికక్షి అయినట్లు అసూయ కలిగిందని భావించింది. వెంటనే ఆమె బాగా మెలకువ తెచ్చుకుని లిఖోనిన్‌వైపు మొహం

తిప్పింది. కళ్ళు పెద్దవిచేసి, వినయంగా, మార్దవంగా అతనివంక చూచింది. తన నడుంమీద వున్న అతని కుడిచేతిని మెల్లగా వేళ్ళతో తాకింది.

'కోపంవచ్చిందా ప్రియా! మీకు కాకుండా మరొకరికి మనసు ఇస్తా నన్న మాట కల్ల. దేవుడిమీద ప్రమాణంచేసి చెపుతున్నాను. మీరు నన్ను కాపాడాలని ప్రయత్నిస్తున్నారు. ఆమాత్రం నేను అర్థంచేసుకోలేదను కున్నారా? మీరు...మీరు అందమైన యువకులు. ఇహ ఎందుకు కాదం టాను. పోనీ మీరు వృద్ధులన్నా అయితే అనుకోవచ్చు...'

'నా అభిప్రాయం అదికాదు.' గట్టిగా అన్నాడు లిఖోనిన్. ఆమె తన భావాలు అర్థంచేసుకోలేదని తెలుసుకుని, మళ్ళీ ఆమెకు విపులంగా చెప్పసాగాడు. స్త్రీల హక్కులనుగురించీ, మానవ జీవితాన్నిగురించీ, న్యాయాన్నిగురించీ, చెడుకు, బానిసత్వాన్ని నిర్మూలించే స్వేచ్ఛనుగురించీ గంభీరమైన ఉపన్యాసం ఇచ్చాడు.

కాని పాపం, అప్పటికీ ఆ పిల్ల గ్రహించలేదు. అతను చెప్పే విష యాల్లో ఒక్కమాటకూడా ఆమెకు అర్థంకాలేదు. అందుకు ఎంతో విచా రించింది. తన అసమర్థతకు, తప్పిదమునకు దుఃఖించింది. తనకోసం అంతగా కృషిచేస్తోన్న యువకుణ్ణి, అతని మనస్తత్వాన్ని, అతని భావాలు గ్రహించ లేనందుకు ఎంతో చింతించింది. అతనికి కనుపించకుండా మనసులోనే కుమిలి కుమిలి ఏడ్చింది.

'అదుగో మన ఇల్లు వచ్చింది...ఆపవోయ్‌బండీ!' అన్నాడు విద్యార్థి.

బండి ఆగింది. అతను బండిలోంచి దిగాడు. ల్యూబాను చెయ్యిపట్టు కుని మెల్లగా దింపాడు. బండివాడికి ఇవ్వాల్సిన బాడుగ ఇచ్చేశాడు.

అతను దర్జాగా ల్యూబాచెయ్యి పుచ్చుకుని, ఏవో పోజుపెట్టి ఇంటి లోకి తీసుకుపోతోంటే, బండిలోలే ఆముసలాడు అవాలా చూచాడు.

'ఇది నా సుందరభవనం!
లేదు ఇసుమంత భయం!
ఇది నిశ్శబ్దం, నిర్మలసౌధం!
ఈ భవనానికి రాణివి నీవే!
ఈ హృదయానికి దేవివి నీవే!
పదవే ఓ ప్రియురాలా!
పదవే ఓ సఖురాలా!

అని ఏదో పాట వినపడుతున్నట్లు అనిపించింది ఆ బండివాడికి. ఏదో విచిత్రంగా, వేదాంతిలా నవ్వాడు అతను.



లిఖోనిన్ నివసిస్తోన్న గది మేడమీద అయిదో అంతస్థులోవుంది. ల్యూబా ఎంతో కష్టంమీద మేడమెట్లు ఎక్కసాగింది. ఇహ రెండు మూడు మెట్లెక్కితే, నీరసంవల్ల అక్కడే పడిపోయి మరి లేవలేననికూడా అనుకుంటోంది. కాని లిఖోనిన్ ఇంకా మాటలు చెపుతూనేవున్నాడు.

'ల్యూబా! నీవు బాగా అలసిపోయినట్లున్నావు. మరేంఫరవాలేదు. నన్ను ఆనుకుని నడువు. మనం పైకిపోతున్నాం. మానవుడు పురోగమిస్తాడనడానికి ఇదేతార్కాణం. ఫరవాలేదు నా సోదరీ! నా కామ్రేడ్! ఇలా నా భుజానికి ఆనుకో'.

అసలే అలసివున్న ల్యూబాకు ఇది మరీ కష్టంగావుంది. తనొక్కతే ఎక్కడం కష్టంగావుంటే, ఇప్పుడు లిఖోనిన్‌నుకూడా ఈడ్చుకుపోవాల్సి వచ్చింది. పైగా అతను చాల బరువుగావున్నాడు. పోనీ ఎలాగో బాధను తట్టుకుందామాఅంటే, దీనికితోడు అతగాడు ఊరక తెరిపిలేకుండా వదరుతున్నాడు. అర్థంలేనివాగుడుతో ఊదరకొడుతున్నాడు. ఇది మరీ బాధగా వుంది ల్యూబాకు. పిప్పిపన్ను పోటులా, పసివాడిఏడుపులా 'గీ' అని అరిచే కీచురాయి ధ్వనిలా వుంది అతని వాగుడు.

చివరకు ఎలాగైతేనేం, ఇద్దరూ లిఖోనిన్‌గదికి చేరుకున్నారు. గదికి తాళంలేదు. అసలెప్పుడూ అది తాళంవేసివుండదు. లిఖోనిన్ తలుపు తోశాడు. తలుపు తెరుచుకుంది. ఇద్దరూ లోనికి ప్రవేశించారు. గది అంతా చీకటిగావుంది. మసకమసకగా అగుపిస్తోంది. గదంతా కంపుకొడుతోంది. చిట్టెలుకలవాసన, కాల్చిపారేసిన పొగాకు, సిగరెట్లవాసన, కిరసనాయిలు కంపు, మాసిపోయి మురిగిపోయిన బట్టలవాసన; ఈదుర్గంధంతో ముక్కులు పగిలిపోతున్నాయి. ఆ మసకవెల్తుర్లో ఎవరో గాఢంగా, వళ్ళుతెలీకుండా గుర్రుపెట్టి నిద్రపోతున్నారు.

గదికి అడ్డంకట్టిన తెరలు తొలగించాడు లిఖోనిన్. కిటికీతలుపులు కూడా తెరిచాడు. అప్పుడు గదిలోకి కొంత వెల్తురువచ్చింది. చూస్తే, ఒక మామూలు పెళ్ళికాని పేదవిద్యార్థిగది ఎలావుంటుందో అలాగేవుంది ఆగది. ఒకవైపు కుక్కి అయిపోయి ఊగుతోన్న మంచం, దానిమీద అట్టకట్టుకుపోయిన ఒకదుప్పటి ఉన్నాయి. మరోమూల కాలువిరిగిన టేబులు, దానిమీద కొవ్వొత్తులు వెలిగించి పెట్టే దీపపుసెమ్మా వున్నాయి. కొవ్వొత్తులు మాత్రం లేవు. కొన్నిపుస్తకాలు టేబులుమీద, మరికొన్ని క్రిందా చిందరవందరగా పడేసివున్నాయి. గదినిండా ఎక్కడపడితే అక్కడ కాల్చి పారేసిన సిగరెట్టుముక్కలు పడివున్నాయి. గోడను ఆనించి, బాగా పాతబడిపోయిన ఒక సోఫావుంది. ఆసోఫాలో ఒకయువకుడు పడుకుని నిద్రపోతున్నాడు. నల్లగా వంకులుతిరిగినజుట్టు, నల్లని కోరమీసాలు. నోరు తెరుచుకుని గురకపెడుతూ నిద్రపోతున్నాడు. అతనిచొక్కాకు గుండీలు ఊడతీసివున్నాయి. అందుచేత ఎదురురొమ్ము, దానిమీద నల్లగా, వత్తుగా వున్న వెంట్రుకలు స్పష్టంగా అగుపిస్తున్నాయి.

'సిజేరా! ఏయ్ సిజేరా! లేవోయ్! లే!' అంటూ అరిచాడు లిఖోనిన్, అతని డొక్కమీద తడుతూ.

'ఊ ఊ...' మూలిగాడు అతను.

'లేవోయ్! లే! నిన్నే. గాడిదలా ఏమిటానిద్ర?'

'అబ్బ! ఊ...ఊ...'

'నీకేరా చెప్పేది? నీనిద్ర పాడుగాను. ఏమిటా మొద్దునిద్ర? దున్నపోతులా దొర్లుతున్నావ్. లే! అరబ్బీ లొట్టిపిట్ట! లేవవేంరా రాస్కెల్!...' చెడామడా తిట్టాడు లిఖోనిన్.

అంతలో ల్యూబా అడ్డొచ్చింది. భయపడుతూ అతనిచెయ్యి పట్టుకుని ఇలా అంది.

'ఊరుకోండి పాపం, ఎందుకాయన్ను బాధపెడతారు? అలసిపోయి పడుకున్నట్లున్నారు. అతన్ని నిద్రపోనీయండి...... నేనే తిరిగి ఇంటికివెడతాను. బండి బాడుగకు ఓ యాభై కోపెక్కులుంటే ఇవ్వండి, చాలు. మళ్ళీ మీరు లేపొచ్చి నన్ను చూడొచ్చు...రారూ?'

ల్యూబా అన్నమాటలు విని లిఖోనిన్ కలవరపడ్డాడు. నిద్రమత్తులోవున్న ఆపిల్ల, అనవసరంగా జోక్యం కలిగించుకుని తనను అటకాయించడం విచిత్రంగా తోచింది అతనికి. కాని ఆ నివ్వెరపాటు ఎంతో సేపు లేదు అతనికి. మళ్ళీ అనుకున్నాడు. బహుశా ఆమె నిద్రపోతోన్న మనిషినిచూచి జాలిపడిందని భావించాడు. మొత్తంమీద అతనిమనసు కొంత నొచ్చుకుంది. నిద్రపోతోన్న నిజరాచెయ్యి కిందికి వేలాడుతోంది. అతని చేతిలో ఆరిపోయిన సిగరెట్టుకూడా వుంది. అలాగే పట్టుకునివున్నాడు. ఇహ లాభంలేదని లిఖోనిన్ అతనిచెయ్యి పుచ్చుకుని బలవంతాన ఊపుతూ, తీవ్రంగా ఇలాఅన్నాడు.

'నిజేరా! ఎంత పిలిచినా నీవు లేవడంలేదు. మనిషిఅన్నతరువాత జ్ఞానంవుండాలి. నేను ఒంటరిగాలేను. నాతో ఒక ఆడమనిషికూడావుంది, లేరాపంది!'

ఈసారి ఈమాటలు మంత్రంలా పనిచేశాయి. నిజేరా ఒక్కసారిగా ఉలిక్కిపడి లేచాడు. ఎగిరికూచున్నాడు. చేతులతో కళ్ళు నలుముకున్నాడు. కన్నెత్తి చూచాడు. ఎదురుగా ఆడమనిషి అగుపించింది. కలవరపడ్డాడు. గొణుక్కుంటూ గబగబా చొక్కాకు గుండీలు పెట్టుకున్నాడు.

'నువ్వేనా లిఖోనిన్? నీకోసం కూచుని కూచుని విసుగుపుట్టింది. ఆఖరుకు కునుకుపట్టింది. దయచేసి ఆమెగారిని ఒక నిముషం అటుతిరగమని చెప్పు' అన్నాడు నిజేరా నిద్రమత్తుగానే.

అతను గబగబా తన బూడిదరంగు కోటు—విద్యార్థులు వేసుకునే కోటు తొడుక్కున్నాడు. రెండుచేతులూ జుట్టులోకి పోనిచ్చి, వేళ్ళతో క్రాపు సరిచేసుకున్నాడు. ప్రతి ఆడమనిషికీ వగలాడితనం సహజంగా పుట్టుకతో వచ్చినగుణం. ఎంతవయసు వచ్చినా, ఏ పరిస్థితిలోవున్నా, వాళ్ళకు ఆగుణం పోదు. అందులోనూ కొత్తమగాడు కనిపించగానే ఆడది తప్పకుండా ఒయ్యారం ఒలకపోస్తూ మసలుగోలుపుతుంది. అలాగే ఇప్పుడు ల్యూబాకూడా ఎదురుగావున్న నిలువుటద్దంముందుకువెళ్ళి జుట్టు సవరించుకోసాగింది. నిజేరా, తన కళ్ళసైగలతోటే, ఆ వచ్చిన ఆమె ఎవరని లిఖోనిన్ను ప్రశ్నించాడు.

'ఎవరోతే' అన్నాడు పెద్దగా లిఖోనిన్. 'ముందు మనం బయటికి వెడదాం రా! అంతా చెపుతాను. ల్యూబ్కా! ఇప్పుడే ఒక నిముషంలో వస్తాను. మరేం అనుకోకు. వచ్చి నీకు కావల్సిన ఏర్పాట్లు అన్నీ చేసి మరీ వెడతాను'.

'మరేంఫరవాలేదు' అంది ల్యూబా. 'నాకో సోఫా చాలు. మీ రా మంచంమీద పడుకోండి. నాకింకేమీ అక్కర్లేదు'

'అలాకాదు ల్యూబా! నా స్నేహితుడుకూడా ఈ ఇంట్లోనే వుంటు న్నాడు. నేను అతనితో గడుపుతాను. మళ్ళీ ఇప్పుడే వస్తాను.'

ఆ ఇద్దరు విద్యార్థులు, నడవలోకి వెళ్ళారు.

'ఏమిటిది? కలలావుందే? ఎవరాపిల్ల? ఎక్కణ్ణుంచి కొట్టుకొచ్చావోయ్? కళ్ళు పెద్దవిచేసి చూస్తూ అడిగాడు నిజేరా.

లిఖోనిన్ ఏదో అర్థవంతంగా తలూపి మొహం చిట్లించాడు.

'చూడు మిత్రమా!' అన్నాడు లిఖోనిన్ తడబడుతూ. స్నేహితుడి కోటుగుండీ చేత్తో కదుపుతూ అతని మొహంకేసి చూడకుండా చెప్ప సాగాడు. 'నీవు అపార్థంచేసుకుంటున్నావు నిజేరా! ఆమె... ఆమె... నేను, స్నేహితులతో కలసి... ఊరకే ఒకనిముషం అన్నామార్కోవ్ నాఇంటికి వెళ్ళాం...'

'నీతో ఎవరెవరు వచ్చారు?' ఆసక్తితో అడిగాడు స్నేహితుడు.

'ఎవరైతే ఏమోయ్? రాంసెస్, బోరియా, ఇంకా కొద్దిమంది వచ్చారు. యార్చెంకో అనే ప్రొఫెసరుకూడా వున్నాడు... అందరిపేర్లు నాకు గుర్తులేవు. మేమంతా కలసి పగలంతా నదిమీద పడవషికారులో గడిపాం. తరువాత రెస్టారెంటులో ఫలహారాలు చేశాం. అంతటితో ఊరు కోక, అందరూ పంపల్లా పోయి యామాలోపడ్డారు. నాసంగతి నీకు తెలుసుగా? నేనీ పాడుపనిలో జోక్యం కలిగించుకోలేదు. కాస్త బ్రాందీ పుచ్చుకుంటూ, నాస్నేహితుడు ఒక రిపోర్టరువుంటే, అతనితో మాట్లాడు కుంటూ కూచున్నాను. ఇహ మనవాళ్ళంతా ఊరుకునేరకమా? వాళ్ళ గోలలో వాళ్ళు ఉన్నారు. తెల్లవారుజాము అయ్యేసరికి ఎంచేతనో తెలీదు గాని, నాహృదయం కరిగిపోయింది. అభాగ్యులైన ఆ వేశ్యలమీద జాలి కలిగింది. ఎక్కడలేని దుఃఖం ముంచుకొచ్చింది. మనం, మన అప్పచెల్లె

అమ్మలను అమితంగా ప్రేమిస్తాం. వాళ్ళమీద ఈగనివాలనివ్వం. వాళ్ళ శీలాన్ని, గౌరవాన్ని, మానమర్యాదలను మన ప్రాణాలు ధారపోసి కాపాడుకుంటాం. వాళ్ళను ఎవడైనా పల్లెత్తు అనరానిమాట అంటే ఊరుకుంటామా? వెంటనే ఎగిరి, మీదపడి ముక్కలుముక్కలు చేసెయ్యం? అవునా?'

'అవును.'

'మరి, వాళ్ళగతిఏమిటి? వారు మన అప్పచెల్లెళ్ళవంటివారు కామా! వారు మన తల్లులవంటివారు కాదూ! ముసలివాళ్ళు, పడుచువాళ్ళు, నీచులు వెధవలు—అంతా వాళ్ళదగ్గరకు వెళ్ళి డబ్బుపారేసి, బహిరంగంగా వాళ్ల శీలాన్ని కొనుక్కుని, చిత్రహింసచేస్తున్నారే! ఇది ఎంత దారుణమో ఆలోచించు. పాపం ఆస్త్రీలు ఒకనిముషానికో, ఒకరాత్రికో డబ్బుతీసుకుని, అనాగరికులు రోగులుఅయిన పురుషులను సుఖపెట్టడానికి ప్రయత్నిస్తారు. వాళ్లు చేయమన్న పిచ్చిపనులన్నీ చేస్తారు. దీన్ని ప్రేమఅంటావా? చెప్పు? ఈనీచులు ఆపిల్లల్ని నానాహింసలు పెడతారు. వాళ్ళను క్రిందపడేసి, తొక్కి, ఉక్కిరిబిక్కిరిచేసి, తమ మోజుతీర అనుభవించి, ఆనందించి, డబ్బులుపారేసి ఇవతలికొస్తారు. హాయిగా, కులాసాగా, కుషీగా జేబుల్లో చేతులు పెట్టుకుని, తలఊపుతూ, ఈలపాట పాడుకుంటూ వెళ్ళిపోతారు. ఆవిధంగా ఆ స్త్రీలు, ఈ పురుషులూకూడా అలవాటుపడిపోయారు. ఆ స్త్రీలలో హృదయం, అంతరాత్మ చచ్చిపోయాయి. వాళ్ళు యంత్రాల మాదిరి అయిపోయారు. నిజంగా వారినిచూస్తోంటే నాకు మన సోదరీమణులు, తల్లులు గుర్తుకొస్తారు నిజేరా! ప్రపంచంలోని స్త్రీజాతి అంతా వారిలో నాకు గోచరమవుతూవుంది. అవునా?'

'అవును.' గొణుగుతూ అటూఇటూ చూశాను నిజేరా.

'అంచాత ఇవన్నీ నామనసులో మెదిలాయి. ఇవన్నీ అందరికీ తెలుసు. అంతా మాటలు చెపుతారు. పెద్దపెద్ద సమావేశాలలో, సభలలో నిలుచుని వ్యాఖ్యోపన్యాసాలు చేస్తారు. నీతులు వల్లిస్తారు. బైబిల్ గ్రంథాలు పంచిపెడతారు. పవిత్రసూక్తులు పఠిస్తారు. అనాచారాన్ని, అన్యాయాన్ని తొలగించాలని వాగుతారు. కలుషితాన్ని, కళ్మలాన్ని కడిగివేయాలంటారు. ఆదర్శప్రాయమైన నవసమాజాన్ని నిర్మించాలంటారు. (ఇక్కడ

లిఖోనిన్, అకస్మాత్తుగా రిపోర్టరు చెప్పిన మాటలు గుర్తుకుతెచ్చుకున్నాడు) కాని ఏంప్రయోజనం? ఎవరూ ముందుకు రార్రు. కార్యాచరణకు పూనుకోరు. కావల్సినదానికి నడుంకట్టరు. నేనే ఈపనికి పూనుకోవాలని నిశ్చయించుకున్నాను. రంగంలోకి దిగాను. ఆ నికృష్టంలోంచి, ఆ రొంపిలోంచి ఈపిల్లను బయటికి తీసుకొచ్చాను. ఆమెకు సహాయంచేసి మంచిమార్గంలో పెడతాను. ఆమె భయాన్ని, బాధను పోగొడతాను. ఆమెకు కావల్సినంత ప్రోత్సాహం ఇస్తాను. ఆమెపట్ల దయ, సానుభూతి ప్రదర్శిస్తాను'.

'ఊఁ' మళ్ళీ మూలిగాడు జార్జియన్ కుర్రాడు నిజేరా.

'ఊఁ ఏమిటి నీమొహం! నేచెప్పేది నీవు అర్థంచేసుకోవడంలేదు. మానవకోటినిగురించి మాట్లాడుతున్నాను. అదికూడా శరీరాలనుగురించి కాదు, మానవ ఆత్మలనుగురించి చెపుతున్నాను.'

'అవును, బాగుంది. తరువాత ఏంజరిగిందో చెప్పు.'

'తరువాత ఏముంది? ఈ అమ్మాయిని అన్నా ఇంట్లోంచి తప్పించి తాత్కాలికంగా ఇక్కడికి తీసుకొచ్చాను. తరువాత ఏంజరుగుతుందో ఆ భగవంతుడే వున్నాడు! ముందామెకు చదవడం, వ్రాయడం నేర్పిస్తాను! తరువాత ఆమెకోసం ఒక చిన్న హోటలో, భోజనశాలో పెట్టిస్తాను. లేకపోతే ఒక చిన్న చిల్లరదుకాణం పెడతాను. మిత్రులంతా నాకీవిషయంలో తప్పక సహాయంచేస్తారు. మానవహృదయం మిత్రమా! ఎవడైనాసరే, ఎలాంటివాడైనాసరే, మనిషిఅన్నతరువాత మనసువుండాలోయ్! దయ, దాక్షిణ్యాలు లేనివాడు మనిషేనా? చూస్తూవుండు! ఒకటి రెండేండ్లలో ఆమెను ఒక ఆదర్శస్త్రీని చేసి నిలబెడతాను. సంఘంలో ఆమెకూ ఒక స్థానం వుందని నిరూపిస్తాను. ఎందుకంటే ఆమెఆత్మ అగ్నిమాదిరి పవిత్రంగా వుంది. శారీరకంగా ఆమె చెడిపోయిందేకాని, ఆత్మకు ఎలాంటి చెడుగూ అంటలేదు సోదరా!'

'ఓ! అదాసంగతి! అయితే ...' అంటూ స్నేహితుడు నాలుక కొరుక్కున్నాడు.

'ఏమిటి అయితే? నీతలకాయ! గాడిదలా మొహమూ నీవూను.'

'అయితే ఆమెకు కుట్టుమిషన్ కొనిపెడతావా?'

'నీమొహం? కుట్టుమిషనే ఎందుకుకొనాలి? ఏమిట్రా నీమాటలు? నాకర్థంకావడంలేదు.'

'ఎందుకో చెప్తాను విను. నవలల్లో ఇలాగే వుంటుందిలే. కథానాయకుడు, నాయకిని రక్షించగానే, ఒక కుట్టుమిషన్ కొనిపెడతాడు. నీవూ అలాగే చేస్తావన్నమాట.'

'ఇహ ఆపరా ఇడియట్! నీ పరిహాసాలూ నీవూను' కోపంగా అన్నాడు లిఖోనిన్.

అది వినేసరికి జార్జియన్ కుర్రాడైన నిజేరాడు ఉద్రేకంవచ్చింది. అతని నల్లటికళ్ళు ధగధగ మెరిశాయి. కంఠస్వరంకూడా మారింది.

'అవునోయ్! నేచెప్పిందాంట్లో అర్థంలేకపోలేదు. నీవు ఆమెకోసం ఏరకంగా శ్రమపడ్డానసరే, ఫలితం ఒకటే. చెప్తాను విను. నీవు ఆమెతో కలిసి కాపురంవుంటావు. ఓ అయిదునెలలతరువాత ఆమెను బయటికి వెళ్ళగొడతావు. అప్పుడామె మళ్ళీ సానికొంపకు చేరుతుంది లేదా వీధుల్లోపడి అడుక్కుతింటుంది. ఇది సత్యం! ఒకవేళ నీవు ఆపిల్లతో కలిసివుండకుండా, ఆమెకోసం ఏవో ఆదర్శాలు, ఆశయాలు ఆలోచిస్తూ, బుర్రపగులగొట్టుకుంటూ కూచుంటావనుకో, ఆపిల్లకు మానసికపరివర్తన తీసుకురావడానికి చైతన్యం కలిగించడానికి ప్రయత్నిస్తావనుకో, అప్పుడైనా ఇలాగే జరుగుతుంది. ఆపిల్ల అవివేకి. అమాయకురాలు. అవిద్య, అజ్ఞానం ఆమెలో పేరుకొనివుంది. అంతాత నీవు చెప్పే నీతులు, బోధలు ఆమెబుర్రకెక్కవు. అర్థంచేసుకోలేదు. చివరకు విసుగుపుట్టుతుంది. వెగటుగా తోస్తుంది. అలవాటులేని ఈ వాతావరణంలో క్షణంకూడా నిలబడలేకపోతుంది. అప్పుడు మళ్ళీ తన మామూలుజీవితంలోకి, సానికొంపలోకి పరుగెడుతుంది. కనుక రెంటికీ ఫలితం ఒకటేగా? ఇంకోవిషయం. పోనీ నీవు, ఆమెను పొందకుండా పవిత్రంగా వుంటావనుకో. సోదరుడిలా ప్రేమిస్తూ, నిక్కచ్చిగా, నిజాయితీగా వుంటావనుకో. అప్పుడామె మరెవరో పురుషుణ్ణి ప్రేమిస్తుంది. నామాట నమ్మ సోదరా! ఆడది ఎప్పుడూ ఆడదేరా అబ్బాయ్! ప్రేమలేకుండా, ప్రేమించకుండా ఏ ఆడదీ బ్రతకదు, బ్రతకలేదు. ఇది నిప్పులాంటి నిజం! అందుకని ఆమె మోహం ఆపుకోలేక ప్రేమించిన పురుషుడితో లేచిపోతుంది. అతగాడు ఆమెనుంచి శరీరసుఖంపొంది,

ఆ వలపు, ఆ తలపు తీరగానే అవతలికి నెట్టుతాడు. ఇది మగాళ్ళ గుణం. అప్పుడామె యథావిధిగా ఏడుస్తూ వచ్చినచోటకే వెళ్ళి సానికొంపను చేరుతుంది. లేదా వీధులవెంటపడుతుంది. మరి ఇప్పుడేమంటావు?'

నిజేరా, గంభీరంగా ఉపన్యసించాడు.

అతను చెప్పిందంతా విని లిఖోనిన్ నిట్టూర్పు విడిచాడు. అతనిగుండె బరువుగావుంది, ఎక్కడో లోతుగా అతని అంతరాంతరాళాలలో ధ్వనులు పలికాయి. నిజేరాచెప్పింది అక్షరాల నిజం అనిపించింది. కాని వెంటనే మనసు మార్చుకుని, గుండె నిబ్బరంచేసుకుని నిజేరాభుజం పట్టుకున్నాడు. ఉద్రేకంతెచ్చుకుని ఇలాఅన్నాడు.

'ఒకేయ్! పందెంవేస్తున్నాను. ఓ ఆరునెలలతరువాత చూద్దువుగాని ఏంజరుగుతుందో! అప్పుడను నీమాటలు నీకే అప్పచెపుతాను. ఇలా అన్నానే అని చింతించి నీవు నాకు పదిసీసాలు ద్రాక్షసారాయి పోయించి, నన్ను క్షమాపణ వేడుకుంటావు. హుఁ! మేకపోతువేధన!'

వహ్వా! భలేఅన్నావు' అంటూ ఆ కుర్రాడు లిఖోనిన్ చెయ్యిపుచ్చుకుని ఊపాడు. 'నీవుచెప్పినట్లు జరిగితే చాలా సంతోషం. అలాకాక నే చెప్పిందే నిజంఅవుతుందనుకో. అప్పుడు నీవే నన్ను అలా క్షమాపణ వేడుకోవాలి అంతేనా?'

'ఓ! తప్పకుండా. అదిసరేకాని రాజా! ఇప్పుడు నీవు ఎక్కడ పడుకుంటావు?'

'ఎక్కడేముంది? ఇక్కడే. ఈసదవలోనే పడుకుంటాను. మన మిత్రుడు సొలోవీవ్ కూడా ఇక్కడేవున్నాడు. మరి నీవూ? అవునులే, రాజకుమారుడిలా, మహాయోధుడిలా రెండువైపులా పదునుగలకత్తి మధ్యనపెట్టుకుని, ఆమె, నీవు పడుకుంటారు కాబోలు! అహ్హాహ్హా!'

'నాన్సెన్స్! అలాకాదు. నేనూ ఇక్కడే పడుకుని సొలోవీవ్‌తోనే గడుపుదామనుకుంటున్నాను. కాని కొంచెంసేపు బజార్లో తిరిగిరావాలనివుంది. సరే, నీవు పడుకో. నేను అక్కణ్ణుంచి, జైచెవిస్కీగదికో ద్రింప్‌గదికో వెడతాను. సరే నే వస్తాను'

# 9

లిఖోనిన్ ఒక్కడూ నడవలో వుండిపోయాడు. అతనిబుర్రలోకి రకరకాల ఆలోచనలు వస్తున్నాయి. ఏదో ఆవేదన, ఆరాటం. ఎందుకో తెలీదు. ఎన్నో అహోరాత్రులు నిద్రాహారాలు లేకుండా వున్నవాడు ఎలా బాధపడతాడో అలా బాధపడుతున్నాడతను. సాధారణమైన జీవితపు సరిహద్దులు దాటి ఎక్కడికో ప్రయాణంచేస్తున్నట్లు తోచింది. ఏవో దూరంగా, అందని విషయాలనుగురించి ఆలోచిస్తున్నట్లు, వాటిపై ఆసక్తి చూపుతున్నట్లు అనిపించింది. ఇలా అనుకునేసరికి, తను మరీ చీకట్లోకి పోతున్నట్లు భయపడ్డాడు. బాధపడ్డాడు. అందరికిమల్లేకాక, తనజీవితం ఏదో ప్రత్యేకంగా, పేరుపెట్టునట్లుగా కనిపిస్తోంది. ఇలాంటి స్థితిలోవున్న లిఖోనిన్‌కు అకస్మాత్తుగా ల్యూబా జ్ఞాపకంవచ్చింది. వెంటనే గదిలోకి పోవాలనిపించింది. ఆమె హాయిగావుందో లేదో చూడాలని ఆదుర్దా కలిగింది. ఉదయాన్నే ఆమెఫలహారంకోసం అన్నిఏర్పాట్లు చేయాలని తోచింది. కాని మళ్ళీ అంతలోనే మనసు మార్చుకున్నాడు. గదిలోకి పోతే ఏమవుతుందో, తను ఎలా ప్రవర్తిస్తానో అని భయపడ్డాడు. అందుకని గభాలున లేచి వీధిలోకి వెళ్ళిపోయాడు.

ఒక గమ్యంఅంటూ లేకుండా గంటలతరబడి రోడ్లమీద నడిచాడు. తిరిగినచోటే తిరిగాడు. చూచినస్థలమే చూచాడు. చివరకు ఊరుదాటి, దూరంగావున్న పొలాల్లోకికూడా వెళ్ళాడు. 'ఏంచేయాలి? ఏంచేయాలి?' ఇదేప్రశ్న అతన్ని పట్టుకుని బాధిస్తోంది. ఏంచేయాలో తన అంతరాత్మకి తెలుసు. కాని తెలుసునని చెప్పడానికి సాహసించలేకపోతున్నాడు.

అలా తిరుగుతూవుండగానే, హఠాత్తుగా తెల్లవారిపోయిందని గ్రహించాడు. అప్పటికి తెల్లగా తెల్లవారింది. వీధులవెంట జనం తిరుగుతున్నారు. ఎవరిపనులమీద వారు పోతున్నారు. కూర, నార వస్తువులు అమ్ముకునే బేరగాళ్ళ కేకలు వినిపిస్తున్నాయి. సూర్యుడు తూర్పున ప్రత్యక్షమై పైకి ఎగబాకి పోతున్నాడు.

'ఈపాటికి ఆమె నిద్రలేచివుంటుంది. ఒకవేళ ఆమె లేవకపోయినా, నేవెళ్ళి కదలకుండా సోఫాలో పడుకుని కొంసేపు నిద్రపోతాను' అనుకున్నాడు. తనలో అలా నిశ్చయించుకుని ఇంటిమొహం పట్టాడు లిఖోనిన్.

గదితలుపు దగ్గరగావేసివుంది. మెల్లగా తలుపుతీసుకుని లోపలికి వెళ్ళాడు. కిటికీలోంచి సన్నని వెలుతురు గదిలోపడుతోంది. గదిమధ్యకు పోయి ఆగాడు లిఖోనిన్. ప్రశాంతంగా, బుసకొడుతూ నిద్రపోతోన్న ల్యూబావైపు ఆసక్తితో చూచాడు. అతని పెదవులమీద తడి ఆరిపోతోంది. ఎండిపోయిన పెదవులను తడపతిడవకు నాలుకతో తడుపుకుంటున్నాడు. అతనికాళ్ళు గజగజ వణుకుతున్నాయి.

'ఆమెకు ఏమైనా కావాలేమో అడుగుతాను'. ఈఆలోచన మళ్ళీ అతనిమనసులోకి మెరుపులావచ్చింది.

బరువుగా ఊపిరితీస్తూ, నోరుతెరుచుకుని, తాగినవాడికిమల్లే తూలుతూ మంచందగ్గరకు వెళ్ళాడు.

ల్యూబా వెల్లకిలపడుకునివుంది. ఒకచెయ్యి ఎదురురొమ్ముమీద పెట్టుకునివుంది. రెండోచెయ్యి పక్కన వంటికి ఆనించుకునివుంది. లిఖోనిన్ దగ్గరగా వంగి ఆమెమొహంలోకి చూచాడు. ఆమె బలంగా శ్వాస పీలుస్తోంది. మంచి యౌవ్వనంలోన, పరిశుభ్రంగాను, ఆరోగ్యంగాను వున్న ఆమె శరీరంలోంచి తీయని పరిమళం వస్తోంది. అతను తన మునివేళ్ళతో జాగ్రత్తగా ఆమెరొమ్ములను తాకి, తట్టాడు. 'ఏమిటి నీవు చేస్తున్నది?' ఎవరో పెద్దగా అరిచినట్లనిపించింది అతనికి. 'నేనేం తప్పుచెయ్యడంలేదు. ఆమె సరిగా నిద్రపోయిందో లేదో అడుగుతున్నాను. ఆమె కొంత టీ తాగుతుందేమోఅని తెలుసుకుంటున్నాను'. అంతలో తనకోసం, ఎవరో ఆ ప్రశ్నకు సమాధానం చెప్పినట్లు తోచింది.

వెంటనే ల్యూబాకు మెలుకువవచ్చి కళ్ళుతెరిచింది. మళ్ళీ ఒక క్షణం గట్టిగా మూసుకుంది. తిరిగీ రెండోమాటు కళ్ళుతెరిచిచూచింది. ఆమె మొహం ఇప్పటికీ అమాయకంగా మెరుస్తూవుంది. మత్తుగా మందహాసం చేసింది. తన వెచ్చని, పచ్చని చేతిని ముందుకుచాచి అతనిమెడకు చుట్టింది.

'ఏం ప్రియా!' ఆమె పలుకుల్లో ఏదో హాయి, ఆనందం ప్రతిధ్వనిస్తున్నాయి. మీకోసం ఎంతోసేపు వేచివున్నాను. చివరకు కొంచెం కోపం

కూడా వచ్చింది. ఆతరువాత గాఢంగా నిద్రపట్టింది. నిద్రపోతున్నంతసేపూ మీరే కలలో కనుపించారు. రాత్రిఅంతా కలలో మిమ్మల్ని పలవరిస్తున్నాను. ఏదీ: రండి! రండి ప్రియా!' అంటూ ఆమె అతన్ని దగ్గరకు తీసుకుని వక్షోజాలకు గట్టిగా అదుముకుంది.

లిఖోనిన్ ఆమెపట్టునుండి తప్పించుకోవాలని కొంచెం పెనగులాడాడు. కాని అతనిలో శక్తిలేదు. గాలికి ఊగే ఎండుటాకులా వణుకుతున్నాడు. తడబడుతోన్న గొంతుతో రహస్యంగా ఇలా అన్నాడు.

'వద్దు ల్యూబా! వద్దు...నిజంగా ఆపని చెయ్యొద్దు ల్యూబా! నన్ను హింసించకు...దేవుణ్ణి ప్రార్థిస్తూ చెపుతున్నాను. నన్ను వెళ్ళనీయి ల్యూబా! నన్ను వదిలిపెట్టు...'

'అమ్మదొంగా! నాతో నే వేషాలువేస్తున్నావా?' కిలకిలనవ్వుతూ అంది ఆమె.

అప్పటికి లిఖోనిన్‌లో తిరస్కారం చాలవరకు తగ్గిపోయింది. ఆమె అతన్ని లోంగతీసుకుంది. అతని పెదవులకు తన పెదవులు తాకించి బలంగా, బరువుగా ముద్దుపెట్టుకుంది. నిజంగా ఆమె నిజమైన ప్రేమతోటి, స్వచ్ఛమైన హృదయంతోటి, కల్మషంలేని కామోద్రేకంతోటి అతన్ని తొలిసారి ముద్దుపెట్టుకుంది. నిజంగా ప్రేమించి, పురుషుణ్ణి ముద్దుపెట్టుకోవడం ఆమెకదే మొదటిసారి. బహుశా ఆమెజీవితానికి అదే చివరిసారికూడా.

'ఓరి దుర్మార్గుడా! నీవుచేస్తున్న పనేమిటి?' తన అంతరాత్మలో ఎవరో ఘోషించినట్లు అనిపించింది అతనికి. ఆ మాట ఎంతో నిజంగా, నీతిగా, జాగ్రత్తగా అంటున్నట్లుగా వుంది. కాని అది నిజంకాదు. మోసం! కృత్రిమం!

'సరేకాని,...ఏమండీ! ఇప్పుడెలావుంది? హాయిగావుందా?' అంటూ ల్యూబా అతన్ని మళ్ళీ ఇంకోసారి ముద్దుపెట్టుకుంది. 'ఓ! అబ్బ! నీవు నా ప్రియమైన విద్యార్థివి!' అంది ఆమె ప్రేమగా.

# 10

లిఖోనిన్ బట్టలుకూడా విప్పకుండా పోయి ఆ సోఫాలో కూల బడ్డాడు. ఆ సోఫా పాతపడిపోయి, నుగ్గునుగ్గయి ఊగుతోంది. అతని గుండెల్లో మంట బయలుదేరింది. తనమీద తనకే అసహ్యంవేస్తోంది. ల్యూబా మీదకూడా కోపంవస్తోంది. అసలు ప్రపంచంమీదనే ద్వేషం పుట్టుకొ స్తోంది. అవమానం, సిగ్గు దహించివేస్తున్నాయి. పళ్ళు పటపట కొరికాడు. తనుచేసినపని తలుచుకుంటూవుంటే నిద్రకూడా వచ్చేట్లులేదు. 'నేనుచేసింది ఏమిటి? ఛీ! ఎంత పాడుపనిచేశాను? నీచమైన కామవాంఛకు దాసుడ నయ్యాను. నేను అనుకున్నదేమిటి? జరిగింది ఏమిటి? అవును. ఇది నా దౌర్బల్యం. ఆడదాని వ్యసనానికి బానిసకానివాడు చరిత్రలో ఎవ డున్నాడు? ఇలా జరగడానికి వీల్లేదు. ఇహముందైనా తగుజాగ్రత్తలో వుంటాను.'

తలతిరిగిపోతోంది. కళ్ళు మండుతున్నాయి. పెదవులు ఎండిపోయి నాయి. వంట్లోంచి సెగలు, పొగలు బయటికొస్తున్నాయి. సిగరెట్టుమీద సిగరెట్టు తెంపిలేకుండా కాల్చిపారేస్తున్నాడు. గొంతు ఎండిపోతోంటే తడవతడవకు టేబిల్ దగ్గరికివెళ్ళి కూజాలో నీళ్ళు తాగుతున్నాడు. ఆలా యాతన పడిపడి చివరకు గడిచినవిషయం మరచిపోవడానికి ప్రయత్నిం చాడు. వెంటనే అతన్ని దయ్యంలాంటినిద్ర ఆవహించింది. సోఫాలో పడు కుని, ఒళ్ళుతెలీకుండా, గాఢమైన నిద్రలో మునిగిపోయాడు.

అతను లేచేసరికి సాయంత్రం మూడుగంటలయింది. కాని ఎంత టైం అయిందో సరిగా అతనికి తెలీదు. ఏదో బిత్తరపోయి చుట్టూ కలయ చూచాడు. అతనిమనసులో ఏమీ ఆలోచనలులేవు. రాత్రి జరిగిన విషయాలు, అసలు ఏంజరిగిందోకూడా అతని స్మృతిపథంలోకి రాలేదు. కాని అంతలో మంచంమీద కదలకుండా కూచునివున్న ల్యూబా కనుపించింది. ఆమె తల వంచుకుని, చేతులుముడుచుకుని కూచుంది. ఆమెను చూడగానే మళ్ళీ అతనికి అంతా జ్ఞాపకంవచ్చింది. అవమానం, సిగ్గు, బాధ అన్నీ మళ్ళీ పట్టుకుని వేధించసాగాయి. తనలోతాను ఏదో గొణిగాడు; సణిగాడు.

'మీరు మేల్కొన్నారా?' అంది ల్యూబా ప్రేమగా.

ఆమె, తన మంచంమీదనుంచి లేచి సోఫావద్దకు వచ్చింది. అతని కాళ్ళదగ్గర, క్రిందకూచుంది.. అతనిపాదాలను తనచేతితో మెల్లగాతట్టింది.

'నేను లేచి చాలసేపయింది. మిమ్మల్ని లేపుదామనుకున్నాను. కాని భయంవేసింది. మీరు గాఢనిద్రలో ఉన్నారు. ఒక్కదాన్నే కదలకుండా కూచున్నాను' అంటూ అతనిమీదికి వంగి బుగ్గలు ముద్దుపెట్టుకుంది. లిఖోనిన్ మొహం చిట్లించుకున్నాడు. మెల్లగా ఆమెను అవతలకు నెట్టాడు.

'ఊరుకో ల్యూబ్ కా! ఏమిటూపని? గుర్తుంచుకో! ఇలాంటి పిచ్చి పనులు మరెప్పుడూ చెయ్యకు...పొద్దున జరిగిందా?...అవును. పొరపాటున జరిగింది...ప్రమాదవశాత్తు జరిగింది...అది నా బలహీనత...కాకపోతే నాలోవున్న నీచబుద్ధి! ... నన్ను ద్రోహంచేసింది ... కాని నిజంచెపుతున్నాను! దేవుడిమీద ప్రమాణంచేసి చెపుతున్నాను. నామాట నమ్ము. నిన్ను నా ప్రియురాలుగా చేసుకోవాలని ఎప్పుడూ అనుకోలేదు. ఆతలంపు నాకు ఏకోశాన లేదు. నిన్ను నాసోదరిలా, స్నేహితురాలిలా, కామ్రేడ్ లా చూచుకుంటాను. అదే నాకోరిక. జరిగినదానికి విచారించకు. మళ్లీ అంతా సక్రమంగా సర్దుబాటు చేసుకుందాం. కాని ఒకే ఒకవిషయం. మనం మాత్రం స్థిరచిత్తంతో మెలగాలి. ఏక్షణంలోకూడా మన మనసులు చలించకూడదు. అంతే...సరే...ఒకసారి ఆ కిటికీవైపు చూస్తూ. నేను కొంచెం బట్టలు సరిచేసుకోవాలి.'

అదిరిని ల్యూబా కొంచెం అలకతో పెదవి విరిచింది. మెల్లగా కిటికీవద్దకువెళ్ళి, అటుపక్కకు తిరిగి నిలుచుంది. ఆ పసిహృదయానికి, అమాయకమైన ఆ రైతుబిడ్డకు అతను చెప్పినమాటల్లో ఒక్కఅక్షరంకూడా అర్థం కాలేదు. సోదరప్రేమ, స్నేహం, కామ్రేడ్—ఇవేవీ ఆమెబుర్రకు ఎక్కలేదు. అవును, ఆమె అజ్ఞాని. ఆమెబుద్ధి వికసించలేదు. ఆమెకు తెలిసిందల్లా ఒక్కటే. అతనొక విద్యార్థి; అందులోనూ అందరు విద్యార్థులవంటివాడు కాదు. మంచివాడు. బాగా చదువుకున్నవాడు. ఇహముందు ఏ డాక్టరో, ప్లీడరో అవుతాడు. లేకపోతే జడ్జీకూడాకావచ్చు. అలాంటివాడు తనకు ఆశ్రయం ఇచ్చి, ఆధారం కల్పిస్తానన్నాడు. తను పొంగిపోయింది. తీసుకొచ్చాడు కాని, ఇప్పుడతనికి ఆమోజుకాస్తా తీరినట్లుంది. తనను వదిలించు

కోవాలని చూస్తున్నాడు. హు! అంతే! ఈ మగాళ్ళంతా అంతే! ఇదే ఆమె గ్రహించింది.

లిఖోనిన్ గబగబ సోఫాలోంచి లేచి, కొన్ని నీళ్ళు పోసుకుని మొహం కడుక్కున్నాడు. తువ్వాలుతో తుడుచుకున్నాడు. తరువాత, గదికిమూతలా వేసివుంచిన కప్పులు తొలగించాడు. తెరలు కూడా అడ్డంతీశాడు. అప్పుడు గదిలోకి బాగా సూర్యరశ్మి, వెలుతురు వచ్చాయి.

అక్కడినుంచి చూస్తే నగరం అంతా కనిపిస్తోంది. వీధులలో సందడి, జనం, రోడ్లమీద పోయే ట్రాలీబండ్లు, టాక్సీలు, కార్లు, రోడ్లమీద రేగిన దుమ్ము, ధూళి, పైన ఆకాశం, నగరంచుట్టూ వున్న కసింద చెట్లు, అడివి బాదంచెట్లు, పోప్లార్ చెట్లు అన్నీ ప్రత్యక్షమయ్యాయి- నగరంలోని ధ్వను లన్నీ అయిదో అంతస్తులో అటకలాగ, గుహలాగ వున్న ఆ చిన్నగది లోకి ఒక్కసారిగా ప్రవేశించి, ప్రతిధ్వనించి మూలిగినట్లయింది. లిఖోనిన్ ఆమెను సమీపించి, భుజంమీద తట్టాడు.

'మరేం భయంలేదు ల్యూబా! అయిందేదో అయిపోయింది. ఇహ ఆ విషయం ఆలోచించకు. ఇది మనకొక గుణపాఠం. ముందైనా జాగ్రత్తగా వుంటాం.అవునుగాని, నీవేమీ ఫలహారం తీసుకోలేదుగా?' అనడిగాడు అతను.

'లేదు. మీకోసం కూచున్నాను. అయినా, ఎవర్ని అడగాలో నాకు తెలీదుకూడా. మీరు భలేవారండీ! రాత్రి మీ స్నేహితుడితో మాట్లాడారు. తరువాత గదివాకిలివద్దకు వచ్చి నిలబడ్డారు. లోపలికివచ్చి నన్ను పలకరిస్తా రేమో అనుకున్నాను. కాని తీరా చెప్పకుండానే వెళ్ళిపోయారు. ఇలా చేయడం న్యాయమేనా?' అంది ఆమె.

ఆమె కొత్తగావచ్చిన ఆడపిల్ల. అందులోనూ అమాయకురాలు. ఇంటి పనులు స్వయంగా నిర్వహించుకోలేని సుకుమారి. కనుక మగాడు, ధీరుడు అయిన తనే ఇంట్లో వ్యవహారాలన్నీ సర్దుకోవాలి. భోజనం మొదలైనవాటికి ఏర్పాట్లు చేసుకోవాలి అనుకున్నాడు లిఖోనిన్ తనలో. ఒక ఆడకూతురు కోసం, ఇంటిపెత్తనం చేయాల్సివచ్చినందుకు అతనికి ఆనందం, ఉత్సాహం కలిగాయి. వెంటనేవెళ్ళి గదితలుపు బార్లగాతీశాడు. నడవలోకివెళ్ళి పెద్దగా కేకవేశాడు—'అలెగ్జాండ్రా! రెండు రొట్టెలు, వెన్న, టీ, పట్టుకురా!••• ఒక చిన్నసీసా వోడ్కాకూడా•••ఊఁ•••త్వరగా'

నడవలోకి ఎవరో గబగబ నడిచివచ్చినట్లు స్లిప్పర్ల చప్పుడైంది. ఒక ముసలిగొంతుక ముసుగ్గా వినిపించింది.

'ఏమిటి? ఏమిటా కేకలు? మహా గొంతంతా చించుకుంటున్నావే... పెద్ద మగాడివిలా... ఏం కావాలి?'

కొద్దిక్షణాల తరువాత గదిలోకి ఒక వృద్ధురాలు వచ్చింది. ఈమే అలెగ్జాండ్రా! అరవైఅయిదేండ్ల వయస్సుంటుంది. కాని మనిషి దుక్కలా వుంది. విద్యార్థులుండే లాడ్జిలో ఈమె సేవకురాలు. ఎన్నోఏండ్లబట్టి పని చేస్తోన్న మనిషి. విద్యార్థులందరితోనూ చనువుగా, స్నేహంగా వుంటుంది. అడపాదడపా వాళ్ళకు అప్పులుకూడా ఇస్తూవుంటుంది.

లిఖోనిన్ తనకు కావల్సినవన్నీ ఆమెకు మరోసారి చెప్పి ఒక రూబులునోటు చేతిలో పెట్టాడు. కాని ఆ ముసల్ది అక్కడినుంచి కదల్లేదు. గదిలో ఏదో పనివున్నదానికమల్లే అటూ ఇటూ తారట్లాడుతూ, ల్యూబావంక విషపుచూపులు చూడ్డం మొదలెట్టింది. లిఖోనిన్ వెంటనే కనిపెట్టాడు.

'ఏమిటి సంగతి అలెగ్జాండ్రా? ఎవరా అని చూస్తున్నావా?' అన్నాడు లిఖోనిన్ నవ్వుతూ. 'ఎవరూ కాదులే. ఆమె మా పెత్తల్లికూతురు. పేరు ల్యూబోవ్......' అంటూ అతను ఒకక్షణం కలవరపాటు చెందాడు. మళ్ళీ ఇలా అన్నాడు. 'అవును, ల్యూబోవ్ వాసిలెవ్నా! నేను మాత్రం ల్యూబోచ్కా అని పిలుస్తాను. పసిపిల్లగా వున్నప్పటినుంచీ నాతో చనువుగా వుండేది. చెప్పినమాట వినకపోతే చెవులుపట్టుకుని మెలేసేవాణ్ణి...ముద్దుగా ఈమెకు సీతాకోకచిలుకలు, తూనీగలు పట్టి ఇచ్చేవాణ్ని...' అంటూ అతను అభినయిస్తూ మాట్లాడాడు. తిరిగీ ఇలా అన్నాడు. 'సరే అలెగ్జాండ్రా!... ఇక త్వరగావెళ్ళి ముందు ఫలహారాలు పట్టుకురా!...ముసిలిముండవు! ఒక కాలు ఇక్కడ, ఒక కాలు అక్కడ పెడుతుంటావు. నానుడుబేరం నీవూ. ఊఁ...త్వరగా వెళ్ళు'

కాని అప్పటికీ ఆ ముసల్ది అక్కడినుంచి కదల్లేదు. అటూ ఇటూ పచారుచేస్తూ, ల్యూబావంక కోరచూపులు చూస్తోంది. ఏదో లోలోపల గొణుక్కుని తరువాత ఇలా అంది.

'పెత్తల్లి కూతురా!... ఇలాంటి పెత్తల్లికూతుళ్ళను చాలామందిని

చూచాం...హు!...పెత్తల్లికూతురట, పెత్తల్లికూతురు!...ఆ కొట్టనో మా వీధిలో ఇలాంటివాళ్ళు కందలమంది తిరుగుతున్నారు...కుక్కలు!'

'నోర్ముయ్! ముసలితొత్తా! ఏమిటే ఆ వాగుడు?' అరిచాడు లిఖోనిన్—'ముందిక్కడినుంచి వెళ్ళి నీపని చూసుకో. లేదా, పీకపిసికేస్తా, పాడుముండ! ఆ ట్రియాసోవ్‌గాడు చేసినట్లు నిన్న రోజంతా నీళ్ళతొట్లో పెట్టి తాళంవేస్తేగాని నీ తిక్క కుదరదు.'

అలెగ్జాండ్రా వెళ్ళిపోయింది. ఆమె పోతూపోతూ నడవలో గొణగడం వాళ్ళకు వినిపిస్తూనేవుంది. అవును. ఆమె ఈపని నలభైఏండ్లబట్టీ చేస్తూవుంది. నలభైఏండ్ల సార్వీసు. ఎంతమంది విద్యార్థులను చూచివుంటుందో వూహించుకోవచ్చు. వాళ్ళ గుణగణాలు, మనస్తత్వాలు అన్నీ ఆమెకు కొట్టినపిండే. అయినా పాపం, ప్రేమగాచూస్తుంది. ఎన్ని తప్పుడు పనులు చేస్తున్నా భరిస్తుంది.

విద్యార్థులేం తక్కువవాళ్ళా? వాళ్ళుచేసే అల్లరి అంతా ఇంతా కాదు. తాగుడు, వాదం, కొట్లాట, కేకలు, పెడబొబ్బలు, ఈలలు, పురందరికీ వినిపించేటట్లు రాగాలుతీయడం, ఇవ్వాల్సినబాకీ ఎగగొట్టడం; ఇవన్నీ ఆమె ఓర్పుతో సానుభూతితో ఏండ్లతరబడి సహిస్తూ, భరిస్తూ వచ్చింది. నిజంగా ఆమె దేవత! ఇన్ని సహిస్తుందిగాని, ఆమె పవిత్రహృదయం ఇలాంటి చెడునడతను మాత్రం సహించలేదు.

## II

'ఓ! అద్భుతం!...బాగుంది...చాలాబాగుంది' అన్నాడు లిఖోనిన్ టేబుల్‌మీద పెట్టిన టీ, ఫలహారాలు, పానీయాలు అనవసరంగా సర్దుతూ. టేబుల్‌మీద ఏవస్తువు ఎక్కడపెడితే బాగుంటుందో అని అతను వాటిని పదేపదే ఒకవైపునుంచి మరొకవైపుకు మారుస్తున్నాడు. 'ఇలా టీ తాగి ఎంతకాలమైంది! నిజంచెప్తున్నాను ల్యూబా! ఎప్పుడో మాఇంట్లో, మావాళ్ళమధ్య ఇలా బల్లమీద ఫలహారాలు అమర్చుకుని టీ తాగాను. మళ్ళీ ఇన్నాళ్ళకు ఇవాళ తాగుతున్నాను. ఇదుగో! ఇలారా! ఈ సోఫామీద

కూచుని నీచేతులమీదుగా టీకలిపి ఇవ్వు... నీవు ఈవేళప్పుడు 'వోడ్కా' తాగలేవనుకుంటాను. నేనుమాత్రం తాగగలనులే...అది కొంచెం నరాలకు బలంఇస్తుంది. హుషారెక్కిస్తుంది. నాకు టీ కొంచెం స్ట్రాంగ్‌గా చెయ్యి. ఒకముక్క నిమ్మకాయకూడాపిండు. ఓ! మృదువైన ఆడవారిచేతులమీదుగా తయారుచేసిన వేడివేడి టీ ఒకగ్లాసు తాగితే ఎంతరుచిగా వుంటుంది!'

అతనిమాటలు వింటోంటే, ల్యూబాకు కొంచెం విసుగుకలిగింది. అవును. అతను అనవసరంగా మాట్లాడుతున్నాడని ఆమె అభిప్రాయం. అయినా, సహజమైన ధోరణిలో మందహాసంచేస్తూ టీ కలిపింది. నిజానికి ఆమె 'టీ' బాగా చెయ్యలేదు. అవును. ఆపని చేయాల్సిన అవసరం కలిగి చాలాకాలమైంది. 'టీ' చేసే అలవాటు తప్పిపోయింది. లిఖోనిన్ ఊరుకోకుండా మళ్ళీ మాట్లాడటం ప్రారంభించాడు.

"ల్యూబా! టీ తయారుచేయడంకూడా ఒక కళ ల్యూబా! అది అందరికీ పట్టుబడదు. మాస్కోలో 'టీ' ఎంత బాగా చేస్తారనుకున్నావు! నిజంగా టీ చెయ్యడం చూడాలంటే అక్కడే చూడాలి. అక్కడే నేర్చుకోవాలి." అంటూ అతను మాస్కోలో టీ ఎలా తయారుచేస్తారో వర్ణించసాగాడు.

'...ఓ! నీవు ఊహించలేవు ల్యూబా! ఆ రుచి, ఆ రంగు, ఆ కమ్మదనం, ఆ గుమాయింపు...అద్భుతం ల్యూబా!...ఆ టీ తాగుతూంటే స్వర్గసుఖం అనుభవిస్తున్నట్లుంటుంది.'

అమాయకంగా, ఆకర్షణీయంగావున్న ల్యూబాముఖం అంతలో పాలిపోయింది. తనకు 'టీ' చేయడం చాతకాదని అతను ఎద్దేవచేస్తున్నట్లుగా భావించింది.

'దైవసాక్షిగా మిమ్మల్ని వేడుకుంటున్నాను. నామీద కోప్పడకండి...మీపేరు వాసిలీ వాసిలిచ్ కదూ? దయచేసి కోప్పడకండి వాసిలీ వాసిలిచ్! నాకు టీ చేయడం చాతకాదు. ఇహ నేర్చుకుంటాను. ముమ్మాటికీ నేర్చుకుంటాను...త్వరలోనే...మీరు నన్ను అతిగా గౌరవిస్తున్నారు. ఎవరో కొత్తవారిని పిలిచినట్లుగా మర్యాదఇచ్చి మాటాడుతున్నారు... ఏం? మనం ఇంకా అపరిచితులమే అనుకున్నారా?' అంది ల్యూబా.

ఆమె అతనివంక చూచింది. ఆమెచూపుల్లో కారుణ్యం తొణికిస లాడుతోంది. అవును. ఈనాడు ఆమెజీవితంలోకి వసంతంవచ్చింది. డబ్బు కోసం కాకుండా, అయిష్టంగా ఒకరి బలవంతంమీద కాకుండా, ఇవాళ తన జీవితంలో తొలిసారిగా ఒక పురుషుణ్ణి హృదయపూర్వకంగా ప్రేమించ గలిగింది. తనశరీరాన్ని, ఆత్మనుకూడా అతనికి అర్పించగలిగింది. అవును. కేవలం కామవాంఛ కాదు ఆమెను అలాచేసింది. ఒకమనిషికి మరొకమనిషి మీదవుండే జాలి, ఒకరు మరొకరికి చూపవలసిన కృతజ్ఞత, ఆమెను అలా చేయించాయి. ఇప్పుడామెహృదయం నిజంగా ఉప్పొంగిపోతోంది. సహజమైన, స్వచ్ఛమైన ఆ స్త్రీ హృదయం ఇప్పుడు నిజమైన, శాశ్వతమైన ప్రేమవైపు మళ్ళుతోంది. పొద్దుతిరుగుడుపువ్వు సూర్యుడివైపు తిరిగినట్లు ఆమె హృదయం స్వచ్ఛమైన ప్రేమవైపు తిరిగింది.

లిఖోనిన్ ఆకస్మాత్తుగా ఏదో అవమానంపొందినట్లు బాధపడ్డాడు. ఆమెమీద ద్వేషం, అసహ్యం కలిగాయి. ఆమె తన శత్రువనే భావన కలి గింది నిన్న. ఆమెఎవరో తనకు తెలీదు. ఇవాళ అప్రయత్నంగా ఇంటియజ మానురాలు అయిపోయింది. 'అప్పుడే కుటుంబ గొడవలు ప్రారంభ మయ్యాయి' అనుకున్నాడు తనలో. వెంటనే లేనిఉత్సాహాన్ని తెచ్చుకొని లేచాడు. ఆమెను సమీపించి తల నిమురుతూ ఇలా అన్నాడు.

"నా ప్రియమైన స్నేహితురాలా! నా ప్రియమైన సోదరీ!' ఈ మాటలు మనస్ఫూర్తిగా అన్నవికావు. ఏదో తెచ్చిపెట్టుకుని, అసహజంగా అనేశాడు. "ఇవాళ జరిగినపని, మరెన్నడూ జరగదు. ఇలా జరిగినందుకు నిన్ను క్షమించమని వేడుకుంటున్నాను. నిజం. ఇది నాఇష్టానికి వ్యతిరేకంగా జరిగింది. ఆకస్మాత్తుగా... అనుకోకుండా జరిగింది... నన్ను అర్థంచేసుకో ల్యూబా ... ... ఇంతవరకు ఒక స్త్రీతోకూడా చనువుగావుండివుర గను... అంచాత నిభాయించుకోలేకపోయాను...... నాలో ఏదో పశువు మేలుకొంది. ఆక్షణంలో దయ్యం ముసిరింది.... నన్ను బలహీనుణ్ణిచేసి లొంగతీసుకుంది... ఆపుకోలేకపోయాను... కాని భగవంతుడా! నిజంగా నేనంత గొప్పతప్పుచేశానా? పవిత్రమైన ఋషులు,మహాపురుషులు, మతగురు వులు నన్నుక్షమించరూ?... అవును... మహాత్ములుకూడా ఈ తృష్ణకు

ఈ వ్యాపకం లొంగిపోయారే!...... ల్యూబా! ప్రమాణం చేస్తున్నాను. ఈపని మళ్ళీ జరగదు... ఏం? ఇప్పుడు నీకు మనశ్శాంతి కలిగిందా?"

అతను మాట్లాడుతూవున్నంతసేపూ ల్యూబా అతనిచెయ్యి వదిలించుకోవాలని ప్రయత్నించింది. ఆమె పెదవులు వణుకుతున్నాయి. బిత్తర బిత్తరచూపులు చూస్తూ తత్తరపాటు చెందుతోంది.

"అవును" అంటూ ఆమె మూర్ఖంగా అతనిచెయ్యి విదలించివేసింది. 'నాకర్థమైంది. నేనంటే మీకుఇష్టంలేదు.మరి ఆమాట స్పష్టంగా, ముఖాముఖి చెప్పవచ్చుగా? ఇన్ని డొంకతిరుగుడుమాట లెందుకు?...... నాకు బండి బాడుగ ఇప్పించండి. వెళ్ళిపోతాను ...... ఒకరాత్రి వుంచుకున్నందుకు ఇవ్వాల్సిన పైకం అప్పుడే ఇచ్చేశారుగా! ఇప్పుడెలాగైనా నేను కొంప చేరడం కావాలి ... అంతే." అంది ఆమె కొంచెం ఈసడింపుగా.

లిఖోనిన్ తలపట్టుకుని, గదిలో ఒకమూలనుంచి మరొకమూలకు గబగబ తిరుగుతూ, విచారంగా ఇలా అన్నాడు.

"ఓ! అదికాదు ల్యూబా! నేచెప్పింది అదికాదు. నన్నునీవు అర్థం చేసుకోలేదు.... ల్యూబా! పొద్దునజరిగినపని మళ్ళీ జరగక్కూడదన్నాను. అదీ నా వుద్దేశ్యం. నిజానికి ఎంత అసహ్యమైన పనో ఆలోచించు...... అబ్బె! రోతకదూ! మానమర్యాదలుకలమనిషి దాన్ని సహించలేడు. అది పతనానికి హేతువు. ప్రేమ! ప్రేమఅనేది హృదయంలో వుంటుంది. శరీరంలో కాదు. ప్రేమ చాలాగొప్పది. ఉన్నతమైంది! గంభీరమైంది! అగాధమైంది! ప్రేమ ప్రపంచంకంటె గొప్పది ల్యూబా! ప్రేమఅంటే పక్కమీద పడి పొర్లడంకాదు. అలాంటిప్రేమ మనకు అక్కర్లేదు. నీవు నాజీవితంలో నమ్మకమైన మిత్రురాలివి. సోదరివి. సోదరప్రేమయే మనిద్దరిహృదయాల్లో నాటుకుపోవాలి. అలా మనం ప్రేమించుకున్ననాడు అపూర్వమైన ఆనందం కలుగుతుంది. దానిముందు ఈ తుచ్ఛమైన వాంఛలన్నీ తీసికట్టు. అదిస్వర్గం ల్యూబా! అదే నేకోరేది. అదేనాకు కావల్సింది, అంతే!"

ల్యూబా కుంకిపోతున్నట్లు కనిపించింది. 'నేను పెళ్ళిచేసుకోమని అడుగుతున్నానని భావించాడు...నాకది అసలు అక్కర్లేదు' అనుకుంటూ తనలోతాను ఆలోచించుకోసాగింది. 'పెళ్ళితో పనిలేకుండానే ఇద్దరం జీవించవచ్చు. అనేకమంది మగాళ్ళు ఆడాళ్ళను వుంచుకోవడంలేదూ?

ఇందులో నా కొచ్చేనష్టం ఏముంది? ఇలా జీవించినా హాయిగా, ప్రశాంతంగానే వుంటుంది. అతనికి మేజోళ్ళు కుట్టిపెడతాను. అతని బూట్సు తుడుస్తాను. ఇల్లు శుభ్రంచేస్తాను. ఏదో కొంచెం వంటకూడా చేస్తాను. తరువాత అతనికి ఒక శ్రీమంతులపిల్లను పెళ్ళాడే అవకాశం కలుగుతుంది. అప్పుడు నన్ను బయటికి గెంటేస్తాడు. అతనేదో కాస్త అతిగా మాట్లాడుతాడు. అంతకన్నా మరో దుర్గుణంలేదు. మంచివాడు. ఎలాగో ఓలాగు నన్ను పోషించకపోడు. ఇహ నేనంటే అతనికి ప్రేమమాత్రం ఎందుకు వుండదు? నన్నెందుకు సుఖపెట్టడు? నేను గండాగొండి పిల్లనుకాను. అతనిపట్ల వినయవిధేయతలతో ప్రవర్తిస్తాను. అతనికి ద్రోహం చెయ్యను. మరెందుకో పొద్దున నా దగ్గరికిరాగానే అదోలా అయిపోయాడు. ఏమోలే! ఒక్కొక్కప్పుడు మగాళ్ళకు అలాగే అవుతుందని చెపుతారు. అయినా చూస్తాను, ముందుముందు ఏంజరుగుతుందో!'

లిఖోనిన్ కూడా మౌనంగా ఆలోచిస్తున్నాడు. తనకుమించిన భారం తలమీద పెట్టుకున్నట్లు తోస్తోంది అతనికి. అంతలో గదితలుపు చప్పుడైంది. ఇద్దరు విద్యార్థులు లోపలికివచ్చారు. ఒకతను సొలోవీవ్, రెండో అతను నిజేరా. ఆలోచనలతో విసుగ్గావున్న లిఖోనిన్‌కు ఆ ఇద్దరుమిత్రుల్ని చూచేసరికి సంతోషమైంది.

సొలోవీవ్ లావుగా, పొడుగ్గావుంటాడు. విశాలమైనమొహం. కుర్రాడే. గడ్డంవెంట్రుకలు వంకులుతిరిగివున్నాయి. ఇతనుకూడా యూనివర్సిటీలో చదువుతున్నాడు. నిజేరా వలె ఇతనుకూడా లిఖోనిన్‌కు ప్రాణస్నేహితుడు. తరుచు వీరుముగ్గురూ కలిసిమెలిసి తిరుగుతూ వుంటారు. పొద్దుటినుంచి రాత్రివరకూ రకరకాలవిషయాలుచర్చిస్తూ, కాలంగడుపుతారు.

'లోకంలో ఎక్కడచూచినా ప్రతి ఇల్లూ పాపభూయిష్టమైపోయింది.' అంటూ సొలోవీవ్, గదిలోకి వస్తూనే, పెద్దగా సంభాషణ ప్రారంభించాడు. అలా అంటూ అతను ల్యూబావంకచూచి హఠాత్తుగా ఆగిపోయాడు. 'ఏమిటీ?...ఆమె ఎవరబ్బా!... ఓ! సోన్యాకదూ... అహఁ. కాదు కాదు. పొరపాటుపడ్డాను ... నడియా ... కాదురా దేవుడా ... ఇప్పుడు గుర్తొచ్చింది...ల్యూబా! అన్నామార్కోవ్నాఇంట్లోవుండే సాని, ల్యూబా' అన్నాడు ఆశ్చర్యచకితుడై.

ల్యూబా సిగ్గుతో కుంగిపోయింది. ఆమె ఒళ్లంతా అవమానంతో దహించుకుపోయింది. గభాలున మొహం రెండుచేతులతో కప్పుకుంది. ఆమె కళ్ళల్లో నీళ్ళుతిరిగాయి. లిఖోనిన్ గమనించాడు. స్నేహితుడన్నమాటకు ఆమె నొచ్చుకుందనీ విపరీతంగా బాధపడుతోందనీ, గ్రహించి వెంటనే ఆమెకు వత్తాసువెళ్ళి సొలోవీవ్‌తో గట్టిగా మొరటుగా ఇలాఅన్నాడు.

"అవును మిత్రమా! నగరంలోని ప్రజలను, ప్రదేశాలను వివరించి చూపే పట్టికప్రకారం ఆమె యామాలో నివసిస్తూవున్న పిల్ల. పేరు ల్యూబా. నిన్నటివరకూ పడుపుకత్తె. ఇవాల్టినుంచీ నాసోదరి, నాస్నేహితురాలు! నన్ను గౌరవించేవాళ్ళు ఎవరైనావుంటే, నాతోపాటు ఆమెనూ అదేవిధంగా గౌరవించాల్సివుంటుంది. లేకపోతే...."

అతను మాట పూర్తిచేయకముందే సోలోవీవ్ గభాలునవచ్చి, లిఖోనిన్‌ను గట్టిగా కౌగలించుకున్నాడు. వీపుమీదతట్టుతూ ఇలా అన్నాడు.

"భలే, భలే! ఏదో తొందరపడి అనేశానురా!... ఏం చెల్లీ! మరేం అనుకోకు." అంటూ అతను ల్యూబాముందుకు వెళ్ళి కరస్పర్శ చేశాడు. "చాలా మంచిపనిచేశావు. మావాడిమనసు మంచిది.. నీ రాకవల్ల మాఅందరికీ ఎంతో సంతోషంగావుంది. అలెగ్జాండ్రా బీర్!" అంటూ అరిచి తిరిగీ ల్యూబాతో ఇలా అన్నాడు "మేమంతా గడుగ్గాయలం. తాగుడు, జూదం సోమరితనం, వీటన్నిటికీ అలవాటుపడ్డాం. చేయరానిపనులు చేస్తాం. దీనికంతకూ కారణం, మా అందరికి సరైన స్త్రీయొక్క ఆదరణ, అభిమానం లేకపోవడమే. నీ కోమలమైన హస్తాలను మరోసారిస్పృశించనీ. అలెగ్జాండ్రా! బీర్!"

"వస్తున్నా!" అంటూ అవతల్నుంచి అరిచింది అలెగ్జాండ్రా.

"వస్తుంటే ఎందుకలా కేకలేస్తావు? ఎన్నిసీసాలు కావాలి?"

సోలోవీవ్ నడవలోకివెళ్ళి, ఏమేమికావాలో పనిదానితో చెప్పాడు. లిఖోనిన్ చిరునవ్వుతో అతనివైపు చూచాడు. నిజేరాకూడా తనమిత్రుని హడావుడిచూచి సంతోషంతో లిఖోనిన్ వీపుమీద చరిచాడు.

సోలోవీవ్ మళ్ళీ గదిలోకివచ్చి ఒక పాతకుర్చీలో జాగ్రత్తగా కూచున్నాడు. "ఇహ చెప్పండోయ్! ఏమేమికావాలో. నాకో అరగంట

వ్యవధిఇస్తే హోటలుకు పరుగెత్తి, ఎవణ్ణో ఒకణ్ణి పట్టుకొట్టి కావాల్సిన వన్నీ పట్టుకొస్తాను. ఆమాత్రం అప్పుపుట్టించే ధైర్యంవుందిలే."

'అక్కర్లేదోయ్! ఇంకా నా దగ్గర బోలెడుడబ్బుంది. మనమందరం కలిసి ఓ చిన్న రెస్టారెంటుకు వెడదాం. ముందు నిన్ను కొన్ని సలహాలు అడగదలుచుకున్నాను. నీవు నా ప్రాణస్నేహితుడివి. అన్నివిషయాలు తెలిసినవాడివి, అనుభవంవున్నవాడివి. నన్ను సరీగా అర్థంచేసుకొని, నేను చేయబోయే పనులలో మీరుకూడా సహాయపడాలి. కొంత బాధ్యతవహించాలి. ఆమెకు కావల్సిన ఏర్పాట్లు చేయడానికి ప్రయత్నిస్తాను. ఆమెకు ప్యాస్‌పోర్టు కావాలి. ....చాలా తతంగం వుంది. ఏంరా అబ్బాయిలూ! ఆషామాషీ అనుకోకండి. ఈ విషయంలో మీరుకూడా నా పక్కన నిలబడి గట్టిగా పనిచెయ్యాలి. ఏమంటారు?' అన్నాడు లిఖోనిన్.

'భేష్. ఏం అభ్యంతరంలేదు. సంతోషంగా అంగీకరిస్తున్నాం. నీతో పాటు నిలబడతాం' అంటూ నిజేరా, ఒకసారి ల్యూబావంక చూచాడు. తనకోరమీసం సరిచేసుకున్నాడు. సొలోవీవ్‌మాత్రం మెల్లగా ఇలా అన్నాడు.

'చాలా మంచిపనిచేశావు లిఖోనిన్. నీవు ప్రారంభించిన కార్యం అద్భుతమైంది, అత్యున్నతమైంది. యువకులమైన మనంచేయాల్సిన పనులు ఇవేనోయ్. సాహసకృత్యాలు! సీసా నా చేతికివ్వు, అలెగ్జాండ్రా! నీకు మూతతీయడం సరీగా చేతకాదు. నీవు కార్కుతీస్తోంటే, బీరుకొస్తా బుస్సున పొంగి గదంతా ఖరాబవుతుంది. ల్యూబోచ్‌కా!....కాదు ల్యూబోవ్! నీ కొత్తజీవితం ఆనందమయంకావాలి. తీసుకోరా గ్లాసు.'

మూడు గ్లాసులనిండా బీరుపోసుకుని ముగ్గురూ తీసుకున్నారు. ఒకరి గ్లాసు మరొకరిగ్లాసుకు తాకించారు.

'నిఖోనోవ్‌నా! కాని ల్యూబా అనేపేరు బాగానే వుంది'

'అవును ల్యూబా!' అన్నాడు నిజేరా, గ్లాసు నోటిదగ్గరకు తీసుకుంటూ.

ముగ్గురూ గాసులు ఖాళీచేశారు.

'మరొకసారి నిన్ను అభినందిస్తున్నాను లిఖోనిన్!' అన్నాడు సొలోవీవ్. మీసాలుతుడుచుకుంటూ 'నాకెంతో సంతోషంగావుంది. మా అందరి

లోకీ, నీ ఒక్కడిలోనే ఆ సాహసం, ఆ నిజాయితీ, రష్యన్ యువకుడికి వుండాల్సిన వీరధైర్యం; అన్నీ వున్నాయి లిఖోనిన్! నీవు మాలా అనవసరంగా వాగవు. ఏ పని అయినా చేసిచూపిస్తావు.'

'ఇహ ఊరుకోరా నీ వెధవవాగుడు. సాహసంలేదూ, వీర ధైర్యమూ లేదు' అన్నాడు లిఖోనిన్ మొహంచిట్లిస్తూ.

"నిజంగానోయ్! లిఖోనిన్ చెప్పింది నిజం. నన్నెప్పుడూ వాగే వాణ్ణి అంటూంటావే.మరి నీవూ? నీవిప్పుడు అనవసరంగామాట్లాడుతున్నావు అన్నాడు నిజేరా, సోలోవీవ్ తో.

"మరేం ఫరవాలేదు. నేను కాస్త అతిగా మాట్లాడేమాట నిజమే. అయినా నామాటలకు ఒకవిలువ వుందోయ్! మనలాడ్జీలలోవుండే విద్యార్థులందరికీ పెద్దగా మరోసారి చెపుతున్నాను. ల్యూబాకూడా ఇవాల్టినుంచి మనసంఘంలో గౌరవ సభ్యురాలు." అంటూ అతను కుర్చీలోంచి లేచాడు. చేతులు పైకెత్తి విచారసూచకంగా ఇలా పాడాడు.

"ఇది మా సుందరభవనం!
లేదు ఇసుమంత భయం!
ఇది నిశ్శబ్దం, నిర్మలసౌధం!
ఈ భవనానికి రాణివినీవే!
మా హృదయాలకు దేవివి నీవే!"

ఆపాట వినగానే లిఖోనిన్ కు గుర్తొచ్చింది. తెల్లవారుజామున ఆమెను గదికి తీసుకొస్తూ తను ఇదేపాట, ఇలాగే పాడాడు. అది తలుచుకునేసరికి వెంటనే అతనిహృదయం సిగ్గుతో, అవమానంతో నిండిపోయింది. గట్టిగా కళ్ళుమూసుకున్నాడు.

"సరే, ఇహ చాల్లేవోయ్! ల్యూబా! బట్టలు వేసుకో! హోటలుకు వెడదాం" అన్నాడు లిఖోనిన్.

# 12

'స్పారోస్' రెస్టారెంటు దగ్గరలోనేవుంది. అక్కడికి ఓ రెండొందల అడుగులకంటె ఎక్కువదూరంలేదు. వెళ్ళేటప్పుడు దోవలో ల్యూబా లిఖోనిన్‌ను పక్కకు పిలిచింది. అంచేత ముందుపోతున్న స్నేహితులకూ వీళ్ళకూ కొంచెం ఎడంఅయింది. అప్పుడు ఆమె లిఖోనిన్‌తో మెల్లగా ఇలా అంది.

"ఏమండీ! ఏమిటిదంతా? నిజంగా మనం హోటలుకు వెళుతున్నామా?... నేనేదో పరిహాసానికి అన్నారనుకున్నాను."

"పరిహాసాల కిది సమయంకాదు ల్యూబా! ఇలాంటివిషయాల్లో నాదగ్గర హాస్యాలు పనికిరావు. నిజంగా మనమంతా హోటలుకు వెడుతున్నాం. తప్పేముంది? మరొకసారి చెప్తున్నాను. నీవు నాసోదరివి. స్నేహితురాలివి. కామ్రేడ్‌వు. సరేనా? మీరెప్పుడూ ఇలాంటి ప్రస్తావన తీసుకురావద్దు. ఇవాళే నీకోసం ప్రత్యేకంగా ఒకగదికూడా తీసుకోదలుచుకున్నాను." అన్నాడు లిఖోనిన్ తీవ్రంగా.

స్పారోస్ హోటల్లో, లిఖోనిన్ అంటే గౌరవం చూపిస్తారు. అవును అతను అందరితోనూ తెలివి,జాగ్రత్తలతో సంచరిస్తాడు.ఎన్నడూ డబ్బుఎగనామం పెట్టడు.

ఇవ్వాల్సినబిల్లులన్నీ సక్రమంగా ఇస్తాడు. అంచాత అతనికొక ప్రత్యేకమైన చిన్నగదిఇచ్చారు. ఆ గదిలోకి పగలు బాగా వెలుతురురాదు. అంచాత గ్యాస్‌లైటు వెలిగించారు. నేలమట్టానికి కొంచెంపైన ఒక చిన్న కిటికీవుంది. ఆ కిటికీలోంచిచూస్తే, వీధిలో పోయేవాళ్ళ బూట్లు, చెప్పులు, చేతికర్రలు; ఇవి మాత్రమే కనుపిస్తాయి.

వీరంతా హోటల్లోకి వెళ్ళేసరికి అక్కడ మరో విద్యార్థికూడా తయారపడ్డాడు. అతనిపేరు 'సిమనోవస్కీ' ఇహనేం? అతన్నికూడా ఆహ్వానించారు. అంతాకలిసి గదిలోకివెడుతోంటే, ల్యూబా, వెనుకఆగి లిఖోనిన్‌తో రహస్యంగాఅంది. "ఏమండీ! ఎందుకు వీళ్ళంతా? నాకుచాలా సిగ్గేస్తోంది. ఇంతమందితో ఇలా బహిరంగంగా తిరుగుతోంటే నాకు అదోలావుంది."

అవును పాపం. తనొక పడుపుకత్తెననీ, పదిమందిలో తిరగడానికి తగినదాన్ని కాననీ ఆమె తలంపు. అందరూ తనను గురించి 'ఫలానా' అని చెప్పుకుంటారని, ఆమెకు తలవొంపులుగావుంది. ఆమె అడిగినదానికి లిఖోనిన్ తిరిగి ఇలాజవాబుచెప్పాడు.

'ఏమిటి ల్యూబా! ప్రతి చిన్నవిషయానికీ ఇలా గొడవచేస్తే ఎట్లా? ఇందులో పరాయివాళ్ళు ఎవరూలేరు. అంతా మనస్నేహితులే. అందరూ మంచివాళ్ళు. మనకోసం ఏంకావాలంటేఅదిచేస్తారు. ప్రాణాలైనా ఇస్తారు. వాళ్ళు తమాషాకు, పరిహాసానికి ఏమైనా అన్నా, నీవు పట్టించుకోకు. వాళ్ళహృదయాలు పవిత్రమైనవి ల్యూబా! బంగారంవంటి మనసు వాళ్ళది.'

లిఖోనిన్ రహస్యంగా ఆమెతో చెప్పినప్పటికీ ల్యూబా మనసు కుదుటపళ్ళేదు.

'మీరు ఎన్నిఅయినా చెప్పండి, నాకుమాత్రం సిగ్గుగావుంది. నేను ఎక్కడినుంచి వచ్చిందీ, వీరిలో చాలమందికి తెలుసు' అంది మళ్ల ల్యూబా.

'తెలిస్తే తెలియనీ; మరేంఫరవాలేదు. అసలు తెలియాలనేగా ఇదంతా; జరిగినదాన్ని గురించి సిగ్గుపడడం ఎందుకు? జరిగింది మనం దాచిపెట్టడంలేదు. ఇహముందు మంచిమార్గంలో నడవడానికని ప్రయత్నిస్తున్నాం. చూస్తూవుండు. ఒకఏడాదిలో వీరంతా నిన్నెలా గౌరవిస్తారో! ఎప్పటికైనా కింద పడ్డవాడే లేస్తాడు! పడనివాడు లేచేదేముంది? రా! లోపలికివెడదాం.'

అందరూ గదిలోకివెళ్ళి కూచున్నారు. అందరికోసం భోజనం తెమ్మని ఉత్తర్వుచేశాడు లిఖోనిన్. ఒక్క సిమనోవస్కీమాత్రం భోంచేయనన్నాడు. అప్పుడే ఫలహారం చేశాననీ, వంట్లోకూడా బాగాలేదనీ చెప్పాడు. తక్కిన వారంతా భోంచేస్తున్నారు. భోజనాలముందు ఒక్కల్యూబాతప్ప, తక్కిన వారంతా అతిధోరణిగా మాట్లాడడం మొదలెట్టారు. అందులోనూ లిఖోనిన్, సొలోవీవ్, నిజేరా, వీరుముగ్గురూ మరీ వాగుతున్నారు. ఆ పిల్లకుపట్టిన దుర్గతినిగురించి చర్చిస్తున్నారు. దానిమీద ప్రతివారు తమతమ అభిప్రాయాలు వెల్లడిస్తున్నారు. ల్యూబామాత్రం ఒక్కమాటకూడా మాట్లాడడంలేదు. అందరూ అడుగుతోన్న ప్రశ్నలకు 'అవును' లేక 'కాదు' అనిమాత్రం ముక్తసరిగా జవాబుచెప్పేది. భోజనంకూడా ఆమె ఇష్టంగాతినడంలేదు.

'అవును. లిఖోనిన్ భేషయిన పనిచేశాడు' అన్నాడు సిమనోవస్కీ, వేళ్ళతో టేబుల్ మీద దరువు వేస్తూ 'చాలా సాహసమైనపనిచేశాడు. మన మిత్రులు సోలోవీవ్, నిజేరా సహాయంచేస్తామని వాగ్దానంచేశారు. నేను కూడా మీతోవుంటాను. నా చేతనైన సహాయం తప్పకచేస్తాను. కాని ముందే ఆమెను ఏదోఒకపనిలో పెడితే బాగుంటుందేమో! ఆమె అభిరుచి దేనిమీదవుందో తెలుసుకోవడం మంచిది' అంటూ అతను ల్యూబావైపు తిరిగాడు 'ఏంల్యూబా? నీవు ఏంచేయగలవో చెప్పు. అంటే నీకు ఏపని చాతనవునో చెప్పు—కుట్టుపనివచ్చా?——లేసుఅల్లడం —?'

'నాకేమీ రాదండీ' అంది ల్యూబా, వినపడీ వినపడనట్లు తలదించుకుని. ఎంతో కష్టంమీద అంది ఆ మాట.

'అసలు మీరు మాట్లాడేది ఏమిటోకూడా నాకు అర్థంకావడంలేదు'

వెంటనే లిఖోనిన్ జోక్యంకలిగించుకున్నాడు. 'చూడండి ఆదిలోనే హంసపాదు అన్నట్లు, అసలు మనం మొదట్లోనే తప్పటడుగువేశాం. ఈవిషయం ఇలా ప్రారంభించకూడదు. ఆమెను ఎదురుగాపెట్టుకుని మనం మాట్లాడుతూవుంటే ఏంసబబుగా వుంటుంది? పైగా ఆమెను ఇరకాటంలో పెడుతున్నాం. ఆమె ఎంత కలవరపడుతూందో మీకు కనిపించడంలేదూ? పాపం మాట్లాడలేక గుడ్లనీళ్ళుకుక్కుకుంటోంది.' అంటూ అతను ల్యూబా వైపు మళ్ళాడు. 'లే ల్యూబా! మనం వెడదాం. నిన్నుయింటిదగ్గర దిగబెట్టి వస్తాను. నేనోపదినిముషాల్లో వచ్చేస్తానోయ్! అప్పుడు మనం అన్నీ వివరంగా, ఏమేమిచేయాల్సిందీ, ఏమార్గం తొక్కాల్సిందీ నిర్ణయిద్దాం'

'మీయిష్టం. మీరు ఏంచేయమంటే అదిచేస్తాను. కాని మళ్ళీ గదికి వెళ్ళడంమాత్రం నాకిష్టంలేదు' అంది ల్యూబా, గద్గదస్వరంతో.

'ఏం? ఎందుకని?'

'నేనాగదిలో ఒంటరిగా వుండలేను. కాకపోతే ఈ దగ్గరలో వున్న పార్కులో బెంచీమీదకూర్చుంటాను మీరువచ్చిందాకా.'

'ఓ! అదా సంగతి. నా కర్థమైంది. అలెగ్జాండ్రా నిన్ను హడలగొట్టిందికదూ? ఉండు, దానిపని చెపుతాను. ఆ ముసలిముండకు ముక్కచివాట్లు పెడితేగాని బుద్ధిరాదు. ఇహ లే! మనం వెడదాం.'

ల్యూబా జంకుతూ లిఖోనిన్‌కు తనచెయ్యి అందించింది. ఆమెను వెంటబెట్టుకొని లిఖోనిన్ వెళ్ళిపోయాడు.

కొద్దినిముషాలతర్వాత మళ్ళీ వచ్చాడు. తను లేని సమయంలో మిత్రులు తననుగురించి ఏదో అనుకున్నారని అనుమానించాడు. కొంచెం మనసులో మెదిలింది. అయినా మామూలుగా కూచుని, టేబుల్ మీద చేతులు ఆనించి మాట్లాడడం మొదలెట్టాడు.

'మీరు నా ప్రాణస్నేహితులు. నాకు తెలుసు.' అంటూ అతను ఒక సారి గభాలున సిమనోవస్కీ వంక చూచి, మళ్ళీ మామూలుగా మాట్లాడ సాగాడు. 'నేను మనస్ఫూర్తిగా మీసహాయాన్ని అర్థిస్తున్నాను. ఈ విష యంలో ముందువెనుకలు ఆలోచించకుండా నేను కొంచెం తొందరపడ్డ మాట నిజమే. అయినా నిష్కల్మషంగా, సదుద్దేశ్యంతోటే ఈపనిచేశాను.'

'అసలు కావల్సింది అదే' అన్నాడు సిమనోవస్కీ ఉత్సాహంగా.

'నన్నుగురించి స్నేహితులుగాని, పరాయివాళ్ళుగాని ఎవరేమి అను కున్నా నేను లెక్కచేయను. నా నిశ్చయాన్ని మార్చుకోను. ఆమెను రక్షిం చడమే—క్షమించండి. నోరుజారి తెలివితక్కువమాట అన్నాను—ఆమెకు ప్రోత్సాహం ఇచ్చి, సహాయంచేస్తాను. ప్రస్తుతానికి ఆమెకోసం చౌకలో ఒక చిన్న ఇల్లు అద్దెకు తీసుకుంటాను. ఆమెజరుగుబాటుకు అవసరమైన డబ్బు ఇస్తాను. డబ్బువిషయంలో నాకు బాధలేదు. కాని ఆతరువాత ఏం చేయాలనేదే ప్రశ్న. అదే నన్ను కలవరపెడుతోంది. డబ్బునుగురించి నా కెప్పుడూ భయంలేదు. అంచాత ఆమె జరుగుబాటుకు ఏలోటూ రానివ్వను. కాని తింటూ, సోమరిపోతులా ఎంతకాలమని కూచుంటుంది? కనుక మనం ఏదో ఒకపని ఆలోచించాలి. ఆమెకు ఒకవృత్తిని కల్పించాలి. ఇక్కడే మీసలహా నాకు అవసరం. కాస్త ఆలోచించి చెప్పండోయ్.'

'మరి ఆమె చేయగలిగిన పనేమిటి ? సానికొంపలో ప్రవేశించక ముందు ఏవృత్తిలో వుండేది?' అనడిగాడు సిమనోవస్కీ.

'ఆమెకు చదువుకూడా రాదోయ్.'

'చదువు రానంతమాత్రాన ప్రమాదం ఏమీలేదు. చదువుకున్నా చదువుకోకపోయినా మనకు ఒకటే. మన ఆలోచనలన్నీ నీటిబుడగలమాదిరి

వున్నాయి. కాని ఆమె కష్టపడుచు. అదే జాగ్రత్తగా ఆలోచించండి.' అన్నాడు సొలోవీవ్.

'హీ, హీ, హీ' అంటూ సందేహంగా సకిలించాడు నిజేరా. అప్పుడు సొలోవీవ్ కొంచెం కోపంగా ఇలాఅన్నాడు.

'నిజేరా! నీ వ్యవహారం నాకు నచ్చలేదు. ఇక్కడ మాట్లాడుతోన్న విషయాలు, నీకంత ఎగతాళిగావుంటే, ఇదుగోదోవ, వచ్చినదోవనే వెళ్ళి పోవచ్చు!'

'మరి...ఆమాట...ఇందాక నీవే అన్నావుకదోయ్'

'అవును. నోరుజారి అన్నాను. క్షమాపణచెప్పుకున్నాను. దాంతో ఆ విషయం అయిపోయింది. లిఖోనిన్ అంటే నాకు గౌరవం, ప్రేమ. అతని కోసం నేచేయగలిగింది చేస్తాను. ఇప్పుడు అసలువిషయంఏమిటంటే: ఆమెకు చదువురానంతమాత్రాన ఇబ్బందిలేదు. చదువురానివాళ్ళు అనేకమంది రకరకాల వృత్తులు చేసుకుని సుఖంగా, గౌరవంగా బ్రతకడంలేదూ? ఈమె కూడా ఏదోఒకపని నేర్పిస్తే, రెండువారాల్లో ఆరితేరుతుంది' అన్నాడు సొలోవీవ్.

'ఏదీ ఉదాహరణకు ఒక్కటిచెప్పు.' అన్నాడు నిజేరా.

'చెప్తాను...కాగితపుపూలు తయారుచేయడం...ఎంతో హాయిగా వుంటుంది. పరిశుభ్రమైనవృత్తి ... పరువుగాబ్రతకొచ్చు. లేదా పూలవర్తకుడిదగ్గర పనిచెయ్యొచ్చుకూడా.' అన్నాడు సొలోవీవ్.

'యింతకూ, ఏపనిలోఅయినా అభిరుచి ఉండాలోయ్' అన్నాడు మామూలుధోరణిలో, సిమనోవస్కీ.

లిఖోనిన్ ఏదో ఆలోచించినట్లు తలపంకించి ఇలాఅన్నాడు. 'ఆమె చేత ఓ చిన్న భోజనశాల పెట్టించాలని నామనసులో వుంది. అదిఅయితే పెద్ద కష్టంవుండదు. పైగా మన విద్యార్థులంతా సహాయపడతారు. వాళ్ళు ఎక్కడతిన్నా, ఏంతిన్నా పెద్ద పట్టించుకోరు. అంతేకాక, విద్యార్థులకు భోజనంపెట్టే హాస్టల్, ఎప్పుడూ జనంతో కిటకిటలాడుతూరద్దీగావుంటుంది. అంచాత మనస్నేహితులందరినీ ఇక్కడికే తోలుకురావచ్చు.'

'ఈఆలోచన పసందుగా వుంది' అన్నాడు నిజేరా—'కాని నాకొకటే సందేహం. భోజనశాల నడపడం మనకు అలవాటులేనిపని. అందు

లోనూ మనవాళ్ళంతా యఫ్. యస్. గాళ్ళు. ఒక్కడికీ చేతిలో పైసా వుండదు. అప్పులు పెట్టి ఆతరువాత పీక్కోలేక చావాలి. మనపని ఖాళీ. హోటలు మర్నాడే దివాళాతీస్తుంది. అందుకని ఎవడో ఒకడు కనిపెట్టుకుని వుండాలి. ఎవడిచాతనవుతుందేమిటి? ఆ మెను చూడబోతే పసితనం, అమాయకురాలు. లిఖోనిన్ మాత్రం పొద్దస్తమానం గల్లాపెట్టెదగ్గర కూచుంటాడా ఏమిటి?'

అదివిని లిఖోనిన్ కొంచెం అయిష్టంగా అతనివైపు చురచుర చూశాడు. కాని ఏమీ మాట్లాడకుండా పెదవులు కొరుక్కుని ఊరుకున్నాడు.

అప్పుడు సిమనోవస్కీ కొంచెంధీమాగా తలూపుతూ ఇలా అన్నాడు.

'అబ్బాయిలూ! మీ ఆలోచనలు బాగానేవున్నాయి. ఆచరణలోనే వస్తుంది చిక్కు. హోటలుకానీయండి, మరొకటికానీయండి. వ్యాపారం అన్న తరువాత ఎవడైనా కాస్త గట్టిమైన మనిషి పక్కన నిలబడాలి. లిఖోనిన్ చెప్పినట్లు డబ్బువిషయంకాదు ప్రధానం. నిర్వహణ. వ్యాపారంలో ఎంతటెంతటివాళ్ళూ పల్టీకొట్టడం కద్దు. అంచాత ఏది మొదలెట్టినా మొదట్లో కొన్ని చిక్కులు, కష్టాలు తప్పవు. తడిసిగాని గుడిసె కప్పడు, తాకిగాని తలవొగ్గడన్నట్లు, కొన్నిదెబ్బలు తిన్నతరువాతగాని జ్ఞానం కలుగదు. పసిపిల్లాడు నడవడం నేర్చుకునేముందు కనీసం ఓ యాభైసార్లయినా కిందపడతాడు. అలాగే వ్యాపారంకూడా. కనుక మొదట్లోనే ఆ చిక్కులేని పిల్లకు కష్టాలు తెచ్చిపెట్టేదానికంటె ఆమెకాళ్ళమీద ఆమే నిలబడేలా చేయడం మంచిది. స్వశక్తిమీద ఆధారపడి జీవించడం ఎప్పుడైనా శ్రేయస్కరమోయ్.'

'అయితే ఏమిటి నీవుద్దేశ్యం? ఆమెను ఎక్కడైనా పనికి కుదరమంటావా?' అనడిగాడు సొలోవీవ్.

'అవును. హోటల్లో వంటమనిషిగానో, పళ్ళాలుకడగడమో, లేకపోతే లాండ్రీలో పనిమనిషిగానో కుదరడం మంచిది' అన్నాడు సిమనోవస్కీ.

లిఖోనిన్ ప్రయోజనంలేదన్నట్లు తలఊపాడు.

'మాటలు చెప్పడం తెలిసే. వంటమనిషి, పనిమనిషి...కాని మొదటిది అలాంటిపనులు ఆమె చేయగలుగుతుందా అని నా అనుమానం. ఇహ రెండోది, యిదివరకు యిలాంటిపనులుచేసి ఆమె చాలాకష్టాలు అనుభవించింది. యజమానులు నీచంగామాడడం, వాళ్ళతిట్లూ, చీవాట్లు అన్నీ రుచి చూచింది. మీకు తెలీదూ? అసలు పశుపుకత్తెలలో నూటికి తొంభయి మంది, అంతకుముందు పనిమనుషులుగావున్న వాళ్ళే. దాసీలుగావుండి, నానా యాతనలుపడి, చివరకు సానికొంపలలో ప్రవేశిస్తారు. ఇప్పుడుకూడా ల్యూబాను మనం ఆపనిలో పెట్టామూఅంటే, తిరిగీ ఆమె దానికి ఉద్యాసన చెప్పి తొందరలోనే యథాస్థానానికి చేరుకుంటుంది' అన్నాడు లిఖోనిన్.

'అవును. నీవుచెప్పింది నిజం' అన్నాడు సొలొవీవ్.

'సరే. నీయిష్టంవచ్చినట్లు చెయ్యవోయ్' అన్నాడు సిమనోవస్కీ, అయిష్టంగా.

'ఇహ నావిషయంలో ఒకటేసంగతి' అన్నాడు నిజేరా.

'నీకు పొద్దున్నే చెప్పాను. అసలు ఇలాంటి విషయాల్లో దిగడం చాలాపొరపాటు. అనేకమంది మనలాగే ఈ పశుపుకత్తెలను బాగుచేయడానికి ప్రయత్నించి, చాతగాక పప్పులోకాలువేశారు ...... అలాంటి వాళ్ళను మనం కళ్ళారా చూచాం కూడా. అయినా నీవు నడుంకట్టావు; మంచిదే. నీవు ఏపని ఎలాప్రారంభిస్తే, ఆపనిలో నా శక్తివంచనలేకుండా తప్పక సహాయంచేస్తాను.'

లిఖోనిన్, పిడికిలితో టేబుల్‌మీద గుద్దాడు.

'వీల్లేదు.' పెద్దగాఅరిచాడతను. 'సిమనోవస్కీ చెప్పినవాట్లో కొంత అర్థంవుంది. వ్యాపారంలో కొన్ని ప్రమాదాలు ఎదుర్కోవల్సినమాట వాస్తవం...ముందామెకు ఒక చిన్నగది తీసుకుంటాను. తిండీ తిప్పలు ఏర్పాటుచేస్తాను. తరువాత ఆమెకు విద్యాబుద్ధులు నేర్పడానికి మనమంతా ప్రయత్నిద్దాం. క్రమక్రమంగా దోవకువస్తుంది. నాకుతెలుసు. ఆమె హృదయం, ఆత్మ పవిత్రమైనవి. ఈమాట చెప్పడానికి నాకు తగినంత ఆధారం లేకపోయినా, అలాఅని నేను నమ్ముతున్నాను. నిన్ను అనేకసార్లు హెచ్చరించాను నిజేరా! పరిహాసాలు ఆడొద్దని పదేపదేచెప్పాను. ఎన్నోసార్లు వచ్చినకోపాన్ని ఆపుకున్నాను. అయినా నీ పాడుబుద్ధి పోలేదు. అవతల

వాడు ఎంతబాధపడతాడో నీవు గ్రహించలేదు. మళ్ళీచెపుతున్నాను. నీవు ఎంత విడ్డూరంగా, పరిహాసంగా మాట్లాడినా నేను లెక్కచెయ్యను. నా నిశ్చయాన్ని మార్చుకోను. అనుకున్నది చేసితీరాల్సిందే' చాలా కోపంగా, తీవ్రంగా అన్నాడు లిఖోనిన్.

'ఓ! నాఉద్దేశ్యం అదికాదోయ్!... కోప్పడకు లిఖోనిన్!... నేను సరదాగా మాట్లాడేవాణ్ణని నీకు తెలుసు...పోనీ అంత ఇష్టంలేకపోతే ఇహ మాట్లాడను. సరేనా?...ఏదీ! ఒకసూటు షేక్ హాండ్ ఇవ్వు...ఇద్దరంకలిసి ఒక డోస్ వేసుకుందామా?' తగ్గి, స్నేహంకలుపుతూ అన్నాడు నిజేరా.

'సరే. నన్ను ఒంటరిగా వుండనివ్వు...ఇహముందైనా చిన్నపిల్లాడిలా ప్రవర్తించకు...దీనివల్ల మనస్నేహాలు చెడగొట్టుకోవడం ఎందుకు?...ఇహ ఆ విషయం పోనీయాడి...ల్యూబాకు ముందు చదువు నేర్పించాలి. ఆమెను ఎగ్జిబిషన్లకు, థియేటర్లకు తీసుకెళ్ళాలి. మీటింగులకు తీసుకెళ్ళి ఉపన్యాసాలు వినిపించాలి. మ్యూజియంలు, ప్రదర్శనశాలలు, రేడియోవార్తలు, పాటకచ్చేరీలు; ఇవన్నీ ఆమెలో చైతన్యం కలిగిస్తాయి. ఆ అమాయకహృదయాన్ని వికసింపచేస్తాయి. ఈపనిలోనే మీరంతా తోడ్పడాలి. తరువాత ఏంజరుగుతుందో చూద్దాం' అన్నాడు మళ్ళీ లిఖోనిన్ కోపం తగ్గించుకుని.

'ఓ! అద్భుతంగావుంది' అన్నాడు సిమనోవస్కీ. 'ఇలాచేస్తే ఓ కొత్తపంథా తొక్కినవాళ్ళం అవుతాం. ఏమో! ఎవరెరుగుదురు? ముందు ముందు లిఖోనిన్ ఆమెకొక తండ్రిలాంటివాడు, పవిత్రమైన గురువులాంటి వాడు కావచ్చు. నేను సహాయంచెయ్యడానికి సిద్ధంగావున్నానోయ్.'

'నేను, నేనుకూడా!' అరిచారు మిగతా ఇద్దరువిద్యార్థులు. మొత్తం నలుగురూ కలిసి, ల్యూబాకు చదువు చెప్పే విషయంలో తీర్మానాలు చేశారు. వెంటనే అందరూ ముందుకొచ్చి ఎవరి నిశ్చయాలు వారుచెప్పారు.

సొలోవివ్ ఆపిల్లకు వ్యాకరణం, వ్రాయడం నేర్పుతానన్నాడు. ఆమెకు నేర్చుకోడానికి కష్టంగాను, విసుగ్గానులేకుండా, ఎప్పటికప్పుడు తేలిక అయిన పాఠాలు రష్యన్ భాషలోను, ఇతరభాషల్లోను చదివి వినిపిస్తానన్నాడు. తద్వారా, వీటిల్లో ఆమెను ఉత్తీర్ణురాలుగా చేస్తానన్నాడు. లిఖోనిన్ ఆమెకు లెక్కలు, భూగోళం, చరిత్ర, చెప్తానన్నాడు.

తరువాత నిజేరా, ఈసారి పరిహాసంగా కాకుండా, హృదయపూర్వకంగా ఇలా అన్నాడు.

'అబ్బాయిలూ! నాకు ఏ సబ్జెక్టుల్నూ పరిపూర్ణంగా తెలీదు. పైగా నేనిదివరకు కొంతకాలం పిల్లలకు చదువుచెప్పి దిగుగత్తినవాణ్ని. అంచాత ఆమెకు నేను మా జార్జియన్ మహాకవి 'గ్లోస్ట లీ' కావ్యాలు చదివి వినిపిస్తాను. ప్రతిపంక్తికీ అర్థంచెప్పకుండాపోతాను. అంతేకాదు. వీణ, ఫిడేలు, సితారు వాయించడం నేర్పుతాను. సంగీతంలో నాకు కొంత పాండిత్యం, ప్రతిభ, అనుభవం ఉన్నాయి.'

జార్జియన్ విద్యార్థి నిజేరా, సంగీతం చెపుతాననేసరికి లిఖోనిన్, సొలోవివ్ పకపక నవ్వుతూ సంతోషంతో చప్పట్లు కొట్టారు. పిమ్మట సిమనోవస్కీ ఇలా అన్నాడు.

'ఒరేయ్! ఇందాకటినుంచీ ఎంత పరిహాసమాడినా, ఇప్పుడుమాత్రం బ్రహ్మానందంగా మాట్లాడావు. అవును. సంగీతం నేర్పావూ అంటే, అది ఆమెకు ఎన్నోవిధాల ఉపకరిస్తుంది. ముందు ముందు ఏదో కొన్ని వాయిద్యాలు వాయించడం ఆమె త్వరగా నేర్చుకొంటుంది. మరి నేను ఏం బోధించదలచుకొన్నానో తెలుసా? కారల్ మార్క్స్ వ్రాసిన 'కాపిటల్' మానవ విజ్ఞానానికి, సంస్కృతికి సంబంధించిన చరిత్రలు చదివి వినిపిస్తాను. అంతేకాదు. సైన్సులో నాకు అభిమానవిషయాలైన పదార్థవిజ్ఞానశాస్త్రం, రసాయినికశాస్త్రం ఇదికూడా ఆమెకు బోధిస్తాను.'

ఇదివిని తక్కిన విద్యార్థులంతా మరీ సంతోషంతో చప్పట్లుకొట్టారు.

అలా నిశ్చయించుకొని విద్యార్థులంతా ఎటువాళ్ళు అటు వెళ్ళిపోయారు. లిఖోనిన్ మాత్రం ల్యూబా కూచునివున్న పార్కులోకి వెళ్ళి ఆమెను కలుసుకున్నాడు. అతనితో తిరిగి గదికి వెళ్ళడానికి ఆమె మనస్సు అంగీకరించలేదు. లాడ్జిలో పనిమనిషి అలెగ్జాండ్రా అసాధ్యురాలు. ఆమెకు పడుపుకత్తెలంటే సరిపడదు. తనను నలుగురిలోనూ అవమానపరుస్తుందని ల్యూబా భయపడింది. పైగా తన పూర్వవృత్తాంతం చెప్పివుద్ధుకుందామన్నా, లిఖోనిన్ అందుకు అంగీకరించడంలేదు. చేసేపని ఏదో బహిరంగంగా పదిమందితోనూ చెప్పి చేద్దామంటున్నాడు అతను. ఈ కారణాల వల్ల తిరిగి లాడ్జికి వెళ్ళడానికి ల్యూబా బాధపడుతోంది. అయినా లిఖోనిన్

ఊరుకోలేదు. ఆమెకు నచ్చచెప్పి తీసుకెళ్ళాడు. ఇహ చేసేదిలేక ఆమె, అతనిమాటకు ఎదురుచెప్పకుండా గుడ్డిదానిలా అనుసరించింది.

కపటమనస్కురాలైన అలెగ్జాండ్రా వూరుకోలేదు. ఈలోపుగా, విద్యార్థులలాడ్జికి అధికారి అయిన సూపరింటెండెంటుదగ్గరకు వెళ్ళి లిఖోనిన్‌మీద రిపోర్టుచేసింది. ఎవరో పిల్లనుతీసుకొచ్చి గదిలో పెట్టాడనీ, రాత్రిఅంతా ఆమెతో గడిపాడని చెప్పింది. ఆ పిల్ల ఎవరో తనకుతెలీదనీ, ఆమె తనపెత్తల్లి కూతురని లిఖోనిన్ చెపుతున్నాడనీ, కాని ప్యాస్‌పోర్టు చూపించలేదనీ, ఆమె ఎన్నెన్నోవిధాల, అధికారితో మొరపెట్టుకుంది. అధికారి వెంటనే లిఖోనిన్‌ను పిలిపించి అడిగాడు. సూపరింటెండెంటు తక్కువవాడుకాడు. గదులకూ, ఇళ్ళకూ ఖచ్చితంగా అద్దెలువసూలుచేస్తుంటాడు. ఆడపాడదడపా లంచాలుకూడా పుచ్చుకుంటూ; చేసేపాపాలు బయటపడకుండా మాపుచేస్తూవుంటాడు. లిఖోనిన్ అతనితో వినయంగా మాట్లాడాడు. తక్షణం, ఆమెకోసం వేరేగది అద్దెకుతీసుకుంటున్నానని నచ్చచెప్పడానికి ప్రయత్నించాడు. అయినా అధికారి వూరుకోలేదు.

'లిఖోనిన్! నీవు ఆపిల్లకోసం వేరేగది తీసుకుంటున్నానని చెప్పావు బాగానేవుంది. అయినా నాకు ప్యాస్‌పోర్టు చూపించాలి. రేపే తీసుకొచ్చి చూపించు. ఇంతగా ఎందుకు చెపుతున్నానంటే, నీమీద నాకు నమ్మకంలేక కాదు. నిన్ను ఎంతోకాలంనుంచి ఎరుగుదును. పైగా నీవు అద్దె బకాయి పెట్టకుండా సక్రమంగా ఇస్తుంటావు. కాని కాలం మారింది. పరిస్థితులు వెనుకటిలా లేవు. ఎవడైనా నామీద పై అధికారులకు రిపోర్టు చేశాడా అంటే, నాకు జరిమానా విధించడమే కాకుండా, శిక్షకూడా పడుతుంది' అన్నాడు అధికారి.

ఆసాయంత్రం లిఖోనిన్ ల్యూబాను వెంటబెట్టుకొని పార్కుకు వెళ్ళాడు. అక్కడ కొంతసేపు కులాసాగా తిరిగి, నోబెల్‌క్లబ్‌లో సంగీతం వింటూ హాయిగా గడిపారు. తరువాత ఇద్దరూ గదికిచేరుకున్నారు. లాడ్జిలోనే కొంచెం ఎడంగా లోపలగావున్న ఓ చిన్నగది తీసుకుని, అందులో ఆమెను దిగబెట్టాడు. వెళ్ళొస్తానని చెపుతూ, పితృప్రేమతో ఆమె నుదుటిమీద ముద్దుపెట్టుకున్నాడు. పిమ్మట తన మామూలు గదిలోకి వచ్చేశాడు.

కాని ఓ పదినిముషాలు అయినా కాకముందే, ఆమె తిరిగి లిఖోనిన్ గదిలోకి వచ్చింది. అప్పటికి లిఖోనిన్ దుస్తులువిప్పుకుని, 'లా బుక్కు' చదువుకుంటూ మంచంమీద పడుకునివున్నాడు. ల్యూబా పిల్లిలా ప్రవేశించి తలుపుదగ్గర నిలబడి గీరడంమొదలెట్టింది. లిఖోనిన్ తలెత్తిచూచాడు. అకస్మాత్తుగా ల్యూబా అక్కడికిరావడంచూచి చకితుడయ్యాడు. అప్పుడు ల్యూబా మెల్లగా ఇలాఅంది.

'ఏమండీ! మీచదువుకు భంగంకలిగించినందుకు నన్ను క్షమించండి. నాకు ఒక సూది, దారం కావాలి. కోప్పడకండి. ఒక్కనిముషంలో వెళ్ళిపోతాను.'

'ల్యూబా! నీవు తక్షణం ఇక్కణ్ణుంచి వెళ్ళిపోవాలి. నిముషం కాదు, అరనిముషంకూడా వుండడానికి వీల్లేదు' అన్నాడు లిఖోనిన్ గట్టిగా.

'ఓ! కోపగించకండి ప్రియా! ఎందుకు నామీద అలా విరుచుకుపడతారు?' అంటూ ఆమె వెలుగుతోన్న కొవ్వొత్తిని గభాలున ఆర్పేసింది. అతన్ని గట్టిగా కౌగలించుకుని పెద్దగా నవ్వడం మొదలెట్టింది.

ఓ పదినిముషాల తరువాత లిఖోనిన్ గదితలుపుదగ్గరకొచ్చి నిలబడ్డాడు. వంటిమీద దుప్పటి కప్పుకునివున్నాడు. తువాలుతో చెమట తుడుచుకుంటూ ఇలా అన్నాడు.

'ల్యూబా! ఇలాఅయితే మనం జీవించలేం. ఎన్నిసార్లుచెప్పినా నీవు వినడంలేదు. రేపు నీకోసం, దూరంగా ఇల్లుఒకటి తీసుకుంటాను. నీకు మళ్ళీ చెపుతున్నాను. ఇలా ఎన్నడూ చెయ్యొద్దు. ఇలాజరగడం నాకిష్టంలేదు. మన సంబంధం కేవలం స్నేహంగానే వుంటుందని నాకు మాటఇవ్వు'.

'అలాగే ప్రియా! నేను కాదన్నానా?' అంటూ ఆమె మందహాసంతో, మరోసారి అతని పెదవులను, చేతిని ముద్దుపెట్టుకుంది. పిమ్మట తన గదిలోకి వెళ్ళిపోయింది.

# 13

రష్యన్ మేధావులలో అద్భుతమైనవాళ్ళు అనేకమంది ఉన్నారు. స్వచ్ఛమైన సంస్కృతి, విజ్ఞానం కలిగినవాళ్ళు ఉన్నారు. తమ ఆదర్శాల కోసం పడరాని పాట్లు పడుతూ, చెప్పరాని చిత్రహింసలకు గురిఅవుతూ, ఓర్పుతో సహించేవాళ్ళు, ఆఖరుకు ఏమాత్రం తొణకకుండా, నిర్భయంగా మృత్యుముఖంలోకి పోయేవాళ్ళు అనేకమంది ఉన్నారు. కాని ఇలాంటి ధీరోదాత్తులు తీరా ఏ బంట్రోతువాడు సరీగా ప్రవర్తించలేదనో, చాకలిది తలబిరుసుగా మాట్లాడిందనో కలవరపాటు చెంది, మనస్థైర్యాన్ని కోల్పోయి వారిమీద దురుసుగా ప్రవర్తిస్తారు. తత్ఫలితంగా మనసులో బాధపడుతూ పోలీసుస్టేషన్‌కు వెడతారు. ఇలాంటిఘనులలో లిఖోనిన్ ఒకడు. ఆమర్నాడు ఉదయాన్నే లేచి, ల్యూబా ప్యాస్‌పోర్టుకోసం ప్రయత్నాలు ప్రారంభించాడు. (కిందటిరోజు సెలవుదినం అవడంవల్ల ఈపనిమీద ఎవరినీ కలుసుకో లేదు) చీకటితోనే లేచాడు. ఆమెకు ప్యాస్‌పోర్టు సంపాదించడం ఎలాగా అని ఆలోచించసాగాడు. అతనికి తలతిరిగిపోతోంది. వళ్ళంతా వణుకుపుడు తోంది. పరీక్షలు దగ్గరపడుతున్నాయి. ఈ గొడవల్లోపడితే తనచదువు పాడయిపోతుంది. తను తప్పడం ఖాయం. ఇవన్నీ జ్ఞాపకంవచ్చేసరికి హృదయ మంతా కలచివేసింది. ఆవేళ ప్రొద్దుటినుంచే సన్నగా వర్షంకూడా ప్రారంభమైంది. ముసురుపట్టినట్లు కురుస్తోంది. ఇదొక ఆటంకం. ఎక్కడికి వెడదామన్నా, ఏంచేద్దామన్నా చిరాగ్గావుంది. తనకు తెలుసు. తను ఏపని ప్రారంభించినా, సరీగ్గా అదేసమయానికి వర్షంముంచుకొస్తుంది. ఈ వర్షం తన అపజయానికి, కష్టాలకు చిహ్నమని అతని ఉద్దేశ్యం. ఈ ఆలోచనలతో ఏమీ పాలుపోక అలాగే మెల్లగా కాలకృత్యాలు తీర్చుకుని దుస్తులు వేసుకుని బయలుదేరాడు.

యామా అతనిగదికి అట్టే దూరంలేదు. ఒకమైలుకు లోపేవుంటుంది. ఆ దోవను వెళ్ళడం అతనికి మామూలే. కాని ఎప్పుడూ రాత్రిళ్ళు తప్ప, పగటిపూట వెళ్ళిఎరగడు. అంచాత ఇవాళ పట్టపగలే బయలుదేరి యామాలోకి వెడుతోంటే, మనస్సంతా పరిపరివిధాల బాధిస్తోంది. వచ్చే

పోయే జనమంతా తనవైపే అదోరకంగా చూస్తున్నట్లు తోస్తోంది. ఎదురు పడ్డ ప్రతిమనిషి, ప్రతిబండివాడు, ప్రతి పోలీసువాడు- అంతా తనవైపే పరీక్షగా, విచిత్రంగా చూస్తున్నారు. వాళ్ళచూపుల్లో ఏదో అనుమానం, అసహ్యత అగుపిస్తున్నాయి. తను అటువైపు ఎందుకు వెడుతున్నదీ వాళ్ళు స్పష్టంగా గ్రహించినట్లు తోస్తోంది. ఈ విమపుచూపులను భరించలేక పోతున్నాడు లిఖోనిన్. అలాగే బరువుగా, బాధగా కాలుసాగిస్తున్నాడు.

నగరందాటి, ఊరిపొలిమేరకు చేరుకున్నాడు. రోడ్డుకు రెండువైపులా పచ్చిక మైదానాలున్నాయి. చిన్నచిన్న కాలువలు, నీళ్ళమడుగులు వున్నాయి. వాటిపక్కన ఆవులు, దూడలు మేస్తున్నాయి. వాటినిదాటేసి, యామ్‌స్కాయా వీధివైపు మళ్ళాడు.

అన్నా మార్కోవ్‌నా ఇంటిదగ్గరకు చేరుకున్నాడు. ఇంటితలుపులు కిటికీలు, అన్నీ మూసివున్నాయి. అలాగే తక్కినఇళ్ళుకూడా నిశ్శబ్దంగా నిద్రపోతున్నాయి. ఎక్కడా అలికిడిలేదు. వీధిఅంతా నిర్మానుష్యంగా కళాహీనంగా పాడుపడ్డట్టుంది. ప్లేగు, కలరా, మహమ్మారి మొదలైన అంటువ్యాధులు ప్రబలంగా వ్యాపించి, విహారంచేసి వెళ్ళింతరువాత ఎలా వుంటుందో, అలావుంది ఆ ప్రదేశం. లిఖోనిన్, బరువెక్కిన గుండెతో అన్నా మార్కోవ్‌నా ఇంట్లోకి వెళ్ళి 'కాలింగ్ బెల్' నొక్కాడు.

ఒకదాసీవచ్చి తలుపుతీసింది. ఆమెచేతిలో తడిగుడ్డవుంది. వళ్ళంతా మడ్డికారుతూవుంది. ఇల్లుకడిగి తుడిచేపనిలో వుంది.

'జెన్నిని చూడాలనివచ్చాను.' అన్నాడు లిఖోనిన్, కొంచెం సందేహిస్తూ.

'జెన్ని తనవిటుడితోవుంది. ఇంకా నిద్రలేవలేదు' అని చెప్పింది దాసీ.

'పోనీ, టమారా?'

ఆమె మొహంచిట్లిస్తూ అలనివంక ఓరగా చూచింది, 'టమారా... ఏమో, నాకు తెలీదు...ఆమెకూడా తీరుబడిగా లేదనుకుంటాను...అయినా ఎందుకూ? మీకేం కావాలి? ఆమెతోవుండడానికి వచ్చారా?'

'ఏదో కొంచెం... అవును. ఆమెతో వుండడానికే వచ్చాను.'

'అయితే, నాకుతెలీదు. మీరు వుండండి, వెళ్ళిచూస్తాను.'

లిఖోనిన్‌ను హాలులో నిలబెట్టి దాసీమనిషి లోపలికి వెళ్ళిపోయింది. హాలంతా మసకమసకగావుంది. బ్రాందీ, పొగాకు వాసన గుప్పు మంటోంది. దుమ్ము, ధూళి గదినిండా అలాగే పేరుకునివుంది. గతరాత్రి జనంతో క్కిసలాటతో హాలంతా కిటకిటలాడిపోయిందికదూ! దానిఫలితం ఇంకా పోలేదు. ఆ చిహ్నాలు మిగిలివున్నాయి. నాటకశాలలు, నృత్య శాలలు, సినిమాహాలులు, సర్కస్ డేరాలు ప్రదర్శనానంతరం ఎలావుంటాయో అలావుంది హాలు. దూరంగా, వీధిలో ఎక్కడో ఒకబండి పోతోన్నచప్పుడు వినిపించింది. గోడగడియారం, యథావిధి టిక్ టిక్ మని ధ్వని చేస్తోంది. లిఖోనిన్ హాలులో బిక్కుబిక్కుమంటూ ఒక్కడూ కూచున్నాడు. చలి వలన అతనిచేతులు వణుకుతున్నాయి.

జెన్నీ వచ్చింది. ఆమెజుట్టు రేగివుంది. కళ్ళు నిద్రమత్తుగావున్నాయి. పడుకునేటప్పుడు తొడుక్కునే తెల్లనిజాకెట్టు తొడుక్కునివుంది. అప్పుడే పక్కమీదనుంచి లేచివస్తున్నట్లు స్పష్టంగా తెలుస్తోంది. 'ఆ!...' అంటూ పెద్దగా ఆవులించింది జెన్నీ. చెయ్యి ముందుకు చాపుతూ, 'గుడ్‌మార్నింగ్ స్టూడెంట్! ల్యూబా కులాసాగావుందా? కొత్తగా కాపురం పెట్టారుకదా, మీఇంటికి నన్ను విందుకైనా పిలవలేదేం? అసలు ఎవరికీతెలీకుండా,దంపతు లిద్దరూ ఏకాంతంగా శోభనవైభవంలో మునిగితేలుతున్నారా?' అందిజెన్నీ.

'ఏమిటా పిచ్చిమాటలు జెనీచ్‌కా? ఇహ అంతటితో ఆపు. నేను ప్యాస్‌పోర్టుకోసం వచ్చాను.'

'ఓ! ప్యాస్‌పోర్టా!' అంది జెన్నీ ఏదో ఆలోచిస్తూ. 'ప్యాస్‌పోరు ఇక్కడ్లేదు. యజమానురాలిదగ్గర్నుంచి మీరు వట్టి కాగితం ఒకటి తీసుకో వాలి. అది మామూలుగా పడుపుకత్తెలందరికీ ఇచ్చే కాగితం. అది తీసుకుని పోలీసుస్టేషన్‌కు వెడితే వాళ్ళు దాన్ని అక్కడ ప్యాస్‌పోర్టుగా మార్చి ఇస్తారు. చూడండి! ఈవిషయంలో మీకు నేను అంతగా సహాయం చేయ లేను. నేను యజమానురాలుతోకాని, కాపలావాడితోకాని మాట్లాడితే వాళ్ళు ఊరుకోరు. నన్ను చావచితకకొడతారుకూడా. అందుకని నేను మీకు ఒకమార్గం చెపుతాను. అలాచేయండి. పనిమనిషిని యజమానురాలి దగ్గరికి పంపండి. వతనగా వచ్చే ఒకాయన, స్వయంగా కలుసుకుని మాట్లా డాలంటున్నాడని కబురుచేయండి. ఆమె వస్తుంది. నేను వెనకాల వుండి

పని జరిగేలా చూస్తాను. మరేమీ అనుకోకండి. ఇలా చెప్పినందుకు నామీద ఆగ్రహించకండి. ఏంచేయమంటారు? ఈవిషయంలో నేను ప్రత్యేకంగా ఆసక్తి చూపిస్తున్నట్లు యజమానురాలికి తెలిస్తే, ఇహ నాకు పుట్టగతులుండవు. సరే, మీా రిక్కడ చీకట్లో ఒంటరిగా దేనికి ఉండడం? రండి. లోపల గదిలో కూచుందురుగాని. ఒకబుడ్డి బీరు తెప్పించనా? లేకపోతే కొంచెం కాఫీ పుచ్చుకోండి...' అంటూ జెన్ని ఒకసారి అటూ ఇటూ చూచింది. ఆమెకళ్ళు మెరిశాయి. మళ్ళీ ఇలాఅంది. 'ఎవరైనా అమ్మాయి కావాలా? టమారాకు తీరుబడిలేదు. పోనీ న్యూరా, వెర్కా? పిలిపించనా?'

'అబ్బ! ఇహ ఆపు జెన్నీ, ఏమిటామాటలు? నేను ఎంతో ముఖ్యమైన పనిమీద వస్తే, ఇప్పుడా ఇవన్నీ?...' అన్నాడు లిఖోనిన్ చిరాగ్గా.

'అబ్బెబ్బె! ఏంలేదు. ఊరికే అడుగుతున్నాను ఎవరైనా కావాలేమో అని. లేకపోతే మీసంగతి నాకు తెలీదూ? మీరు ఎలాగైనా సత్పురుషులు. సరే. లోపలికి రండి.'

జెన్ని అతన్ని గదిలోకి తీసుకెళ్ళి కూచోబెట్టింది. గది కిటికీలు పూర్తిగా తెరిచింది. మందమందంగా వెలుతురు గదిలోకి వచ్చింది. ఒకసోఫా, కొన్ని కుర్చీలు వున్నాయి.

ఇక్కడే కూచోండి, ఇహనేను వెడతాను. మీరుమాత్రం కొంచెం తెలివి జాగ్రత్తలతో వుండండి. యజమానురాలుగాని, సిమన్‌గాని అతిగా మాట్లాడి మీదకొస్తారేమో! జాగ్రత్త! మీరేం భయపడకండి. పిరికివాళ్ళను మరీ తరుముతారు. మీరు మెత్తమెత్తగావుంటే వాళ్ళకు మరీ అలుసు. గండడమిండడైతే వీళ్ళు అదురుకు చస్తారు. పళ్ళునూరి ఎదురుతిరిగి మాట్లాడండి. దాంతో హడలిపోయి అడుగులకుమడుగులొత్తుతారు. ఆముండ చాల అసాధ్యురాలు. అయినా ఇది పట్టపగలు. మీకొచ్చిన ప్రమాదంలేదు. మీరు మిక్కిలి ఏదైనాఅంటే, చెప్పండి. సరాసరి గవర్నర్ దగ్గరకెళ్ళి రిపోర్టుచేస్తాననీ, ఇరవైనాలుగు గంటల్లో ఈ పాడుకొంపకు తాళం వేయిస్తాననీ బెదిరించండి. కుక్కిన పేనులా పడివుంటుంది ముండ. నోటికి వచ్చినట్లు బూతులు తిట్టండి. మెత్తగా పట్టుకుచ్చులా అయిపోతుంది పాపిష్టిది. మరి నేవస్తాను.'

వ్యవహారం ఎలానడపాల్సిందీ వివరంగాచెప్పి జెన్ని వెళ్ళిపోయింది. ఓ పదినిముషాల తరువాత, ఇంటిపెత్తందారు ఎమ్మా గదిలోకి వచ్చింది.

విశాలమైన మొహం, నల్లటికళ్ళు. శరీరం లావుపాటి దుక్కలా వుంది. నీలపు రంగువస్త్రాలు ధరించివుంది. రాగానే లిఖోనిన్ ఆమెతో కరస్పర్శచేశాడు. ఆమెచెయ్యి రాతిబండలావుంది. చేతికి బంగారపు కడియాలు, వేళ్ళకు ఉంగరాలు ఉన్నాయి. 'ఈ పాడుముండ ఎన్నెన్నిపాపాలు చేసిందో, ఎంతమంది ప్రాణాలు తీసిందో!' అనుకున్నాడు లిఖోనిన్ తనలో.

"యామా" లో వ్యవహారాలన్నీ లిఖోనిన్‌కు బాగా తెలుసు. అతను అక్కడికి ఎప్పుడువెళ్ళినాసరే, కావల్సిన డబ్బేకాకుండా, వెంట ఒక రివాల్వరుకూడా తీసుకొని వెడతాడు. ఈసారికూడా అలాగే చేశాడు. పరిస్థితి ఎటుపోయి ఎటువస్తుందోఅని, ఒక రివాల్వరు గుండ్లతోనింపి భద్రంగా జేబులో వుంచుకున్నాడు. పుష్కలంగా డబ్బుకూడా దగ్గరవుంది. వ్యవహారం ఏమాత్రం బెడిసినా, వాళ్ళుఏదైనా తూలుడుగా ప్రవర్తించినా, అందుకు సిద్ధపడే వున్నాడు లిఖోనిన్. అయినా అతనికి ఈవ్యవహారంనడపడం ఏదో కష్టంగా, బాధగా వుంది.

"ఆహా! భలే! భలేవారండీ మీరు." అంది ఎమ్మా పడకకుర్చీలో కూచుంటూ. సిగరెట్టుముట్టించి మళ్ళీ ఇలాఅంది—"మీరు ఒకరాత్రికని సైకంఇచ్చి పిల్లను తీసుకుపోయారు. కాని, మరోపగలు, మరోరాత్రికూడా అక్కడే వుంచుకున్నారు.కనుక మీదగ్గరనుండి మాకుఇంకా పాతికరూబుల్సు రావలసి వున్నాయి. ఒకరాత్రికి అమ్మాయినిపంపిస్తే పదిరూబుల్సు వసూలు చేస్తాం. అలాంటిది మీరు ఇరవైనాలుగుగంటలు ఎక్కువ వుంచుకున్నారు కనుక, మరోపాతికరూబుల్సు మాకు ఇవ్వాల్సివుంటుంది. దయచేసి సిగరెట్టు కాల్చరూ?" అంటూ ఆమె సిగరెట్టుపెట్టె అందించింది. లిఖోనిన్ ఆలోచించకుండా వెంటనే సిగరెట్టుతీసుకుని వెలిగించాడు.

"నేను మీతో వేరేవిషయం మాట్లాడడానికి వచ్చాను." అన్నాడు లిఖోనిన్.

"ఓ! అదా సంగతి. నాకంతా తెలుసులెండి. వయసులోవున్న కుర్రాళ్ళు మీరు. మా ల్యూబాను తీసుకెళ్ళి ఆమెను మీతోనే వుంచుకోవాలనుకుంటున్నారు...... లేక, ఆమెను ఉద్ధరించి రక్షించాలనుకున్నారు... అవునా? ఇది, సాధ్యమయ్యేపనికాదు బాబూ! నాకు తెలుసు. యువకులంతా ఇలాగే మూర్ఖులై, అర్థంలేనిపనులు చేస్తుంటారు. పశుప్రకృతైను ఎవరైనా

మార్చగలరటయ్యా! మీదంతా పిచ్చిగాని'' అంది ఎమ్మా, ఈవిషయమంతా ముందే తనకు తెలిసినట్లు.

'బాగుపరుస్తానో, చెడగొడతానో అది వేరేసంగతి. ఆమెను తీసుకెళ్ళి రక్షించడం నా ధర్మం.' అన్నాడు లిఖోనిన్ కొంచెం నిర్లక్ష్యంగా.

'అవును. మీధర్మం' అంటూ ఎమ్మా మొహం అష్టవంకరలు తిప్పి పరిహాసంగా నవ్వడం మొదలెట్టింది. 'ఇలాంటి నీతులు, ధర్మపన్నాలు వల్లించే యువకులను చాలామందిని చూశాం. సరే. మీరు ఆ పిల్లను బాగు చేస్తే సంతోషమే. కాని ఒకసంగతి చెపుతున్నాను. గుర్తుంచుకోండి. ఆ సిగ్గు లేని లంజ ల్యూబా వున్నదే! మీరు అక్కడ్లేదని మెడపట్టి గెంటిన తరువాత ఇక్కడికి ఏమొహం పెట్టుకొని వస్తుంది? గడపలో కాలుపెడితే ముక్కుకు తాడేసి అవతలికి ఈడుస్తాను, ఏమనుకున్నారో! దిక్కూ మొక్కూ లేకుండా నడిరోడ్డుమీద కుక్కచావు చావాల్సిందే. లేదా, ఆ యాభై కోపెక్కుల అధ్వాన్న పురొంపలో ప్రవేశించి, సోల్జర్లచేత తొక్కించుకుని మురికిచావు చస్తుంది' అంది ఎమ్మా, వళ్ళంతా కసిచేసుకుని.

'అనవసరమైన మాటలతో పనిలేదు. ఆమె ఎన్నటికీ ఇక్కడికిరాదు. ధృడసంకల్పంతో చెపుతున్నాను. నా కిప్పుడు ఆమెసర్టిఫికెట్ కావాలి. అందుకే వచ్చాను' అన్నాడు లిఖోనిన్.

'సర్టిఫికెట్టా? హు! సరే. ఇప్పుడే ఇస్తాను. కాని ముందామె ఇవ్వాల్సిన బాకీలు చెల్లించండి. ఇలా జరుగుతుందని నాకు ముందే తెలుసు. అందుకే ఆమె పద్దులపుస్తకం పట్టుకొచ్చాను.' అంటూ ఎమ్మా తనచెయ్యి రొమ్ముల్లోకి పోనిచ్చి, జాకెట్టులోంచి ఒక చిన్న నోటుబుక్కు బయటికి తీసింది. అలా చేసేటప్పుడు లావుగా, బలిసి, పచ్చగావున్న ఆమె రెండు స్తనాలు లిఖోనిన్‌కు స్పష్టంగా కనిపించేలా చేసింది. పుస్తకం టేబుల్ మీద పడేస్తూ 'ఇది చూడండి, మీకే తెలుస్తుంది.' అంది ఎమ్మా. లిఖోనిన్ పుస్తకం తీసుకుని చూడడం మొదలెట్టాడు. దానికి నల్లటి అట్ట వేసివుంది. అట్ట మీద 'ఇరినా ఓశ్చేంకోవా (ల్యూబ్‌కా); అన్నామార్కోవ్‌నా ఇంట్లో వుండే వేశ్యతాలూకు జమాఖర్చుపుస్తకం; యామ్‌స్కాయా వీధి, ఇంటినెంబరు...'ఫలానా అనే వివరాలున్నాయి. లిఖోనిన్ మెల్లగా పుస్తకం లోపలపేజీలు తిరగేయసాగాడు. మొదటిపేజీలో కొన్ని రూల్సు, నిబం

ధనలు అచ్చులో వున్నాయి ఈ జమాఖర్చుపుస్తకం రెండుప్రతులుగా వుంటుందనీ, ఒకటి యజమానురాలిదగ్గర, రెండోది సానిదగ్గర వుంటాయనీ, సంపాయించే సొమ్ము, ఆమెకోసం యజమానురాలికి అయ్యే ఖర్చు, ఎప్పటి కప్పుడు ఈ రెండుపుస్తకాల్లోనూ వ్రాయబడతాయనీ వుంది. సాని తన ఇంట్లో వున్నందుకు, భోజనం, పడక, దీపపుచమురు, స్నానం, పానం, ఇంకా ఇతర చిల్లరఖర్చులు; వీటికింద యజమానురాలు సానిసంపాదనలో శ్చివంతులు తీసుకుంటుంది. మిగతా ఒకవంతుసొమ్ములో చాలవరకు ఆమె దుస్తులు, అలంకారాలు మొదలైన ఖర్చులకింద పోతుంది. సాని పరిశుభ్రంగాను, అందంగాను అలంకరించుకోవాల్సిన అవసరముంది. అంచాత కనీసం రెండుజతలయినా మంచిరకం దుస్తులు కావాలి. ఇందువల్ల కొంతసొమ్ము యజమానురాలు తీసుకుంటుంది. ఇహ మిగతాసొమ్ము ఏమైనా నిల్వవుంటే అది సానికి చెందుతుంది. సానిదగ్గర్నుంచి ఎప్పటికప్పుడు స్టాంపు అంటించిన రశీదుమీద సంతకంతీసుకొని, ఆ డబ్బు ఆమెకు ఇవ్వబడుతుంది. ప్రతి నెల ఆఖరున ఇచ్చిపుచ్చుకునే లెక్కంతా పరిష్కారం చేయబడుతూవుంటుంది. పోతే, వేశ్య ఎప్పుడైనా ఇక్కణ్ణుంచి వెళ్ళిపోదలుచుకుంటే, యజమానురాలికి యివ్వాల్సిన బాకీలు చుప్తాగా రొఖ్ఖంయిచ్చిగాని, లేదా 'సివిల్ లా' ప్రకారంప్రామిసరీనోటు వ్రాసియిచ్చిగాని వెళ్ళాల్సివుంటుంది. అలాచేసింతరువాత స్వేచ్ఛగా వెళ్ళిపోవచ్చు.

ఇదీ ఆ నిబంధనల సారాంశం. ఇదంతా చదివి, లిఖోనిన్ ఇలా అన్నాడు.

"ఏమమ్మా? ఇందులో ఎప్పుడుబడితే అప్పుడు ఆమె వెళ్ళిపోవచ్చునని ఉందే? ఇహ మీఅభ్యంతరం ఏమిటి?"

"అవును. నేచెప్పేదీ అదే నాయనా! వెళ్ళవచ్చు. కాని ఆమెవద్ద నుండి మాకు రావలసిన డబ్బుమాట చెప్పండి" అంది ఎమ్మా.

"అయితే, ప్రామిసరీనోటు వ్రాసిస్తుంది."

"ప్రామిసరీనోటూ! భలేవాడివయ్యా! దానికి చదువురాదు...... చదువురాని మొద్దు వ్రాసిచ్చిన నోటుకు ఎక్కడైనా విలువవుంటుందటయ్యా! అందుకని నాకు నమ్మకమైన పెద్దమనిషి ఎవరైనా హామీవుండాలి. అప్పుడు ఒప్పుకుంటాను'.

'హోమీసంగతి ఆరూల్సులో ఎక్కడాలేదే'

'ఆరూల్సులో చాలాసంగతులు వుండవు. యజమానురాలికి చెప్పకుండా, ఏపెద్దమనిషిఅయినా సానిని తనతో తీసుకుపోవచ్చునికూడా ఆ రూల్సులో లేదు'.

'ఎలాగైనా యిప్పుడు నాకు ఆమె సర్టిఫికెట్ ఇవ్వాలి'

'నేనంత పిచ్చిముండను కాదబ్బాయ్, బోల్తాపడడానికి? ఎవరైనా బాధ్యతగల పెద్దమనిషిని హామీతీసుకురా. ఒకపోలీసునుకూడా వెంటపెట్టుకురా. నీకూ ఆపిల్లకూ వున్న సంబంధం చట్టసమ్మతమైందనీ, న్యాయబద్ధమైందనీ ఆ పోలీసాయన వ్రాసియివ్వాలి. నీవు ఆపిల్లను తీసుకుపోవడం, ఏలాభంకోసమూ ఆశించికాదనీ, ఆమెను మరోసానికొంపకు అమ్మడానికి కాదనీ ఆ వచ్చిన పెద్దమనిషి హామీపత్రంమీద సంతకంపెట్టియివ్వాలి. ఇలా ఆ యిద్దర్నీ తీసుకొచ్చి, ఆ రెండుపనులూ చేస్తే నీకు వెంటనే సర్టిఫికెట్టు దొరుకుతుంది.

'దీనిపాడుగాను! ఎన్ని తికమకలు పెడుతున్నావమ్మా! నేనే ఆమెకు హామీవుంటాను. ఏం, పనికిరాదా? ఈసమయంలో ప్రామిసరీనోటు వ్రాసియిస్తాను...'

'ఇదుగో అబ్బాయ్! నీకు ఆ కాలేజీల్లో ఏంచదువు చెప్తున్నారో నాకర్థం కావడంలేదు. హు! చదువుకున్నాట్ట చదువు! బుర్రలేదే నీకు! బుద్ధిలేనిమనిషి! పాంటుమీదపాంటు, కోటుమీదకోటు వేసి, రోడ్లమీద తిరగడమనుకున్నావా? వ్యవహారమయ్యా వ్యవహారం! 'పిల్లకాకికేంతెలుసు వుండేలుదెబ్బ' అన్నట్లు నీకేంతెలుసు వ్యవహారం సంగతి, ప్రామిసరీనోట్ల సంగతి? ఇదేం మజాఖా అనుకున్నావా? నన్నే మస్కాకొట్టాలని చూస్తున్నావే! అమ్మ పిల్లగాడా!'

యిది వినేసరికి లిఖోసిన్‌కు పూర్తిగా కోపంవచ్చింది. జేబులోంచి డబ్బులసంచి తీసి టేబుల్‌మీద విసిరేశాడు.

'అయితే ఇదిగో డబ్బు. ఇవ్వాల్సింది అవతల పారేస్తాను. సర్టిఫికెట్టు ఇచ్చెయ్యి'

'అహా! ఇనాకనిత్తు వేశావూ? అయితేసరే. ఆపుస్తకంలో మిగతా పేజీలు చూడు. నీప్రియురాలు మాకెంతబాకీవుందో తెలుస్తుంది' అంది ఎమ్మా హేళనగా.

"నోర్ముయ్, లంజదానా!" పెద్దగా అరిచాడు లిఖోనిన్.

"నువ్వంటేనే ఫూల్! ముందది చూడు" అంది ఆమె పెద్దగా ఎదురుతిరుగుతూ.

రూళ్ళువేసిన పేజీలు తిరగేశాడు లిఖోనిన్. ఎడమవైపున, సానిసంపాయించిన సొమ్ము జమవేసివుంది. కుడిపక్కన ఆమెకోసం చేసినఖర్చులు వ్రాసివున్నాయి. ముందు జమలుచదవడం మొదలెట్టాడు.

"ఫిబ్రవరి 15;—10 రూబుల్సు; 16—4 రూబుల్సు; 17—12 రూబుల్సు; 18—సుస్తీగావుండి సేవలేదు; 19—సుస్తీ, 20—6 రూబుల్సు 21—14 రూబుల్సు."

"ఆఁ దేవుడా! ఒకరాత్రి పన్నెండుమందిదగ్గర పడుకుందా!" అనుకున్నాడు లిఖోనిన్ తనలో. బరువుగా భారంగా నిట్టూర్పువిడిచి మళ్ళీ చదివాడు.

"నెలకు సంపాయించిన మొత్తం 360 రూబుల్సు."

"ఆఁ భగవంతుడా! ఇంతఘోరం జగత్తులో ఎక్కడా చూళ్ళేదు.... నూట అరవైఅయిదుమందితో వుంది." పేజీలు తిరగేస్తూ, లెక్కంతా చూస్తుండేసరికి లిఖోనిన్కు గుండెఆగిపోయేటంత భయం పుట్టింది. తరువాత పుస్తకం కుడివైపున వ్రాసినఖర్చులు చూడడం మొదలెట్టాడు.

'లేసుఅల్లిన సిల్కుదుస్తులకు—కుట్టుపనివాడు 'ఇవడోకిమోవా' కు ఇచ్చినది—84 రూబుల్సు; పడుకునేటప్పుడు వేసుకునే లేసుఅల్లిన దుస్తులకు, వాటిపనివాడికి ఇచ్చినది—35 రూబుల్సు;6 జతల సిల్కుమేజోళ్లు—36 రూబుల్సు; బండిబాడుగ, పౌడరు, తలనూనెలు మొదలైనవి—మొత్తం 205 రూబుల్సు' కనుక మొత్తం 330 రూబుల్సులో యజమానురాలు పెట్టిన ఖర్చు 220 రూబుల్సు తగ్గించవలసినది. పోతే మిగిలిన 110 రూబుల్సు యజమానురాలి వాటాకింద సరిపోయినది. ఇహ గతసంవత్సరం ఇరీనా (ల్యూబ్కా) ఇవ్వాల్సిన అప్పు 418 రూబుల్సు, ఈఏడు మళ్ళీ వాడుకున్నబాకీ 95 రూబుల్సు; మొత్తం 513 రూబుల్సు ఆమె ఇవ్వవలసినబాకీ.

యిదంతా పరిశీలించేసరికి లిఖోనిన్‌కు తల తిరిగిపోయింది. ఆమె కోసం యింత ఖరీదైన దుస్తులు, విలువైన వస్తువులు ఎందుకు ఖర్చుచేయాల్సి వచ్చిందని ఎమ్మాను అడిగాడు. కాని ఆమె పెడసరంగా సమాధానం చెప్పింది. అందుకు తన జవాబుదారీ ఏమీ లేదనీ, కాస్త మర్యాదగల వేశ్యా గృహంలో వుండేవారు మంచిదుస్తులు, అలంకారాలు వేసుకునివుండడం విధాయకమనీ చెప్పింది.

'నీవూ, నీ ఖర్చులు, నీ కుటుంబపువాళ్ళు, అంతా దొంగలు! మోస గాళ్ళు! నీ లెక్కంతా తప్పుడు లెక్క! నీవొక సాలెపురుగువు! నీ కొంపంతా ఒక సాలెగూడు! సానులంతా ఈగలు, దోమలు! నీవు మానవరూపంలో రక్తాన్ని పీలుస్తూవున్న జలగవు! నీవు క్రూరసర్పానివి! విషపురుగువు! నీ నాశనం కాను! నీకు దయాదాక్షిణ్యాలున్నాయటే! నీకు హృదయంవుందీ? నీకు అంతరాత్మవుందా? దుర్మార్గురాలా!' వళ్ళు మండిపోయి నోటికి వచ్చి నట్లు తిట్టాడు లిఖోనిన్.

అతను కోపంతో రెచ్చిపోతున్నకొద్దీ, మరీ హేళనచేయడం మొదలుపెట్టింది ఎమ్మా.

“అబ్బాయ్! నీవు అడిగేపాటితో నాకు సంబంధంలేదని ఇందాకే చెప్పాను...... అనవసరంగా ఓట్టావూ అంటే, కాపలావాణ్ణిపిలిచి బయటికి గెంటిస్తాను.” అంది ఆమె కోపంగా.

లిఖోనిన్ ఆమెతో తెగించి, నిర్దాక్షిణ్యంగా బేరమాడాడు. గొంతు పగిలిపోయేలా అరిచాడు. చివరకు ఎలాగైతేనేం ఆమె అంగీకరించింది. 250 రూబుల్సు రొఖ్ఖం తీసుకోడానికీ, ఇంకో 200 రూబుల్సుకు అతని చేత ప్రామిసరీనోటు వ్రాయించుకోడానికీ ఒప్పుకుంది. కాని మళ్ళీ ఒకషరతు పెట్టింది. యూనివర్సిటీ అధికార్లచేత, అతను 'లా' చదువుతున్నట్లు, ఆ వేసవిలో పరీక్షలు పూర్తిచేసి 'లాపట్టం' పుచ్చుకోనున్నట్లు సంతకాలు చేయించిన సర్టిఫికెట్లు తీసుకురావాలని చెప్పింది. అలా తెస్తేనే ప్రామిసరీనోటు వ్రాయించుకుంటానని ఖచ్చితంగా చెప్పింది. అతను వీటికి 'సరే' నన్నాడు.

వెంటనే ఆమె పచ్చటిక్కెట్టు కోసం లోపలికి వెళ్ళింది. గదిలో లిఖోనిన్ ఒక్కడూ అటూ ఇటూ పచారుచేస్తున్నాడు. గోడలనువున్న పటాలు, తైలచిత్రాలు అనేకం అతనికి అగుపించాయి. అవన్నీ శృంగార

చిత్రాలే. వాటికేసి చూస్తూవుండగా హఠాత్తుగా అతనిదృష్టి గోడకు వేలాడగట్టివున్న ఒక నోటీసుబోర్డుమీద పడింది. ఒకపొడుగాటి అచ్చు కాగితానికి ఫ్రేమ్‌కట్టి గోడకు తగిలించివుంది. బూజు, మట్టి పడి మసగ్గా వున్న అద్దంలోంచి ఆ కాగితం ఏమిటో అని చూచాడు లిఖోనిన్. అది పోలీసుడిపార్టుమెంటువారు, వ్యభిచారచట్టంక్రింద ఏర్పాటుచేసిన రూల్సుకు, నిబంధనలకు సంబంధించిన కాగితం. అలాంటిది ఇంతకుముందెప్పుడూ లిఖోనిన్ చూళ్ళేదు. అంచేత ఆదుర్దాగా, ఆసక్తితో, ఆరూల్సు చదవసాగాడు. ఆ ప్రకటన అంతా పోలీసుభాషలో అచ్చువేయబడివుంది. తెరవెనకాల వుండడంవల్ల సరిగా కనిపించలేదు. అయినా ఎవరికంటపడినా, ఆరూల్సు చదివి తెలుసుకుంటారు ఆ ప్రకారం నడవడంలేదని యజమానురాలిమీద రిపోర్టు చేయవచ్చు. అందుకని ఆ ప్రకటన కనిపించీ కనిపించనట్లు తెర చాటున గోడకు వేలాడకట్టారు. తెరతొలగించి చదివాడు లిఖోనిన్. వేశ్యాగృహాలు నడిపేవారు తీసుకోవలసిన జాగ్రత్తలన్నీ అందులో వున్నాయి: ఇళ్ళు పరిశుభ్రంగాను, ఆరోగ్యకరంగాను వుంచాలనీ, అల్లర్లు, కొట్లాటలు జరగకుండా జాగ్రత్తవహించాలనీ, ఇంట్లోవుంటున్న వేశ్యల యొక్క పూర్తివివరాలు వ్రాసివుంచాలనీ, వారిని వారం వారం డాక్టర్ చేత పరీక్షచేయిస్తూ వుండాలనీ, అందుకు అవసరమైన చికిత్సాసామాగ్రి, పరికరాలు భద్రపరచాలనీ, మొదలైనవన్నీ వున్నాయి. అంతేకాదు. వేశ్యాగృహాలు చర్చిలకు, స్కూళ్ళకు, కోర్టుభవనాలకు కనీసం నూరుఅడుగుల దూరంలో వుండాలనీ, వాటిని కేవలం ఆడవాళ్ళే నడపాలనీవుంది. అలా నడిపేస్త్రీలకు బిడ్డలుగాని, బంధువులపిల్లలుగాని వుంటే, వారు ఏడుసంవత్సరాలకంటె తక్కువవయస్సుగల పిల్లలయితేనే, వారితోపాటు అక్కడ వుండవచ్చు. లేకపోతే వేరుగా వుండాలి. వేశ్యాగృహాలయజమానురాండ్రు, వేశ్యలు, పనిమనుషులు, దాసీలు; వీరంతా ఎవరిబాధ్యతలు వారు గుర్తించి మెలగాలనీ, వచ్చేవిటులను మర్యాదగా ఆహ్వానించి, వారిపట్ల వినయం, విధేయత, అణకువ ప్రదర్శించాలనీ వుంది. వేశ్యలుగాని, వచ్చిన విటులుగాని ఎప్పుడూ తాగకూడదు. ప్రమాణాలు చెయ్యడం, పోట్లాటలు పనికిరావు. వేశ్య తప్పతాగి, వచ్చిన విటునితో ప్రేమకలాపాలు సాగించడం పనికిరాదు. తాగివున్న పురుషుడితోగాని, లేక మత్తుగాగాని, పిచ్చిగాగాని

అసహ్యంగా అసభ్యకరమైన స్త్రీలతోగాని వన పురుషులతోగాని వేశ్యలు గడపకూడదు. కనుపులు పోగొట్టుకోవడం, దగతాగడం పెద్ద నేరంగా భావించబడుతుంది. పైనిబంధనలు అతిక్రమించినవారు చట్టప్రకారం శిక్షార్హులవుతారు. "ఛా! ఏం నీతిసూత్రాలు వ్రాశారు వెధవలు!" అనుకున్నాడు లిఖోనిన్. అదంతా చదివి విపరీతంగా కోపగించుకున్నాడు. అసహ్యంకూడా వేసింది. తుపుక్కున ఉమ్మేశాడు.

చివరకు ఎమ్మాతో జరగవల్సిన పని అంతా పూర్తిఅయింది. అనుకున్న ప్రకారం డబ్బుతీసుకుని, రశీదు వ్రాసియిచ్చింది. రశీదు, పచ్చటికట్టు రెండూ అతని కిచ్చింది. యిలా యిచ్చేటప్పుడు ఒక తమాషా జరిగింది. యిద్దరూ ఒకరినొకరు నమ్మలేకపోయారు. రశీదు, టిక్కెట్టు తీసుకోకుండా డబ్బు యివ్వడానికి లిఖోనిన్ సంకోచించాడు. ముందు డబ్బు తీసుకోకుండా కాగితాలు యివ్వడానికి ఎమ్మా అనుమానించింది. ఈపని జరిగేటప్పుడు యిద్దరిచేతులూ వణికాయి. చివరకు ఎలాగో డబ్బుయివ్వడం, కాగితాలు తీసుకోవడం; రెండు పనులూ ఒకేసారి జరిగాయి. కాగితాలు తన సంచిలో భద్రపరుచుకుని లిఖోనిన్ లేచాడు. వాకిలిదాకా అతన్ని సాగనంపడానికి ఎమ్మా వెంట వచ్చింది. అతను వీధిలోకి వెళ్ళిన తరువాత ఆమె వెనక్కుపిలిచింది.

'ఏమండోయ్! విద్యార్థి గారూ!'

అతను ఆగి వెనుతిరిగి చూచాడు.

'ఏమిటి?'

'ఏంలేదు. ఒకవిషయం చెపుదామని పిలిచాను. ఆ ల్యూబావుంది చూచారూ? అది వట్టి భ్రష్టుముండ! దొంగది! చెడామడా తిరిగి చెడ్డరోగాలన్నీ తగిలించుకుని చస్తోంది. మా యింటికి వచ్చే మర్యాదస్థుడు ఎవడూ దాన్ని ముట్టుకోడు. ముందుముందు నీకే తెలుస్తుంది. అసహ్యంపుట్టి బయటికి గెంటేస్తావు. మరోవిషయం. దాని దృష్టిఅంతా ఎప్పుడూ, పనివాళ్ళమీదా, పాకివాళ్ళమీదా, పోలీసువాళ్ళమీదా, కాపలావాళ్ళమీదా, దొంగలమీదా వుంటుంది. వాళ్ళతోటే సుఖంఅనుభవిస్తూఉంటుంది. జాగ్రత్త! ఉద్ధారకుడవు! ముందుముందు నీకేతెలుస్తుందిలే! పాపం, ఎంత మోజుపడ్డావో, సక్రమంగా పెళ్ళిచేసుకొని సుఖపడు నాయనా!' అంది ఎమ్మా.

కూచున్నాడు. కాళ్ళు టేబుల్ మీద పంబతన్ని, రెండు చేతులూ వెనక్కి పెట్టుకున్నాడు. ఆ ఎద్దులాంటి శరీరం అటూఇటూ కదిలిస్తోంటే కుర్చీ కిర కిరలాడుతోంది.

లిఖోనిన్ లోపలికిరాగానే, అతన్ని ఒక అచేతనమైన వస్తువును చూచి నట్లుచూచి ఇలా ప్రశ్నించాడు కెర్బెష్.

“ఏం, విద్యార్థిమహాశయా? ఇలా దయచేశావేం?”

తనువచ్చిన పని గురించి క్లుప్తంగా వివరించిచెప్పాడు లిఖోనిన్.

“కనుక...ఆమెను నా సేవకురాలిగానో లేక... వీలైతే చుట్టం గానో నాదగ్గర అట్టిపెట్టుకో దలచుకున్నాను ... ... ఒక్కమాటలో తేల్చి చెప్పండి ఏంచేయమంటారో?” అన్నాడు లిఖోనిన్ సంభాషణముగిస్తూ.

“సరేలే! ఆమెను ఉంపుడుకత్తెగానో, భార్యగానో వుంచుకుంటూ వన్నమాట.” అన్నాడు కెర్బెష్ అయిష్టంగా. చేతిలోవున్న వెండిసిగరెట్ కేసును టేబుల్ మీదపెట్టి అటూఇటూ ఆడిస్తూ మళ్ళీ ఇలాఅన్నాడు. ‘ఈవిష యంలో నేను చేయగలిగిందేమీలేదు... అందులోనూ ప్రస్తుత పరిస్థితిలో నీవు ఆమెను పెళ్ళిచేసుకోదలుచుకుంటే, మీ యూనివర్సిటీ అధికార్లనుండి సక్రమమైన అనుమతిపత్రం తీసుకురావాలి. లేక ఆమెను ఉంపుడుకత్తెగా వుంచుకుంటానంటావా, అది అర్థంలేనిపని.... నీతి జాతి లేకుండా సాని కొంపల్లోపడి చెడిపోయినపిల్లను ఉంపుడుకత్తెగా స్వీకరించడం ఎంత సిగ్గు మాలినపనో మరి చెప్పక్కర్లేదు.”

‘పోనీయండి, ఆమెను నేను సేవకురాలిగానే స్వీకరిస్తాను’ అన్నాడు లిఖోనిన్.

‘సేవకురాలైనా అంతేనయ్యా! ముందు నీవు నివసిస్తోన్న యింటి యజమాని దగ్గర్నుంచి సర్టిఫికెట్ తీసుకురావాలి...ఇంతవరకూ నీవు సరే ఇల్లు తీసుకోలేదనుకుంటాను...ఎలాగైనా సరే ఒక సర్టిఫికెట్ యూనివర్సిటీ అధికారులనుంచీ, మరొకటి నీ జిల్లాకు సంబంధించిన పోలీస్ స్టేషన్ నుంచీ నీవు దాసీదాన్ని పెట్టుకునే స్థితిలో వున్నావనీ, మిగతా వ్యవహారాలన్నీ సక్రమంగా వున్నట్లూ, ఇంకా తరతర వివరాలతో దాఖలుచేసుకోవాలి. నీపేరు టౌన్ రిజిష్టరులో నమోదు అయివుందా? లేక......నీవుకూడా బేవా ర్సుగా తిరిగేవాళ్ళల్లో ఒకడివా?

'లేదు. రిజిష్టరులో నమోదుఅయింది' అన్నాడు లిఖోనిన్. లిఖోనిన్‌కు కోపంరావడం ప్రారంభించింది.

'అయితే సరే. మరి ఆపిల్లపేరు?' మళ్ళీ అడిగాడు కెర్బెష్.

'అవును. ఆమెపేరు ఇంకా నమోదుచేయలేదు. కాని ఆమెటికెట్ నావద్దవుంది. దాన్ని మీరు ప్యాస్‌పోర్టుగా మార్చిపెట్టండి. వెంటనే పేరు రిజిష్టరుచేయిస్తాను.'

కెర్బెష్ తిరిగి చేతులుచాచి, సిగరెట్ కేసును అటూఇటూ ఆడించడం మొదలెట్టాడు.

"అబ్బాయ్! నేను నీకు ఏవిధంగానూ సహాయం చేయలేను. నాకు సరియైన కాగితాలు, రికార్డు తీసుకొచ్చి చూపిస్తేనేకాని, ఈపని ముట్టుకోను. ఇహ ఆపిల్లసంగతి; ఇల్లుతీసుకుని వుండడానికి ఆమెకు పర్మిషన్ లేదు. కనుక ఎక్కణ్ణుంచి వచ్చిందో మళ్లీ అక్కడికే వెళ్ళిపోవాలి. లేదా, మేమే పట్టుకుని పోలీసుస్టేషనుకు తీసుకొస్తాం. ఇహ మీరు వెళ్ళొచ్చు" అన్నాడు కెర్బెష్ తలబిరుసుగా.

లిఖోనిన్ అక్కణ్ణుంచి తలుపుదాకా వచ్చాడు. హఠాత్తుగా అతనికొక సులువైనఆలోచన తట్టింది. కాని అది అతనికి ఇష్టంలేని ఆలోచన. అయినప్పటికీ మళ్ళీ వెనక్కితిరిగి టేబుల్ వద్దకు వెళ్ళాడు. తనుచేయబోయే పని చాలా అసహ్యమైందని బాధపడుతూనే, మళ్లీ నిలదొక్కుకుని ఇలా అన్నాడు.

"ఆఫీసరుగారూ! మన్నించండి. ముఖ్యమైనవిషయం ఒకటి మరచిపోయాను. మీకూ నాకూ పరిచయంవున్న ఒకతను, మీకివ్వాల్సినడబ్బు నాచేతికిచ్చి పంపాడు."

ఈ మాటలు అనేటప్పుడు లిఖోనిన్ కంఠస్వరం పూర్తిగా మారింది.

"ఓ! పరిచయస్తుడా? ఎవరబ్బా అతను?" అన్నాడు కెర్బెష్ కళ్ళు పెద్దవిచేసి.

"బార్... బార్‌సోవ్"

"ఓ! బార్ బార్‌సోవ్! వాడా! జ్ఞాపకం వచ్చింది."

'ఆ! అతనే! మరి అతనిచ్చిన ఈ పదిరూబుల్సు తీసుకోరూ?'

కెర్చెవ్ అక్కర్లేదన్నట్లు తలఊపాడు. లిఖోనిన్ ఇవ్వబోయిన పది రూబుల్సునోటు తీసుకోలేదు.

'అయితే వాడు నీకు తెలుసునన్నమాట... వట్టి దొంగముండా కొడుకు! వాడు నాకు ఇవ్వాల్సింది పదిరూబుల్సు కాదు. పాతికరూబుల్సు. నీచపువెధవ! పుండాకోరు! పాతికరూబుల్సు, ఇంకా కొంత చిల్లరడబ్బులు కూడా ఇవ్వాలి... పోనీ, చిల్లర దానికుంపతెగిరి, వదులుకుంటాను. మరి పాతికరూబుల్సు? జూదంలో బాకీపడ్డాడు...రాస్కెల్!...వాడికి ఆట చాతాకాదు, పాడూకాదు. వద్దన్నకొద్దీ ఆడి, డబ్బు ఎగనామంపెట్టాడు... అందుకని మిగతా పదిహేనురూబుల్సుకూడా కలిపి మొత్తం పాతిక ఇవ్వండి' అన్నాడు కెర్చెవ్.

'ఆఫీసరుగారూ! మీరు డబ్బువిషయంలో చాల గట్టివారులా వున్నారు' అన్నాడు లిఖోనిన్ మిగతాడబ్బు తీస్తూ.

'అవును నాయనా? ఏంచేయమంటావు చెప్పు? పెళ్ళాం బిడ్డలు కల వాణ్ణి...నాకొచ్చే జీతం ఎంతో తెలుసా?...ఆశ్చర్యపోతావు...ఇదుగో నీ ప్యాస్‌పోర్టు...నాకు ఓ రశీదు ఇవ్వు...మంచిది. ఇహ వెళ్ళు.'

'మానవస్వభావం ఎంతచిత్రమైంది! పాతికరూబుల్సు జేబులో పడే సరికి టక్కుమని ప్యాస్‌పోర్టు వచ్చింది.' అనుకుంటూ లిఖోనిన్ అక్కడ్నుంచి బయటపడ్డాడు.

గదికివెళ్ళి ల్యూబాను కలుసుకున్నాడు. అష్టకష్టాలుపడి ప్యాస్‌పోర్టు సాధించానని చెప్పి ఆమెకిచ్చాడు. కాని తనకోసం ఇంత ఘనవిజయం సాధించుకొచ్చినందుకు ల్యూబా సంతోషపడలేదు, ఆశ్చర్యమూ వెలిబుచ్చ లేదు. పాపం, ఆమెసంతోషంఅల్లా మళ్ళీ ఎలాగైనా లిఖోనిన్ తనకంట పడ్డాడని. అదే ఆ అమాయకురాలి ఆనందం! గబాలున పరుగెత్తుకుంటూ వచ్చి లిఖోనిన్ మెడకు రెండుచేతులూ చుట్టి కౌగలించుకుంది. కాని లిఖో నిన్ అలా చెయ్యొద్దని వారిస్తూ మెల్లగా ఆమెచెవిలో అన్నాడు.

'ల్యూబా! నిజం చెప్పు! ఏమాత్రం భయపడకుండా, దాచకుండా నాతో నిజం చెప్పు...ఇవాళ అన్నాఇంటికి వెడితే అక్కడ వాళ్ళు నాతో చెప్పారు...నీదగ్గర జబ్బు లున్నాయటగా?...ఘోరమైన వ్యాధులు!...

ఎంతవరకు నిజం?...మరేం ఫరవాలేదు...దాచకుండా, స్పష్టంగా చెప్పు ల్యూబా!'

అది వినగానే ల్యూబా మొహం ఎర్రబారిపోయింది. రెండు చేతులతో మొహాన్ని కప్పుకుని సోఫామీద పడి పెద్దగా వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

'ప్రియా! మైడార్లింగ్! దేవుడిమీద ప్రమాణంచేసి చెపుతున్నాను. అలాంటిది ఏమీ లేదు... నేనెప్పుడూ చాలా జాగ్రత్తగా సంచరించేదాన్ని... రోగాలే తగిలివుంటే ఈపాటికి చచ్చివుండేదాన్ని...మిమ్మల్ని ప్రేమిస్తున్నాను...మీతో కాక మరెవరితో చెపుతాను. అంతా అబద్ధం. నాదగ్గర నిజమ్మేలేదు' అంది ఆమె వెక్కి వెక్కి ఏడుస్తూనే. తరువాత ఆమె అతని చేతులు పట్టుకుని తనగుండెమీద పెట్టుకుంది. పసిపిల్లలా ఏడుస్తూ కాళ్ళ మీద పడింది.

వెంటనే లిఖోనిన్ ఆమెచెప్పింది నిజమని నమ్మాడు. 'ఊరుకో ల్యూబా! నీమీద నాకు నమ్మకం లేకపోలేదు. వాళ్ళు చెప్పబట్టి విషయం తెలుసుకుందామని అడిగాను. అంతే! ఇప్పుడు నీవు చెప్పింది మనస్ఫూర్తిగా విశ్వసిస్తున్నాను.అనవసరంగా బాధపడకు...నాకు కావల్సిందల్లాఒక్కటే... మనం ఆ బలహీనతకు తావు ఇవ్వకూడదు...ఇదివరకు జరిగిందేదో జరిగింది. మళ్ళీ అలాంటిది జరక్కుండా ఇద్దరం చూసుకోవాలి.' అన్నాడు లిఖోనిన్ ఆమెతలనిమురుతూ.

'మీ ఇష్టంవచ్చినట్లు కానీయండి' అంటూ ల్యూబా అతని చేతిని, కోటును ముద్దుపెట్టుకుంది.

కాని మళ్ళీ అదేరాత్రి జరగాల్సినదంతా జరిగింది. ఇంతవరకూ లిఖోనిన్ ఏపనిఅయితే చేయకూడదని పదేపదే చెపుతూవచ్చాడో, ఏ బలహీనతకు లొంగకూడదని అనేకసార్లు హెచ్చరిస్తూవచ్చాడో తిరిగీ అదే బలహీనతకు దాసుడయ్యాడు స్త్రీవాంఛకు లొంగిపోయి అదేపని చేయడం ప్రారంభించాడు. మొదటమొదట కొంచెం సిగ్గుపడి తన్నుతాను నిందించుకున్నాడు. కాని క్రమక్రమంగా ఆపనికి అలవాటుపడడంవల్ల సిగ్గు, బిడియం, బాధ, బరువు అన్నీ దిగమింగాడు.

# 14

న్యాయంగా చెప్పాలంటే, ల్యూబాకోసం తను చేయగల పనులన్నీ శక్తివంచన లేకుండా చేశాడు లిఖోనిన్. ఆమె జీవితం ప్రశాంతంగాను, సౌఖ్యవంతంగాను వుండడానికి తగిన ఏర్పాట్లన్నీ చేశాడు. తన లాడ్జీ వసతిగా లేదని గ్రహించాడు. అది ఎక్కడో చాల ఎత్తున అయిదో అంతస్తులో అటకమాదిరి వుంది. చిటారుకొమ్మన వుండే పక్షిగూడు మాదిరి వుంది. పైగా లాడ్జీనిండా విద్యార్థులు, తక్కువ జనం. అహర్నిశలు సందడి. ప్రశాంతత ఏమాత్రం వుండదు. దీనికితోడు అలెగ్జాండ్రా పోటుకూడా ఎక్కువైంది. ల్యూబా వైపు విషపు చూపులు చూస్తూ ఆమెను ద్వేషించడం మొదలెట్టింది. లేనిపోని తప్పులు పట్టి ఆమెను ఎత్తిపొడవసాగింది. ఇలా అస్తమానం అలెగ్జాండ్రా, ఏదేదో గొణుక్కుంటూ, మూలుక్కుంటూ వుంటే లిఖోనిన్ సహించలేకపోయాడు. ఇవన్నీ గమనించి వేరే ఇల్లు తీసుకోవడం మంచిదని నిశ్చయించాడు. వెంటనే వెళ్ళి నగరానికి వెలుపల ఒక చిన్న ఇల్లు అద్దెకు తీసుకున్నాడు. ఒక వంటయిల్లు, రెండు వేరే గదులు; మొత్తం మూడు గదుల యిల్లు. ఫరవాలేదు. వసతిగానే వుంది. పైగా అద్దెకూడా ఏమంత ఎక్కువ కాదు. నెలకు తొమ్మిది రూబుల్సు మాత్రమే. అయితే ఒకటిమాత్రం నిజం. ఇల్లు ఊరిచివర వుండడంవల్ల అస్తమానం పనులమీద అటూఇటూ తిరిగే లిఖోనిన్‌కు కొంచెం ఇబ్బందిగా వుంటుంది. అంతదూరంనుంచి రోజూ అనేకసార్లు నగరంలోకి రావడం పోవడం కష్టమే. అయినప్పటికీ లిఖోనిన్ అందుకు బాధపళ్ళేదు. మంచి ఆరోగ్యంగా ఉన్నాడాయె. వంట్లో కావల్సినంత శక్తి, ఓపిక ఉన్నవాయె. ఇహ నేం? ల్యూబాకోసం తను ఈమాత్రం శ్రమపడడం ఒక లెక్కలోది కాదనుకున్నాడతను. 'మరేం ఫరవాలేదు. నా కాళ్ళల్లో కావల్సినంత సత్తువవుంది.' అనేవాడు అతను తరుచుగా.

ఇంట్లోకి అవసరమైన సామానులుకూడా కొన్నాడు. దాంతో లిఖోనిన్ వద్ద నున్న జూదంలో గెలిచిన సొమ్ము చాలవరకు ఖర్చైపోయింది. తిరిగి సంపాదించాలనే తలంపుతో మళ్ళీ పేకాటకు వెళ్ళి కూచున్నాడు.

కాని ముక్క ఎక్కలేదు, డబ్బుచిక్కలేదు. తన జాతకం మారిందనీ, తన అదృష్టం తిరిగిపోయిందనీ, వెంటనే గ్రహించి తెలివిగా బయటపడ్డాడు.

ఇప్పటికి లిఖోనిన్‌కూ, ల్యూబాకూ మధ్యవున్న నిజబాంధవ్యం ఏమిటో స్నేహితులందరికీ తెలిసిపోయింది. అవును. ఎంతకాలం దాగుతుంది? రహస్యం బయటపడినప్పటికీ లిఖోనిన్ మాత్రం తన మామూలుపాట మానలేదు. స్నేహితులందరితోను ల్యూబా తన సోదరిఅనీ, స్నేహితురాలు అనీ చెప్పడం మానలేదు. వాళ్ళ సమక్షంలో అలాగే నటిస్తూవచ్చాడు. తను ఎంత తెలివిగా ఆడుమాడినా, ఎంత యుక్తిగా ప్రవర్తించినా స్నేహితులు కనిపెట్టారని అతను గ్రహించాడు. అయినప్పటికీ ఆవిధంగా నటించకుండా వుండలేకపోయాడు. తనకు తెలిసినప్పటికీ కొంతకాలం అలవాటుపడిన ప్రవర్తనను మార్చుకోలేకపోయాడు. ల్యూబాతో అతనెప్పుడూ కర్తగాకుండా, కర్మగానే వ్యవహరిస్తూవచ్చాడు. ప్రేమ, ప్రోత్సాహం, ఉత్సుకత, ఊబలాటం అన్నీ ల్యూబావైపునుంచే రావాలి. అన్నిట్లోనూ ప్రతిసారి ఆమెదే పైచేయి. తనకేమీ తెలీనట్లు, ఆమె ప్రోద్బలంవల్లనే తానలా చేస్తూ వున్నట్లు నటించసాగాడు. బహుశా నేరంఅంతా ఆమెమీద వెయ్యడానికి కాబోలు అలాచేయసాగాడు. (ప్యాస్‌పోర్టులో ఆమె అసలుపేరు ఇరినా అనివున్నా అతను ఆవిషయం మరిచిపోయి, ల్యూబాఅనే పిలుస్తూవచ్చాడు.)

విచక్షణలేకుండా కొన్నివందలమంది పురుషులకు తనశరీరాన్ని అప్పగించిన ల్యూబా ఈనాడు లిఖోనిన్‌కు తనశరీరం, ప్రేమ, హృదయం, ఆత్మ, ఆలోచన అన్నీ అప్పగించి ఊరుకుంది. అతన్ని వదిలిపెట్టి ఒక్కక్షణం కూడా వుండలేకపోతోంది. అతన్ని చూడకపోతే కళ్ళు పోయినట్లుంటున్నాయి ఆమెకు. ఇంకేంచెప్పను? అతనికి పూర్తిగా దాసురాలై, భక్తురాలై సేవించడం మొదలెట్టింది.

చిన్న సెలయేరులా ప్రారంభమై, చివరకు మహానదియై, ఒడ్డులను ఒరుసుకుని ప్రవహిస్తోన్న ఆమె ప్రేమప్రవాహంలో లిఖోనిన్ నిలబడలేకపోతున్నాడు. ఆ వేగానికీ, వేడికి తట్టుకోలేకపోతున్నాడు. పైగా, ఈ బరువు ఎప్పుడు దించుకుందామా అని ఆలోచిస్తున్నాడు.

రానురాను లిఖోనిన్ స్నేహితులతోకూడా ఆమెకు అతిచనువు ఏర్పడింది. వాళ్ళు ఏంచేసినా, ఏమన్నా ఊరుకుంటుంది. జార్జియన్ కుర్రాడు

నిజేరా అస్తమానం వులాసాగా కబుర్లు చెప్తూ ఆమెకు ఆనందం కలిగిస్తున్నాడు. సాలోవీవ్ కూడా హుషారుగా, ఉత్సాహంగా వుంటున్నందున అతనంటే ఆమెకు ఇష్టం, ఆసక్తి ఏర్పడినాయి. నిమకోవస్కీ మాత్రం తనంటే ఆమెకు కొంచెం భయం కలిగేలా ప్రవర్తిస్తున్నాడు. మొత్తానికి అందరితోనూ చనువుగా వున్నప్పటికీ లిఖోనిన్ మాత్రం ఆమెకు దేవుడు. యజమాని. పూజనీయుడు! అతనొక్కడూ తన సొంతసొత్తు అయినట్లు భావించుకుని, తనకు కావల్సిన సర్వసుఖాలు అనుభవిస్తోంది.

ఇంటికివచ్చే విద్యార్థులను చూచి అతను బాధపడసాగాడు. వాళ్ళ చూపుల్లో, చర్యల్లో, మాటల్లో, చేతల్లో అన్నిట్లో అతనికి అనుమానం కలగడం, దాంతో అవమానం పొందుతున్నట్లు బాధపడడం జరుగుతూ వచ్చింది. వాళ్ళంతా ఒక స్నేహితుడి భార్యగా, లేక ఒక సోదరిని చూచినట్లు ఆమెను చూడ్డంలేదు. గౌరవం, మర్యాద చూపించడంలేదు. 'నీవు ఒక పతితవు. ఇంతకుముందు అనేకమందిసొత్తువు. ఇప్పుడొక యువకుడి సరదా తీర్చడంకోసం ఇక్కడికి వచ్చావు. అంతమాత్రాన నీవొక పవిత్రమైన స్త్రీవి, పతివ్రతవు అయిపోవు. నీ కళంకం నీవద్దనే కలకాలం నిలుస్తుంది' అని వారంతా తమమనసుల్లో అనుకుంటున్నట్లుగా తోచేది లిఖోనిన్కు. తన మిత్రులంతా తనను కూడా ల్యూబాస్థాయిలోకే దించుతున్నట్లు అనిపించేది అతనికి. దీంతో ల్యూబామీద ద్వేషం, శత్రుభావం ఆరంభమైనాయి. గుండెల్లో చెప్పలేనంత మంట బయలుదేరింది. ఆమెపీడ ఎప్పుడు వదిలించుకుంటానా, ఎలా వదిలించుకుంటానా అని మార్గాలు ఆలోచించసాగాడు. ఆతరువాత తానిలా నీచమైన తలంపులతో వున్నందుకు సిగ్గుపడేవాడు. తన్నుతాను నిందించుకుని బాధపడేవాడు.

ఒక్కోసారి అతని మనసులో ఇలాంటి ఆలోచనలు వచ్చేవి.

'నేను నైతికంగా, మానసికంగా రెండువిధాలా ఘోరమైనపతనాన్ని పొందుతున్నాను. సంస్కృతి, నాగరికత కల పురుషుడు అవిద్యతో, అజ్ఞానంలో జీవిస్తోన్న ఒక స్త్రీని బాగుపరచడానికి ప్రయత్నిస్తే విఫలుడై తీరతాడు. పైగా అతనుకూడా తన పూర్వపు ఔన్నత్యాన్ని కోల్పోయి, ఆమె స్థాయిలోకి దిగిపోతాడు. ఈవిషయం నేను పుస్తకాలలో చదివాను.

అనేకమంది పెద్దలు చెప్పగా విన్నాను. ఇది యదార్థం. ఇప్పుడు నేనూ అలాగే భ్రష్టుడనయ్యాను.'

ఇలాంటి ఆలోచనలతో రెండు వారాలైనా గడవకముందే లిఖోనిన్‌లో ల్యూబాను ఉద్ధరించే తలంపు సంపూర్ణంగా నశించిపోయింది. అతను ఆమెను తరుచుగా తిట్టడం, ఆ తరువాత జాలిపడి ఓదార్చడం జరుగుతూ వచ్చింది.

ల్యూబా యిప్పుడు వెనుకటిలా లేదు. తన జీవితంలో ఎన్నడూ ఎరగని ప్రశాంతమైన వాతావరణం ఈనాడు ఆమెకు లభించింది. ఒక యువకుని అండ, ఆశ్రయం దొరికాయి. తనకు కావల్సిన సౌఖ్యం అతని నుండి పుష్కలంగా లభిస్తోంది. నిజంగా ఇక ఆమె జీవితంలో పర్వదినాలు. వెనుకటి విచారమంతా కరిగిపోయింది. సంతోషంగా రోజులు గడుస్తున్నాయి. ఉల్లాసంతో, ఉత్సాహంగా వుంటోంది. సంతోషం సగంబలం అన్నట్లు ఎప్పుడైతే దిగులు, చింతా లేకపోయిందో, అప్పుడే ఆమె పూర్తిగా మారిపోయింది. ముఖంలోకి తేజస్సువచ్చింది. కళ్లు ప్రకాశవంతంగావున్నాయి. శరీరం పుష్టిగా ఎదిగింది. పెదవులు ఎర్రబడ్డాయి. వంట్లోకి కొత్తరక్తం వచ్చింది. అంతకుముందు సానిగావున్నప్పుడు ఆమెలో కనపడే అనారోగ్య లక్షణాలన్నీ ఈనాడు మటుమాయమైపోయాయి. తొలకరించినప్పుడు చిగురించే లేతతీగలాగ, అప్పుడప్పుడే వికసిస్తోన్న గులాబీపూవులా తయారైంది ల్యూబా. దినదినప్రవర్ధమానమవుతోన్న ఆ యువతి సౌందర్యాన్ని తిలకిస్తూ వుంటే, విద్యార్థులకు పిచ్చెక్కినట్లు వుండేది.

క్రమక్రమంగా ల్యూబా గృహకృత్యాల్లోకూడా ఆరితేరింది. చక్కగా వంటచేసేది. క్యాబేజిపులుసు మంచి రుచికరంగా తయారుచేసేది. మాంసంకూడా మజాగా వండటం నేర్చుకుంది. లిఖోనిన్ ఇచ్చిన తర్ఫీదు వృథాకానీయకుండా మాస్కోలోమాదిరి 'టీ' తయారుచేయడం శ్రద్ధగా నేర్చుకుంది. ఇంట్లో వస్తువులన్నీ జాగ్రత్తగా సర్దుకుని, అందంగా అమర్చిపెట్టుకునేది, గుల్లు పదేపదే నీళ్ళతో కడిగి శుభ్రపరుస్తూ వుండేది. కాని పాపం ఆమెలో ఇంకా అజ్ఞానం పూర్తిగాపోలేదు. అదే సుమరి. ఎవరైనా తమకున్న స్థాయినిబట్టి కొంతవరకే అభివృద్ధి చెందగలరుగాని, అన్నిటో

పూర్తిగా ఆరితేరడం సాధ్యం ఎలాఅవుతుంది. ఇల్లంతా తడిలో నానుతూ వుంటంవల్ల అక్కడక్కడ చెదలుపట్టేది.

ఒకసారి వార్తాపత్రికలో ప్రకటన చూచి లిఖోనిన్ ఆమెకు ఒక కుట్టుమిషను కొనుక్కొచ్చాడు. దాంతో మేజోళ్ళు కుట్టవచ్చు. ఈ కుట్టుపని నేర్చుకోవడం బ్రహ్మవిద్యకాదు. లిఖోనిన్, సొలోవీవ్, నిజేరా, వీరంతా ఆ మిషన్‌తో ఎలా కుట్టాల్సిందీ అతిసులభంగానే నేర్చుకున్నారు. ల్యూబాకుమాత్రం చాతకాలేదు. ఆమె ఎంత ప్రయత్నించినా ఏదో పొరపాటు జరుగుతూనే వుండేది. పాపం, చాలకొంక దారం చిక్కుపడేది. వెంటనే ఎవరినో ఒకరిని సహాయంచేయమని పిలిచేది. కాని మరోపనిలో ల్యూబా ఆరితేరింది. కాగితపుపూలు తయారుచేయడం అతితేలిగ్గా నేర్చుకుంది. ఎన్నిపూలుఅయినా ఎంతో అందంగా ఇట్టే తయారుచేసేది. ఈపని నేర్చుకోవడానికి ఆమె అంతగా శ్రమపడలేదుకూడా. ఒకటీచరుదగ్గర ఒకటిరెండు పాఠాలు చెప్పించుకుంది. తక్కినదంతా పుస్తకం దగ్గరపెట్టుకుని 'నమూనా'లు చూస్తూ నేర్చుకుంది. ఒకనెల తిరగకముందే ఆమెపనికి మెచ్చుకుని ఒక అంగడివాడు పూలుకొనడం మొదలెట్టాడు. తీరుబడిగా వున్నప్పుడే ఆమె ఈపని చేసేది. అంచాత పెద్దసంపాదన కాకుగాని, మొత్తంమీద వారానికి ఒకటిరెండు రూబుల్సు కాగితపుపూలద్వారా సంపాయిస్తూ వచ్చింది. ఇదే ఆమె ఒక పెద్ద ఘనకార్యంలా భావించి గర్వపడేది. సంతోషించేది ఈవిధంగా మొదటిసారి వచ్చిన సొమ్ముతో యాభైకోపెక్కులు పెట్టి లిఖోనిన్‌కు ఒక 'సిగరెట్ హోల్డర్' కొని తెచ్చింది.

నిజానికి లిఖోనిన్‌కుకూడా ఇప్పుడు ఎంతో ప్రశాంతంగా, సుఖంగా వుంది జీవితం. ఇల్లు, కుటుంబాన్ని, బంధువులను వదిలిపెట్టి, అనేకసంవత్సరాలనుంచి ఏకాంతంగా, విసుగ్గా విద్యార్థిజీవితాన్ని గడుపుతున్నాడు. అలాంటివాడు అకస్మాత్తుగా ఇలాంటి గృహవాతావరణంలో పడేసరికి అతనికి ఎంతో ప్రశాంతత ఏర్పడింది. కాదూ మరి! తను ఒంటరిగా వున్నప్పుడు ఎలా గడిపేవాడో తలుచుకుంటే విచారంవేస్తుంది. వేళకు తిండలేదు. స్నేహితులతో కలిసి ఎక్కడో తిరగడం, ఏవేళకో గదికి చేరడం. ఒక్కొక్కసారి నిద్రకూడా వుండేదికాదు. అనాచారంతో, అనారోగ్యంతో బ్రతుకీడ్చాడు. కృత్రిమంగా, కుటిలంగా జీవించాడు. మరి ఇప్పుడలాకాదు.

తన కొక యిల్లు, ఇంట్లో ఒక స్త్రీ. ఆమెచేతిమీదుగా చేసి పెట్టిన భోజనం జీవితానికి ఒక బాధ్యత, ఒకపద్ధతి ఏర్పడ్డాయి. మిత్రులంతా తన ఇంట్లో చేరతారు. వారితో ఖుషాసాగా, దిలాసాగా కబుర్లు చెప్పకుంటూ హాయిగా కాలక్షేపం చేస్తున్నాడు.

ల్యూబాకు చదువుచెప్పేవిషయంలో వ్యవహారం కొంత వెనకపడిం దనే చెప్పాలి. . ఆమెకు చదువుచెప్పడానికి పూనుకున్న ఈ ఉపాధ్యాయు లంతా మిత్రులేగా! ఒక్కోసారి అంతాకలిసి, మరొకసారి వేరువేరుగానూ దెబ్బలాడుకునేవారు. చదువుచెప్పేవిషయంలో వీరికి విభిన్నమైన అభిప్రా యాలున్నాయి. ఫలానావిధంగా బోధిస్తే చదువువస్తుందని ఒకరు, కాదు ఈవిధంగా చెప్పితే సులభంగా అబ్బుతుందని మరొకరు; ఇలా ఎవరి అభి ప్రాయాలు వారు చెపుకూ వాదించుకోసాగారు. చివరకు అంతాకలిసి అసలువిషయం మన్నాచుట్టారు. వీరు మాట్లాడే పెద్దపెద్ద విషయాలు, చెప్పే అద్భుతమైన శాస్త్రాల్లోని సంగతులు ల్యూబా అర్థంచేసుకోలేక మొహం తేలవేసేది.

అసలే ఆమె అమాయకురాలు. పల్లెటూరిపిల్ల. పైగా ఇంతకాలం అవిద్యతో, అజ్ఞానంతో, అనాగరక జీవితం గడిపిన మనిషి. ఇహ ఒక్క సారిగా చదువు, విజ్ఞానం అంతా రోట్లోవేసి తొక్కమంటే ఎలా సాధ్య మవుతుంది? లిఖోనిన్ ఆమెకు లెక్కలు చెప్పేవాడు. ఆమె గుణించేపద్ధతి చూస్తే అతనికి చిరాకుపుట్టేది. పల్లెటూరిబళ్ళో ఒకటోతరగతి పిల్లలయినా ఈమెకంటె మెరుగని నించేవాడు. పన్నెండు లెక్కపెట్టమంటే ఆమె ఎలా లెక్కించేదనుకున్నారు! ముందు రెండుమూళ్ళు తీసుకునేది. మళ్ళీ రెండుమూళ్ళు తీసుకునేది. తరువాత మొత్తంకలుపుకొని పన్నెండని చెప్పేది. అలాగే పందొమ్మిది అంటే, మూడుఅయిదులు, రెండు రెండ్లు, ఇలా ఆమె ఎప్పుడూ ఒకట్లు, రెండ్లూ, మూళ్ళూ, అయిదులు ఉపయోగించి లెక్క వేసేది. ఈవిధంగా వందవరకూ చెప్పగలిగేది. ఆతరువాత ఆమెవల్లంకాక పోయేది. లిఖోనిన్ ఆమెను పదుల్లో లెక్కపెట్టేలా చేయాలని విశ్వప్రయ త్నం చేశాడు. కాని ఎంత బోధించినా ఆమెబుర్రకు ఎక్కలేదు. అతనికి వెర్రెత్తిపోయి పెద్దగా అరిచేవాడు. కేకలుపెట్టేవాడు. జుట్టుపీక్కునే వాడు. ఆమె అతనివంక దీనంగా చూచేది. ఎదురు మాట్లాడేదికాదు. ఏక్క

మొహం పెట్టి, తప్పు చేసినదానికిమల్లే భయంతో బెదిరి బెదిరి అతని మొహంలోకి చూచేది. తరువాత కళ్ళనీళ్ళు కార్చేది. అయితే కూడికలు, హెచ్చవేతలు అలాగే తంటాలుపడి చేసేది. తీసివేతలు, భాగారాలు ఆమెకు చచ్చినా అర్థమయ్యేవి కావు. ఇహ భూగోళం విషయం: ఆదికూడా లిఖోనినే చెప్పేవాడు. భూమి గుండ్రంగా వుందనీ, తనచుట్టూ తను తిరుగుతోందనీ చెపితే ఆమె నమ్మలేకపోయేది. పైగా పగలబడి నవ్వేది. 'మ్యాపు' చూపించినా ఆమెకు తెలిసేది కాదు. 'ఏమిటీ అర్థంలేని పిచ్చిగీతలు? ఏమిటీ రంగులు?' అన్నట్లు వాటివంక విచిత్రంగా చూసేది. రంగునుబట్టి ఫలానా దేశమని ఆమె చెప్పలేకపోయేది. ఆకారాన్నిబట్టి కొంచెం సులువుగా గుర్తించగలిగేది. 'ఇటలీ ఎక్కడుందో చూపించు' అని అడిగితే ఆమె 'ఇదుగో బూట్' అని చెప్పేది. అలాగే హిస్టరీకూడా ఆమెకు రాలేదు. లిఖోనిన్ చరిత్రలో సంగతులు అనేకం చెప్పాడు. అనేక యుద్ధాల పేర్లు, ప్రసిద్ధికెక్కిన వీరుల పేర్లు, తేదీలు......ఇన్నీ చెప్పేసరికి ఆమె హడలిపోయేది. అదేమంటే గుడ్లనీళ్ళు కుక్కుకునేది.

నిజేరామాత్రం, ఆమెకు ఉపాధ్యాయుడుగావుండి ఎంతో ఆనందం పొందేవాడు. అతని 'సితారు' నీళ్ళ భోజనశాలలో గోడకు వేలాడదీయబడివుండేది. నిజేరా రాగానే (అతను ఇక్కడికి వారానికి మూడు, నాలుగుసార్లు, సాయంత్రంపూట వచ్చేవాడు) ఆమె ఉల్లాసంగా, గోడకువున్న సితారుతీసి, రుమాలుతో దుమ్ము, ధూళి తుడిచి అతనిచేతికి అందించేది. అతనుకాస్త గొంతూ అదీ సవరించుకుని ధీమాగా కుర్చీలోకూచుని వాయించడం మొదలెట్టేవాడు. కళ్ళుమూసుకుని, తలతిప్పుతూ, అభినయిస్తూ అద్భుతమైన ప్రేమగీతాలు పాడేవాడు. అతనికి అనేక మధురమైన ప్రేమగీతాలు, హుషారిచ్చే లల్లాయి పదాలు, పూర్వకాలపు జానపదగీతాలు వచ్చు. ఇవన్నీ శ్రావ్యంగా పాడేవాడు. చిందులు తొక్కేవాడు. తరువాత తన ప్రతిభ చూడమన్నట్లు ల్యూబా కళ్ళల్లోకి చిలిపిగా చూచేవాడు.

ఇతని సమక్షంలో ల్యూబా ఎంతో సంతోషంగా వుండేది. అతను ఆడుతూ, పాడుతూ పరవశుడై, తన్మయత్వం చెందుతూవుంటే, తనుకూడా అతనితోపాటు ఆ సంగీతంలో లీనమయ్యేది. తమాషాగావుండే అతని అభినయం చూచి కడుపుబ్బ నవ్వేది. ఆమెకళ్ళనుండి ఆనందాశ్రువులు రాలేవి.

ఒక్కొక్కసారి ఇద్దరూకలిసి పాడేవారు. ల్యూబా కంఠస్వరం మంచిదే. పూర్వం తాగుడు మొదలైన దురభ్యాసాలతో గడిపినా ఆమెకంఠం చెడి పోలేదు. మెల్లగా, చల్లగా, హాయిగా, తీయగా పాడేది. అలా ఇద్దరూ సంగీతంలో లీనమై ఊగుతూ, తేలుతూ గంటలకొద్దీ గడిపేవారు.

ఒకొక్కసారి నిజేరా పాటపాడుతూ శృంగార చేష్టలు చేసేవాడు. ఆమెవైపు కొంటెగా, చిలిపిగా చూచేవాడు. అనవసరంగా వళ్ళూ, వళ్ళూ తాకించేవాడు: ఆమెను కౌగలించుకోబొయ్యేవాడు.

'ల్యూబా! స్వర్గంలో పుష్పోద్యానవనం వుంది చూచావూ? అందులో నీవు గులాబీపువ్వువు! నీ పెదవుల్లో పాలు, తేనె వున్నాయి ల్యూబా! నీ తీయని గాలి సోకితే దేవతలు మూర్ఛపోతారు. నీ సౌందర్యం, నీ శరీరసౌరభం, ప్రకృతిలో మరిదేనికీలేవు. నీ పెదవుల్లోని అమృతాన్ని గ్రోలనివ్వు. స్వర్గసామ్రాజ్యాన్ని, నిర్వాణసిద్ధిని పొందనివ్వు' అంటూ ఆమెచెవిలో రహస్యంగా ప్రలాపాలు పలికేవాడు.

అతని ప్రేమప్రలాపాలు, చిలిపిచేష్టలు చూచి ల్యూబా నవ్వేది. ఒకొక్కసారి అతనిచేతులమీద కొడుతూ తిట్టేది. 'లిఖోనిన్‌తో చెప్పి నీపని పట్టిస్తానుండు. అమ్మదొంగా!' అంటూ బెదిరించేది.

"మరేం ఫరవాలేదు. లిఖోనిన్ నా సోదరుడేగదూ! అయినా అతనికి ప్రేమసంగతి తెలీదు ల్యూబా! మా జార్జియన్ కుర్రాళ్ళే ప్రేమకు పెట్టిన పేరు. అసలైన సిసలైన ప్రేమ ఎలావుంటుందో నీవు ఎరగవు. చూపిస్తానుండు." అంటూ నిజేరా ఆమెను చేరబోయ్యేవాడు. ఇదంతా పరిహాసం అనుకునేది ఆమె. పసిపిల్లలా భయపడుతూ, చిక్కకుండా గెంతుతూ, అవతలగదిలోకి పరుగెత్తేది.

ఇకపోతే సొలోవివ్ వ్యవహారం. ఆమెకు వ్రాయడం, చదవడం నేర్పేవంతు ఇతనిది. ఈ విషయంలో అతను, ప్రత్యేకమైన శ్రద్ధ, పట్టుదల చూపించాడనే చెప్పాలి. సొలోవివ్ గుండె గట్టిది. ఎంతో సహనం, ఓర్పు వహించి ఆమెకు బోధించేవాడు. ఎక్కువమంది పిల్లలాగే ఈమెకూడా చదవడంకంటె, ముందు వ్రాయడం నేర్చుకుంది. కాగితంమీదికి వంగికూచుని పళ్ళుబిగించి బలవంతాన వ్రాయడానికి ప్రయత్నించేది. మధ్య మధ్య నాలిక బయటికిపెట్టేది. ఎలాగయితేనేం; వ్రాయడంలో కొంచెం కొంచెం దోవలో

పడింది. చదివేవిషయంలో ఈమెకు చాలా కష్టంగావుండేది. ప్రతిఅక్షరాన్ని స్మృతిలో గుర్తుపెట్టుకుంటూనే తడబడేది. ఇలాఈమెపడే తిప్పలన్నీ, జాగ్రత్తగా పరిశీలిస్తూ, ఓర్పుతో బోధిస్తూ ఆమెకృషిలో సహాయంచేస్తూ వచ్చాడు సొలోవీవ్. ఎన్నెన్నో పుస్తకాల్లో కథలుచదివి వినిపించేవాడు. వాటికి అర్థంచెప్పేవాడు. ఇవన్నీ ఆమె అతిశ్రద్ధగావింటూ, ఆ యా సందర్భాలనుబట్టి ఏడుస్తూ నవ్వుతూ వుండేది. అతని తెలివికి, విజ్ఞానానికీ ఆశ్చర్యపోయేది ల్యూబా. ఈ నెలాపదిహేనురోజులలో అతను ఆమెకు ఎంతో చనువుఅయ్యాడు. అయినా ఆమె అతనియందు భయభక్తులు చూపిస్తూ వచ్చింది. అతనికికూడా ఆ పిల్లమీద అవ్యాజమైన ప్రేమ, కరుణ, జాలి కలిగాయి. ఉదారబుద్ధి, దయ కల ఒక పెద్దఏనుగు, దిక్కులేక, నిస్సహాయురాలై పడివున్న ఒకచిన్న కోడిపిల్లపట్ల ఎలాంటి ప్రేమ జాలి చూపిస్తుందో అలా చూపించసాగాడు సొలోవీవ్.

## 15

మొత్తంమీద లిఖోనిన్‌తోపాటు అతనిమిత్రులు నిజేరా, సొలోవీవ్ కూడా పట్టుదలతో ల్యూబాకు చదువుచెపుతూవచ్చారు. ఆమెబుద్ధి వికసించడానికి తాము చేయగలిగిన కృషిఅంతా చేస్తున్నారు.

ఇక పోతే మరోమిత్రుడు సిమనోవస్కీ వ్యవహారమే ఏమీ బాగా లేదు. ఇతను చదువుచెప్పేతీరు ల్యూబాకు అతి బాధాకరంగా పరిణమించింది. ఇతను ప్రతిరోజూ వేళతప్పకుండా వచ్చేవాడు. జీతం తీసుకుని ఇంటికివచ్చి పిల్లలకు చదువుచెప్పే ట్యూటర్‌లా కష్టపడుతున్నాడు. ఒక రోజుకూడా ఊరుపోకుండా సక్రమంగా రావడం, తీరుబడిగా ఆమెకు చదువు చెప్పడం, చేస్తూవుండేవాడు.

విద్యబోధించేవిషయంలో ఇతనికి కొన్ని నిశ్చితమైన అభిప్రాయాలుండేవి. పైగా ఇతనికంఠస్వరం అతికర్కశంగా వుండేది. పాపం, ఆమె ఇతన్ని చూచి హడలిపోయేది. అంచేత చదవేస్తే ఉన్నమతికూడాపోయినట్లు, ఇతని బోధనలవల్ల ఆమె ఏమీ నేర్చుకోలేకపోగా, అంతకుముందున్న గ్రహణశక్తి

కూడా కోల్పోసాగింది. ఆమె మనస్సు వికారపడేది. అవును, సిమనోవస్కీ అలాంటివాడే. ఇతను తరుచు స్కూలుమీటింగులలో పాల్గొనేవాడు. బ్రహ్మాండమైన ఉపన్యాసాలిచ్చి, లేతవయస్సులో వున్న విద్యార్థుల మనస్సును చెదరగొట్టేవాడు. స్కూల్లో జరిగే సభలు, సమావేశాలు అన్నిట్లో పాల్గొని చాలా చురుగ్గా పనిచేసేవాడు. వాల్ పోస్టర్లు అచ్చువేయించడం మొదలు పుస్తకాలు, పత్రికలు, ఉపన్యాసాలు అచ్చుగుద్దించడంవరకూ అన్ని పనులూ స్వయంగా చేసేవాడు. అనేకసార్లు స్కూలు పెద్దగాకూడా ఎన్నిక అయినాడు. విద్యార్థినిధి వసూలుచేయడంలో ప్రముఖపాత్ర నిర్వహించాడు. ఇలాంటి ఘనుడికి ల్యూబాకు చదువుచెప్పడంలో కష్టమేముంది? ఆమెకు ఏపద్ధతిలో విద్యాబోధ చెయ్యాలో ముందే ఒకనిర్ణయం చేసుకుని, ఒక గిరి గీచుకుని ఆప్రకారం ప్రారంభించాడు. ముందు భౌతికశాస్త్రం, రసాయనికశాస్త్రం బోధించడం మొదలెట్టాడు.

'ఏమీ తెలీని అమాయకురాలు. చిన్నచిన్న ప్రయోగాలు చేసి చూపిస్తే, ఆమె ఏదో తమాషాఅనుకుని కుతూహలంగా చూస్తుంది. తేలిగ్గా అర్థంచేసుకుంటుంది ప్రకృతిలోగల పరమరహస్యాలన్నీ ఆమెకు ఈవిధంగా తేటతెల్లం చేస్తాను. స్వచ్ఛమైన శాస్త్రాన్ని, విజ్ఞానాన్ని ఆమెకు ప్రసాదిస్తాను' అనుకున్నాడు లోపల సిమనోవస్కీ. అలా అనుకుని అందుకోవల్సిన పరికరాలన్నీ ఎంతో అవస్థపడి సంపాయించుకునివచ్చాడు. అక్కడే గదిలో కూచుని ఆమెసమక్షంలో ప్రయోగాలు చేస్తూవచ్చాడు. ఒకనాడు చిన్న నాటుబాంబు ఒకటి తయారుచేసి గదిలోనే పేల్చాడు. ఆమె భయపడి పరుగెత్తింది.

ఇలా అతని ప్రయోగాలు, గంభీరమైన ఉపన్యాసాలు ల్యూబాకు బుర్రకెక్కక చిరాకుపడుతోంటే, ఇంకొకనాడు మరొకసంఘటన జరిగింది. సిమనోవస్కీ పాఠంచెపుతూ మధ్యలో దేవుణ్ణిగురించి ఉపన్యాసం ప్రారంభించాడు. దేవుడు లేడనీ, నిస్సందేహంగా లేడనీ, కావాలంటే అయిదునిముషాల్లో ఆవిషయం రుజువుచేస్తానని సిమనోవస్కీ అన్నాడు. యిది వినేసరికి ల్యూబా కూచున్నచోటునుంచి ఉలిక్కిపడి లేచింది. తను పడుపుకత్తెగా, పతితురాలుగా జీవించినప్పటికీ దేవుడు లేడనేమాట నమ్మనని ఖచ్చితంగా చెప్పింది. దేవుడిమీద తనకు పూర్తివిశ్వాసం వుందనీ, తన సమక్షంలో భగ

వంతుణ్ణి నిందించడం, పరాభవించడం సహించలేనని చెప్పింది. ఇలాంటి పిచ్చి మాటలు యిహముందెప్పుడూ మాట్లాడవద్దనీ, వాసిలీవాసిలిచ్‌తో (లిఖోనిన్‌ను ఆమె అలాపిలుస్తుంది) ఫిర్యాదు చేస్తాననీ తీవ్రంగా హెచ్చరించింది.

'నేనాయనతో చెపుతాను. మీరు నాకుపాఠాలూ పాడూ చెప్పేది లేకపోగా, అనవసరమైన పిచ్చివాగుడు వాగుతున్నారు. మీరు చెప్పేవిషయాలు నాకు ఏమాత్రం బోధపడడంలేదు. పైగా ఇక్కడున్నంత సేపూ నా మోకాలుమీద చెయ్యివేసి కూచుంటారు. ఇదేమీ బాగాలేదు. మీ నడవడి నాకేమాత్రం నచ్చలేదు' అంటూ ఆమె అతన్ని తీవ్రంగా హెచ్చరించి, చీదరించుకుంటూ అవతలికి వెళ్ళిపోయింది.

సిమనోవస్కీ అంటే ఆడాళ్ళు ఇష్టపడరని చెప్పడానికి వీల్లేదు. అతనికి తనుచేసే ప్రతిపనిమీదా అచంచలమైన విశ్వాసం వుంది. అమోఘమైన వాగ్ధాటివుంది. వీటివల్ల అమాయకులైన యువతుల హృదయాలను ఆకర్షిస్తాడు. ముఖ్యంగా కల్లా, కపటం ఎరుగని అమ్మాయిలు ఇతనంటే ఇష్టపడతారు. ఆడవాళ్ళను సులభంగా వలలోవేసుకునే శక్తి, సామర్థ్యాలు తన దగ్గర వున్నాయని గర్వపడుతుంటాడు. అలాగే ల్యూబాకూడా తనను మెచ్చుకుని, ప్రేమిస్తుందని భావించాడు. తీరా ల్యూబా నిరాదరణ చూపేసరికి ఇతనిమనస్సు కొంచెం దెబ్బతిన్నది యిన్నాళ్ళూ స్వేచ్ఛగా పడుపువృత్తి సాగించి ఒకేరాత్రి అనేకమంది పురుషులకు శరీరం అప్పగించి ఊరుకున్న ల్యూబా, ఈనాడు తనకు శ్రీరంగనీతులు చెప్పడం ఏమిటి? పరపురుషుణ్ణి అంటని మహా పతివ్రతలా, నంగనాచిలా నటించడం ఏమిటి? తను ఒక్క లిఖోనిన్‌నుమాత్రమే భర్తగా, దైవంగా భావించడం ఏమిటి? ఇదంతా బూటకం. యిందులో అర్థంలేదు. తనొక ఇల్లాలుగా, పత్తిత్తుగా నాటకం ఆడుతోంది. ఈవిడ అంతు ఏదో తేల్చుకుంటాను. ఎలాఉంటుందో చూస్తాను. ఈమె పాతివ్రత్యంసంగతేమిటో పట్టిచూస్తాను'. అని నిశ్చయించుకున్నాడు సిమనోవస్కీ. అవును, ఒక వేశ్య, ఒక నీచురాలు తనను నిరాదరణ చేసిందని అతనికి ఆవేశం, ఆగ్రహం వచ్చాయి పట్టుదలగా ఆమెను పరాభవించడానికి పూనుకున్నాడు. రోజురోజుకు ఇంకా అసహ్యంగా, అసభ్యంగా ప్రవర్తించడం మొదలెట్టాడు. ఆమె యితని పోటును తట్టుకోలేక చివరకు ఒక నాడు లిఖోనిన్‌తో చెప్పింది.

'ఏమండీ, మీరు స్నేహితుడున్నాడు చూచారా? ఆయనగారు చెప్పే చదువు ఏమయినాగాని, నాకు తల తిరిగిపోతోంది. ఒక్కమాటకూడా అర్థంకావడంలేదు. యిక్కడనుంచీ ఆయనదగ్గర నాకు పాఠాలు అక్కర్లేదు' అంది ల్యూబా, గద్గదస్వరంతో.

వెంటనే లిఖోనిన్ సిమనోవస్కీని పిలిచి జరిగిన సంగతేమిటని అడిగాడు. సిమనోవస్కీ చాలా ప్రశాంతంగా ఇలా జవాబుచెప్పాడు.

'అబ్బాయ్! ఒకమాట చెపుతాను వింటావ్? నేను ల్యూబాకు చదువుచెప్పేపద్ధతి నీకూ, ఆమెకూకూడా నచ్చకపోతే ఆమాట చెప్పేయండి. వెంటనే మానేస్తాను. ఆమెకు సరియైన శిక్షణ యిచ్చి విద్య బోధించడానికి తంటాలుపడ్డాను. నేచెప్పేది అర్థంకాకపోతే, ముందు కొంత కాలంవరకూ కష్టం చేయిస్తాను. తరువాత క్రమక్రమంగా దారిలో పడుతుంది! చదువంటే మాటలనుకున్నావటోయ్! మనం లెక్కలు, ఆల్జీబ్రా నేర్చుకునేటప్పుడు ఎంత అవస్థపడ్డాం? గ్రామరు అర్థంకాక ఎంత తలపగుల గొట్టుకునేవాళ్ళమో నీకు తెలీదూ?'

ఆరోజుకు అలావెళ్ళిపోయింది. ఆమరుసటిరోజే సిమనోవస్కీ మామూలుగా ల్యూబాకు దగ్గరగాకూచుని పాఠం ప్రారంభించాడు. రొమ్మును రొమ్ముతో తాకేలా ఆమెమీదికి వంగి, ఆ యువతి శరీరంనుండి వచ్చే పరిమళాన్ని ఆస్వాదిస్తూ ఇలాఅన్నాడు.

'ఒక త్రికోణంగియ్యి—అవును. అంతే. ఈమొదటికోణానికి ప్రేమ అని పేరుపెడతాను. తక్కిన రెండుకోణాలూ, ఒకటి స్త్రీ, మరొకటి పురుషుడు. అనగా అర్థంఏమిటంటే, స్త్రీ పురుషుల ప్రేమ. ఎలావుంది? అద్భుతంగా లేదూ?'...ఒక క్షణం ఆగి, మళ్ళీ ఇలాచెప్పడం మొదలెట్టాడు.

'చూడు ల్యూబా! తినడం, తాగడం, నిద్రపోవడం మానవులకు ఇది ఎంత అవసరమో ప్రేమకూడా అంతేఅవసరం. ఇదిలేకుండా మనం బ్రతగ్గలమా? అలాగే ప్రేమలేకపోయినా బ్రతకలేం' అంటూ అతను ఆమె తొడమీద మెల్లగా గిల్లాడు. తరువాత తనకాలుతీసి ఆమెతొడమీదవేశాడు. ల్యూబా నిర్ఘాంతపోయి చూచింది. ఆమెకు వణుకుపుట్టింది. కాని ఏమైనా అంటే బాధపడతాడని, గొడవ అవుతుందనీ దిగమింగి ఊరుకుంది. మెల్లగా తనకాలు అవతలికి లాక్కుంది. మళ్ళీ అతను ప్రారంభించాడు—

'చూడు ల్యూబా! మాటవరుసకు నిన్ను నీ సోదరిగాని, తల్లిగాని, భర్తగాని యింట్లో అవమానపర్చి బాధిస్తారనుకో. నీకేమో ఆకలివేస్తూవుంటుంది. వాళ్ళతో కలిసి యింట్లో భోంచెయ్యడానికి మనస్కరించదు. అప్పుడేంచేస్తావు చెప్పు? గబగబ హోటలుకుపోయి, అక్కడ కమ్మగా భోంచేసి నీ ఆకలి చల్లార్చుకుంటావు కదూ? అలాగే ప్రేమకూడా. సరిగ్గా అంతే. ఏమీ తేడాలేదు. ఆకలికిమల్లేనే ప్రేమకూడా ఒక తృష్ణ. ఒక పిపాస. శారీరకమైన సుఖంవల్లగాని ఈ తృష్ణ చల్లారదు. కొంకపోతే, తక్కిన కోరికలు అన్నిటికంటె ఇది చాలా బలమైనది. అంతకన్నా మరేంలేదు. మాటవరుసకు నిన్ను నేను పొందాలని అనుకుంటున్నాననుకో...'

'ఇహ ఆపండి!' అంది ల్యూబా కోపంగా. 'ఏమిటీవాగుడు వస పిట్టలా? ఇలాంటిమాటలు అనవద్దని పదేపదే చెప్పలేదూ! మీరు చెప్పే విషయాల్లోని అంతరార్థం ఏమిటో నాకు తెలీదనుకున్నారా? నేను ఎన్నటికీ లిఖోనిన్‌కు ద్రోహంచేయను. ఆయన నన్ను ఉద్ధరించాడు......నా మనస్సు ఆయనకు అంకితంచేశాను...ఆయన్ను పూజిస్తాను...ప్రేమిస్తాను... మీ చొల్లుకబుర్లు వింటూవుంటే నా కసహ్యం పుట్టుకొస్తోవుంది.'

ల్యూబా అలా అరున్న కసురుకుని బుద్ధిచెప్పింది. ఆతరువాత మరొకనాడు సిమనోవస్కీ ఆమె హృదయానికి మరీ నొప్పికలిగేపని చేశాడు. అంతకుముందే లిఖోనిన్ యూనివర్సిటీలో తన స్నేహితులందరికీ, తనొక పతితురాలిని ఉద్ధరించానని, ఆమెను సంఘంలో ఒక ఉన్నతస్థానానికి తీసుకుపోవాలని ప్రయత్నిస్తున్నాననీ చెప్పాడు. ఈ మెవిషయం యూనివర్సిటీలో దాదాపు అందరికి తెలిసింది. ఈ అవకాశం తీసుకుని సిమనోవస్కీ నలుగురు అమ్మాయిలకుకూడా ఈవిషయం తెలియచేశాడు. ఆ నలుగురు యువతులు యూనివర్సిటీలో చదువుతున్న విద్యార్థినులు. అందులో ఇద్దరు వైద్యశాస్త్రం చదువుతున్నారు. ఒకామె చరిత్ర అభ్యసిస్తోంది. నాలుగోఆమె మంచి కవయిత్రి. కావ్యాలు, వ్యాసాలు వ్రాస్తోంది. ఈ నలుగురినీ వెంటబెట్టుకుని ల్యూబాఇంటికి తీసుకొచ్చాడు సిమనోవస్కీ.

ల్యూబాకు ఒక్కొక్కరిని పరిచయంచేశాడు. యూనివర్సిటీలో చదువుతున్న విద్యార్థినులని చెప్పాడు. లీజా, నదిమా, సారా, రాఛెల్; అంటూ వాళ్ళపేర్లు చెప్పాడు. పిమ్మట విద్యార్థినులతో ల్యూబాపరిస్థితి

స్పష్టంగా చెప్పాను. ఆమె ఒక సాని అనీ, భయంకరమైన జీవితం గడిపిందనీ చివరికిప్పుడు లిఖోసన్ సహాయంతో బయటికొచ్చిందనీ చెప్పాను. విద్యావంతులైన ఆ యువతులఎదుట ల్యూబా విపరీతంగా భయపడింది. తన పాపపు జీవితం వారికికూడా తెలిసిందని సిగ్గుతో, అవమానంతో కుంగిపోయింది. వారిని కూచోమని చెప్పి మర్యాద చేసింది. టీ, రొట్టె, ఫలహారాలు అందించింది. వారు కులాసాగా టీ తాగుతూవుంటే, తనొక దాసీదానిలా దూరంగా నిలబడింది. కనీసం వారిపక్కన కూచోడానికే సిగ్గుపడింది. ఒకామె చేతిరుమాలు కిందపడితే, పరుగెత్తుకుంటూ వెళ్ళి తీసి ఆమెకిచ్చింది. వారు ఈమెను ప్రశ్నలు అడిగారు. అన్నిటికీ తలఎత్తకుండా 'అవును', లేక 'కాదు' అనిమాత్రం జవాబు చెప్పింది. వచ్చిన యువతులు నలుగురూ ఊరకే పోక తలా ఒకవిధంగా ఆమెహృదయానికి నొప్పితగిలేలా ప్రవర్తించి అవమానించారు.

ఒకామె లావుగావుంది. ఎర్రనిముఖం, చప్పిడి ముక్కు, నల్లగా మెరుస్తోన్న చిన్నకళ్ళు. ఈమె వచ్చినప్పటినుంచీ, ల్యూబాను ఆపాదమస్తకం పరీక్షిస్తూ అదోలా చూడడం మొదలెట్టింది. ఈమె విషపుచూపులు ల్యూబాహృదయంలో ములుకుల్లా నాటాయి. 'ఆమె నావైపు ఎందుకలా చూస్తుంది? ఆమె అందాన్ని నేనేం దోచుకోలేదే?' అలా మనసులో అనుకుంటూ ల్యూబా తప్పుచేసినదానిలా బాధపడింది. మరొక ఆమె బక్కపల్చగా, నాజూగ్గా వుంది. మెడకు గులాబీరంగు రుమాలు ఒకటి కట్టుకుంది. 'నీవు పడుపుకత్తెవుగా జీవించడానికి కారణంఏమిటి? వేశ్యావృత్తిలో ఎలా ప్రవేశించావు?' అంటూ ఆమె ప్రశ్నించసాగింది. ఒకసారి కాదు, దాదాపు పదిసార్లు అదేప్రశ్న తరచితరచి అడిగింది.

'నిన్ను మొట్టమొదట చెడగొట్టిన దుర్మార్గుడెవడు......?' అని ఆమె ప్రశ్న.

వెంటనే ల్యూబాకు తన పూర్వస్నేహితురాండ్రు జెన్నీ, టమారా గుర్తుకొచ్చారు. వాళ్ళు కళ్ళల్లో మెదిలారు. వినయంగా ఇలా జవాబు చెప్పింది.

'చాలామంది ఉన్నారు...నాకు జ్ఞాపకంలేదు. కోల్కా, మిష్కా, వోలోద్కా, సెరేజ్ కా, జోరిజిక్, టోల్సిష్కా, పెట్కా,. తరువాత

కూష్కా, గోష్కా ఇంకా వాళ్ళ స్నేహితులు...' అంటూ ఆమె తనవద్దకు వచ్చిన విటులపేర్లు కొన్ని గబగబ చెప్పింది. తిరిగి ఇలా అంది. 'అయినా, ఈవిషయంలో మీకింత ఆసక్తి ఎందుకు?'

'మరేంలేదు, తెలుసుకుందామని. నీవు ఎవరినైనా ప్రేమించావా?'

'క్షమించండి' మీరడిగే ప్రశ్నలు నాకర్థం కావడంలేదు... నాకు పనివుంది. అవతలికి వెళ్ళాలి.'

'ఏం? నేం అడిగేది నీకర్థం కాలేదూ? నీ వెప్పుడైనా పురుషుడిదగ్గర పడుకుని నిద్రపోయావా?'

అప్పటికి ల్యూబాకు బాగా తలనొప్పి వచ్చింది. 'ఏమండీ! సిమనోవ్స్కీగారూ! మీరీలాంటివారిని నాదగ్గరకు తీసుకొస్తారని అనుకోలేదు. మీరుచేసిన ఈ మహోపకారానికి ఎంతో కృతజ్ఞురాలిని. దయచేసి ఇహ వీరిని వెళ్ళమనండి.' ఆగ్రహంతో అంది ల్యూబా.

సాధారణంగా అమాయకులు అణగిమణగి పడివుంటారు. వారికి త్వరగా ఆగ్రహం రాదు. వచ్చిందా మరి ఆగదు. ల్యూబాకు వళ్ళంతా తేళ్ళూ, జెర్రులూ పాకినట్లయింది. ఒక్కసారిగా తన స్నేహితురాండ్రయిన జెన్ని, టమారా ఇలాంటిసమయాల్లో చూపే గర్వం, సాహసం, తిరుగుబాటు ఇవన్నీ గుర్తొచ్చాయి. ఆ వచ్చిన నలుగురినీ విదిలించివేస్తూ ఇలాఅంది.

'మీచరిత్ర నాకు తెలుసు. నాకంటె మీరు ఏమాత్రం ఎక్కువ కాదు. కాని మీకు తల్లిదండ్రులున్నారు. చేసినపాపాలను కప్పిపెట్టటానికి కావల్సినన్ని అవకాశాలున్నాయి. అంచేత మీరుచేసే తప్పుడు పనులు బయటపడవు. మీరు కడుపులు చేయించుకుని పోగొట్టుకుంటారు. మీరంతా ఇంతే. మీ చరిత్రంతా ఇంతే. మగాళ్ళు కిటికీల్లో మీ పడకగదుల్లో దూరుతారు. కేళీవిలాసంగా వారితో సుఖాలు అనుభవిస్తారుమీరు. ఇహ మీకు కావల్సిందేముంది? మీరు సానికొంపల్లో ఎందుకు ప్రవేశిస్తారు? నాస్థితిలో మీరుంటే తెలిసేది. తినడానికి తిండీ, కట్టడానికి బట్టా లేక, విద్యావిహీనురాలనై అవస్థపడ్డాను. ఇలాంటి గతి మీకుపట్టినట్లయితే, ఈపాటికి బహిరంగంగా బోర్డుకట్టి తెరిపిలేకుండా పడుపువృత్తి సాగించేవారు. నాలాంటి దీనురాలిని కనికరించడానికి మారుగా, హేళనచేస్తూ తూలనాడుతున్నారా? మీకు సిగ్గువెయ్యడంలేదూ!'

సిమనోవస్కీ బిత్తరపోయి చూచాడు. ల్యూబా ఎదురౌతుందని కలలోకూడా అనుకోలేదు. ఏంచేస్తాడు! కాని తిట్లుతిట్టి, గొణుక్కుంటూ వెంటనే ఆ నలుగురు యువతులను కుని వెళ్ళిపోయాడు.

ల్యూబా తనకూ, సిమనోవస్కీకి జరుగుతోన్న నిత్యసంఘర్షణలను గురించి అనేకసార్లు లిఖోనిన్‌తో చెప్పింది. తనపట్ల చాల అసహ్యంగాను, అసభ్యతతోను ప్రవర్తిస్తున్నాడనీ, చివరకు తనను వశంచేసుకోడానికికూడా దిగాడనీ అనేకపర్యాయములు మొరపెట్టుకుంది. కాని లిఖోనిన్ పెడచెవిని పెట్టి ఊరుకున్నాడు. ఏమాత్రం పట్టించుకోలేదు. అసలుసిమనోవస్కీ అంటే అతనికొకరిధమైన నమ్మకం, అభిమానం ఉన్నాయి. అవసరమైతే ల్యూబాను శంకిస్తాడు గాని, మిత్రుణ్ణి శంకించడు. అదీకాక, కొంతకాలంనుంచి ల్యూబాతో కలిసి జీవించడం అతనికి ఇష్టంగాలేదు. విసుగ్గావుంది. అనేక సార్లు తనలో ఆలోచించేవాడు. 'ఈమె నాజీవితంలో ప్రవేశించింది. నన్ను నాశనంచేస్తోంది. నేను పతనమైపోతున్నాను. ఎందుకూ పనికిరాలినవాణ్ణిగా, మూర్ఖుణ్ణిగా తయారవుతున్నాను. అర్థంలేనిపనిచేశాను ఈమెను దగ్గరకు చేర్చుకున్నందువల్ల నాజీవితం తల్లక్రిందులైంది. ఆఖరుకు ఈమెను పెళ్ళి కూడా చేసుకున్నానూ అంటే, దాంతో నాజీవితం పరిసమాప్తమయినట్లే. ఇంత విద్య, విజ్ఞానం, మేధస్సు, శక్తి, సామర్థ్యం— ఇన్నీ వున్న నేన, చివరకు ఆబ్కారీశాఖలోనో, తాలూకా ఆఫీసులోనో, కోర్టులోనో ఒక చిన్న గుమాస్తాగాచేరి నీచంగా జీవించాల్సిన గతి పడుతుంది. లేదా, దిక్కూ మొక్కూ లేని బడిపంతులుగా బ్రతకాల్సొస్తుంది. ఇహ నాగతి ఏమిటి? నాఆశలు, ఆశయాలు అన్నీ సర్వనాశనమైపోతాయి. నాజీవితంలో సేవచేయాలనుకున్నా. జీవితంలోని మాధుర్యాన్ని చవిచూడాలనుకున్నాను. ఎన్నెన్నో సాహసకృత్యాలు చేసి సంఘంలో ఉన్నతస్థాయిని అందుకోవాలని కలలుకన్నాను. ఈ కలలన్నీ గాలిమేడలై కూలిపోవల్సిందేనా? ఎన్నటికీ ఇలా జరగకూడదు. ఇది నేను సహించలేను.' ఈ విధంగా అనుకునేసరికి అతనికి పిచ్చెక్కిపొయ్యేది. ఒక్కొక్కసారి బయటపడి ల్యూబాతో పెద్దగా అనేవాడు. జుట్టు పీక్కుంటూ, నేలను కాళ్ళతో గట్టిగాతన్నుతూ వళ్ళు తెలీని కోపంతో అరిచేవాడు. పాపం, ఆమె అతని తిట్లు, చీవాట్లు

...శ్శేక నోరునొక్కుకుని ఊరుకునేది. మెల్లగా వంటింట్లోకి ...నలో తాను కుమిలి కుమిలి ఏడ్చేది.

ఈ విధంగా క్రమక్రమంగా కుటుంబ కలహాలు పెచ్చుమీరి పోయాయి. ఒక్కోసారి కోపంలేనప్పుడు లిఖోనిన్ ల్యూబాతో మెల్లగా ప్రశాంతంగా ఇలా అనేవాడు.

“చూడు ల్యూబా! మనిద్దరికీ పొత్తుకుదరదు. మనం ఒకరికొకరం తగినవాళ్ళం కాము. ఇదుగో! నూరురూబుల్సు ఇస్తున్నాను. ఇవితీసుకుని మీఊరు వెళ్ళిపో. పల్లెటూళ్ళో, మీవాళ్ళు, మీబంధువులు, అంతా కలవరిస్తూ వుంటారు. నిన్నుచూడగానే సంతోషంతో పొంగిపోతారు. అక్కడేవుండు. ఓ ఆరునెలలపాటు హాయిగా, కులాసాగా బాధలన్నీ మరచిపోయి మీవాళ్ళతో గడుపు. ఆ తరువాత నే నక్కడికి వస్తాను. అప్పుడు నీవు స్వయంగా, స్వశక్తితో జీవించడానికి వీలు కలుగుతుంది.

కాని, ఈ మాటలు ఆమెను సంతృప్తిపరుస్తాయా? తన జీవితంలో తొలిసారి, అదేచివరసారి అయినట్లు ఒక పురుషుణ్ణి ప్రాణప్రదంగా ప్రేమించింది. ఇలాంటి ఉప్పుచప్పని మాటలుచెప్పి విడిపోయి దూరంగావుండమంటే ఆమెమనస్సు అంగీకరించగలదా? అంచేత ఆమె వెళ్ళిపోలేదు. అతనితోనే వుంటూవచ్చింది.

ఇది లిఖోనిన్‌కు మరీ కష్టం కలిగించింది. ఆమెపీడ ఎలా వదిలించుకుందామాఅని ఆదుర్దాపడుతున్నాడు.

సిమనోవస్కీమీద అతనికి ఎంతఅభిమానం, ప్రేమ వున్నా అంతరాత్మలో అతనిప్రవర్తననుగురించి అనుమానించకపోలేదు. ల్యూబామీద అతనికి మనసువుందని, ఆమెను వశంచేసుకోవాలని కుతూహలపడుతున్నాడని పూర్తిగా గ్రహించడానికి లిఖోనిన్‌కు ఎక్కువకాలం పట్టలేదు. కాని ఇది తెలుసుకున్నందుకు ఏమాత్రం కించపడలేదు. పైపెచ్చు సంతోషించాడు కూడాను.

“అవును, సిమనోవస్కీ ల్యూబామీద కన్నువేశాడు. ఆమెను ప్రేమిస్తున్నాడు. పోనీ; ఇందులో నాకొచ్చిన నష్టమేముంది? నేనైతేనేం? వాడైతేనేం? లేక మరొకడైతే మాత్రం ఏం? మనలాంటివాళ్ళను ఎంతమందిని చూచిందో ఆమె. నేనే అతన్నిపిలిచి ముఖాముఖి మాట్లాడతాను. ఉన్నవిష

యింతేచ్చి చెప్పేస్తాను పాపం అతనికోరికా తీరుతుంది. నాబాధాతప్పుతుంది. ల్యూబాను తనతో తీసుకుపోయి స్వేచ్ఛగా అనుభవించమని చెపుతాను. అలాగైనా ఈ మూగురఖులు నన్ను వదిలిపెడతుందేమో?" అని దురాలోచనచేశాడు తనలో. కాని మళ్ళీ సందేహంవచ్చింది. "ఏమోనబ్బ! ఇంత మాత్రానికే ఈ పిశాచం నన్నొవదలిపెడతుందా? పైగా నామీద ఊరందరితో చెప్పి అల్లరిపెట్టెయ్యదూ!" మళ్ళీ అనుకున్నాడు.

అవును మరి, నిగ్రహంలేనివాళ్ళు ఇలాగే చేస్తుంటారు. తొందరపడి ముందొకపని చెయ్యడం, తరువాత నిగ్రహించుకోలేక ఎందుకు చేశామాఅని పశ్చాత్తాపపడటం, చేసింది వదిలించుకోవాలని అనడం—ఇది వీళ్ళకు పరిపాటి. ఇప్పుడు లిఖోనిన్ కూడా ఫక్తు అలాగేఅన్నాడు ఎలాగైనా ఆమెను తన దగ్గర్నుంచి వెళ్ళగొట్టాలని పథకంమీద పథకం వేస్తున్నాడు.

'ఆ! ఇలా కాదు దీని వ్యవహారం. సిమనోవస్కీ, ల్యూబా, ఇద్దరూ ప్రేమకలాపాలు జరిపేటట్లు చేస్తూ, పట్టుకుంటాను......అప్పుడు నాటకం పరాకాష్ఠనందుకుంటుంది...ఒక పాత్ర ధరించి చిన్న దృశ్యం ఆడేస్తాను. ...కొంత కోపం అభినయించేసి... వెళ్ళిపొమ్మని చెప్తాను' చివరకిలా వుపాయం పన్ని, ఓ నిశ్చయానికి వచ్చాడు లిఖోనిన్.

ఇప్పుడిక లిఖోనిన్ కి వెనకటిలా ఇంటి వ్యవహారాలు పట్టించుకోవడం లేదు. అసల్లు [illegible] గంటలతరబడిఇంటిచాయలకూడా పోకుండాఅక్కడక్కడ తిరుగుతూవచ్చాడు. చివరకు ఏ వారానికో రెండు వారాలకో వెళ్ళేవాడు. వెంటనే ఎక్కడికి వెళ్ళారని ల్యూబా ప్రశ్నలమీద ప్రశ్నలు వెయ్యడం, తను కోపంతెచ్చుకోవడం, ఆమె బాధపడడం, తాను రెచ్చిపోయి నానా తిట్లూ తిట్టడం; చివరకామె గండమోర్లుపెట్టి ఏడవడం; ఇదీ వరస. చివరకు ఇల్లొక కల్లుపాకలా అల్లరిమూకలా తయారైంది.

ల్యూబాకు యీ విచారంవల్ల, మతిభ్రమకలగడం మూర్ఛలురావడం కూడా జరిగింది. లిఖోనిన్ ఇంట్లో ఒక్క క్షణంకూడా వుండకుండా వెళ్ళిపొయ్యేవాడు. ఆమె వెర్రెత్తినట్లు అతనివెంట పడేది. అతను పోయిపోయి, ఏ ఇంట్లోనో దూరేవాడు. తనువాకిట్లో గంటలతరబడి నిలబడి అతనువచ్చేదాకా కాచుకుని వుండేది. అతను వచ్చేవాడు. అతన్ని కౌగలించుకుని కాళ్ళమీదపడి ఏడ్చేది. అతను విదిలించి, వదిలించుకుని వెళ్ళిపోయేవాడు.

లిఖోనిన్ పేర ఇంటికి ఉత్తరాలువచ్చేవి. వాటిని చదవడానికి ఆమెకు చాతకాదాయె. పోనీ, సాలోవీవ్, నిజేరా, వీళ్ళవరిచేతనైనా చదివించుదామంటే, అందుకు సాహసించలేకపొయ్యేది. అంచేత వాటి నన్నిటినీ కట్ట కట్టి బీరువాలో పంచదార, టీ మొదలైన వస్తువులతోపాటు దాచివుంచేది. చివరికామె ఏ స్థితికి వచ్చిందంటే, అన్నబేధి, మైలతుత్తం, ఇలాంటిమందేదో తిని చావాలనే స్థితికి వచ్చింది.

ఇవన్నీ గ్రహించి లిఖోనిన్ మళ్ళీ అనుకునేవాడు.

'పాపిష్టిది, ఎలాగైనా చావనీ! దానికీ, సిమనోవస్కీకి మధ్య ఏమీ లేకపోవచ్చు. అయితేఏం? నేనే ఒక మంచినాటకం వేస్తా. భయంకరమైన నాటకం ఆడి ఇద్దరినీ దోషులుగాజేస్తాను.' అలా ఆలోచించుకుని ముందుగానే అందుకు రిహార్సలు వేసుకున్నాడు.

'ల్యూబా! ఇదీ నీ బ్రతుకు! నిన్ను మనసారా ప్రేమించి తీసుకొచ్చాను. ఆశ్రయం ఇచ్చాను. కాని చివరకు ఏం జరిగింది? నీ నీచబుద్ధి బయటపడింది. నీవు చేస్తోన్న ద్రోహం కళ్ళారా చూచాను! ఓ సిమోయ్ సిమనోవస్కీ! నీవు నా ప్రాణస్నేహితుడవు. కాని నీవు చేసిందేమిటి? నా సుఖానికే అడ్డుతగిలావు. నా ప్రేమసామ్రాజ్యాన్ని ఆక్రమించుకున్నావు. ...వద్దు. వద్దు... మీ ఇద్దరినీ నేను వేరుచేయ దలచుకోలేను. కళ్ళ నీళ్ళు కారుస్తూ దుఃఖిస్తూ వెళ్ళిపోతాను... నేను మీ ప్రేమను అడ్డురాను. నా దోవను నేను వెళ్ళిపోతాను...ఇంకా, ఇంకా ఇలా నాటకం ఆడితే బ్రహ్మాండంగా వుంటుంది' అనుకున్నాడు లిఖోనిన్.

కాని ఇలాంటి దుర్మార్గపు ఆలోచనలు, కుతంత్రాలు, లోకం మెచ్చుతుందా? తరువాతనైనా నిజస్థితి బయటపడదూ? లిఖోనిన్ చేసేపనికి లోకం నిందించదూ? కాని అతనిఅదృష్టం కలిసివచ్చింది. ఆకస్మాత్తుగా అతని దురాలోచనలు ఫలించేఅవకాశం కలిగింది. అది చాలా చెడ్డరోజు. ఉపద్రవమైనరోజు. సాలోవీవ్ మామూలుప్రకారం ల్యూబాకు పాఠం చెపుతున్నాడు. ఆమె ఎక్కువ కష్టపడకుండా పెద్దపెద్దవాక్యాలు చదువగలుగుతోంది. సోలోవీవ్ చాలసంతోషించాడు. పాఠంఆపేసి మధ్యలో సరదాకోసం, కలాస్కినోవీ అనే వర్తకుడికథను చెప్పాడు. ఆకథ ఎంతో ముచ్చటగా వున్నందున, కుర్చీలో కూచునివున్న ల్యూబా ఆనందంతో

చప్పట్లుకొట్టింది. కాని అంతలో సాలోవీవ్ తనకు అత్యవసరమైన పనివుందని వెళ్ళిపోయాడు. ఆమె తనకృతజ్ఞత తెల్పే అవకాశంకూడా ఇవ్వకుండా వెళ్ళిపోయాడు. ఇంతలో సిమనోవస్కీ వచ్చాడు. ఉపన్యాసం ప్రారంభించాడు. మానవుడు స్వేచ్ఛాజీవి అనీ, అతన్ని ఏకట్టుబాట్లు, ధర్మాలు ఆపలేవనీ, అతను అన్నింటికీ అతీతుడనీ ఉపన్యాసం ఇచ్చాడు.

“మనిషి కావాలనుకుంటే దైవసమానుడు కావచ్చు. లేదా పనికి మాలిన పురుగులా పతనం చెందవచ్చు.” అన్నాడతను.

చివరకు విషయాన్ని, స్త్రీ పురుషుల ప్రణయ సంబంధంలోకి దించాడు. కాని విషయం పూర్తికాకముందే అతనికి ఉద్రేకంఎక్కువైంది. ఢభాలున ఆమె సరసకు జరిగి కౌగలించుకున్నాడు. “ఇహ ఆమె ఎదురుచెప్ప లేదు. ఈ ఉద్రేకంలో లొంగిపోతుంది” అనుకున్నాడు తనలో. తరువాత బలవంతాన ఆమె పెదవులను ముద్దుపెట్టుకోవడానికి ప్రయత్నించాడు. కాని ఆమె పెద్దగా అరవడం మొదలెట్టింది. ఇహ మెత్తమెత్తగా ఊరుకోలేక, కఠినంగా మారిపోయింది.

“ఛీ! దుర్మార్గుడా! వదిలిపెట్టు. నీకు సిగ్గులేదుట్రా నీచుడా! పందీ! కుక్కా! నీ మొహం పాడుగాను. నిన్ను ముక్కలుముక్కలు చేస్తాను.” అంటూ ల్యూబా తీవ్రంగా అతన్ని ఎదిరించింది.

సానులకు సహజంగాఉండే, ధైర్యం, సాహసం, మోటుతనం, పొగరుబోతుతనం; అన్నీ మళ్ళీ ఒక్కసారి ఆమెలో ప్రవేశించాయి. సిమనోవస్కీని, మొహంమీదకొట్టి, వళ్ళంతా రక్కి, అవతలికి తోసింది. అతని కళ్ళజోడు కిందపడిపోయింది. మొహమంతా ఆకారం మారిపోయింది. ఆమెవంక దీనంగాచూస్తూ ఇలా అన్నాడు.

“ప్రేయసీ!...... మరేం ఫరవాలేదు. ఒక్కక్షణం... నీతీయని పెదవులను ముద్దుపెట్టుకోనియ్...... ఎవరూ రారులే...ఊ...త్వరగా... నన్ను నీవాణ్ణిగా చేసుకో”

సిమనోవస్కీ ఇలా ఆమెను చెరచడానికి ప్రయత్నిస్తూవుండగా, సరిగ్గా అదేసమయానికి లిఖోనిన్ గదిలోకి వచ్చాడు.

నిజానికి ఇలా జరుగుతుందని అతను అనుకునిరాలేదు. కాని అనుకోకుండానే ఆ క్షణం అతనికి అనుకూలంగా కలిసివచ్చింది. అతనిమొహంపాలి

పోయింది. దూరంగా నిలబడి, నాటకం అంతిమ ఘట్టంలో నటించే నటుడిలా పోజు పెట్టి ఇలా అన్నాడు.

'అవునుల్యూబా! ఎన్నో అనుకున్నానుగాని, ఎన్నడూ ఇలా జరుగుతుందని అనుకోలేదు. అయినా...నిన్ను క్షమిస్తున్నాను ల్యూబా! నీవొక అనాగరకురాలివి! పశువువు! పనికిమాలిన పురుగువు!...మరి నీవూ?......సిమనోవస్కీ!...నిన్ను నేను గౌరవించాను...... ముందుకూడా గౌరవిస్తాను......కామం అన్నిటికంటె బలమైందని, నాకు తెలుసు...కామం కళ్ళను కప్పేస్తుంది; విచక్షణాజ్ఞానాన్ని నశింపజేస్తుంది...ఇవిగో యాభై రూబుల్సు!...ఇవి ల్యూబాకోసం ఇస్తున్నాను. ఫరవాలేదు. నీకు వీలైతే, మళ్ళీ ఉన్నప్పుడు ఇవ్వవచ్చు. నీమీద నాకు నమ్మకముంది. ఆమెకోసం ఏదో ఒకటి చెయ్యి. చివరకామె అదృష్టం ఎలావుంటే అలా జరుగుతుంది. నీవు తెలివైనవాడవు. దయ, దాక్షిణ్యం, నీతి, గౌరవం కలవాడవు. ఇహ నేనో...'ఒక దుర్మార్గుణ్ణి! కటికి దుర్మార్గుణ్ణి!' అని అతని అంతరాత్మలో ఏదో ఘోషించినట్లు వినిపించింది. "నేను వెళుతున్నాను. ఎందుకంటె, ఇహ ఈయాతన, ఆవేదన నేను భరించలేను. మీ ఇద్దరూ సుఖంగా వుండండి."

అద్భుతంగా నటించాడు లిఖోనిన్. దీనంగా తలవొంచుకుని విషాదం పొందిన కథానాయకుడులా నటించాడు. జేబులోంచి యాభైరూబుల్సుతీసి టేబుల్ మీద పడేశాడు.

తలను రెండుచేతులతో అదిమిపట్టుకుని గబగబ గదిలోంచి ఇవతలికి వస్తూ మళ్ళీఅన్నాడు.

"ల్యూబా! నీ ప్యాస్‌పోర్టు ఆ డ్రాయరులోవుంది."

అతనుకోరింది ఇదే! అతను అనుకున్నట్లు అద్భుతంగా, దిగ్విజయంగా ముగిసింది నాటకం!

# మూడో భాగం

ఆవిధంగా జరిగిన ఈ చరిత్రఅంతా ల్యూబా జెన్నీతో చెప్పింది. ఎంతో బాధపడుతూ మధ్యమధ్య ఆమె భుజంమీదపడి ఏడుస్తూ చెప్పింది.

ఆమె చెప్పిన మాటలనుబట్టి చూస్తే, ఇదంతా లిఖోనిన్ తను స్వయంగా కావాలనుకుని చేసినట్లు అనిపిస్తుంది. లిఖోనిన్ తనను తీసుకెళ్ళింది ఉద్ధరించడానికి కాదనీ, ఆశపెట్టి పిచ్చిదాన్ని చేసి చెరిచి వశపరచుకున్నాడనీ, ఇష్టంవచ్చినన్నాళ్ళు అనుభవించి తరువాత బయటికి గెంటాడనీ ఆమె అభిప్రాయం. తను మూర్ఖురాలై ఆవిషయం గ్రహించలేక అతన్ని పిచ్చిగా ప్రేమించానని చెప్పింది. తనను వదిలించుకోవడానికి కపటోపాయంపన్ని, మిత్రుడైన సిమనోవస్కీని తనమీదికి ఉసికొలిపాడనీ, తనను బలాత్కారం చేయమని పంపాడనీ చెప్పింది. తరువాత జరిగిన సంగతులుకూడా ఆమె విపులంగా జెన్నీతో వెళ్ళబోసుకుంది.

అలా నాటకంఆడి లిఖోనిన్ బయటికి వెళ్ళిపోయాడు. కాని సిమనోవస్కీ ఆమెను వదలిపెట్టలేదు. తనపశుబలం ప్రయోగించి ఆమెను ఎలాగైనా లొంగదీసుకోవాలని చూస్తున్నాడు. ల్యూబా తనశాయశక్తులా పోరాడుతూ నిరోధిస్తూవుంది. ఇంతలో అక్కడికి ఆ ఇంటియజమాని వాస్సా వచ్చి చూసాడు. ఒక్కక్షణం కూడా ఆలోచించకుండా ల్యూబాను మెడపట్టి బయటికి గెంటాడు.

పాపం! ఆమె ఏంచేస్తుంది? మగదిక్కులేదు. వెంటతోడులేదు. నిలువ నీడలేదు. నగరంలో ఎక్కడికి వెళ్ళాలో, ఏంచేయాలో తెలియదు. ఎటూ దోవకనిపించదు. అలా ఒంటరిదై వీధులుపట్టింది ల్యూబా. పిచ్చిదానిలా తిరిగి తిరిగి, తుదకు నగరంచివర కొట్లాడుతోన్న ఒకవిధంగాగల చౌకబారు హోటల్లో చిన్నగది తీసుకుంది. ఆ హోటల్లోపనిచేసే రౌడీవెధవఒకడు ఆమెసంగతి గ్రహించాడు. ఆమెతో చెప్పకుండానే, పశుప్రవృత్తిచేయించి డబ్బు గడించాలనీ, వీలైతే మరొకరికి అమ్మేయాలని పన్నాగాలు పన్నాడు కాని, ల్యూబా అదికనిపెట్టింది. ఆ నికృష్ట వాతావరణంలో జీవించలేనని తెలుసుకుని గదివదలిపెట్టి మళ్ళీ రోడ్లుపట్టింది.

తలవని తలంపుగా లిఖోనిన్‌తో సంబంధం ఏర్పడటం, అతన్ని మన స్ఫూర్తిగా ప్రేమించడం, విద్యావంతులతో కలిసిమెలిసి ఈ కొద్దికాలం ఒక చక్కని వాతావరణంలో జీవించడం, ఇవన్నీ ఆమె మనస్సును ప్రౌఢతరం చేశాయి. మళ్ళీ పతనమైపోకుండా ప్రతిఘటించే శక్తిని ప్రసాదించాయి. అంచేత స్వయంకృషితో మంచిమార్గాన జీవించడానికి ప్రయత్నించింది. పనిమనిషిగా కుదురుతానని రెండు మూడు పత్రికలలో ప్రకటించింది. కాని ప్రయోజనం లేకపోయింది. ఆమెకు సిఫార్సులు లేవు. సర్టిఫికెట్లు లేవు. ఇక నౌకరీ ఎవరిస్తారు? పైగా మరో చిక్కుకూడా తటస్థించింది. తను ఉద్యోగంకోసం వెళ్ళినచోటల్లా వృద్ధులైన యజమానురాండ్రను కలుసుకోవాల్సివచ్చేది. వారంతా ఈమెను చూడగానే సంసారి లక్షణాలు లేవని కనిపెట్టేవారు. ఇలాంటి గుంటను పనికి కుదుర్చుకుంటే గొంతుకు ఉరిపోసుకున్నట్లేననీ, ఏ క్షణానో తను భర్తలను, తండ్రులను, కొడుకులను వలలో వేసుకుపోతుందనీ భావించి, వెళ్ళిపొమ్మనేవాళ్ళు.

తన స్వగ్రామం వెళ్ళడం మరీ బుద్ధితక్కువపని అని ఆమె గ్రహించింది. నిజానికి వాళ్ళ ఊరు ఎక్కువ దూరం లేదు. అక్కడికి పదిహేను మైళ్ళు మాత్రమే. కాని ఏం లాభం? పడుపువృత్తితో జీవిస్తున్నట్లు చాల కాలంకిందటే వాళ్ళ ఊళ్ళో అందరికీ తెలిసిపోయింది.

తరచు వాళ్ళ ఊరినుంచి అనేకమంది నగరానికి వస్తూవుంటారు. అనేకసార్లు తిరుగుతుండగానో, లేక అన్నామార్కోవ్‌నా ఇంట్లో వుండగానో అందరూ చూచారు. పైగా నగరంలో ఆమె చరిత్ర ప్రసిద్ధికెక్కింది. హోటళ్లలో పనివాళ్ళు, బండ్లవాళ్ళు, కాపలావాళ్ళు, వీరందరూ ఆమెతో ఒకసారో అరసారో ఉండిపోయినవాళ్ళే. వీరంతా ఆమె స్వంత ఊరికి ఉత్తరాలు వ్రాసీ, వచ్చినవారితో అల్లా ముఖాముఖి చెప్పీ, తన బ్రతుకు చాటింపుచేశారు. ఇక అలాంటిస్థితిలో గ్రామం వెడితే ఏమిటి లాభం? ఎవరైనా మర్యాదగా చూస్తారా? పైగా పరాభవంచెయ్యరూ? కనుక తిరిగి స్వగ్రామం వెళ్ళడంకంటె, ఉరిపోసుకుని చావడం నూరురెట్లు ఉత్తమం. ఇవన్నీ ఆలోచించుకుని ఆమె స్వంతఊరు వెళ్ళడం మానేసింది.

డబ్బు జాగ్రత్త దాచుకునే విషయం ల్యూబాను బొత్తిగా తెలీదు. ఈ విషయంలో ఈమెకంటె అయిదేళ్ళ పసిపిల్ల నయమనిపిస్తుంది. అంచేత

చేతిలో ఒక కానీ కూడా లేకుండా ఖర్చుచేసుకుంది. ఇహ ఎలా బ్రతకడం? మళ్ళీ సాలెకొంపకు పోవటం సిగ్గుచేటని భావించింది. ఆమె మనస్సు అంగీకరించలేదు.

ఈవిధంగా ల్యూబా, అహర్నిశలు రోడ్లమీదపడి తిరుగుతూవుంటే అనేక అవాంతరాలు, ఉపద్రవాలు వచ్చిపడేవి. పనీపాటా లేక భటాచోర్లు, దొంగలు, దుర్మార్గులు, దేశదిమ్మరులు, మాటుసరసాలాడే ముసలిముండా కొడుకులు, మగాళ్ళను ముండల్ని తార్చే ముసలితొత్తులు; వీరంతా ఎదురుపడేవారు. రకరకాల మాటలుచెప్పి అనేకవిధాల వంచించడానికి ప్రయత్నించేవారు. తూలనాడేవారు. పరాభవించేవారు. 'ఎందుకు తిరుగుతావు? నా వెంటరా అమ్మాయ్! అన్నిసుఖాలు అమురుతాయి' అంటూ వెంటపడేవారు. తరిమేవారు. దినదినగండంగావుంది ల్యూబా బ్రతుకు. ఏక్షణాన ఏం ముంచుకొస్తుందో తెలీదు. ఆమె బ్రతుకు దుర్భరమైంది. తిండిలేదు. నిలువ నీడలేదు. ఎంతకాలం ఇలా?

విధిలేక, వేరె గత్యంతరంలేక చివరకామె తలనెరిసిన ఒక వృద్ధుని వెంట వెళ్ళడానికి అంగీకరించింది. అతను మంచిదుస్తులు, అవీ వేసుకుని చూడ్డానికి పెద్దమనిషిలాగానే అగుపించాడు. మర్యాదగానే ప్రవర్తించాడు. అతను ఆమెనుతీసుకెళ్ళి అనుభవించి, ఒకరూబులు చేతిలోపెట్టాడు. అంత తక్కువసొమ్ము ఇచ్చినందుకు ఆమె బాధపడింది. కాని ఎదిరించి అడగడానికి సాహసించలేకపోయింది. అవును. దుర్భరమైన ఆమెజీవితం, చుట్టుముట్టిన పరిస్థితులు; అన్నీ ఆమెను ఎందుకూ పనికిరానిదానిగా, బలహీనురాలిగా మార్చివేశాయి. ఆ తరువాత కొన్నిసార్లు ఆ వృద్ధుడు ఏమీ డబ్బివ్వకుండానే ఆమెను అనుభవించి వెళ్ళిపోయాడు.

తరువాత ఒక అందమైన యువకుడు తగిలాడు. సిల్కుచొక్కా తొడుక్కుని, టోపీ పెట్టుకున్నాడు. మనిషి మహా దర్జాగావున్నాడు. అతను ఈమెను చేపట్టి ఓ హోటలుకు తీసుకెళ్ళి అక్కడ గదిలో మకాం పెట్టాడు. భోజనం, ఫలహారాలు, బ్రాందీ, అన్నీ తెప్పించాడు. తనొక పెద్ద జమీందారు కొడుకుననీ, నగరంలో పెద్ద పేరుగల బంతిఆటగాణ్ణనీ, తనను చూసి ఆడపిల్ల లందరూ పిచ్చెక్కిపోయి వెంటబడతారనీ చెప్పాడు. తనను అంటిపెట్టుకుని వున్నట్లయితే, ఏకభోగం సానిగా జీవించవచ్చనీ

చెప్పాడు. ఇతను పట్టి బడాయికోరు. కోతలరాయుడు. అనుయాయురాలైన ల్యూబాతో డాబులుకొట్టి, దర్జాగా తనకు కావల్సిన సుఖం అనుభవించాడు. పిమ్మట తనకేదో పనివుంది, ఇప్పుడేవస్తానని చెప్పి, పత్తాలేకుండాపోయాడు. పాపం! ల్యూబాపని ఇరకాటంలో పడింది. హోటలు కాపలావాడు కటికి దుర్మార్గుడు. గడ్డమున్నవాడూ, అతిభయంకరంగా వుంటాడు. ల్యూబామీద పడి గట్టిగా ఆమె నోరు మూసి వళ్ళంతా చితకబాదించాడు. ఎంతోసేపు అలా హింసించి, చివరకు ఆమెతప్పు కాదనీ, ఆ వచ్చిన తుంటరివెధవ మోసంచేసి వుడాయించాడనీ తెలుసుకున్నాడు. ఆఖరుకు ఆమె దగ్గరనున్న పర్సు లాక్కున్నాడు. అందులో ఒక రూబులు, మరికొంత చిల్లర, వున్నాయి. ఆ గది అద్దెకింద ఇవ్వాల్సిన సొమ్ముకు 'హామీ'గా, ఆమె తల మీద ధరించిన చిన్న టోపీ, వంటిమీద వేసుకున్న ఓవరుకోటూ కూడా లాక్కొని బయటికి గెంటివేశాడు.

తరువాత నలభైయేడు సంవత్సరాల వయస్సుగల ఒక పెద్దమనిషి ల్యూబాను తీసుకుపోయి, రెండు గంటలసేపు భయంకరంగా హింసించి తనకు కావల్సిన సుఖం అనుభవించాడు. చివరకు 80 కోపెక్కులు చేతిలో పెట్టి పొమ్మన్నాడు. ఇలాచేయడం అన్యాయమని ఆమె అడిగేసరికి, ఉగ్రుడై మీదకొచ్చాడు. దయ్యంలాంటి పిడికిలితో ఆమెముక్కును అదిమి పట్టి భీకరంగా ఇలా అన్నాడు.

'అనవసరంగా వాగావంటే చిత్రవధచేస్తాను. జాగ్రత్త!...... తక్షణం పోలీసువాణ్ణి పిలిచి, నేను నిద్రపోతూవుండగా ఈ దొంగలంజ నా డబ్బు కాజేసిందని చెపుతాను. దాంతో నీ తిక్క కుదురుతుంది...... ఎంతకాలమైంది నీవు పోలీసు స్టేషన్ చూసి?'

అలా ఆతను బెదరించి, బాధించి వెళ్ళిపోయాడు.

ఇంకా ఇలాంటి భయంకరమైన సంఘటనలు అనేకం జరిగాయి.

ఆవిధంగా మానం, అభిమానం, డబ్బు, వస్తువులు, అన్నీ కోల్పోయి జీవచ్ఛవంలా ఆమె మళ్లీ రోడ్డుపట్టింది సిగ్గుతో, అవమానంతో కుమిలి కుమిలి ఏడుస్తూ, ఎండనకా వాననకా, రాత్రనకా పగలనకా తిరిగినచోట తిరక్కుండా, పోలీసువాళ్ళను, రౌడీలను తప్పించుకుంటూ తిండీ తిప్పలు లేకా, స్నానంలేకుండా నాలుగురోజులు నగరవీధుల్లో పిశాచంలా తిరిగింది

ల్యూబా. ఆఖరుకు లిఖోనిన్‌ను సహాయం అర్థించుదామని నిశ్చయించుకుని అతనింటికి వెళ్ళింది. కాని అతను కనుపించలేదు. విచారించగా అతను ఊళ్ళో లేడనీ, తనను అవమానించి వెళ్ళగొట్టినవాడే, సెలవుపెట్టి పిరికిపందలా ఎక్కడికో పారిపోయాడనీ తెలియవచ్చింది. ఇహ దిక్కూ దివాసీలేక చేసే దేమీ కనపడక, కాళ్ళీడ్చుకుంటూ, నడవలేక నడుస్తూ, తూలిపడబోతూ మెల్లగా మళ్ళీ 'యామా'లో ప్రవేశించింది. 'యథాస్థానం ప్రవేశయామి' అన్నట్లు తనమామూలు సానికొంపలోకి వచ్చి, యజమానురాలితో కాపాడమని మొరపెట్టుకుంది.



'జెనీచ్కా! నీవెలాగైనా తెలివైనదానివి. ధైర్యసాహసాలు కలదానివి. 'ఎమ్మా'తో చెప్పి నన్నెలాగైనా మళ్లీ పనిలో చేర్పించు.' అంటూ ల్యూబా, జెన్నీ భుజాలమీదపడి వెక్కివెక్కి ఏడుస్తూ, ఆమె చేతుల్ని ముద్దుపెట్టుకుంటూ బ్రతిమాలుకుంది.

"ఎవరుచెప్పినా అది వినేరకం కాదు," అంది జెన్నీ గట్టిగా.

"మరి ఏంచూచుకుని ఎందుకూ పనికిరాని, ఏమీచాతగాని అమూర్ఖుడి వెంట వెళ్ళావే?" అనడిగింది ఆమె కొంచెం కష్టంగా.

"జెనీచ్కా!... సరి... వెళ్ళమని నీమటుకు నీవే సలహా చెప్పావుగా..." అంది ల్యూబా, భయపడుతూ.

"నేనా! నేను నీకు సలహా ఇచ్చానా?... నేనెప్పుడూ నీతో చెప్పలేదు... ఎందుకే ఈ అబద్ధాలు?......సరే,... ముందు లోపలికిరా ... తరువాత చూద్దాం." అంటూ జెన్నీ ఆమెనుపిలుచుకుని తనగదిలోకి తీసుకెళ్ళింది. ఆమెకు భోజనం తెప్పించి పెట్టించింది.

ల్యూబా తిరిగీ తన దగ్గరకు రాకతప్పదని 'ఎమ్మా'కు ఎప్పుడో తెలుసు. ల్యూబా రావడంకూడా ఆమె కనిపెట్టింది. మెల్లగా ఇంట్లో ప్రవేశించి, అటూ ఇటూ బెదురుగాచూస్తూ, నడవలో తచ్చాడుతూవుండడం 'ఎమ్మా' చూసింది. ఆ పిల్లను తిరిగి చేర్చుకోవడానికి తనకు ఎట్టిఅభ్యంతరం

లేదు. ఆమె వెళ్ళేటప్పుడు అంగీకరించడానికూడా కారణం లేకపోలేదు. మొదటిది డబ్బు వస్తోంది. రెండోది ల్యూబా తిరిగీ తన దగ్గరకు రాక తప్పదు. ఒక వేళ రాకపోయినా సరేం ఇబ్బందిలేదు. ఆమెలాంటి సానులు అనేకమంది చౌకగా దొరుకుతున్నారు. మరెవర్నైనా తీసుకొచ్చి ఆమె స్థానాన్ని భర్తీచేయవచ్చు. ఇలా ఆలోచించుకునే ఆమె ల్యూబా వెళుతూ వుంటే అంగీకరించింది. ఇప్పుడు మళ్లీ చేర్చుకోవాలని మనసులోవున్నా, అలా చేస్తే చులకనయిపోతామనీ, ముందు కొంత బెట్టుచేసి, పెట్టవలసిన చీవాట్లన్నీ పెట్టి తరువాత ఒప్పుకుందామనీ ఎమ్మా ఆలోచించింది.

'ఏమిటీ? నిన్ను మళ్లీ మా కొంపలోకి తీసుకోవాలా? ఓసి! బుద్ధిలేని ముండా! ఇన్నాళ్ళబట్టీ, ఎక్కడెక్కడో వీధుల్లో, గోడలపక్కనా, దిబ్బల్లో, దొడ్లల్లో, అడ్డమైన వెధవలందరితో పడి పొర్లి చివరికిక్కడి-కొచ్చావుటే! ఓసిభ్రష్టుముండా! మా కొంపరువూ, మర్యాదా లేవనుకున్నావా, నీలాంటి తక్కువరకం ముండ లందరినీ ఇక్కడ చేర్చుకోవడానికి?...... పందీ!......ముందిక్కణ్ణుంచి పో!' అంటూ ఎమ్మా, ల్యూబామీద విరుచుకుపడింది.

పాపం! ల్యూబా దీనంగా, ఆమెచేతులుపట్టుకుని ముద్దుపెట్టుకోనాలని ప్రయత్నించింది. కాని ఆమె మొహమంతా కళ్ళుచేసుకుని జయ్యాలా ల్యూబామీదికి వచ్చింది. పళ్ళుకొరుకుతూ చెంపమీద ఛెళ్ళునవేసి మెడ పట్టుకుని అవతలికి తోసింది. ల్యూబా కిందపడింది. కాని వెంటనేలేచి, వెక్కివెక్కి ఏడుస్తూ "...నన్ను కొట్టకండి... నన్ను కొట్టకండమ్మా!... మీకు పుణ్యంవుంటుంది..."అంటూ ఎమ్మాకాళ్ళు పట్టుకోబోయింది.

అప్పటిదాకా జరుగుతోన్న ఘోరకృత్యమంతా జెన్నీ చూస్తూ నిలబడింది. కాని ఇహ సహించలేకపోయింది. వీరావేశంలో ఒక్కఉరుకులో వెళ్ళి 'ఎమ్మా'ను జుట్టుపట్టుకుని కిందపడేసింది. ఆ మెత్తోడుక్కున్న గౌను, చింపి పీలికలు చేసింది. వెర్రెత్తినదానికిమల్లే అరవడం మొదలెట్టింది.

"దుర్మార్గురాలా!... హంతకురాలా!... దొంగముండ! ...సిగ్గు విడిచిన లంజ!..."

అలా ఆ ముగ్గురు ఆడాళ్ళమధ్య జరుగుతోన్న కొట్లాటకు ఇల్లంతా ఎగిరిపోతోంది. వెంటనే లోపల గదులలోంచి, నడవాలోంచి పశుప్రకత్తె

లంతా పిచ్చెక్కినట్లు పరుగెత్తుకొంటూ వచ్చారు. ఒకరిమీద ఒకరు పడి కొట్టుకోవడం మొదలెట్టారు. ఒకరికీ వళ్ళు తెలియడంలేదు. కేకలు, అరుపులు పెడబొబ్బలు. ఏడుపులు, మూలుగులు, జుట్టుపీక్కోవడం, బట్టలుచింపుకోవడం, వాడిగా గిచ్చుళ్ళతో, కొరుకుళ్ళతో గాయాలు చేసుకోడం; ఓ! ఒక రేవిటి? సంకులసమరం జరిగింది. పిచ్చికుక్కలకుమల్లే పోట్లాడుకున్నారు. ఇలాంటి వెర్రెత్తిన సంఘటనలు అనేకసార్లు జరగడం కద్దు. పశువులకు తెలియనట్టే ఒకో సందర్భంలో ఏదో ఎరగని పూనకం పుట్టుకొస్తుంది హిస్టీరియాలా వస్తుంది. పిచ్చాసుపత్రిలో పిచ్చాళ్ళకుమల్లే ప్రవర్తించి కొన్ని గంటలసేపు కోలాహలం చేస్తారు. ఇప్పుడూ అలాగే జరిగింది.

కొవలావాడ్లు సిమన్, మరికొంతమంది రౌడీల సహాయంతోవచ్చి, గంటసేపు పోరాడి గలాటా సద్దుబాటుచేశారు. ఇలా చేసినందుకు ఇంట్లో వున్న పదమూడుగురు వేశ్యలను, కఠినంగా, ఘోరంగా శిక్షించారు. క్రిందపడి వున్న ల్యూబాకూడా చావచితకతన్ని అవతలికి లాక్కుపోయారు. అందరిలోకీ జెన్నీపని మరీ అధ్వాన్నమయింది. ఎందుకంటే ఈ గలాటాకు ఆమెయే నాయకురాలు కనుక. 'ఎమ్మా' మీద తిరుగుబాటు చేసినందుకు, పిల్లలందరికన్నా ఆమెను ఎక్కువ బాధించి, చెప్పరానన్ని హింసలు పెట్టారు. అయినా జెన్నీ ఏమాత్రం బెదరలేదు. దెబ్బతిన్న సింహంలా, పగబట్టిన నాగులా గర్జిస్తూ బుసలుకొడుతోంది. చీకటి పడేంతవరకూ ఆమె తనగదిలో పక్కమీద పడుకునేవుంది. భోజనం చేయడానికి నిరాకరించింది. తనను ఎవరైనా చూడ్డానికివచ్చినా, వీల్లేదని చెప్పింది. పాపం! ఆమెకు కంటిదగ్గర బలమైన గాయం తగిలింది. చొక్కాఅంతా బఠాబదలుగా చిరిగిపోయి రొమ్ములమీద ఎర్రగా గీరుకుపోయి రక్తంచిమ్ముతోంది. మెడచుట్టూ, తాడుతోనులుముకుని కొట్టినట్లు ఎర్రగా వాతలుపడి పొంగిపోయాయి. ఈ పని చేసింది ఆ కర్కోటకుడు సిమన్‌గాడే. ఆమె తనగదిలో ఒంటరిగావుంది. ఆమెబుర్ర తీవ్రంగా ఆలోచిస్తోంది. కళ్ళు జ్యోతుల్లా వెలుగుతూ ఏదో క్రూరమైన పథకాన్ని వెళ్ళగక్కుతున్నాయి. మొహం పొంగులువారుతోంది. నాసికారంధ్రాలు, గడగడ వణుకుతున్నాయి. కోపోద్రేకంలో ఏదో గొణుక్కుంటూవుంది.

'ఉండండి చెప్తాను!...కొంచెం...కొంచెం ఓపిక పట్టండి!...లంజల్లారా!...మాద్దురుగాని—నరమాంసం భక్షించే రాక్షసి ముండల్లారా!...'

హాలులో లైట్లు వెలిగించారు. పనిమనిషి జోస్యా వచ్చి గది తలుపు తట్టింది. 'లెం ఆయింపమ్మా!

—అలంకారాలు చేసుకుని బయటికిరండి' అని హెచ్చరించి వెళ్ళి పోయింది. జెన్నీ గబగబా లేచి మొహం కడుక్కుంది. బట్టలు వేసుకుంది. కంటిదగ్గర, కొమ్ముల మీద, గాయం తగిలినచోటల్లా పౌడరు అద్దుకుని కనిపించకుండా చేసుకుంది. హాలులోకి వెళ్ళింది. దీనంగా చూస్తోంది. కాని గర్వంగా అగుపిస్తోంది. ఆమెకళ్ళు భయంకరమైన ఆగ్రహంతో ప్రకాశిస్తున్నాయి. కాని ఏదో మానవాతీతమైన సౌందర్యం ఆమెలో అగుపిస్తోంది.

## 3

కొల్యా గ్లాడిషెవ్ అనే ఒకచక్కని యువకుడున్నాడు. ఎర్రని చాయ. గులాబీ రంగు బుగ్గలు. కళ్ళు నీలాల్లా మెరుస్తూవుంటాయి. గుండ్రని తల. వంకులొంకులు తిరిగిన నల్లని జుట్టు. నూనూగుమీసం. మనిషి మహా అందంగా, కులాసాగా ఉంటాడు. కొంచెం సిగ్గుపడుతూ మాట్లాడతాడు. సాధారణంగా ఎవరినీ ప్రేమించని జెన్నీ ఈ కుర్రాడంటే మహా ఇష్ట పడుతుంది. ఇతనామె జతగాడు. గడచిన శీతాకాలంలో జెన్నీ ఇతనితో కలిసి కులాసాగా, కుషామత్తుగా గడిపింది. పసికిల్లల్లా ఇద్దరూ బొమ్మలు పెట్టుకుని ఆడుకునేవారు. ఆమె అతనికి యాపిల్ పండ్లు, లేకపోతే పటికిబెల్లం ముక్కలు పెట్టేది.

ఎన్నో నెలల తరువాత మళ్ళీ ఇప్పుడితను ఇక్కడికి వచ్చాడు. అవును. ఇతను మిలిటరీలో పనిచేస్తున్నాడు. మిలిటరీస్కూల్లో శిక్షణపొంది, పట్టభద్రుడై ఆఫీసరుగా నియమింపబడ్డాడు. డ్యూటీమీద క్యాంపువెళ్ళి ఎన్నో ఊళ్లు పర్యటనచేసి, మళ్ళీ ఇన్నాళ్ళకు తన ప్రియురాలైన జెన్నీని చూడాలనే కుతూహలంతో వచ్చాడు. మనిషి వెనుకటిమాదిరిగా లేడు.

మాంచిరంగు తేలాడు. పొడుగు పెరిగాడు. బొదబొదలాడుతూ ఎదిగి వచ్చాడు. ఠీవిగా, ఉల్లాసంగా వున్నాడు. మిలిటరీలో పని చేస్తున్నా ఇతనికి అన్నివిధాల స్వేచ్ఛ వుంది. ఇంట్లోకూడా తల్లిదండ్రులు ఇతన్ని ప్రేమగా గారాబంగా చూస్తారు. ఇంట్లో పెద్దవాళ్ళ ఎదుటే సిగరెట్లు కాలుస్తాడు. వాళ్ళ నాన్నగారే, ఇతని కొక సిగరెట్ కేసుకూడా బహుమతి ఇచ్చాడు. పైఖర్చుకోసం ఇష్టమొచ్చినట్లు ఖర్చుపెట్టుకోమని నెల నెలా ఓ పదిహేను రూబుల్సుకూడా ఇస్తుంటాడు.

ఇలాంటి వాతావరణంలో పెరిగిన కుర్రాడు సానికొంపకు అలవాటు పడటం, తొలిసారిగా జెన్నీతో సంబంధం ఏర్పరచుకోవడం జరిగింది.

ఇంతపసివాళ్ళు సానికొంపలకుగాని, వీధుల్లో తిరిగే భ్రష్టుకుండలకుగాని అలవాటుపడడం తరుచు సంభవిస్తూవుంటుంది. నిజంగాఈవిషయం తలుచుకుంటే ఆశ్చర్యంగానే వుంటుంది. పసివాళ్ళేకాక ఈ వ్యసనంలో పడిన ముసలాళ్ళుకూడా వున్నారు. యాభైఏండ్లు దాటినవాళ్ళు—మనుమలుకూడా పుట్టింతరువాత ఇందులోకి దిగారూ అంటే, ఏమనుకోవాలి? వీరందరూ ఒకే కారణం చెపుతారు. దాసీదో లేక పెంచిపోషించేదాదో తనంతట తాను వలలో వేసుకుని, చెరిచి చెడగొట్టిందని అబద్ధం చెపుతారు. పసివాళ్ళకు, ముసలాళ్ళకుకూడా ఇదే కారణం చెప్పటం ఒక అలవాటయిపోయింది. ఈ పచ్చిఅబద్ధం తరతరాలబట్టీ పనపడి, పాతుకుపోయి పారంపర్యంగా వస్తోంది.

కోల్యాకూడా చాలా చిన్నతనంలోనే— తొమ్మిది లేక తొమ్మిదిన్నరసంవత్సరాల వయస్సప్పుడే యాంత్రికమైన కామోద్రేకాన్ని రుచి చూచాడు. కాని అప్పుడతనికి ప్రేమఅంటే ఏమిటో, స్త్రీ సంపర్కంఅంటే ఏమిటో బొత్తిగా తెలిసేదికాదు. అవును మరి. ముక్కుపచ్చలారని బాలుడికి ఇంతపెద్ద విషయం ఎలా తెలుస్తుంది? పైగా భయంకూడా పుట్టేది.

కోల్యాకు తనవయస్సులోవుండే చాలామంది పిల్లలకుమల్లే అర్థంచేసుకోలేని అనేక పనులతో సంబంధం కలిగింది. ఒకసారి అతను పరుగెత్తుకుంటూ వాళ్ళనాన్నగారి గదిలోకి వెళ్ళాడు. గులాబిపూవులావుండే తమ దాసీపిల్ల ఫ్రోస్యా మంచంమీద పడుకుని, కట్టుకున్నగుడ్డ మొహానికికప్పుకునివుంది. వాళ్ళనాన్నగారు మొహమంతా ఎర్రగాచేసుకుని, రొప్పుతూ

మంచంమీదనుంచి లేస్తున్నాడు. ఈ దృశ్యం అతనికంటపడేసరికి అతనికేమీ అర్థంకాలేదు. 'మానాన్న పెద్దపులిలావున్నాడు' అనుకున్నాడు తనలో. అంతకన్నా అతనికేమీ తెలీదు. మరొకసారి, సహజంగా పిల్లలకుండే కొంటెతనంవల్ల నాన్నగారి డ్రాయరు బయటికి లాగి చూచాడు. అందులో అందమైన అమ్మాయిల ఫోటోలు అనేకం కనుపించాయి. అవన్నీ శృంగార చిత్రాలు, నగ్నచిత్రాలు.

వాళ్ళ అమ్మ పార్ఫ్యోల్ ఎఫ్యగ్నోవిచ్ (గవర్నమెంటు ఉద్యోగిగా వున్న ఒక సూధుడు) అనే పెద్దమనిషితో కలిసి, సాయంత్రం నీపర్ నది దగ్గరకు షికారువెళ్ళడం అనేకసార్లు చూచాడు. అతని పక్కనకూచుని, కులాసాగా నవ్వుతూ పేలుతూ మాట్లాడేది. ఇంట్లో ఎప్పుడూ పనివాళ్ళ మీద, నాన్నగారిమీద కసురుకుంటూ కోపంగావుండే ఆమె, అతనితో హాయిగా మాట్లాడడం చూచేసరికి, కోల్యాకు ఆశ్చర్యంకలిగేది. ఆమె తన మొహానికి పౌడరు అద్దుకుని, చక్కగా అలంకరించుకుని గుమ గుమ వాసనలతో అతని సరసను చేరేది. అతను దగ్గరున్నంతసేపూ, ఆమె మొహం వికసించివుండేది. ఎంతో ఉల్లాసంగా అగుపించేది. వీటన్నిటికీ కారణం ఏమిటో ఆ పసివాడికి బోధపడేదికాదు. ఓ! చెపితే నమ్మరుగాని, పసిపిల్లలు దగ్గరున్నారని అయినా పెద్దవాళ్ళకు జ్ఞానముండేదా!

'మరేం ఫరవాలేదు. పిల్లలున్నారని భయపడకు. వాళ్ళకేమీ అర్థం కాదులే' అని వాళ్ళపని వాళ్ళు చూచుకునేవారు.

కోల్యాకు ఒక అన్న వున్నాడు. అతనిపేరు బోరింకా—అతను కూడా మిలిటరీ స్కూలులో చదువుకుని పట్టభద్రుడై పెద్ద ఉద్యోగంలోకి వెళ్ళిపోయాడు. ఆ ఉద్యోగంలోకి వెళ్ళకముందు అతను ఇంట్లోనే ఒక ప్రత్యేకమైనగదిలో వుండేవాడు. అప్పుడు వాళ్ళఇంట్లో 'న్యూషా' అనే పిల్ల పనిచేస్తూవుండేది. చాలా అందమైనపిల్ల. మంచికళ్ళు, చక్కని తలకట్టు. ఎంతో ముచ్చటగావుండేది. ప్రాప్తంలేదుగాని, ఆ అమ్మాయికిమంచిదుస్తులూ అవీ కట్టి, అలంకారంచేస్తే నాటకాల్లో వేషాలు ధరించే నటీమణులకంటె అద్భుతంగావుండేది. లేకపోతే ఎవరో రాణీ అనికూడా అనుకోవచ్చు. అలాంటి అమ్మాయితో వాళ్ళఅన్నయ్య సంబంధంపెట్టుకున్నాడు. శృంగారం సాగిస్తూ వచ్చాడు. వాళ్ళ అమ్మకుకూడా ఈ విషయం తెలుసు.

అయినా ఆమె హరించి ఊరుకుంది. వయసులో వున్న కొడుకు, ఏ సాని దానితో, లేక ఏ పెంకెముండతో మరిగితే చచ్చే చావు వస్తుంది. అంతకన్నా గుట్టుగా, ఇంట్లో పడివున్న ఈ అమాయకపు పిల్లతో కాలక్షేపం చేయడం ఎంతో మంచిది. అలా అనుకుని ఆమె ఊరుకుంది. ఇదంతా కోల్యా చూస్తూనే వుండేవాడుగాని, ఏమీ తెలిసేదికాదు. ఒకసారి అతను గది దగ్గరకు వచ్చేసరికి లోపల అన్న, ఆ పనిమనిషి ఇద్దరూ చెడ్డ అసహ్యమైన పనిలో వుండడం కళ్ళారా చూచాడు. తలుపుసందుల్లోంచి స్పష్టంగా కనుపించింది. పిమ్మట న్యూషా గర్భవతి అయింది. అయిదు నెలలు నిండాయి. అమ్మకు తెలిసి, ఆ పిల్లను నానాతిట్లు తిడుతూ, అరుస్తూ గోలపెట్టింది. ఆమెను కొంతడబ్బు లంచం యిచ్చి గుట్టుగా అవతలికి పంపాలని అమ్మ ప్రయత్నించింది. కాని ఆ పిల్ల ఒప్పుకోలేదు. అపుడు. ఆమె అన్నయ్యను ప్రేమించింది. అంచేత వెళ్ళనని, అప్పటికే తన బ్రతుకు పాడయిపోయిందనీ గోడుగోడున దుఃఖించింది. అయినా అమ్మ ఒప్పుకోలేదు. పోలీసులను పిలిపించి, ఆమెను అప్పగించింది. ఈ దృశ్యాలన్నీ పసివాడైన కోల్యా మనసులో విపరీతంగా పనిచేశాయి.

కోల్యా అయిదారు తరగతులు చదివేటప్పుడు, బళ్ళో పిల్లలలో చాల మంది అప్పటికే ఈ పాపం అంతో ఇంతో చేశారు. బళ్ళో ఇతని స్నేహితులు అనేకమంది ఎప్పుడూ స్త్రీలనుగురించి, శృంగారాన్ని గురించి మాట్లాడుతుండే వారు. ఒకొక్కరు తాము చేసిన ఘనకార్యాలు వెల్లడించి, గర్వపడేవారు. 'అర్కాషా' అనే కుర్రాడికి రోగంకూడా అంటుకుంది. కాని అది అంత ప్రమాదకరమైన జబ్బుకాదు. మూడు నెలల తరువాత అతను ఈ వ్యవహారంలో ఆరితేరినవాడై అందరికీ పెద్ద అయినాడు. ఇంకేం? బళ్లో పిల్లలందరికీ సాను లనుగురించి, సానికొంపలనుగురించి తెలిసిపోయింది. ఇంక అవే ముచ్చట్లు రాచకార్యాలు. అందరూ రుచిమరిగారు.

కోల్యాకూడా తొలిసారిగా 'అన్నా' ఇంటికి వెళ్ళడం తటస్థించింది. రోజూ సాయంకాలం అయ్యేసరికి అతనికేదో విసుగ్గా, చిరాకుగా, తోచకుండావుండేది. తనకుతానే శక్తి, ధైర్యం, సాహసం తెచ్చుకుని ఓ గ్లాసుడు 'రమ్' తాగేవాడు. పాపం తాగుడు కొత్తఅవడంవల్ల అది నల్లులకంపు కొట్టేది. బండిమీదకూచుని యామాకు వెళ్ళడం; అన్నా ఇంట్లో ప్రవేశించడం

జరిగింది. హాలులోకిపోయి చూచుంటే అతనికళ్ళు భ్రమలుకమ్మేవి. రంగు రంగులకాంతులు, రకరకాల అమ్మాయిలు! రాట్నం తిరిగినట్లు హాలంతా తిరిగేవారు. వాళ్ళగ స్తులు, అలంకారాలు, మాటలు, నేష్టలు, ఓ! అద్భుతం! అతనికి వెర్రెత్తిపోయేది. ఏదోలోకంలో వున్నట్లు తోచేది. కాని గుండెలో పిరికితనం పోలేదు. చిన్నతనంనుంచి కలిగిన అనుభవాలు, చూచినదృశ్యాలు, పెరిగిన వాతావరణం; ఇవన్నీ ఆ పసిహృదయంలో ఏదోవాంఛను, ఉద్రేకాన్ని రేకెత్తించాయేకాని, నిజానికి అతనికి ఏమీ తెలీదు. ఆ వ్యవహారం ఎలా నడపాలో, ఎలా సంచరించాలోకూడా తెలీదు. తనవిద్యార్థిమిత్రుడెవడో అనుభవంకలవాడు పక్కనవుండి ఇతనిస్థితి గమనించేవాడు. ఒక వేశ్యను దగ్గరకుపిలిచి ఏదో చెవిలో గుసగుసలాడేవాడు. అప్పుడామె ఇతన్ని సమీపించి "అబ్బాయీ!......నీవు చాలా అమాయకుడవనీ, ఏమీ తెలీదనీ, నీ స్నేహితుడుచెప్పాడు.........రా...... నేనంతా నేర్పుతాను రా!" అంటూ లోపలికి తీసుకెళ్ళేది.

ఆమె ఏవేవో తీయని మాటలు చెప్పింది. కాని 'అన్నా' ఇంట్లో గోడలు ఇలాంటి మాటలు అనేకవేల పర్యాయాలు వినివుంటాయి. ఆ తరువాత జరిగిన వ్యవహారాలు తలుచుకోవడానికికూడా కష్టమైనవి, బాధాకరమైనవీ. ముద్దులు, బలమైన ముద్దులు, వళ్ళంతా గట్టిగాచుట్టుకుపొయ్యేది. తనకు ఎంతో నొప్పి పుట్టేది. అయినా ఆమె ఏవేవో పిచ్చి పనులు చేసేది. తరువాత అబ్బ! అమితమైనబాధ కలిగేపని...తలచుకుంటే వళ్ళు ఝల్లుమంటుంది. అతనికి భయంపుట్టేది. ఏడవాలనిపించేది. చివరకు చచ్చిపోతాననికూడా అనుకునేవాడు. అలాంటిపని...అలాంటిబాధ... తరువాత కాళ్ళు, చేతులు వణుకుతుండేవి...ఊడిపోయిన చొక్కాగుండీల కోసం తడుముకునేవాడు.

కానీ, ఈ పనిలో ఆరితేరడానికి అతనికి ఎంతోకాలంపట్టలేదు. త్వరలోనే ఇందుకు కావల్సిన ధైర్యం, సాహసం కూడుకున్నాయి. వ్యవహారం అలవాటయిపోయుండే. ఇప్పుడేమీ ఆశ్చర్యంలేదు. భయంలేదు. బాధలేదు. పైగా ఆనందం. సుఖం. స్త్రీలంటే ఎంతోఉల్లాసం. ముఖ్యంగా జెన్నీ, తరువాత వెరాకా; వీరిద్దరిమీద అతనికి చచ్చేవ్యామోహం.

'జెనీచ్కా! నీ ప్రియుడొచ్చాడు. అంది ఒకామె కోల్యానుచూచి.

# 4

అది ఆగష్టు నెలలో ఒకరోజు. ప్రొద్దుటినుంచీ సన్నగా వర్షం పడుతోంది. అప్పటికి సుమారు రాత్రి తొమ్మిదిగంటలు అయివుంటుంది. అన్నా మార్కోవ్నా ఇంట్లో దీపాలు వెలుగుతున్నాయి. హాలులో ఎక్కువమంది జనంలేరు. దాదాపు ఖాళీగావుంది. టెలిగ్రాఫ్ ఆఫీసులో గుమాస్తాగా పనిచేసే ఒక యువకుడుమాత్రం తలుపుకు దగ్గరగా కుర్చీ మీద కూచునివున్నాడు. కాట్యా అనే వేశ్యతో సరసాలాడుతూ ఏదో సంభాషిస్తున్నాడు. రోసీ...పోలీ కూడా హాలులోనే వున్నాడు. అటూ ఇటూ పచారు చేస్తూ మధ్య మధ్య సానులతో తీయని కబుర్లు చెప్తూ వారిని నవ్విస్తూ, కవ్విస్తూ వున్నాడు.

కోల్యా, ఇంట్లోకి రాగానే అతన్ని మొట్టమొదట 'వెర్కా' చూచింది. సంతోషంతో ఎగురుతూ, చప్పట్లు కొడుతూ అరవడం మొద లెట్టింది.

'జెంకా, జెంకా! (జెన్నీ) త్వరగా రావే! నీ ప్రియుడొచ్చాడు. మిలిటరీలోపనిచేసే ఆ అందమైన కుర్రాడే!'

కాని జెన్నీ ఇంట్లోలేదు. ఒక రైల్వే కంట్రాక్టరు వచ్చి ఆమెను తీసుకుపోయాడు.

ఇతను లావుగా దుక్కలా వుంటాడు. రైల్వేకంట్రాక్టరుగా వుండి బాగా డబ్బుగడించాడు. వయస్సు నడికారు దాటింది. మనిషి మెత్తనివాడు. సహృదయుడు. ఎక్కువగా ఈ భోగంకొంపకు వస్తూవుంటాడు. కాని తనువెళ్లాల్సినరైలు తప్పిపోతుందనేభయంతో, ఎప్పుడూకూడా నలభైనిము షాలకంటె ఎక్కువసేపు వుండడు. అందుకని ఎప్పుడూ తన గడియారం చూచుకుంటూ తొందరపడుతూంటాడు. అలవాటు ప్రకారం ఇవాళకూడా ఇతను నాలుగసీసాల బీరు తాగాడు. పనిమనిషికి యాభై కోపెక్కులు, కాపలావాడు సిమన్‌కు ఇరవై కోపెక్కులు సంతోషంకొద్దీ ఇచ్చాడు.

కోల్యా వెంట, అతనిసహపాఠి, మిత్రుడూ అయిన మరొకకుర్రాడుకూడా వున్నాడు. అతనిపేరు పెట్రోవ్. ఇతను ఇంతకుముందెప్పుడూ సానిగడప

తొక్కి ఎరగడు. వేశ్యలనుగురించి చిత్రవిచిత్రమైన కథలూ, కబుర్లు మిత్రుడు కోల్యా చెప్పగా విని పాపం, ఇతనికి నోరూరింది. సానులతో సంపర్కం ఎలావుంటుందో ఒకమాటు చవిచూద్దామని లొట్టలు వేసుకుంటూ వచ్చాడు. అనుభవం లేనందున గతసంవత్సరం కోల్యాకుమల్లేనే ఇప్పుడితనికి గుండెల్లో అదురు, బెదురు వున్నాయి. కాళ్ళు వణుకుతున్నాయి. నోరు పిడచకట్టుకు పోతోంది. కళ్ళు మసకలుకమ్ముతున్నాయి. హాలులోవున్న దీపాలన్నీ అటూ ఇటూ ఊగుతున్నట్లు, తనచుట్టూ తిరుగుతూవున్నట్లు తోస్తోంది.

కాపలావాడు సిమన్, ఈ స్నేహితులిద్దరికోట్లు అందుకుని గోడకు వున్న వంకికి తగిలించాడు. వీరిద్దరు మిలిటరీదుస్తులలోనే వున్నారు. కోటు గుండీలు కనపడితే ప్రమాదమని, అవి బయటకు అగుపించకుండా తగిలించాడు సిమన్.

అవును. ఈ విషయాల్లో బహుజాగ్రత్తగా వుంటాడు సిమన్. 'వీళ్ళు అసలే కుర్రాళ్ళు. పైగా మిలిటరీలో పనిచేస్తున్నారు. వీళ్ళిక్కడికి వచ్చినట్లు తెలిస్తే ఇంకేమైనావుందా? సరీగ్గా ఇదేసమయానికి పై ఆఫీసరు ఎవడో ఇక్కడ ఊడిపడ్డాడూఅంటే మనపని ఖాళీ! ముందు మనభరతంపడతాడు! వెంటనే రిపోర్టుచేసి, కొంపకు తాళంవేసి, వ్యాపారం మూయిస్తాడు! మూడేండ్లక్రితం, యజమానురాలు లిమోనా పాంషినాకు ఇదేగతి పట్టింది. నిముషాలమీద వ్యాపారం మూయవలసివచ్చింది. అంతే, మళ్ళీ ఆమె మరోపేరుతో ప్రారంభించిందనుకో. అయినా ఆమెకు ఒకటిన్నరనెలలు జైలుశిక్ష వేశారు. అది తప్పించుకోవడానికి తాకిలుందిగొచ్చారు. బోలెడంత డబ్బు లంచంపోయాల్సివచ్చింది. ఒక్క కెప్టెన్‌గాడే నాలుగొందలరూబుల్సు కాజేశాడు! మరోచిక్కుకూడా వుంది. ఇలాంటి పసివెధవలకు ఏదోరోగం తగిలిందీఅంటే మనచావుకు వస్తుంది. ఈ వెధవలు 'అమ్మా! నాన్నా! నాగతిఇలాఅయిందే'అని మొత్తుకుంటారు. 'వెధవల్లారా! ఎక్కడ తగిలించుకున్నారా!' అని ఆరాతీస్తారు పెద్దవాళ్ళు. 'అదుగో! అక్కడ! సాని కొంప! 'అన్నా' ఇల్లు!...' అని పేర్లు బయటపెడతారు... అప్పుడైనా మన బండారం బయటపడాల్సిందే!... రిపోర్టుచేసి, తగినశాస్తి చేస్తారు.' ఇలా ఆలోచించుకుని ఇలాంటిసందర్భాల్లో కడుజాగ్రత్తగా మెలిగేవాడు సిమన్.

"లోపలికి దయచేయండి" అని వారిని ఆహ్వానించాడు.

ఇద్దరు కుర్రాళ్ళూ హాలులో ప్రవేశించారు. పెట్రోవ్ కాస్త ధైర్యం రావడంకోసం బ్రాందీ తాగాడు. అతను ముఖం వెలవెలబోతూ నిలబళ్ళే కుండా వున్నాడు. ఇద్దరూ వెళ్ళి గోడకానుకుని తివాచీమీద కూచున్నారు. వెంటనే వారిదగ్గరికి ఇద్దరు అమ్మాయిలు చేరారు. ఒకామె 'వెర్కా' రెండో ఆమె 'టమారా.'

'ఏమండీ! సిగరెట్లకు డబ్బులివ్వరూ?' అంటూ వెర్కా, తన వెచ్చని తొడను పెట్రోవ్ కాలికి గట్టిగా తాకిస్తూ అడిగింది. 'మీరు ఎంతో అందంగా వున్నారు.' అన్నది.

అంతలో కోల్యా అడిగాడు.

'జెన్నీ ఎక్కడుంది? ఆమె మరెవరితోనైనా వుందా?'

అదివిని 'టమారా' అతనికళ్ళల్లోకి క్రీగంట చూచింది. ఆ చూపును తట్టుకోలేక కోల్యా, ముఖం తిప్పేశాడు.

'మరెవరితోనో నా? లేదు. ఆమె పొద్దుటినుంచీ ఒకటే తలనొప్పితో బాధపడుతోంది. జెన్నీ నడవలోకి వెళుతోంటే, మనిమనిషి జోస్యా చూడక తలుపుతోసింది. పాపం జెన్నీకి కంటిదగ్గర దెబ్బతగిలింది! అంచేతనే ఈ తలనొప్పి పాపం! ఆమె బాధతో తడిగుడ్డ తలకుకట్టుకుని మంచంమీద పడుకుంది. కొంచెం ఓపికపట్టండి. కొద్ది నిముషాల్లో ఇవతలికొస్తుంది.' అంది టమారా, కోల్యాతో.

వెర్కా తన పక్కనవున్న పెట్రోవ్‌ను ఇంకా పీడిస్తూనే 'మీరు దేవ కుమారుడిలా వున్నారు! నల్లజుట్టు, పాలిపోయిన ముఖంగల మీలాంటి యువకులంటే నా కెంతో ఇష్టం. వాళ్ళకు కామోద్రేకం జాస్తిగా వుంటుంది' అంది వెర్కా—తరువాత ఒక పాటపాడి, మళ్ళీ ఇలా అడిగింది.

'మధురమూర్తీ! మీ పేరేమిటో చెప్పరూ?'

'జార్జి,'

'జార్జ్, జోరోచ్కా! ఎంత మంచిపేరు!' అంటూ ఆమె గభాలున అతని ముఖంలో ముఖం పెట్టి రహస్యంగా అంది.

'జోరోచ్కా! అబ్బ! నాతో వుండరూ?'

పెట్రోవ్ నేలమీదికి చూస్తూ, మెల్లగా అన్నాడు.

'ఏమో నాకు తెలీదు. నా స్నేహితుడెలా చెప్తే అలా చేస్తాను...' అది విని 'వెర్కా' పెద్దగా నవ్వింది.

'చాలాబాగుంది. ఓహోహో! బలే బాగుంది. ఎంత నంగనాచి కబుర్లు చెపుతారండీ. ఇంత లావు మగాడికి, స్నేహితుడు చెప్పేదాకా ఏమీ తెలీదన్న మాట...ఎవరన్నా వింటే నవ్విపోతారు.' అంటూ ఆమె 'టమారా! చూచావుటే ఈ తమాషా! నాదగ్గర పడుకుంటారా అని ఆయన్ను నే నడిగాను. తన మిత్రుడెలా చెప్తే అలా చేస్తానని జవాబు చెపుతున్నారు' అంటూ ఆమె మళ్ళీ కోల్యావైపు తిరిగి అతన్ని అడిగింది. 'ఏమండీ మీ రెవరు? ఆయన గురువుగారా? లేక...'

"ఇహ ఆపవే ఆడదయ్యమా!" అంటూ అరిచాడు పెట్రోవ్ కోపంగా.

పొడుగ్గావున్న 'రోలీ-పోలీ' చేతులూపుకుంటూ ఈమిలిటరీకుర్రాళ్ళ వద్దకు వచ్చాడు. మొహం ఒకపక్కకు పెట్టి వారిని పొగడసాగాడు.

"మిలిటరీ యువకులారా! మీరు విద్యావంతులు, మేధావంతులు. పువ్వులాంటి కుర్రవాళ్ళు. ఇంకా చెప్పాలంటే మనదేశానికి మణిపూసలు; ముందు కాబోయే సైన్యాధిపతులు మీరే! ఈ ముసలాడికి ఒకసిగరెట్టు కాల్చే ప్రాప్తం కలిగించండి. నిరుపేదను, నిష్టదరిద్రుణ్ణి, పనికిమాలినవాణ్ణి!" అన్నాడు 'రోలీ-పోలీ'

వారు అతనికి సిగరెట్టు ఇచ్చారు తరువాత అతను ఒకవిధమైనపోజు పెట్టి, గద్గదస్వరంతో పాడడం ప్రారంభించాడు. అదిచూచి ఆ కుర్రాళ్ళు అతనికి చెరిఒక ఇరవై కోపెక్కుల నాణెం ఇచ్చారు. ఆ రెంటినీ అతను అరచేతిలో వుంచుకుని తమాషాగా ఎగరేసి రెండోచేత్తో పట్టుకున్నాడు. 'ఏన్, జ్యా, డే' అంటూ మాంత్రికుడిలా ఏదోభాషలో మాట్లాడి చేతిలోవున్న డబ్బులు మాయంచేశాడు.

'టమారా! ఎందుకింత అన్యాయం? ఈ ముసలాడిదగ్గరే, ఫారెస్టు గార్డుగా పనిచేసి విరమించుకున్న వీడదగ్గరే, డబ్బులుకొట్టేయాలని చూస్తున్నావా? ఎక్కడపెట్టావో చెప్పు' అంటూ చప్పట్లుకొట్టి, తిరిగీ డబ్బులు తెప్పించాడు. తరువాత వాటిని చమత్కారంగా జేబులో పడేసుకున్నాడు.

'నేను మళ్ళీ ఇప్పుడే వస్తాబాబూ!' అని ఆ కుర్రాళ్ళతో చెప్పాడు. పిమ్మట తెల్లమంకా వైపుతిరిగి 'ప్రేయసీ! ఎక్కడికీ వెళ్ళవుకదూ! ఇప్పుడే వస్తాను. నీకు బహుమానం తెచ్చి సంతోషపెడతానే' అంటూ టోపీ సవరించుకుని వెళ్ళిపోయాడు. అతను వెడుతోంటే మంకా వెనకనుంచి పిలిచి 'తోలీ-పోలీ! నాకో యాభై కోపెక్కులుపెట్టి ఐస్‌క్యాండీ, ద్రాక్షలు కొనుక్కొస్తారు కదూ! ఇదుగో డబ్బు.' అంటూ ఆమె అతను పట్టుకు కేలా డబ్బు విసిరేసింది.

వయసుమళ్ళిన హెన్రీటా వచ్చి ఆ కుర్రాళ్ళదగ్గర ఒక సిగరెట్టు అడిగి పుచ్చుకుంది.

"అబ్బ! బద్ధకంగా వుందండీ! కొత్త డాన్సు పెట్టించరాదటండీ!" అంది ఆవులిస్తూ.

"ఓ! బాగుంది. తప్పక పెట్టిస్తాను." అంటూ కోల్యా, పియానో వాయించే అతనివైపు చూచాడు. ఏదో రకమైన డాన్సు ఏర్పాటుచేయమని ఉత్తర్వుచేశాడు.

ఇంకేం? వాయిద్యాలు మోగాయి. అమ్మాయిలంతా ఒకరితరువాత ఒకరు లేచి గుండ్రంగా తిరుగుతూ నృత్యంచేయడం మొదలెట్టారు.

నృత్యంచూస్తోంటే కోల్యాకు హుషారెక్కుతోంది. అతనికి జ్ఞాపకంవచ్చింది. గతసంవత్సరం తానువచ్చినప్పుడు, పిల్లలందరిలోకీ టమారా అద్భుతంగా నృత్యం చేసింది. అందుకని మళ్లీఅడిగాడు. ఒకచక్కని నృత్యం ప్రదర్శించమని ఆమెను కోరాడు. ఇంతలో వాళ్ళమధ్యనుంచి, రైజ్నేకంట్రాక్టరు బయటికి వెళ్ళిపోయాడు. కాని, అతనువెళ్ళడం కోల్యా గమనించలేదు.

వెర్కా పెట్రోవ్ పక్కన కూచుని, ఎంతసేపటిబట్టి నగలుపోతున్నా, అతను స్వాధీనంఅయ్యేలా లేడు. తాగిన బ్రాందీ ఎప్పుడో తలలోంచి దిగిపోయింది. ఇప్పుడతను మామూలుమనిషియై, ధైర్యంలేక బిక్కుబిక్కుమంటూ కూచున్నాడు. గుండెల్లో విపరీతమైనఅదురు ప్రారంభమైంది. తలనొప్పిగావుందనిచెప్పి బయటికి వెళ్ళిపోదామన్నా, లేక వేశ్యలెవరూ అక్కర్లేవని చెప్పుదామన్నా, కోల్యా తనను వదిలిపెట్టడనీ, ఒప్పుకోడనీ అతనికి బాగా తెలుసు. పైగా అతనితో ఈమాట చెప్పడానికికూడా ధైర్యంలేదు.

డాన్సు అయిపోయింది. కోల్యా, టమారా ఒకరిపక్కన ఒకరు కూచున్నారు.

'జెన్నీ ఇంతవరకూ రాలేదే? ఏమిటికారణం?' అనడిగాడు కోల్యా.

వెంటనే టమారా వెర్కావంక ప్రశ్నార్థకంగా క్రీగంట చూచింది. వెర్కా ఆమె ప్రశ్నకు జవాబుగా కనురెప్పలువాల్చింది. అంటే జెన్నీతో వున్న విటుడు వెళ్ళిపోయాడని దీనిఅర్థం.

'నేనువెళ్ళి ఆమెను పిలుచుకొస్తాను' అంటూ టమారా లేచింది.

"ఏం నాయనా! ఎప్పుడూ మీకాజెన్నీయే కావాలా? నేను పనికి రానూ? నాతోవుండండి" అంది హెన్రీట్టా, కోల్యావైపు దీనంగాచూస్తూ.

"సరే. ఈసారివచ్చినప్పుడు...నీతో వుంటాను." అన్నాడు కోల్యా కొంచెం కంగారుపడి, సిగరెట్టుముట్టిస్తూ.

జెన్నీ ఇంకా బట్టలు కట్టుకోలేదు. అద్దంముందు కూచుని పౌడరుఅద్దు కుంటోంది. టమారా రావడంచూచి ఆమె అడిగింది.

"ఏం టమారా? ఏం కావాలి?"

"నీకోసం ఆ మిలిటరీ కుర్రాడొచ్చాడు.చాలా సేపటినుంచి కనిపెట్టుకుని కూచున్నాడు."

"ఓ! అతనా! గతసంవత్సరం వచ్చిన కుర్రాడు!"

"ఆఁ అతనే. ఇప్పుడతను బాగా ఎదిగాడు. అందంగా,ఆరోగ్యంగా వున్నాడు. నీ కతనితో వుండడం ఇష్టంలేకపోతే, నేనువుంటాను."

అది విని జెన్నీ కోపంగా కనుబొమలు ముడివేయడం, టమారాకు అద్దంలో కనపడింది.

"కాదు, ఉండు చెపుతాను... టమారా! వద్దు. వద్దు....అతన్ని ఇక్కడికి పంపించు. నాకు తలనొప్పిగావుందనీ అవతలికి రాలేననీచెప్పు." అంది జెన్నీ.

'అవును. నేనూ ఆమాటేచెప్పాను. జోస్యా తలుపుతీస్తోంటే, పొరపాటున నీ మొహానికి తగిలిందనీ, తలకు గుడ్డకట్టుకుని మంచంమీద పడుకుందనీ, చెప్పాను జెనిచ్కా! ఇవాళ ఇలా గొడవజరగడం బాగుందంటావా?' అంది టమారా.

'బాగుందో లేదో, అది నీ కనవసరం. నీపని చూచుకో పో!' అంది జెన్నీ కొంచెం దురుసుగా.

'ఇలా జరిగినందుకు నీవు విచారించడంలేదూ?'

'ఏం? నీవు నన్ను గురించి విచారిస్తున్నావా? ఆ దురదృష్టవంతురాలు ల్యూబానుగురించి విచారిస్తున్నావా? అలాగే పాపం గతేమిటి? హు! నీవు మనిషివి కావే. ఒక మొద్దువు.'

టమారా మందహాసంచేసి మళ్ళీ ఇలా అంది—

'లేదు జెన్నీ! అవసరంవచ్చినప్పుడు నేనేం అంత మొద్దులా ఊరుకునేదాన్ని కాను. చూస్తావుగా, తొందరలోనే, రుజువుచేస్తాను. ఇప్పుడు మనకు అనవసరంగా తగాదాఎందుకు? జీవితం కులాసాగా గడిపే వనవిహారంకాదు జెన్నీ! సరే. నేను వెళ్ళి అతన్ని పంపిస్తాను.'

టమారా వెళ్ళిపోగానే జెన్నీ పడుకునేటప్పుడు వేసుకునే జాకెట్టు తొడుక్కొని మంచంమీద పడుకుంది. ఓ నిముషం తరువాత కోల్యా అక్కడికి వచ్చాడు. అతనివెనకాల టమారా పెట్రోవ్ చేయిపట్టుకుని లాక్కొస్తూవుంది. అతను చేయివదిలించుకోవడానికి ప్రయత్నిస్తూ ఆమె బలవంతాన నడుస్తున్నాడు. వీరి వెనుక జోస్యా నిలబడి తొంగితొంగి చూస్తోంది.

'చాలాబాగుంది. అందమైన మీ ఇద్దరికీ, పండ్లలాంటి పిల్లలు ఇద్దరు దొరికారు. ఏంనాయనా! ఏమైనా కావాలా? బీరు తేనా? లేక వైన్ తేనా?' అనడిగింది జోస్యా.

కోల్యాకు జేబులో పుష్కలంగా డబ్బుంది. పాతికరూబుల్సు. ఇంకేం? తినొచ్చు, తాగొచ్చు, ఇష్టం వచ్చినట్లు వుండొచ్చు. అప్పటికి బీరు తాగాడు కాని, వగరుగా వుండడంవల్ల అది అతనికి అంతగా రుచించలేదు. మరి అంతా బీరు, బీరు అని ఎందుకు పడిచస్తారో అనుకున్నాడు.

'మీ దగ్గర సరుకు అంత మంచిదికాదే!' అన్నాడు కోల్యా.

'మంచిది కాకపోవడమేమిటి? బలే పసందైన సరుకైతేను. మా దగ్గరున్న పానీయాలు అంతా అద్భుతంగా వుంటాయని మెచ్చుకుంటారు. రకరకాల బ్రాందీ, అనేకరకాల వైనూ వున్నాయి. పోర్టువైన్ అయితే అద్భుతంగా వుంటుంది. అంతా అదే కావాలంటారు.'

"ఎంతధర?"

"ధరదేముందండీ! మామూలే. అందరూ పుచ్చుకున్నట్టే మేమూ పుచ్చుకుంటాము. తమదగ్గర ఎక్కువ అడుగుతామా? వైన్ సీసాఖరీదు అయిదురూబుల్సు, లెమనేడ్ ఒకసీసా యాభైకోపెక్కులు; నాలుగు లెమనేడ్‌లు, ఒకసీసా వైనూ మొత్తం ఏడురూబుల్సు అవుతుంది."

"ఏమిటది జోస్యా?" మధ్యలో జెన్నీ జోక్యం కలిగించుకుంది. "కుర్రాళ్ళను దోచుకోడానికి నీకు సిగ్గువెయ్యడంలేదూ? మొత్తం అయిదు రూబుల్సుకంటె ఎక్కువకాదు. నీకామాత్రం పెద్దా, చిన్నా తెలియడంలా? ఎవరుపడితే వారిని అడగడమేనా? వాళ్ళు అందరిలాంటివాళ్ళు కాదు."

ధర తగ్గించాలని జెన్నీ చెపుతున్నప్పటికీ కోల్యా నిర్లక్ష్యంగా, పది రూబుల్సునోటు తీసి టేబుల్ మీద పడేశాడు. 'అనవసరమైనమాటలతో పని లేదు. వెంటనే అవి తీసుకురా' అన్నాడు కోల్యా, జోస్యాతో.

"మాకు రావల్సినడబ్బుకూడా ఇందులోనే తీసుకుంటాను. తమరు ఒకసారి వుండిపోతారా? లేక రాత్రిఅంతా వుంటారా? రేటువిషయం తమరు తెలుసు ననుకుంటా. ఒకసారికి రెండురూబుల్సు, రాత్రికి అయితే అయిదు రూబుల్సు" అంది జోస్యా డబ్బుతీసుకుంటూ.

"చాలు చాల్లే! ఇక అంతటితో ఆపు. వారు ఒకసారి వుండిపోతారు. ఇంకా ఇవ్వాల్సింటే ఇస్తార్లే. ఆమాత్రం నమ్మకం లేదూ?" అంది జెన్నీ తిరిగి కోపంగా.

పానీయాలు గదిలో తెచ్చిపెట్టారు. టమారా ఏవేవో వగలుపోతూ ఇచ్చకాలాడుతూ కూచుంది. జెన్నీ తెల్లమంకోను లోపలికిరమ్మని పిలిచింది ఆమెమాత్రం మంచంమీదినుంచి లేవలేదు. పానీయాలు ముట్టుకోలేదు. గది అంతా వెచ్చగా వున్నప్పటికీ ఉన్నిశాలువ ఒకటి రొమ్ములవరకూ కప్పుకుని పడుకుంది. తనను వలచివచ్చిన కోల్యావంక కన్నెత్తికూడా చూళ్లేదు.

"ఏమిటీసంగతి జెన్నీ? అలా వున్నావేం?" అనడిగాడు కోల్యా, మంచంమీద ఆమెపక్కన కూచుని చేతిమీదతడుతూ.

"ఏం లేదు. కొంచెం తలనొప్పిగావుంది. అంతే."

"దానిమీదే దృష్టివుంచుకోకుండా వుంటేసరి. తగ్గిపోతుంది."

"ఏం ఫరవాలేదు. మీరుపక్కనవుంటే నా కిప్పుడెంతో హాయిగా వుంది. ఇంతకాలంబట్టీ మమ్మల్ని చూడ్డానికి రానేలేదే?"

'ఏం చేయమంటావు జెన్నీ! ఊళ్ళోలేను. డ్యూటీమీద క్యాంపుకు వెళ్ళాను. రోజుకు పదిహేను మొదలు ఇరవైమైళ్ళవరకూ నడవాల్సివచ్చేది. కవాతుచెయ్యడం, సైనికదళానికి కావలసిన సామాగ్రిఅంతా మోసుకుపోవడం, దళాన్ని రక్షణలో వుంచడం; ఓ! ఒకటేమిటి? చచ్చేపని అయిందనుకో. చాలా అలసిపోయాను. రాత్రిళ్ళు ప్రాణాలు పోయినట్లుండేది. సేనావిన్యాసాలు చేయడం, దండును అనేకవిధాల నడపి,నిలిపి, వ్యూహాలు పన్నడం, ఇవన్నీ చేశాం.'

'ఓ! మిమ్మల్ని ఎంతబాధపెడుతున్నారు!' అంది మంకా మధ్యలో కలిగించుకుని. 'శతశరీరం మీది. ఎలాంటివాళ్ళను ఇంత హింసపెట్టడండేనికి? నిజంగా చెపుతున్నాను. మీలాంటి తమ్ముడో, కొడుకో నాకు వున్నట్లయితేనా, అతనికోసం ప్రాణం విడిచేదాన్ని.'

కుర్రాళ్ళిద్దరూ గ్లాసులు తాకించి, తాగడం మొదలెట్టారు.

'మరి నీ సంగతేమిటి జెకోచ్కా? నీవెలావుంటున్నావు?' అనడిగాడు కోల్యా, ఆమెకు వైన్‌గ్లాసు అందిస్తూ.

'నాకొద్దు, నేను తాగను. మీరుతాగండి అమ్మాయిలూ! ఇహ మీరు టైం అయినట్లుంది వెళ్ళకూడదూ?'

గదిలోంచి అంతా వెళ్ళిపోయారు. జెన్నీ కోల్యా మాత్రమే మిగిలారు. అప్పుడు అడిగింది జెన్నీ.

"మీరు రాత్రిఅంతా వుండాలనుకుంటున్నారా? కావాలనుకుంటే వుండండి. మరేం ఫరవాలేదు. మీదగ్గర తగినంత డబ్బులేకపోయినా ఇబ్బంది లేదు ప్రియా! తక్కిందినేనే ఇస్తాను. మీమీద ఏపిల్లఅయినాకన్ను వేస్తుంది. డబ్బుకు కక్కుర్తిపడకుండానే మీదగ్గరికొస్తుంది. ఇప్పుడంత అందంగా తయారైనారు మీరు." అంటూ జెన్నీ నవ్వసాగింది.

కోల్యా తలతిప్పి ఆమె మొహంలోకి చూచాడు. పరధ్యాన్నంగా వున్నప్పటికీ అనేక ఉద్రేకాలు కలిసివున్న ఆమెకంఠస్వరం, అతని చెవులకు విచిత్రంగాసోకింది. విచారం, కోపం, బాధ, మృదుత్వం, ఎగతాళి, ఇవన్నీ ఆమె స్వరంలో మేళవించివున్నాయి.

"లేదు ప్రేయసీ! నీదగ్గర ఎంతసేపయినా వుండాలని నాకుతూహలం కాని పదిగంటలకల్లా ఇంటికొస్తానని గట్టిగా చెప్పివచ్చాను."

“మరేం ఫరవాలేదు. మీకోసం కనిపెట్టుకుని వుంటారులే. చాలా కాలానికి వచ్చారు. మాంచి రసికుడిలా తయారై వున్నారు. అందుకని చెప్పాను. సరే, మీ ఇష్టంవచ్చినట్లే కానీయండి. దీపం ఇలాగే వుంచనా లేక తగ్గించనా? మీకు ఎటుపక్కన పడుకుంటే బాగుంటుంది? గోడ పక్కనా?”

“ఎలాగైనా ఫరవాలేదు.” అన్నాడు కోల్యా, వణుకుతున్న కంఠంతో. తరువాత అతను వెచ్చగా, గట్టిగావున్న ఆమెశరీరాన్ని అమాంతం కౌగలించుకుని ముద్దుపెట్టుకోబోయాడు. కాని ఆమె కొంచెం వెనక్కు గుంజుకుంది.

“ఉండండి ప్రియా! కొంచెం ఓపికపట్టండి. ముద్దులకేం తొందర? కావల్సినంత వ్యవధివుంది. కదలకుండా, నిశ్శబ్దంగా పడుకోండి.” అంది.

ఆమె బలంగా, బరువుగా, ఏదో ఆజ్ఞాపిస్తున్నట్లు మాట్లాడింది అయినా ఆమాటలు మోహింపచేస్తూ, ఆ కుర్రాణ్ణి మూర్ఛితుణ్ణిగా చేస్తున్నాయి. ఆమెచెప్పినట్లు అతను తలకింద చేయిపెట్టుకుని వెల్లకిలపడుకున్నాడు. ఆమె తనమోచెయ్యి ఆధారంగా చేసుకుని కొంచెం లేచింది. మందంగా వెలుగుతోన్న దీపకాంతిలో ఆ యువకుడిశరీరం అంతా నిశ్శబ్దంగా పరీక్షగాచూచింది. శరీరం యావత్తూ తెల్లగా, బలంగా పటుత్వమైన నరాలతో కండలు తేలివుంది. అతనివక్షస్థలం విశాలంగా, అత్యున్నతంగా వుంది. సన్నని నడుము, మెత్తనిపార్శ్వాలు. అతనితొడలు గట్టిగా, బలంగా ముందుకు ఉబికివున్నాయి. అతని ప్రతిఅవయవం ఆమె పరిశీలనగా చూచింది. ఆకలిగొన్న మృగంలా చూచింది.

కోల్యా ఒకక్షణంవరకూ కళ్ళు మూసుకుని వున్నాడు. అయినా, ఆమెచూపులు—బలంగా ఏకాగ్రతతో చూచినచూపులు తన శరీరాన్ని, మొహాన్ని తాకినట్లనిపించిం దతనికి.

తరువాత అతను కళ్ళుతెరచిచూచాడు. నల్లటికళ్ళు, పెద్ద ఆకారం గల స్త్రీమూర్తి ఎదుట అగుపించింది.

ఆమె ఎవరో అతనికి తెలీదు.

‘ఏమిటి జెన్నీ నా వైపు అలాచూస్తావ్? ఏమిటి నీఆలోచన?’ అన్నా డతను నెమ్మదిగా తెప్పరిల్లుకుని.

'మీ పేరు కోల్యా కదూ?'

'అవును'

'నా మీద కోప్పడకుండా మళ్ళీ ఒకసారి కళ్ళుమూసుకోండి. కాదు గట్టిగా మూసుకోండి. ఇంకా గట్టిగా. ఈ ఒక్కమాటు నాసరదా తీర్చండి. దీపం ఇటువైపు తిప్పి మిమ్మల్ని బాగా చూస్తాను. ఆ...అలాగా...అంతే. ఇప్పుడు బాగుంది. అద్భుతంగా వున్నారు. ఇంకా కొన్నాళ్ళుపోతే చెడిపోతారేమోగాని, ఇప్పుడు మాత్రం బ్రహ్మాండంగా వున్నారు. వెంట్రుకల మాదిరి, చిక్కనిపాల వలె, ఏదో అడివిపూవు మాదిరి వాసనవేస్తున్నారు. దయచేసి అలాగే కళ్ళుమూసుకుని వుండండి.'

ఆమె లేచి లాంతరు గోడవైపుకు తిప్పింది. మళ్ళీవచ్చి యథాస్థానంలో గొంతుకూచుంది. అది ఆమెకు ఇష్టమైన పోజు! ఇద్దరూ మౌనంగా వున్నారు. దూరంగా, గోడలగదుల అవతల వాయిస్తోన్న పియానోధ్వని వినపడుతోంది, ఎవరిదో వికృతమైన నవ్వు వినపడింది. అవతలివైపు నుంచి ఏదో పాట, శృంగారమైన సంభాషణ అస్పష్టంగా వినిపిస్తోంది. వీధిలో ఎక్కడో దూరంగా బండిపోతున్న చప్పుడు.

'ఇతగ్గాడి మల్లేనే, ఇతనికీ ఇప్పుడు రోగం తగిలిస్తాను.' అనుకుంది జెన్నీ తనలో. మళ్లీ అతని శరీరసౌష్టవం, సౌందర్యం, అమాయకత్వం చూస్తోంటే ఆమెకు జాలి కలుగుతోంది. ఏమీ ఎరుగని పసివాడనీ, ముందు ముందు అతనికెంతో భవిష్యత్తువుందనీ, అలాంటివాడి జీవితం నాశనం అవుతుందనీ బాధపడసాగింది. 'అతన్నిచూచి నేనెందుకు జాలిపడాలి? ఎందుకంటే అతను అందంగా వున్నాడు కనుక. నేను ప్రేమిస్తున్నాను కనుక. చెల్లేను. ఇలాంటి ఆలోచనలు నా మనస్సులోకి చాలాకాలంనుంచీ రానీయడంలేదు. అవును. ఇతనుకుర్రాడే కావచ్చు. గతసంవత్సరం ఇతను నాతో ఆడుకున్నాడు. వెళ్ళేటప్పుడు జేబులనిండా ఆపిల్ పండ్లు, కలకండ ముక్కలు పెట్టిపంపాను. అంతమాత్రంచేత ఎందుకు కనికరించాలి? కానీ, నాకిలా సవాయిరోగం అంటుకుందని అతనితో చెపితే? బహుశా అతను నమ్మడేమో! లేక కోప్పడతాడా? మరొక అమ్మాయి దగ్గరకు పోతాడా? త్వరగానో ఆలస్యంగానో ప్రతివాడికీ ఇలా జరగాల్సిందే. దాన్ని గురించి ఆలోచించడం, విచారించడం అనవసరం. అందరి

లాగే ఇతనూ నన్ను డబ్బుపెట్టి కొనడానికి వచ్చాడా? అందరికిమల్లేనే నా బ్రతుకు ఎలాంటిదో ఆలోచించకుండా, గుడ్డిగా మూఢంగా ప్రవర్తిస్తాడా?'

"కోల్యా!" అంది ఆమె మృదువుగా "కళ్ళు తెరవండి."

అతను కళ్ళు తెరచి ఆమెవైపు తిరిగాడు. ఆమె మెడను రెండుచేతులతో చుట్టి దగ్గరకి లాక్కుని వక్షోజాలమీద ముద్దు పెట్టుకోవడానికి ప్రయత్నించాడు. కాని మళ్ళీ ఆమె వెనక్కు లాక్కుని వుపాయంగా తప్పించుకుంది.

"వద్దు వద్దు. ఉండండి. ఒక్క క్షణం ఉండండి. ఒకమాట అడుగుతాను చెప్పండి. మీరు మా దగ్గరకు — మాలాంటి స్త్రీల వద్దకు రావడానికి కారణం ఏమిటి?"

అదివిని కోల్యా మెల్లగా నవ్వాడు.

"ఎంత కొంటెపిల్లవు నీవు! ఉండి ఉండి భలే ప్రశ్న వేశావే! మగాళ్ళంతా ఎందుకొస్తారో నేనూ అందుకే వచ్చాను. నేనుమాత్రం మగాణ్ణి కాదా...? నాకు యుక్తవయస్సు వచ్చింది... స్త్రీ అవసరమైంది. వేరేరకమైన పాడుదురభ్యాసాలకు లోనై, అందరికిమల్లే నన్నూ కృత్రిమమైన ఉద్రేకాలతో ఆరోగ్యం పాడుచేసుకోమంటావా?"

"అంచాత మీకు స్త్రీ అవసరమైందన్నమాట! అవసరం! కేవలం అవసరం! అంటే మీ భావం, నాపక్కకింద వున్న వస్తువుమాదిరి నేను మీకు అవసరమయ్యానన్నమాట?"

"కాదు. కేవలం అవసరమే కాదు" కోల్యా మళ్ళీ మందహాసం చేసి అన్నాడు. "నీవంటే నాకిష్టం... తొలిసారి చూడగానే నీవు నాకు నచ్చావు... ఇంకా చెప్పాలంటే నీమీద నాకు కొంత ప్రేమఉంది. ఎప్పుడూ నీవుతప్ప నేను మరేపిల్లదగ్గరా వుండలేదు."

"సరే బాగానేవుంది. కాని ఆ మొదటిసారి వున్నప్పుడు — అప్పుడూ అవసరమయ్యే ఉన్నారా?"

"పూర్తిగా అలాఅని చెప్పలేను. నాకో స్త్రీ అవసరమని చూచాయగా అనిపించింది. నా మిత్రులంతా నన్నక్కడికి రమ్మని బలవంత

పెట్టారు. నీకు తెలుసుగా! వాళ్ళు అంతకుముందే ఎప్పుడూ ఇక్కడికి వస్తుండేవాళ్ళు. ఇంకేం? నేనూ వారివెంట వచ్చాను."

"ఆ మొదటిసారి మీకు సిగ్గనిపించలా?"

ఈ ప్రశ్న వినేసరికి కోల్యా కొంచెం చికాకుపడ్డాడు. ఇలాంటి అర్థం లేని పడకగది ముచ్చట్లు అతనికి కష్టం కలిగించాయి. అయినా నిబ్బరించుకుని ఇలా జవాబు చెప్పాడు.

'అవును. చాలా సిగ్గేసింది. భయంకూడా కలిగింది. ధైర్యం కలగడం కోసం తాగివచ్చాను.'

జెన్నీ మళ్ళీ తనమోచేయి ఆధారంగా చేసుకుని అతని పక్కన పడు కుంది. రెప్పవాల్చకుండా అతనివైపే చూస్తోంది.

'అయితే ప్రియా! యిదికూడా చెప్పండి.' ఆమె మెల్లగా మాట్లాడ సాగింది. మాటలు అర్థంచేసుకోవడానికి కూడా వీలుకానంత అస్పష్టంగా మాట్లాడసాగింది 'నాకు డబ్బుయిచ్చే విషయంలో మీ ఉద్దేశ్యం ఏమిటి? ఈ దౌర్భాగ్యపు రెండురూబుల్ని నా మొహాన పారేయడం, నా ప్రేమ కోసం, నా ముద్దులకోసం, నా శరీరం కోసమేనా? యిలా చేస్తున్నందుకు మీకు సిగ్గనిపించడంలేదూ? చెప్పండి.'

'అరె దేవుడా! ఏమిటి నీప్రశ్నలు? యివాళ అంతా విచిత్రంగా అడుగుతున్నావే. యిందులో ఏముందని? అంతా డబ్బిస్తున్నారు. నేనూ యిస్తున్నా. నేనివ్వకపోతే మరెవడోయిచ్చి నిన్ను అనుభవించి పోతాడు. యిందులో వింత ఏముంది?'

"మీరెప్పుడైనా ప్రేమించారా? ప్రేమంటే, నిజమైనప్రేమనుగురించి కాదు నేనడిగేది, మోహం కళ్ళకు ఎగదట్టిన కామం. దీనివిషయం చెప్పండి మీరు ఏపిల్లకైనా పూలు తెచ్చి యిచ్చారా? చెట్టాపట్టాలు పట్టుకుని పండు వెన్నెలలో విలాసంగా షికారుచేశారా? చెప్పండి."

"అవును. ప్రతి మగాడూ తనయవ్వనంలో యిలాంటి పిచ్చిపనులు అనేకం చేస్తాడు. ఇందులో పెద్దఆశ్చర్యమూలేదు. ఆలోచించదగిందీ లేదు." అన్నాడు కోల్యా, అంగీకరిస్తున్నట్లు.

"అయితే మీరెప్పుడూ ఆమెను ముట్టుకోలేదా? ఆమెను వదిలేసి వుంటారు. అవునా? 'ఇదుగో! నన్నుభవించండి, నాకు రెండురూబుల్స్

మాత్రం ఇవ్వండి.' అనిఆమె అడుగుతుందనుకోండి. అప్పుడేం సమాధానం చెప్పేవారు?"

"నీవుచెప్పేది నా కర్థంకావడంలేదు జెంకా!" హఠాత్తుగా కోపం తెచ్చుకుని అన్నాడు కోల్యా. 'ఏమిటిలా అయిపోయావు? ఎందుకిలా నటించడం, నాటకం ఆడడం? ఇహ నే నెందుకిక్కడ? బట్టలు వేసుకుని వెళ్ళిపోతాను.'

"దయచేసి కొంచెంసేపు ఆగండి. మరోప్రశ్న అడగాలనుకుంటున్నాను. ఇదే నా చివరిప్రశ్న."

"సరే. ఏమిటది?"

"మీరెప్పుడైనా ఒక్కక్షణం మీ కుటుంబంసంగతి ఆలోచించారా? అకస్మాత్తుగా అంతా కోల్పోయి మీ సంసారానికి దారిద్ర్యం పడుతుందనుకోండి అప్పుడేమవుతుంది? మీ పొట్టనుమీరు పోషించుకోవాలి. ఏవో కాగితాలు వ్రాసిపెట్టో, వడ్రంగంపనిచేసో; ఇలాంటివాటితో పొట్టపోసుకోవాల్సి వస్తుంది. మీ అక్కచెల్లెళ్ళు ఎవరైనావుంటే వాళ్ళూ మట్టికొట్టుకుపోతారు. మాలాగే పతనమైపోతారు. అవునవును. మీ స్వంతసోదరిని ఏ దుర్మార్గుడో చెరిచి చెడగొడతాడు. అక్కణ్ణుంచి ఆమె అనిపించిన మగాడివగ్గరికల్లా పోవడం మొదలెడుతుంది. అప్పుడు మీరు ఏమంటారు?"

"నాన్సెన్స్! అర్థంలేనివాగుడు! అలా ఎన్నటికీ జరగదు." అంటూ కోల్యా అరిచాడు. 'ఇహ చాలు. నేను వెళుతున్నాను.'

'వెళ్ళండి. దయచేసి వెళ్ళండి, చూడండి. వెళుతూ వెళుతూ ఆ ఎదురుగావున్న చిన్నపెట్టెలో పది రూబుల్స్ నోటు వుంది. అదికూడా తీసుకెళ్ళండి. ఏ రకంగాను, ఏమాత్రంకూడా నాకు ఆ డబ్బు అక్కర్లేదు. ఆ డబ్బుపెట్టి మీ అమ్మగారికి బంగారపుఫ్రేం కట్టిన ఒక్క అద్దం, మీ అక్కకు బిడ్డలెవరైనా వుంటే ఆమె కొక బొమ్మ కొనుక్కుని వెళ్ళండి. చచ్చిపోయిన ఒక రంకుముండ జ్ఞాపకార్థం ఇవి తీసుకొచ్చానని వారితో చెప్పవచ్చు. ఇహ వెళ్ళండి అబ్బాయిగారూ.'

కోల్యా కోపావేశంతో ఒక్కక్షణంలో మంచంమీదనుంచి అవతలికి దూకాడు. మంచంమీదనుంచి విసిరిపారేసిన ఉన్ని శాలువను తొక్కుతూ

నిలుచున్నాడు. అతను యౌవనంలో వున్నాడు. బలంగానూ, ఆరోగ్యంగానూ వున్న ఆ యువకుడి శరీరం ఎంతో అద్భుతంగా అగుపిస్తోంది.

'కోల్యా! కొలొంచ్కా!' మెల్లగా పిలిచింది జెన్నీ. ఆమె కంఠస్వరం, ఎన్నడూ ఎప్పుడూ లేనంత మధురంగావుంది.

ఆమె పిలుపుకు అతను వెనుదిరిగి చూచాడు. జెన్నీ ముఖవైఖరి అద్భుతంగా అత్యద్భుతంగా వుంది. అంత అందంగా, అంత మృదువుగా, అగాధమూ, నిశ్చలమూ అయిన విషాదవదనాన్ని, కోల్యా తన జీవితంలో ఎన్నడూ, ఎప్పుడూ చూశ్లేదు. ఆఖరుకు బొమ్మలలో గొప్ప కళాకారులు గీసిన చిత్రాలలోకూడా అతను చూశ్లేదు. ఆమె కళ్ళల్లో నీళ్ళు నిండాయి. అతను మళ్ళీ మంచంమీద కూచుని తనకు తెలీకుండానే సన్నంగావున్న ఆమె భుజాలమీద చేతులు వేశాడు.

'మనకు తగువు వద్దు జెనీచ్కా!' అన్నాడతను శాంతంగా.

ఆమె అతన్ని దగ్గరకి అదుముకుంది. అతని మెడచుట్టూ తన చేతులు వేసి అతని తలతో తన స్తనాలను ఒత్తుకుంది. కొద్ది నిముషాలు అలా ఇద్దరూ మౌనంగా కూచున్నారు.

'కోల్యా!' అకస్మాత్తుగా పిలిచింది జెన్నీ. ఆమె కంఠస్వరం మారింది. నీ వెప్పుడైనా రోగాలు తగులుతాయని భయపడ్డావా?'

అతను వణికిపోయాడు. గుండెల్లో విపరీతమైన అదురు పుట్టింది. కడుపంతా దేవేసినట్లయింది. తీవ్రమైన చలిజ్వరంవచ్చినట్లు వణికిపోయాడు. వెంటనే సమాధానం చెప్పలేకపోయాడు.

'అవును. అది చాలా భయంకరమైనవిషయం.' అన్నాడతను చివరకు

'ఓ! అతి భయంకరం! దేవుడు మేలుచేసి నన్ను సరీగ్గానే చూస్తాడనుకుంటున్నాను. నేను నీ దగ్గరకే వస్తున్నాను. ఒక్క నీతోనే వుంటున్నాను. నీ దగ్గర అలాంటి జబ్బు లేమైనావుంటే, చెప్పివుండేదానివిగా! చెప్పవూ?'

"అవును. చెప్పివుండేదాన్ని" అంది ఆమె ఏదో ఆలోచిస్తున్నట్లు. తిరిగి వెంటనే, అర్థవంతంగా తూచినట్లు మాట్లాడింది. 'అవును. చెప్పివుండేదాన్ని. మీరెప్పుడైనా 'సవాయిరోగం' అనేపేరు విన్నారా?'

"ఓ! విన్నాను. అది చాలాభయంకరమైన రోగం అదితగిలితే కొందరికి కళ్ళు, ముక్కు; అవయవాలు ఎక్కడికక్కడ కొరుక్కుని హరిస్తాయి"

“కాదు కోల్యా! ఒక్క కన్నూ, ముక్కూ కాదు. అది తగిలినవాళ్ళకు ఒళ్ళంతా పుచ్చిపోతుంది. పురుగులు పడతాయి. చాలా భయంకరమైన రోగం. అది కనిపించకుండా లోపల లోపల నరాలు, మెదడునుకూడా తినేస్తుంది. కొందరు డాక్టర్లు ఈజబ్బు నయమవుతుందని చెపుతారు. కాని అది అబద్ధం. ఈవ్యాధిని ఎవడూ, ఆఖరుకు దేవుడుకూడా నయంచేయలేడు. ఈ జబ్బుగలమనిషి పదేండ్లు ఇరవైఏండ్లు, ముప్పయిఏండ్లుకూడా పీక్కుని పీక్కుని మురికిచావు చస్తాడు. ఏక్షణంలోనైనా అతనికి పక్షవాతం రావచ్చు శరీరంలో ఒకపార్శ్వం పడిపోవచ్చు. ఉదాహరణకు, కుడికాలో, కుడిచెయ్యో, మొహంలో కుడివైపో పక్షవాతంతో పట్టుకుపోతుంది. సగం చచ్చినమనిషియై జీవిస్తుంటాడు! అతను ఎప్పటికీ పూర్ణమైన మానవుడు కాలేడు. సగం చచ్చినమనిషి, సగంశవమైన మనిషి! ఇలాంటివారిలో చాల మందికి పిచ్చిపుడుతుంది. అతనివద్దనుంచి ఆరోగం అనేకమందికి అనేకవిధాల వ్యాపిస్తుంది. అతను తిన్నదాంట్లో తిన్నా, తాగినదాంతో తాగినా, అతన్ని ముద్దుపెట్టుకున్నా; అతని శరీరం సోకినా, ఆఖరుకు అతనిగాలి పీల్చినాసరే ఈ రోగం మరొకరికి వస్తుంది. ఈవిధంగా అతను ఎవరికైనా రోగం అంటించవచ్చు. తనకు అత్యంతప్రియమైన సోదరికి, భార్యకు, కొడుకుకుకూడా అంటించవచ్చు. ఈసవామేహపుజబ్బు భయంకరమైన అంటువ్యాధి. ఈజబ్బుగలవారి సంతానం యావత్తూ ఇలాగే కుళ్ళి కృశించిపోతుంది. గుడ్డివాళ్ళు, కుంటివాళ్లు, అంగహీనులు, పిచ్చివాళ్ళు, ఒళ్ళంతా మచ్చలుపడ్డవాళ్ళు, కుష్టువాళ్ళు, కురూపులు, క్షయ రోగులు, చెవిటివాళ్ళు, వీరంతా సవామేహపు జబ్బుగలవారి సంతానమే కోల్యా! ఈ వ్యాధియొక్క పూర్తి ఫలితం ఇదండీ అబ్బాయిగారూ!’ అంటూ జెన్నీ అతని మొహంలో మొహం పెట్టి చూచింది. అద్భుతమైన ఆ కళ్ళ చూపులకు అతను మూర్ఛపోతాడేమో! ‘ఏం ప్రియా! ఇప్పుడు మీకు చెప్పకతప్పదు. సుమారు నెలరోజుల క్రితం నాకూ ఈ జబ్బే అంటుకుంది. మంచంపట్టాను. అందుకనే ఇవాళ మిమ్మల్ని ముద్దుపెట్టుకోనివ్వలేదు.’

‘నీవు అనవసరంగా నన్ను భయపెట్టి, బాధించాలని చూస్తున్నావు జెన్నీ’ అంటూ గొణిగాడు కోల్యా, భయంతో.

‘అయితే అబద్ధంచెప్పుతున్నా ననుకున్నారా? ఇటు రండి.’

అతన్ని లేచి నిలబడమని చెప్పింది. ఒక అగ్గిపుల్ల గీచింది.

'ఇప్పుడు జాగ్రత్తగా పరిశీలించండి చూపిస్తాను.' అంటూ తన నోరు తెరిచి వెలుగుతోన్న అగ్గిపుల్ల నోటి ముందు పెట్టుకుంది. వెలుతురులో ఆమె గొంతంతా అగుపించింది. కోల్యా చూచి భయపడ్డాడు.

'తెల్లటి మచ్చలు చూచారా? అది ఈ రోగ లక్షణమే కోల్యా! మీకు తెలుసునో లేదో! ఈ జబ్బు అనేక ప్రదేశాల్లో అనేక రకాలుగా బయలుదేరుతుంది. చివరకు భయంకరమైనరూపం తాలుస్తుంది. అన్ని రకాలకూ ఒకే ఫలితం సంభవిస్తుంది. దేవుడి దయవల్ల మీరు ఇప్పుడు దూరంగా వుండ గలిగారు. ఇహ బట్టలు వేసుకోండి.'

కోల్యా ఏమీ మాట్లాడకుండా త్వరత్వరగా దుస్తులు ధరించ సాగాడు. అతను జెన్నీవంక చూడడంలేదు. అతని చేతులు వణుకుతూ స్వాధీనం తప్పిపోతున్నాయి. అంచేత తడబడుతూ బట్టలు అడ్డదిడ్డంగా వేసుకుంటున్నాడు. జెన్నీ తలవొంచుకుని మాట్లాడుతోంది.

'కోల్యా! ఈ ఒక్కమాట వినండి. మీరు అదృష్టవంతులు. అందుకనే ఒక నీతిగల స్త్రీదగ్గరికి వచ్చారు. మరొకరైతే మిమ్మల్ని ఊరికేపోనీరు. నేచెప్పేది వింటున్నారా? మేము పతితులం. భ్రష్టలం. మీలాంటివాళ్ళచేత చెరచబడి, మా ఇళ్ళల్లోంచి వెళ్ళగొట్టబడ్డాం. తరువాత మళ్ళీ మీరే మా వద్దకు వచ్చి రెండు రూబుల్సు మా మొహానపారేసి మీ ఇష్టంవచ్చినట్లు అనుభవించి పోతున్నారు.' అంటూ ఆమె తల ఎత్తి చూచింది.

'వింటున్నారా? ఇలాంటి దుర్మార్గులైన మీమీద మాకు జాలి ఎందుకుంటుంది? మిమ్మల్ని ఎందుకు కనికరించాలి? మిమ్మల్ని ఎప్పుడూ ద్వేషిస్తాం. మీకు బుద్ధి వచ్చేలాచేస్తాం. మీమీద మా కసి తీర్చుకుంటాం. భయంకరమైన రోగాలు తగిలించి, మీ జీవితాల్ని నాశనం చేస్తాం. తెలిసిందా? కాని...మిమ్మల్ని నేను వదలిపెట్టాను!...నీతిగలదాన్ని కనుక వదిలిపెట్టాను. మరో స్త్రీ అయితే ఇలా చేసేదికాదు...'

అప్పటి కింకా పూర్తిగా బట్టలు వేసుకోని కోల్యా హఠాత్తుగా, వేసుకుంటూవున్న బట్టలు కింద పడేశాడు. మంచంమీద జెన్నీ పక్కన కూచున్నాడు. తన రెండు చేతులతో మొహాన్ని కప్పుకుని పసిబిడ్డలా వెక్కి వెక్కి ఏడవడం మొదలెట్టాడు.

"ఓ దేవుడా, ఓ దేవుడా!" ఆగి ఆగి మెల్లగా అంటున్నాడు. 'నీవు చెప్పింది సత్యం! ఎంతఘోరం! ఎంతదారుణం! తలుచుకుంటే గుండెఆగి పోతోంది. మాఇంట్లోకూడా ఒకదాసీవుండేది. ఆమె చాలా అందమైనపిల్ల. మా అన్నయ్య దాంతో సంసారంచేశాడు. ఆమెగర్భవతి అయింది. మా అన్నయ్య ఆమెనువదలిపెట్టి మిలిటరీలో ఆఫీసరుగా వెళ్ళిపోయాడు. తరువాత మాఅమ్మ అన్యాయంగా ఆపిల్లను ఇంట్లోంచి గెంటివేసింది. అవును. నిర్దాక్షిణ్యంగా మెడపట్టి నెట్టింది. చిరిగిన గుడ్డపీలికను అవతలపారేసినట్లు పారేసింది. ఇప్పుడా అమ్మాయి ఎక్కడుందో! మానాన్న—ఆయనకూడా ఒక పనిమనిషిని తన ఉంపుడుకత్తెగా వుంచుకున్నాడు..."

జెన్నీ, అదీ జెన్నీ! ఒక పశువుకత్తె, ఒకనాస్తికురాలు, ఒకతిరుగుబాటుదారు, చిన్నచిన్న విషయాలకే అబద్ధాలాడి తిట్టి శపించుకుని ప్రమాణాలు చేసే జెన్నీ! మెల్లగా అతనిదగ్గరకు వెళ్ళింది. అతన్ని ఉద్దేశిస్తూ పవిత్ర హృదయంతో క్రాస్ చేసుకుంది. (మనం మానసికంగా భగవంతుణ్ణి ప్రార్థించినట్టుగా, క్రైస్తవ మతస్థులు భక్తితో తమ హృదయంమీద † ఈ గుర్తును చేత్తో అభినయిస్తారు. దీన్నే క్రాస్ చేసుకోవడ మంటారు.)

"దేవుడు నీకు మేలుచేస్తాడు బాబూ!" అంది ఆమె ప్రేమతోను, కృతజ్ఞతాపూర్వకంగాను.

తరువాత ఆమె పరుగెత్తుకెళ్లి గదితలుపు తీసి పనిమనిషిని పిలిచింది.

"జోస్యా! జోస్యా!"

ఆమె పిలుపుకు జోస్యా పలికింది.

"జోస్యా! దయచేసి టమారాగాని, మంకాగాని, ఖాళీగావున్నారేమో చూడు. ఇద్దరిలో ఎవరువీలుగావున్నా సరే, వారిలోఒకరిని ఇక్కడికి రమ్మను." అని చెప్పింది జెన్నీ.

వెనుకనుంచి కోల్యా ఏదో గొణిగాడు. కాని ఆమె వినిపించుకోలేదు.

"త్వరగావెళ్ళు జోస్యా!" తొందరపెట్టింది జెన్నీ.

"వెడుతున్నా! వెడుతున్నా!" జోస్యా పరుగెత్తింది.

"ఏమిటి జెన్నీ? ఏమిటిదంతా? వాళ్ళను ఎందుకు పిలవడం? ఇదంతా చెప్పాలనా?" అనడిగాడు కోల్యా.

“మీరాగండి ప్రియా! ఇది మీకు సంబంధించిన విషయం కాదు. ఉండండి. మీకు అయిష్టంకలిగేపని నేనేం చెయ్యనులే.”

ఒక నిముషంతరువాత తెల్లమంకా గదిలోకి వచ్చింది. స్కూలుకు వెళ్ళే విద్యార్థినిమాదిరి చక్కని దుస్తులు ధరించివుంది.

“ఎందుకో పిలిచావుట జెన్నీ! ఏం? పోట్లాడుకున్నారా?” అనడిగింది మంకా.

“లేదు. మేమేం పోట్లాడుకోలేదు మెనీచ్కా! నాకు విపరీతమైన తలనొప్పిగావుంది. వారిని సంతోషపెట్టే స్థితిలోలేను. మా అమ్మవుకదూ. నీవు మంచిపిల్లవు. నిన్ను వేడుకుంటున్నాను, నాకుబదులు నీవు ఈయనదగ్గర వుండవే.” అంది జెన్నీ.

‘ఇహ అంకటితో ఆపు జెన్నీ!’ అన్నాడు కోల్యా, విపరీతంగా బాధపడుతూ ‘నీ అభిప్రాయం నా కర్థమైంది. కాని నాకిప్పుడవసరంలేదు. ఇంకా నన్నెందుకు చిత్రవధ చేస్తావు? అసలే చచ్చి ఉన్నాను. ఇంకా ఎందుకు చంపుతావు?’

‘ఏమిటో మీ గోల? నాకేం అర్థం కావడంలేదు.’అంది అమాయకురాలైన మంకా.

‘ఏం లేదే! ఊరికే సరదాకోసం అన్నాను అంతే. ఇహ మీరు పదండి ప్రియా! మీతో నేనూ వాకిలిదాకా వస్తాను’ అంది జెన్నీ మృదువుగా.

జెన్నీ, కోల్యా, పూర్తిగా తమ దుస్తులు వేసుకుని నడవలోకి వెళ్ళే వాకిలిదగ్గర నిలబడ్డారు. ఇద్దరూ మౌనంగా వున్నారు. విచారంగా ఒకరి వంక ఒకరు చూచుకున్నారు. ఆ క్షణంలో తను ఒకానొక జీవితంమీద బలమైన అపాయాన్ని పడేసి పోతున్నానని కోల్యా ఊహించుకోలేక పోయాడు.

చివరి కలను జెన్నీచేతులు పట్టుకుని ‘నన్ను క్షమించు, నన్ను క్షమిస్తావా జెన్నీ! క్షమించవూ?’ అన్నాడు దీనంగా.

‘అవును. అవునండీ! అవును ప్రియా! అలాగే అలాగే’ అంటూ ఆమె మాతృహృదయంతో అతని తల నిమిరింది. ఆతన్ని నడవలోకి పంపించింది.

అతను వెళ్ళిపోతోంటే జెన్నీ వాకిలి పట్టుకుని నిలబడి అడిగింది.

'ఇప్పు డెక్కడికి వెడుతున్నారు?'

'ఇంటికి. నా స్నేహితుణ్ణి కలుసుకుని ఇంటికి వెడతాను.'

'సెలవు తీసుకుంటాను ప్రియా!'

'నన్ను క్షమించు, నన్ను క్షమించు జెన్నీ!' అంటూ అతను మళ్ళీ వెనక్కు వచ్చి ఆమె చేతులు పట్టుకుని దుఃఖించాడు.

'చెప్పానుగా. మీరు క్షమార్హులు. నన్నుకూడా మీరు క్షమించాలి. మళ్ళీ మనం ఒకరి నొకరం చూడకూడదు.'

ఆమె తలుపు వేసుకుంది.

కోల్యా నడవలో నిలబడి తనమిత్రుణ్ణి ఎలా కలుసుకోవటమని ఒక క్షణం ఆలోచించాడు. పెట్రోవ్ టమారాతో వెళ్ళాడు. ఏ గదిలోకి వెళ్ళిందీ తెలీదు. అంతలో జోస్యా పరుగెత్తుకుంటూ అటువెళుతోంటే అతను అడిగాడు. ఆమె నిలబడకుండానే 'నాకు వ్యవధిలేదు. తొందరగా వెళ్లాలి. ఎడమువైపున మూడోవాకిలి దగ్గరకు వెళ్ళండి' అంటూ పరుగు తీసింది.

కోల్యా ఆమెచెప్పినప్రకారం మూడోగదివద్దకువెళ్ళి తలుపుతట్టాడు. లోపల్నుంచి గుసగుసలు వినపడుతున్నాయి. అతను మళ్ళీ తలుపుకొట్టాడు.

'కర్థోవియన్! తలుపు తెరువు. నేను- సోలిటకోవ్.

వేశ్యలఇళ్ళకు వచ్చినప్పుడు మిలిటరీవాళ్ళంతా మారుపేర్లతో, దొంగ పేర్లతో పిలుచుకుంటారు. ఎవరూ గుర్తించకుండా, ప్రమాదం రాకుండా వుండగలందులకై ఇలా చేస్తారు. ఇదొకవిచిత్రమైన ఆచారం, అలవాటు. అలాగే ఇప్పుడుకూడా. వీరిద్దరూ దొంగపేర్లు చెప్పుకున్నారు.

'మీరు లోపలికి రావడానికి వీల్లేదు. మేము పనిలోఉన్నాం.'అంటూ లోపల్నుంచి టమారా, జవాబుచెప్పింది.

వెంటనే ఆమెచెప్పింది కాదంటూ, పెట్రోవ్ అరిచాడు.

'నాన్సెన్స్!అంతాఅబద్ధం!పనీలేదు, పాడూ లేదు.లోపలికిరావోయ్!'

తలుపుతీసుకుని కోల్యా లోపలికెళ్ళాడు. పెట్రోవ్ మామూలుగా దుస్తులుధరించి కుర్చీలో కూచునివున్నాడు. కాని అతనిమొహం, పెదవులు, ఎర్రగా కందిపోయి వున్నాయి. తలవంచుకుని కూచున్నాడు.

'మీరు భలేస్నేహితుణ్ణి పట్టుకొచ్చారు. నీకేసంగోయ్!' అంటూ టమారా, కోల్యాతో చెప్పసాగింది. 'నేనేదో నిజమైనమగాడనుకున్నాను. అబ్బబ్బే! తీరాచూస్తే ఏమీలేదు. ఆడపిల్లకంటె అన్యాయం. తనేదో మైల పడుతున్నట్లు, తన పురుషత్వమంతా పోతున్నట్లు, అలా భయపడతా డేమిటి? ఏదో నిక్షేపం దాచుకున్నట్లు దాచుకున్నాడు అయ్యగారు! ఇదుగో, తీసుకుపొండి మీ రెండు రూబుల్సు' అంటూ ఆమె పెద్దగా పెట్రోవ్‌తో అని డబ్బు టేబుల్‌మీద విసిరేసింది. 'తీసుకుపోయి ఏ పనిమనిషికో, బిచ్చగత్తెకో ఇచ్చుకోండి. లేకపోతే మధ్యలో మిఠాయికొనుక్కొని తినండి, హు.'

'ఏమిటా అనవసరమైన మాటలూ శాపనార్థాలూ?' అన్నాడు పెట్రోవ్ తలెత్తి. 'ఏం? నా ఇష్టమొచ్చినట్లు ప్రవర్తించడానికి నాకు హక్కు లేదూ? ఇంతసేపూ నీతో గడిపానుకనుక ఆడబ్బు నీదే... కాని బలవంతాన పనులుచేయిస్తే నేను ఒప్పుకోను... నీవుచేసినపని ఏమాత్రం బాగులేదు గ్లాడ్‌షేవ్ — కాదు సోలిటర్లోవ్! ఏదో మంచిపిల్లకదా అనుకున్నాను. కాని, అబ్బబ్బ! ఒకటే ముద్దులు. ముద్దులమీద ముద్దులు! అలాముద్దు పెట్టుకుని పెట్టుకుని చివరకు నన్నేంచేసిందో ఆ ఈశ్వరుడికే తెలియాలి.'

టమారాకు కోపంపోయి నవ్వొచ్చింది. పెద్దగా నవ్వి 'ఓ! నీ వెంత కొంటె పిల్లగాడివి. సరే—కోపం అక్కర్లేదు. మీ డబ్బు తీసుకుంటానులెండి. కాని ఒకటిమాత్రం గుర్తుంచుకోండి. ఈ రాత్రి మీరు విచారిస్తారు. చాలా విచారిస్తారు. సరే. ఇహ కోపగించకండి. ఇహ వెళదామా? ఏదీ ఒకసారి కరస్పర్శ చేయనివ్వండి!' అంటూ టమారా పెట్రోవ్‌కి షేక్‌హాండ్ ఇచ్చింది.

'ఇహ రా కరోక్కదియస్' పిలిచాడు కోల్యా 'గుడ్‌నైట్ టమారా! వస్తాను.'

వేశ్యలందరికీగల అలవాటుప్రకారం, టమారా డబ్బు తన మేజోళ్ళలో దాచుకుని వాళ్ళను సాగనంపడానికి వెంట వెళ్ళింది.

నడవలో నడుస్తుండగానే, హాలులో ఏదో విచిత్రమైన సంభాషణ సందడి అవుతున్నట్లు కోల్యాకు తోచింది.

వెంటనే ఆ ఇద్దరు కుర్రాళ్ళు, హాలులోకి వచ్చి చూచేసరికి విచిత్రంగావుంది. అన్నా ఇంట్లోవుండేవారంతా అక్కడ పోగయ్యారు. అనేకమంది కొత్తవారుకూడా వున్నారు. హాలంతా జనంతో క్రిక్కిరిసి సందడిగావుంది. వారంతా గుంపుగా నిలబడి నేలమీదికి వంగిచూస్తున్నారు. కోల్యాకు మరీ ఆశ్చర్యంవేసింది. గుంపులోకి వెళ్ళి జనాన్ని అటూ ఇటూ తోసి, వాళ్ళ మధ్యలోంచి తనుకూడా తల పెట్టి తొంగిచూచాడు. 'హోలీ... పోలీ' అసహజంగా, క్రింద పడుకునివున్నాడు. అతని చుట్టూరా ఈ గుంపంతా చేరింది. అతని మొహం నీలంగా, దాదాపు నల్లగా అయిపోయింది. కదలడంలేదు. కాళ్ళు అడ్డదిడ్డంగా పడివున్నాయి. నిలువుగుడ్లు వేసి భయంకరంగా చూస్తున్నాడు. ఒకచెయ్యి వక్షస్థలంమీద పెట్టుకున్నాడు. రెండోచెయ్యి, పక్కన చాచుకున్నాడు!'

'ఏమైంది అతనికి?' అన్నాడు కోల్యా కంగారుపడుతూ. న్యూరా అనే పిల్ల రహస్యంగా జవాబు చెప్పింది.

'అతను ఇప్పుడే వచ్చాడు. మంకాకు ఐస్ క్యాండీ, ద్రాక్షలు తెచ్చి ఇచ్చాడు. ఆమె కేవో కథలు చెప్పడం మొదలెట్టాడు. 'నీలి రంగులో వుంటుంది, కచ్చేరి చావడిలో వేలాడగడతారు. ఏమిటో చెప్పండి.' అని ప్రశ్న వేశాడు. మేం చెప్పలేకపోయాం.

'అది ఒక రకమైన చిన్న చేప' అంటూ అతనే జవాబు చెప్పాడు. తరువాత పెద్దగా నవ్వాడు. ఖళ్ళుఖళ్ళుమని దగ్గాడు. క్రింద పడిపోయాడు మళ్ళీ కదల్లేదు. పోలీసులకోసం కబురుపంపారు. ఓరి దేవుడా! ఎంత భయంకరమైన సంఘటన! శవాన్ని చూస్తే నాకు చచ్చే భయం'

'ఉండు చూద్దాం. బహుశా ప్రాణం వుందేమో!' అంటూ కోల్యా అతన్ని సమీపించబోయాడు.

కాని వెంటనే కాపలావాడు సిమన్, ఇనప చువ్వల్లాంటి తన వేళ్ళతో అతని చెయ్యి పట్టుకుని వెనక్కు గుంజాడు.

'వెళ్ళండి అబ్బాయిలూ! ముందిక్కణ్ణుంచి వెళ్ళిపోండి. ఈ చాయల కనిపించారా అంటే ఊరుకోను. పోలీసులు వస్తారు. మిమ్మల్ని సాక్ష్యం చేస్తారు. దాంతో మిలిటరీ స్కూలులోంచి మిమ్మల్ని గెంటేస్తారు. మీ

తిక్క కుదురుతుంది! వెళ్ళేవాళ్ళు వెళ్ళడం మంచిది. ఎందుకీ ఊబిలో దిగుతారు?' అన్నాడు సిమన్ దురుసుగా.

అతను, ఆ ఇద్దరు కుర్రాళ్ళను ముందుగదిలోకి తీసుకొచ్చి వాళ్ళ 'ఓవర్ కోట్లు' చేతికిచ్చాడు.

'రాండి. త్వరగా రాండి. పరుగెత్తండి! మళ్ళీ ఇటొచ్చారా, లోపలికి రానీయను. తెలిసిందా! సరే, ముందీ ముసలాడికి కాస్త డబ్బు పడెయ్యండి. వోడ్కా తాగుతాడు. మీతో అరవడంవల్ల నా గొంతు పోయింది.' అన్నాడు సిమన్ గట్టిగా.

'వోడ్కా తాగితే మరీ వాగుతావు, ఊరుకోరా ముసలితొత్తా!' అని అరిచాడు కోల్యా.

దాంతో సిమన్‌కు పట్టరాని ఆగ్రహం వచ్చింది. పళ్ళు పటపట కొరికాడు. కనుబొమలు ముడివేశాడు. వికృతమైన మొహాన్ని వివిధవంకర్లు తిప్పాడు. అతన్ని చూచేసరికి ఆ కుర్రాళ్ళిద్దరూ హడలెత్తిపోయారు.

'మీ మొహాలు పగలకొడతాను! నరుకుతాను. ముక్కలు ముక్కలు చేస్తాను. పొండి వెధవల్లారా! లేకపోతే నా చేతిలో ఇవాళ చచ్చారన్న మాటే.' బ్రహ్మాండంగా అరిచాడు సిమన్.

కుర్రాళ్ళిద్దరూ మెట్లమీదనుంచి కిందికి పరుగుతీశారు. దోవలో వారికి ఇద్దరుమనుషులు ఎదురుపడ్డారు. ఒకడు ఎర్రచొక్కా, మరొకడు నీలి రంగుచొక్కా వేసుకున్నారు. వాళ్ళిద్దరూ పక్కఇళ్ళల్లోని కాపలావాళ్ళని స్పష్టంగా తెలుస్తోంది.

'ఏమిటీ!' అడిగాడు ఎర్రచొక్కావాడు, సిమన్‌ని.

'కోలీ-పోలీ' పరలోకయాత్ర చేశాడు.'

'అవును, చచ్చాడు. ఇప్పుడుమనం అతన్నిపట్టి వీధిలో పారెయ్యాలి. లేకపోతే మన దుంప తెగుతుంది. గాడిదకొడుకు! చచ్చినవాడు చావకుండా మనచావుకు తెచ్చిపెట్టాడు. వీధిలో పారేశామూ అంటే, చూచినవాళ్ళు వాడే తప్పతాగి నడుస్తూ, పడి చచ్చాడనుకుంటారు.' అన్నాడు సిమన్ పక్క ఇంటి కాపలావాడితో.

'అసలెలా జరిగింది? నీవు వాడిమీద చెయ్యి చేసుకున్నావా?' మళ్లీ అతను అడిగాడు.

'నేనా? నీకు పిచ్చెక్కిందా ఏమిటూ? నేను చెయ్యి చేసుకోవడానికి కారణం ఏమీ లేదు. పాపం అతను చాలా మెత్తనివాడు. ఎవరినీ ఏమీ అనడు! కాలం తీరింది, చచ్చాడు. అంతకన్నా మరేం లేదు.'

'చివరకు ఇక్కడ రాసిపెట్టి వుందన్నమాట. హు! ఎవడైనా ఎంతో పాపం చేసుకుంటే నేగాని ఈ కొంపల్లోకి వచ్చి చావడు.'

'నిజం చెప్పావురా!...సరే... వెడదాం రా' అన్నాడు, నీలిరంగు చొక్కా వేసుకున్న ఆ రెండో వాడు.

ఆ ముగ్గురూ హాలులోకి వెళ్ళారు.

ఆ ఇద్దరు మిలిటరీకుర్రాళ్ళు, కాలికొద్దీ పరుగు లంకించుకున్నారు. 'రోలీ-పోలీ'— భయంకరమైన అతనిశవం, ఇంకా వాళ్ళకళ్ళల్లో మెదులుతూ వుంది. సాధారణంగా శవాన్ని చూస్తే ఎవరికైనా భయం కలుగుతుంది. అందులోనూ కుర్రాళ్ళయితే మరీ. పైగా చీకట్లో దాన్ని గురించి తలుచుకుంటే, ఇహ చెప్పక్కర్లేదు. వణుకుపుట్టాల్సిందే.

## 5

ఆరోజు తెల్లవారుజామునుంచే వర్షం ఆరంభమైంది. ముసురుపట్టినట్లు విడువకుండా సన్నని జల్లు పడుతోంది. ధూళిమాద్రి పైనుంచి తుంపరలు పడుతున్నాయి. ప్లాటొనోవ్ రేవులో పనిచేస్తున్నాడు. పడవలోంచి కర్బూజపండ్లు దిగుమతిచేస్తున్నాడు. ప్లాటొనోవ్ ఇంతకుముందు ఫ్యాక్టరీలో పనికి కుదిరాడు. కాని అతనికి అదృష్టం కలిసిరాలేదు. పనిలో చేరిన మొదటి వారంలోనే మేనేజరుతో తగాదాపడ్డాడు. తగాదా ఏమిటి? పెద్ద యుద్ధమే జరిగింది. అవును, ఫ్యాక్టరీ మేనేజరు కూలీలకు అన్యాయం చేసేవాడు. నీచంగా ప్రవర్తించేవాడు. ఇతను అది సహించలేక, పనివాళ్ళపక్షం వహించి వారి న్యాయమైన హక్కులకోసం పోరాడాడు. అంచేత వెంటనే పనిలోంచి తొలగించబడ్డాడుకూడా.

ఆ తరువాత సెర్గీ ఇవానిచ్ (ప్లాటొనోవ్) తిండికికూడా జరుగక ఒక నెలరోజులు విపరీతంగా బాధపడ్డాడు. నగరం వెలుపల ఎక్కడో వుండి

అష్టకష్టాలుపడ్డాడు. 'ఎకో' పత్రికకు, రోడ్డుమీదజరిగిన ప్రమాదాన్ని గురించో లేక మరో ఆసక్తిని కలిగించే విషయాన్నిగురించో వార్తలు పంపేవాడు. అప్పుడప్పుడు హాస్యాన్ని కలిగించే వ్యాసాలు, నవ్వుపుట్టించే దృశ్యాలు, చిత్రవిచిత్రమైన చిన్నకథలు వ్రాసి పత్రికకు పంపేవాడు. కాని రిపోర్టరుగా పత్రికా రచయితగా బ్రతకడం దుర్భరమైంది. ఈ పనిలో అతనికి విసుగుపుట్టింది. ఏదో అలుపు వచ్చినట్లనిపించింది. జీవనోపాధికి ఇది తగినవృత్తి కాదని తోచింది. ఇంతకన్నా కాయకష్టం చేసుకుని జీవించడం మంచిదనీ అందులో కొంత మనశ్శాంతి సుఖం ఉన్నాయనీ ఆశించాడు. ఈ కారణంవల్లనే రేవులో పనికి కుదిరాడు. అప్పటికి నీపర్ నదిలో పైనుంచి పడవలు కర్బూజపండ్లు వేసుకుని రేవుకు రావడం ప్రారంభించాయి. రేవులో పండ్లు దిగుమతిచేసే ఇతరకూలీలతోపాటు తనూ పనికి కుదిరాడు. అవును. బుద్ధిపూర్వకంగానే అతను ఈ పనిలో ప్రవేశించాడు. కూలీలమధ్య జీవించడం ప్లాటొనోవ్ కు మహా సరదా. గత సంవత్సరం ఈ కూలీలతోనే కలిసి తను కొంతకాలం వున్నాడు. అంచేత వారందరూ ఇతనికి తెలుసు. పైగా పనివాళ్ళంతా ఇతనంటే అతి ప్రేమగా చూస్తారు. మంచివాడనీ ఉల్లాసంగావుంటాడనీ విద్యావంతుడనీ తమకు రావల్సిన కూలికి సంబంధించిన లెక్కా డొక్కా వ్రాయడంలో నేర్పుగలవాడనీ న్యాయంకోసం నిలబడి పోరాడతాడనీ ఇతనంటే పనివాళ్ళంతా ఇష్టపడేవారు. ఇతన్ని గౌరవించేవారు.

రేవులో సరుకు దిగుమతి దివ్యంగా సాగిపోతోంది.

ఒకొక్క పడవదగ్గర, అయిదుగురు పనివాళ్ళు జట్టు జట్టుగావుండి పనిచేస్తున్నారు. మొదటివాడు పడవలోనుండి పండ్లు బయటికి తీస్తాడు. పడవదగ్గరవున్న రెండోవాడికి అందిస్తాడు. అతను దాన్ని వార్ఫులోవున్న మూడోవాడికి, అతను నాలుగోవాడికీ, చివరకు నాలుగోవాడు వాగన్ లో నిలబడివున్న అయిదోవాడికీ అందిస్తాడు. అతను పండ్లన్నీ వరుసలూరుసలుగా వాగన్ లో పేరుస్తాడు. ఆకుపచ్చగాను, తెల్లగాను, చారలు చారలుగాను, వున్న అనేకరకాలపండ్లు వరుస లూరుసలుగా పేర్చబడి తళతళ మెరుస్తూ కనిపిస్తుంటాయి. ఈవిధంగా పని చకచక సాగిపోతూవుంటుంది. పడవలోంచి పండ్లన్నీ వాగన్లలోకి ఎక్కిస్తారు. నిజంగా ఈపని సరదాగానే వుంటుంది.

కళకళలాడుతూ తళతళ మెరుస్తూవున్న కర్బూజపండ్లు వరుసగా నిలబడివున్న పనివాళ్ళు ఒకరిచేతుల్లోంచి మరొకరి చేతుల్లోకి బంతుల్లా ఎగరేసుకుంటూ చకచక పనిచేస్తూవుంటే ఎంత సరదాగా వుంటుంది!

ఇవాళపని మరీ లాభసాటిగావుంది. మొత్తం నలభైమంది పనివాళ్ళు ముఠాగా పనిచేస్తున్నారు. వీరందరూ రోజుకూలికి పనిచేయడంలేదు. ఎంత వ్యవధిఅయినా పట్టనీ, పూర్తిగా వాగన్ నింపడం, అందుకు మొత్తంగా ఇంతని, డబ్బుతీసుకోవడం; ఇలాంటి ఒప్పందం చేసుకున్నారు. ఈపనివాళ్ల మీద అజమాయిషీ చేయడానికి ఒక మేనేజరున్నాడు. అతనిపేరు 'జవోరోట్నీ' యుక్రేనియన్ జాతివాడు. మనిషి బలిష్టుడు, స్థూలకాయుడు. అయినా ఇతను వయస్సులో చిన్నవాడే. పనిలో అనుభవంకూడాలేదు. మనిషి సరసుడుకాదు. జిత్తులంపన్ని, ఎత్తులువేసి, యజమాని ఆదరాభిమానాలు పొందాలని చూస్తుంటాడు. నిజానికి మేనేజరుకూ, పనివాళ్ళకూకూడా సంపాదన ఒకటే. అందరికీ సమానంగానే కూలిముట్టుతుంది. రోజుకు ఒక్కొక్కరికి నాలుగురూబుల్సు. అయితేమాత్రం ఏం? చెమటోడ్చిపనిచేసే కూలీలకూ ఒకటేరేటు, పనిచేయకుండా, వళ్ళుకదలకుండా అజమాయిషీచేసే మేనేజరుకూ ఒకటేరేటు. మేనేజరుచేసే పనేముంది? అరుస్తూ, అధికారం చలాయిస్తూ పైపై పెత్తనం చేయడమేగా! కూచోబెట్టి నాలుగురూబుల్సు ఇస్తున్నా ఈ మేనేజరుకు తృప్తిలేదు. పనివాళ్ళను తొందరపెట్టడం, గర్వం అహంకారంతో కన్నుకానకుండా ప్రవర్తించడం, పనివాళ్ళదగ్గర ఏదో తప్పుపట్టి యజమాని మెప్పుపొందాలని చూడడం, అలాగైనా తనుఎక్కువ లాభం పొందాలని ఎత్తులు వేయడం ఇతనికి అలవాటయిపోయింది.

ఇప్పుడే రేవులో ఓడ కూతపెట్టింది. రెండోది, మూడోది, పెద్దగా కూతలువేశాయి. నదిఅంతా ప్రతిధ్వనించింది. మరికొన్నిఓడలు ఒడ్డున ఉన్నాయి. ఏ క్షణంలోనో అన్నీఒకేసారి అరవడానికి సిద్ధంగా వున్నాయి

'పని ఆపండి!' మేనేజరు జవోరోట్నీ పెద్దగా అరిచాడు. అతని అరుపు ఒకపెద్ద రైలుఇంజను కూతపెట్టినట్లుగా వుంది.

చకచక నడుస్తోన్నపని క్షణంలో ఆగిపోయింది. నడుమువంచి పని చేస్తోన్న ప్లాటొనోవ్, వెన్నువిరిచి నిలుచున్నాడు. ఇప్పుడతనికి నడుము నొప్పి అనిపించలేదు. 'ఫరవాలేదు. ఇంతసేపు కష్టపడి పనిచేసినా బాధగా

లేదు.' అనుకున్నాడు తనలో. అవును, అతను ఇలాంటి కాయకష్టంలో ప్రవేశించిన మొదటిరోజుల్లో విపరీతంగా బాధపడేవాడు. వళ్ళంతా విరగ్గొట్టినట్లుండేది. నరాల్లో పోటుపుట్టేది. రాత్రింబగళ్ళు ఒకటేనొప్పులు, తీపులు; నగరం వెలుపల తనుండే పాడుపడ్డ గుహకు చేరుకుని మళ్లీ లేవలేకపోయేవాడు. దయ్యపు గొంతులా ఫ్యాక్టరీకూత వినిపించేది. గుండెఅదిరిపోయి, పనిలోకి పోవడానికి ప్రయత్నించేవాడు. కాని అడుగుతీసి అడుగువేయడానికే కష్టంగా వుండేది. కాళ్ళు, చేతులు చచ్చుతీపులు పుడుతోంటే, ఎలా పరుగెత్తేవాడో, ఎలా పనిచేసేవాడో, తలుచుకుంటే ఇప్పుడతనికి ఆశ్చర్యం వేస్తుంది. ఏదో అద్భుతం జరిగినట్లు తోస్తుంది. కాని ఇప్పుడలా లేదు. ఎంతపనైనా శ్రమలేకుండా చేయగలుగుతున్నాడు. అవును కాయకష్టానికి అలవాటుపడిపోయాడు.

'భోజనాలకు పదండి' ఆజ్ఞాపించాడు మేనేజరు.

పనివాళ్ళంతా నదిఒడ్డుకు వెళ్ళి బల్లపరుపుమీద కూచుని కొందరు వంగి కొందరు దోసిళ్ళతో నీళ్ళు తీసుకుని వెచ్చగావున్న మొహాలమీద భుజాలమీద పోసుకున్నారు. పుక్కిలించి ఉమ్మేసి చేతులు కడుక్కున్నారు. పిమ్మట నదిఒడ్డునే కొంచెం ఎండగావున్న పచ్చికమీద కూచుని భోజనాలు ప్రారంభించారు. ఒకటేపక్కనఒకరు గుండ్రంగా కూచున్నారు. పదో పదిహేనో బాగాపండిన కర్జూజపండ్లు దగ్గరపెట్టుకున్నారు. కొన్ని రొట్టెలు, ఎండుచేపలు కూడా వున్నాయి. వాళ్ళల్లో ఒకడు ఖాళీ కూజా ఒకటి తీసుకుని దగ్గరలోవున్న దుకాణానికి 'వోడ్కా' కోసం పరుగెత్తాడు. భోజనాలు చేయబోయేముందు సోల్జర్లు పాడే పాట పాడుకుంటూ పోతున్నాడు.

సోదరులారా పదండీ!
భోజనాలకూ వేళయిందీ!
మూటా, ముల్లె విప్పండీ!
పళ్ళెం, చెంచా పట్టుకోండీ!
ఫలహారాలూ రాకపోయినా,
బన్నూ, రొట్టె లేకపోయినా,
ఉప్పిడి గప్పిడి కాకుండా

రద్దీ, రభసా లేకుండా
గుట్టు చప్పుడు కాకుండా
వట్టిపళ్లైనే మెతినేసెయ్యండి!!'

ఇంతలో ఒకకుర్రాడు పనివాళ్ళు వున్నచోటికి పరుగెత్తుకుంటూ వచ్చాడు. అతనిచొక్కా, లాగూ పూర్తిగా చిరిగి పీలికలయి వున్నాయి. దాదాపు వంటిమీద గుడ్డలేనట్టే వున్నాడు. కాళ్ళకు బూట్లుకూడా లేవు. బిచ్చగాళ్ళ పిల్లవాడికంటె అన్యాయంగా వున్నాడు.

'మీలో ప్లాటొనోవ్‌గారంటే ఎవరు? అనడిగాడు ఆ కుర్రాడు, మెరుస్తోన్న కళ్ళతో అందరివైపు చూస్తూ.

సెర్జీ ఇవానిచ్ లేచి అతనిదగ్గరి కొచ్చాడు 'నేనే ప్లాటొనోవ్‌ను. ఏం కావాలి? ఎవరునీవు?' అన్నాడు.

'అక్కడ చర్చివెనకాల ఒక అమ్మాయిగారు మీకోసం నిలబడివుంది ఇదుగోండి, మీ కీ చీటీ ఇవ్వమంది.'

అదివిని పనివాళ్ళంతా పగలబడి నవ్వారు.

'నోర్మూయ్యండి, వెధవల్లారా!' అరిచాడు ప్లాటొనోవ్.

'ఏదీ ఆ చీటీ ఇలాఇవ్వు.'

చీటీతీసుకుని చూచాడు. అది జెన్నీ వ్రాసింది. గుండ్రంగా, పెద్దపెద్ద అక్షరాలు, పసిపిల్లలమాదిరి వ్రాసింది. అక్కడక్కడ కొన్నిమాటలు తప్పులుకూడా వున్నాయి.

'సెర్జీ ఇవానిచ్! మీకు శ్రమ కలిగిస్తున్నందుకు నన్ను క్షమించండి. నేను మీతో ఒకముఖ్యమైన విషయం మాట్లాడాలని వచ్చాను. ఎంతో ముఖ్యమైన విషయం. లేకపోతే మిమ్మల్ని బాధించను. నాకోసం, ఒక్క పదినిముషాలు—వినియోగించండి.' ఇట్లు— మీ ఎరిగిన జెంకా. అన్నా మార్కోవ్‌నా ఇల్లు.'

ప్లాటొనోవ్ చీటీ చదువుకుని మేనేజరుతో మాట్లాడాడు.

'నాకు కొంచెం పనుంది. అవతలికివెళ్ళిరావాలి. మళ్ళీపనిప్రారంభించే సరికి వస్తాను.

'అవును. నీవేమిటో నాకు తెలుసు. ఇలాంటిపనులు చేసుకోడానికి రాత్రి వుందిగా! సరే. వెళ్ళు వెళ్ళు. నిన్నెవరూ ఆపుచేయడంలేదు. కాని

ఒకవిషయం గుర్తుంచుకో. మేము పని ప్రారంభించేసరికి నీవు రాకపోయావా నీ స్థానంలో మరెవరో దొరవసపోయే వెధవాయను పెడతాను. నీకురావల్సిన కోజుకూలీ సున్నా అవుతుంది. ఆ వచ్చినవాడు ఏమైనా తప్పులుచేశాడో, అందుకు నీదే జవాబుదారీ. వాడుచేసిన తప్పులకు నీవే డబ్బుకట్టాల్సివస్తుంది ఏమనుకున్నావో! నీ విలాంటి ముండలమురాకోరువని నేనెన్నడూ అనుకో లేదు ప్లాటొనోవ్.' మేనేజరు అసహ్యించుకుంటూ మాట్లాడాడు.

ప్లాటొనోవ్ వెళ్ళేసరికి జెన్నీ వార్డుకూ, చర్చికీ మధ్యవున్న ప్రదేశంలో వేచివుంది. అక్కడ కొద్దిగా పోప్లార్ చెట్లు వున్నాయి. ఆమె వంటి నిండా జిడ్డుజిడ్డుగావున్న ఒకే గౌను వేసుకుంది. నల్లరిబ్బన్‌గల గడ్డిటోపీ ఒకటి నెత్తిమీద పెట్టుకుంది. ఆమెను కొంచెం దూరంనుంచిచూచి ప్లాటొనోవ్ తనలో ఇలా అనుకున్నాడు. 'సాధారణమైన దుస్తులు వేసుకునా, ఈమె ఎంత అందంగావుంది! దొరవసపోయేవాడు ఎవడైనాసరే, ఈమెను రెండుమూడుసార్లు వెనక్కుతిరిగి చూడకుండా పోడు. నిజంగా ఈమెలో ఒక ప్రత్యేకమైన ఆకర్షణ వుంది.'

'ఏం జెన్నీ! కులాసాగావున్నావా? చాలా కాలానికి నిన్ను చూచాను. చాల సంతోషం. ఇలా అకస్మాత్తుగా కనిపిస్తావని ఎప్పుడూ అనుకోలేదుసుమా!' అంటూ ప్లాటొనోవ్ ఆమెతో కరస్పర్శ చేశాడు.

జెన్నీ మౌనంగావుంది. ఆమె ఏదో బాధపడుతున్నదని వెంటనే ప్లాటొనోవ్ గ్రహించాడు.

'క్షమించు జెనీచ్కా! నే నింకా భోంచెయ్యలేదు. నీ కభ్యంతరం లేకపోతే హోటలుకు వెడదాం. దగ్గరలోనే చిన్న హోటలొకటుంది. ఈపాటికి జనమంతా ఖాళీ అవుతారు. సందడి ఏమీ వుండదు. పైగా లోపల వెనకపక్క చిన్నగదికూడా వుంది. భోంచెయ్యలేదేమో? ఏమైనా తిందువుగాని.' అన్నాడు ప్లాటొనోవ్.

'థాంక్స్. నాకేమీ తినాలనిలేదు. మిమ్మల్ని ఎక్కువసేపు ఆట్టి పెట్టనులెండి. కొద్ది నిముషాలు మాట్లాడాలి. నాకు మీ సలహా కావల్సి వచ్చాను. మీరు తప్ప నా కెవరున్నారు?' అంది జెన్నీ. ఆమె గద్గద స్వరంతో మాట్లాడింది.

'సరే. అందుకేమీ అభ్యంతరంలేదు. సంతోషంగా నేను చేయగలిగిన సహాయంచేస్తాను జెన్నీ. నీవంటే నా కెంతో ఇష్టం. తెలుసుగా!'

ఆమె అతనివైపు క్రీగంట చూచింది. ఆమె చూపుల్లో ఏదో విచారం కృతజ్ఞత అగుపిస్తున్నాయి!

'నాకు తెలుసు సెర్గీ ఇవానిచ్! మీరు నాకు సహాయం చేస్తారనే నమ్మకం వుండబట్టే, మీ దగ్గర కొచ్చాను.' అంది ఆమె.

'నీకేమైనా డబ్బు కావాలా? నిజం చెప్పు జెన్నీ! నా దగ్గరకూడా ప్రస్తుతం డబ్బులేదు. ఇబ్బందుల్లో వున్నాను. అయినా ఫరవాలేదు. మేనేజరును అడిగితే అడ్వాన్సు ఇస్తాడు.'

'థాంక్స్! డబ్బువిషయం కాదండీ, అంతా మీకు హోటల్లో చెపుతాను పదండి.'

ఇద్దరూ దాపులోవున్న చిన్న హోటలుకు వెళ్ళారు. అధ్వాన్నపు హోటలు. గుడిసెమాదిరి వుంటుంది. గాలి, వెలుతురు రాదు. అక్కడికి వచ్చేవాళ్ళంతా దొంగలు, తుంటరివెధవలు. ముఖ్యంగా రాత్రిపూట పోగవు తుంటారు.

హోటలిప్పుడు ఖాళీగానేవుంది. ప్లాటూనోవ్ జెన్నీని వెంటబెట్టు కుని, వెనుకపక్కవున్న చిన్న గదిలోకి తీసుకెళ్ళాడు. గదిలో మసకమసక చీకటిగా వుంది.

ప్లాటూనోవ్ హోటలు కుర్రాణ్ణి పిలిచి రొట్టె, ఒక పెద్దగ్లాసెడు వోడ్కా, మరికొన్ని ఫలహారాలు పట్టుకురమ్మని ఆర్డరిచ్చాడు.

ఆ హోటలుకుర్రాడిది చప్పిడిముక్కు. మొహం జిడ్డుకారుతోంది. వళ్ళంతా మకిలపట్టి అప్పుడే ఏబురదలోనో పొర్లివచ్చినట్టు అసహ్యంగా వున్నాడు.

'ఎన్నికోపెక్కుల రొట్టె కావాలి?' అనడిగాడు కుర్రాడు. అతనికంఠ స్వరం చాలా మొరటుగావుంది.

'మంచి రొట్టెచూచి మరింత పట్టుకురా, తరువాత లెక్కచూచుకుం దాం' అన్నాడు ప్లాటూనోవ్ నవ్వుతూ.

'ఇదుగో అబ్బాయ్! ఒకగ్లాసెడు క్వాస్ (ఒకరకమైన పానీయం) కూడా పట్టుకురా.'

'సరే జెన్నీ! ఇక చెప్పు. ఏమిటి నీ సంగతి? నీవేదో కష్టంలో వున్నట్లు నీ మొహమే చెపుతోంది. ఏమిటో చెప్పు జెన్నీ' అన్నాడు ప్లాటొనోవ్.

జెన్నీ తన చేతిరుమాలు వేళ్ళకు చుట్టుకుంటూ కొద్దిక్షణాలు కిందికి చూస్తూ కూచుంది. తనసంగతి చెప్పాలని విశ్వప్రయత్నం చేస్తోంది. కాని ఆమెకు ధైర్యం చాలడంలేదు. సరైన మాటలు దొరకడంలేదు. చెప్పాల్సిన సంగతి ఎలా ప్రారంభించాల్సిందీ తెలీడంలేదు.

ప్లాటొనోవ్ ఆమె స్థితి గ్రహించాడు. వెంటనే అందుకున్నాడు.

'కలవరపడకు జెనీచ్కా! నీ పరిస్థితి ఎలా వుందో చెప్పు. నీకు కావల్సిన వాణ్ణి, నీ కుటుంబంలో ఒక మనిషిలాంటివాణ్ణని నీకు తెలుసుగా. బహుశా నీకు తగిన సలహా చెప్పగలనేమో. చెప్పు జెన్నీ! ఏమిటివిషయం? ఊ! మాట్లాడు.'

'అదేనండీ! ఎలా మొదలెట్టాల్సిందీ తెలీడంలేదు.' అంది ఆమె ఆందోళనపడుతూ. 'చూడండి సెర్గీ ఇవానిచ్!...... నేను జబ్బుతో వున్నాను. మీ కర్థమైందా? భయంకరమైనవ్యాధి... దారుణమైన రోగంతో బాధ పడుతున్నాను... ఏం జబ్బో తెలుసునా!'

'చెప్పు జెన్నీ. ఫరవాలేదు చెప్పు.' తలూపుతూ అడిగాడతను.

'కొంతకాలంక్రిందట వచ్చిందా జబ్బు. నెలకుపైన అయింది. బహుశా ఆరువారాలు అయివుంటుంది... నేను అది కనుక్కొని నెలరోజు లవుతుంది. సరిగ్గా ట్రినిటీపండుగ... ఆదివారం నాడు.'

ప్లాటొనోవ్ తనచేత్తో నుదుటిమీద రుద్దుకుని వెంటనే అన్నాడు.

వుండు చెప్తాను. నాకూడా జ్ఞాపకముందనుకుంటాను. ఒకనాడు నేనూ కొంతమంది విద్యార్థులూ కలిసి అక్కడికి వచ్చాం. ఆరోజే కదూ?'

'అవును ఇవానిచ్! సరిగ్గా అదే రోజు.'

'అయ్యో జెంకా! నా కర్థమైంది.' అంటూ అతను ఆమె వైపు దీనంగా చూచాడు. 'ఆ తరువాత ఆ ఇద్దరు విద్యార్థులు జబ్బుపడ్డారు. నీకు తెలుసా? ఏం? అది నీ దగ్గర్నుంచి వచ్చిన జబ్బేనా?'

జెన్నీ కళ్ళు క్రోధంతో ద్వేషంతో రగిలాయి.

'కావచ్చు. నాదగ్గర్నుంచే కావచ్చు. అయినా అది నా కెలా తెలుస్తుంది? వాళ్ళు చాలామంది వున్నారు. ఒక కుర్రాడు పొడుగ్గా

తెల్లగా వున్నాడని నాకు జ్ఞాపకం. కళ్ళజోడుకూడా పెట్టుకున్నాడు. మీతో దెబ్బలాటకు సిద్ధపడ్డాడుకదూ!'

'అవునవును. అతనే బోరిస్ అనే విద్యార్థి. అతనికి రోగం తగిలినట్లు నాకు తెలిసువచ్చింది. అయినా నేనందుకు విచారించలేను. అతనికి తల పొగరు జాస్తి. ఆ రెండోవాడున్నాడు చూచావ్? అతన్నిగురించే నాకు చింత కలిగింది. అతని పేరేమిటో నాకు తెలీదుగాని, స్నేహితులంతా అతన్ని రాంసెస్ అని పిలుస్తారు. చాలమంది డాక్టర్లకు చూపించి పరీక్ష చేయించుకున్నాడు. అది సవాయిరోగమని అందరూ చెప్పారు, అంతే. ఇంటికి వెళ్ళి కాల్చుకుని చచ్చిపోయాడు. ఆత్మహత్య చేసుకుంటూ ఒక చీటీ వ్రాసి పెట్టాడు. అందులో ఏవేవో అర్థంకాని విషయాలు అనేకం వున్నాయి. దాని సారాంశం ఇది అని నాకు జ్ఞాపకం 'సౌందర్యం, సన్మార్గం, సచ్ఛీలత, బుద్ధికుశలత, ఇవే జీవితానికి పరిపూర్ణమైన సుఖాన్ని కలిగిస్తాయని నా నమ్మకం. ఈ వ్యాధి వచ్చినందువల్ల నేనిక మనిషినికాదు—ఒక శవాన్ని-శిథిలమైన శవాన్ని. ఏ క్షణంలోనో నాకు పక్షవాతమో పాడో రావచ్చు. దీంతో నా మానవత్వం మంటకలిసిపోయినట్లే. జరిగిన ఈ పనికీ నా మృత్యువుకూ నేనే కారణం. ఇందుకు మరెవరినీ నిందించాల్సినపనిలేదు. క్షణికమైన సుఖానికీ వ్యసనానికి బానిసనై నిర్దాక్షిణ్యంగా ప్రేమ అనేదిలేకుండా డబ్బు పారేసి ఒక స్త్రీ శరీరాన్ని కొనుక్కున్నాను. అంచేత నాకీ శాస్తి జరగాల్సిందే. ఈ శిక్ష అనుభవించాల్సిందే' ఇదీ అతను ఆ చీటిలో వ్రాసింది. అతనిమీద నాకు విచారం, జాలి కలిగాయి జెన్నీ' అని చెప్పి అతను కొద్ది క్షణాలు మౌనం వహించాడు.

జెన్నీ నాసికారంధ్రాలు గజగజ వణికాయి.

'నాకేం విచారంలేదు. కొంచెమైనా విచారంలేదు' అంది ఆమె.

'నీవు పొరపాటుపడుతున్నావు జెన్నీ!' అంటూ అతను హోటలు కుర్రాడివైపు తిరిగి ఇలా అన్నాడు. 'ఇహ నీవు వెళ్ళు అబ్బాయ్! ఏమైనా కావల్సొస్తే పిలుస్తానులే.'

అతను వెళ్ళిపోయింతరువాత ప్లాటొనోవ్ మళ్ళీ జెన్నీతో ఇలా అన్నాడు.

'నీవు చాల పొరపాటుపడుతున్నావు జెన్నీ! అతను చాలా గొప్ప వాడు, అసాధారణమైన వ్యక్తి అయివుండాలి. ఇలాంటివాళ్ళు వెయ్యికి ఒకడుకూడా దొరకడు జెన్నీ. ఆత్మహత్యలంటే నాకు అభిమానంలేదు. చాల మంది యువకులు చిన్న చిన్న కారణాలకు, ఆఖరుకు మిఠాయికొనుక్కో డానికి ఇంట్లోవాళ్ళు డబ్బివ్వలేదని, తల గోడకేసి కొట్టుకునో కాల్చుకునో చచ్చిపోతారు. వాళ్ళసాహసానికి మనం మెచ్చుకోవచ్చు. కాని ఇతను ఒక గొప్పకారణంకోసం, ఒక మహోన్నతమైన ఆదర్శంకోసం, ఒక అద్భుత మైన సత్యంకోసం ఆత్మహత్యచేసుకున్నాడు జెన్నీ! అతను నిజంగా మహాను భావుడు. గొప్పమేధావి. చాల మంచివాడనీ, దయకలవాడనీ అంతా చెపు తారు. అతనిముందు నేను తలవొంచుతాను.'

'మరి నాకేమీ అతనిలో గొప్పదనం, ప్రత్యేకత అగుపించడంలేదు.' జెన్నీ ఎదురుజవాబు చెప్పింది. 'మూర్ఖులు, మేధావులు, పడుచువాళ్ళు, వృద్ధులు, నీతివంతులు, అవినీతిపరులు; అంతా నాకు ఒకటే! ఇప్పుడు నేనంద రినీ ద్వేషిస్తాను! ఎందుకో తెలుసా? నావైపుచూడండి. నేనేమిటి? నేనేమీ కాదు. నడివీధిలో పదిమందీ ఉమ్మేయడంకోసం పెట్టిన పాత్రను! మురుగు దొడ్డిని! అవతలపారేసిన కళ్ళెలాన్ని! ఆలోచించండి. కొంచెం ఆలోచిం చండి ఇవానిచ్! వందలకొద్దీ మగాళ్ళు నన్ను పట్టుకుని నలిపి, కొరికి, రక్కి, తొక్కి, నుగ్గునుగ్గుచేసి, నా రక్తాన్ని పీల్చిపోయారు ఇవానిచ్! ఇలా ఇది వరకు ఎంతోమంది చేశారు. ఇంకాఇప్పుడు, నా పక్కమీద—చేస్తున్నారు! ఓ! వీరందరినీ నేను అసహ్యించుకుంటాను. ద్వేషిస్తాను! నిజంగా నాచేతు ల్లోనే అధికారం, బలం ఉన్నట్లయితే, ఈ పాటికి వీరందరినీ కణకణ మండే నిప్పులతో, ఎర్రగాకాల్చిన ఇనపకడ్డీలతో హింసించి చిత్రవధచేసే దాన్ని ఇవానిచ్! వీరందరికీ ఉరిత్రవ్వించి...'

'నీవు చాలా కఠినమైనదానివి, గర్వంకలదానివి' జెన్నీ!' అన్నాడు మెల్లగా ప్లాటోనోవ్.

'కఠినమూ కాదు, గర్వమూకాదు ఇవానిచ్! ఇప్పుడే ఇలా అయి పోయాను. కాని ఇంతకుముందు— నాకు పదేండ్లయినా నిండకముందే నా కన్నతల్లి నన్ను లోకానికి అమ్మింది. ఆనాటినుండి ఈనాటివరకు ఎన్ని చేతులు మారానో చెప్పలేను ఇవానిచ్! కాని, ఒక్కడైనా కనీసం ఒక్క

డైనా, నన్ను మనిషిగా స్వీకరించాడా! మనిషిగా ఆదరించాడా! లేదు! వాళ్ళ దృష్టిలో నేనొక నలిపురుగును! అనాథకంటె, బిచ్చగత్తెకంటె, దొంగకంటె, హంతకుడికంటె, హీనమైనదాన్ని నేను! ఉరితీసేవాడున్నాడే, కసాయి వాడు; మీకు తెలుసునో లేదో? అలాంటివాడుకూడా మాదగ్గరకొస్తాడు. సరే. వాడు నన్నెంత నీచంగా, క్రూరంగా చూస్తాడో తెలుసా? అబ్బ! దుర్భరం ఇవానిచ్! నేనేమీ కాదు. పబ్లిక్ భోగందాన్ని! పబ్లిక్ అనే భయంకరమైన మాట మీకు తెలీదు! అంటే దాని అర్థం, నే నందరికీ సంబంధించిన దాన్ని! ఏ ఒక్కరికీ చెందినదాన్ని కాదు. ఏ ఒక్కరిసొత్తునూ గాదు. ఒక తండ్రికిగాని, తల్లికిగాని, ఒక రష్యా వాడికే గాని చెందినదాన్ని కాదు. అందరి వస్తువునూ నేను! అన్ని జాతులవాళ్ళు, అన్ని మతాలవాళ్ళు నన్ను స్వేచ్ఛగా అనుభవించవచ్చు! ఈ విశాలవిశ్వంలో అందరికీ నామీద హక్కుంది ఇవానిచ్! ఎవరూ నన్ను గురించి ఒక క్షణమైనా ఆలోచించరు. ఆమే మన లాంటిమనిషే నే, ఆమెకూ చీము, నెత్తురు వున్నాయే, ఆమెకూ మెదడు, హృదయం ఉన్నాయే, ఆమెకూ ఒక ఆలోచన, ఆత్మ వున్నాయే, అనుకోరు. చైతన్యరహితమైన ఏదో ఒక మొద్దుగా నన్ను భావిస్తారు. తుక్కుతుక్కు అయిపోయిన గడ్డిలా, ధూళిలా, పిగిలిపోయిన తాడులా భావిస్తారు! నే నొక్కదాన్నే కాదు ఇవానిచ్! నాలాంటి స్త్రీలు వందలమంది, వేలమంది ఉన్నారు. నా చుట్టూ జీవిస్తున్నారు. పడుపుకత్తెలందరికీ ఇదే దుస్థితి. నేను ఎంతోమందిని చూచాను. కలుసుకున్నాను మాట్లాడాను. కాని ఈ వేశ్య లెవరూ తమదుస్థితిని నా మాదిరిగా ఆలోచించరు. ఓ! అర్థంచేసుకోండి ప్లాటొనోవ్! నేను పడేంతబాధ మరెవరూ పడరు. నేను ఆలోచించినంతగా ఎవరూ ఆలోచించరు. ఈ సత్యాన్ని గ్రహించరు! తింటారు, తాగుతారు, మాట్లాడుతారు, నడుస్తారు; కేవలం నలిపురుగులమాదిరి బ్రతుకుతున్నారు. ఎంత ఘోరమో ఆలోచించండి. అందుకే నాకీ ఆగ్రహం.''

'నీవుచెప్పింది యథార్థం జెన్నీ!' మెల్లగా జవాబుచెప్పాడు ప్లాటొనోవ్ 'ఆ ప్రశ్నే, నిన్నొక రాతిగోడవద్దకు లాక్కుపోతోంది జెన్నీ! నీ కెవరూ తోడు దొరకరు.'

'ఎవరూ తోడులేరు! ఎవరూ లేరు! మీకు జ్ఞాపకంవుందా? మీ రొచ్చినప్పుడు ఒక విద్యార్థి ల్యూబాను తీసుకుపోయాడు.'

'అవును. జ్ఞాపకం లేకపోవడమేమిటి? బాగా జ్ఞాపకముంది. ఇంతకూ ఏం జరిగిందే?

'ఏం జరుగుతుంది? ఎప్పుడూ ఏం జరుగుతుందో అదే జరిగింది. నిన్న మళ్ళీవచ్చింది తిండిలేక దిక్కులేక ఏడుస్తూ మొత్తుకుంటూ తడిసి ముద్దయి వచ్చింది. అతను దాన్ని బయటికి గెంటేశాడు. దుర్మార్గుడు! 'నీవు నా సోదరివి. నిన్ను ఉద్ధరిస్తాను. నీకు సంఘంలో ఉన్నతస్థానాన్ని కల్పిస్తాను.' అంటూ తీయనిమాటలు చెప్పి—చివరకు మెడపట్టి గెంటేశాడు.

'ఆ! నిజంగా అలా జరిగిందా?'

'నిజం. ముమ్మాటికీ నిజం! అందుకనే నేను మిమ్మల్నితప్ప ఈ లోకంలో మరేమగాణ్ణీ నమ్మను ప్లాటూనోవ్! మీ ఒక్కరిమీదనే నాకు విశ్వాసం వుంది. మీరు నాకు ప్రత్యేకంగా విచిత్రమైన వ్యక్తిగా అగుపిస్తారు. మీరు దేన్నో అన్వేషిస్తున్నట్లు అగుపిస్తారు. క్షమించండి. మిమ్మల్ని అర్థంచేసుకోలేను. ఇంత గొప్పవారైనా నాకు మీతో చనువువుంది. మీదగ్గర బెరుకులేదు. ఏదీ దాచలేను. అంచేతనేవచ్చాను.'

'చెప్పు జెన్నీ!'

'రోగం తగిలిందని తెలుసుకోగానే నాకు కోపంతో పిచ్చెక్కిపోయింది. ఇది నా అంత్యదశ అనుకున్నాను! దీన్నిగురించి విచారించాల్సిన పనిలేదు. ఆలోచించాల్సిన అవసరంలేదు! నేను పడిన బాధలకు ప్రతిఫలం ఇదేనా? నాకు కలిగిన నష్టానికి పరిహారం రాదా? ప్రపంచంలో న్యాయానికి స్థానం లేదా? కనీసం పగతీర్చుకుంటేనన్నా నాకు తృప్తి కలుగుతుందేమో? నిజమైనప్రేమ, సంసారసుఖం అనుభవించే యోగ్యత నాకు లేదా? అందరూ నన్ను కుక్కకంటే హీనంగా చూచారే! నేనూ ఒక మనిషినని గుర్తింపబడకుండా వాళ్ళ నీచమైన సుఖాలకోసం ఆహుతిఅయిపోయానే! నేనొక మురుగుకాలవకంటె హీనంగా చూడబడ్డానే! ఛీ! ఇలాంటి నాకు నిష్కృతిలేదా! ఈ భయంకర రోగాన్ని కృతజ్ఞతతో స్వీకరించడమేనా? నేను ఒక బానిసనా? లేక వాళ్ళ పశువులశాలలో కట్టేసిన గుర్రాన్నా? అంచేత ఈ వ్యాధిని వారందరిలో వ్యాపింపచేయాలని పట్టు పట్టాను ప్లాటూనోవ్! ప్రతిఒక్కరికీ భాగ్యవంతుడికీ నిరుపేదకూ వృద్ధుడికీ అంద

గాడికీ కురూపికీ అందరికీ అందరికీ, ప్రతిమనిషికీ ఈరోగం పంచిపెట్టి నా కసితీర్చుకున్నాను ప్లాటొనోవ్!'

ప్లాటొనోవ్ చాలా సేపటికిందటనే తినే ప్లేటు అవతలికి నెట్టి ఆమె వైపు ఆశ్చర్యంగా చూడసాగాడు. ఆశ్చర్యమే కాదు. ఒకరకమయిన భయంకూడా అతనికి కలిగింది. ఆమెలో ఉత్పన్నమయిన పరిపూర్ణమయిన ద్వేషాన్ని అతను చూడగలిగాడు. ఆ ద్వేషంలో భయం, బాధ, నీచం, అసహ్యం, క్రూరత్వం, పశుత్వం ఇవన్నీ కలిసిఉన్నాయి. ఆమెలో ఒక భయంకరమయిన మృగాన్ని చూచాడతను. మనస్సులో ఆమె చేసింది న్యాయమని సమాధానం చెప్పుకున్నాడు.

మళ్ళీ ఆమెతో ఇలాఅన్నాడు.

'ఒక గొప్ప రచయిత ఇలాంటిదే ఒక సంఘటన చెప్పాడు జెన్నీ! ఫ్రెంచివాళ్ళమీద ప్రష్యనులు దండెత్తివచ్చినప్పుడు వారిని అనేకవిధాల హింసించారు. కనిపించిన ఫ్రెంచివాడినల్లా కాల్చారు. ఫ్రెంచి స్త్రీలను చెరిచారు. నగరాలు, పంటలు నిర్దాక్షిణ్యంగా తగులపెట్టారు. ధనకనక వస్తువాహనాదులు దోచుకున్నారు. అప్పుడొక అందమైన ఫ్రెంచివనిత వుంది. ఒకజర్మన్ వాడు ఆమెకు అంటురోగం తగిలించాడు. పగతీర్చుకోవడంకోసం ఆమె తనదగ్గరి కొచ్చిన మనిషినల్లా ప్రేమించినట్లు నటించి, అతనికి ఆ రోగం అంటిస్తూ వచ్చింది. ఆవిధంగా ఆరోగం వందలకొద్దీ జర్మనులకు వ్యాపించింది. చివర కామె ఆసుపత్రిలో చనిపోతూ, తానుచేసినపనికి ఎంతో సంతోషించింది. పగ సాధించుకున్నానని గర్వపడింది. కాని అప్పుడు వాళ్ళు, ఆమె దేశానికి శత్రువులు, ఆమెదేశాన్ని నాశనంచేసినవాళ్ళు. అంచేత ఆమె అలా చేయడంలో అర్థముంది. మరిప్పుడు నీవు, నీవూ, నీవేమిటి జెనీచ్కా?'

'అవును. నాకు భేదాలు, తారతమ్యాలు లేవు. మిత్రుడు, శత్రువు అనే విచక్షణలేదు. మీరుచెప్పండి ఇవానిచ్! నిజంగా, నిష్పాక్షికంగా చెప్పండి! ఒకపసిబిడ్డను, అన్నెం పున్నెం ఎరుగని పసిపాపను ఒకడు నడివీధిలో పడేసి తిడతాడు. చిత్రహింస పెడతాడు. మాటవరుసకు ఆ బిడ్డకళ్ళు పీకేసి, చెవులుకోసేసి ఘోరంగా హింసిస్తాడనుకోండి. మీరే ఆ పసిపాపను చూచారనుకోండి. ఆ నేరంచేసినవాడు, దారినపోయే ఒకానొక వ్యక్తి అని

మీరు గ్రహిస్తారు. అతనెవరో కాదు. దేవుడే అనుకోండి. స్వర్గంలో దేవు డుంటే, అతడే ఆపని చేశాడనుకోండి. అప్పుడు మీ రతన్ని ఏం చేస్తారు? ఏంశిక్ష విధిస్తారు చెప్పండి?'

'నాకు తెలీదు.' అన్నాడు ప్లాటొనోవ్ తలఎత్తకుండానే. అతనికంఠ స్వరం అతనిదిగా లేదు. అతని మొహం పాలిపోయింది. టేబుల్ క్రింద పెట్టు కున్న అతని రెండుచేతులు పిడికిళ్లుపట్టివున్నాయి. 'బహుశా అతన్ని చంపి వుండేవాణ్ణి' అన్నాడు మళ్ళీ.

'బహుశా కాదు. మీ రతన్ని నిస్సందేహంగా చంపేసేవారు. మీ రేపిటో ఎలాంటివారో నాకు తెలుసు. ఇప్పుడిది ఆలోచించండి. మాలో ప్రతిఒక్కరం ఒక పసిబిడ్డమాదిరి చెరచబడ్డవాళ్ళమే! మేమందరం శిశువులం!' ఎంతో బాధగా ఈ మాటలు అని ఆమె తన కళ్ళను ఒకక్షణం చేత్తో మూసుకుంది. 'ఆరోజు రాత్రి మీతో మాట్లాడినప్పుడు ఇలాగే అడిగాను. మేమంతా శిశువులం, మూర్ఖులం, అమాయకులం, గుడ్డివాళ్ళం. ఈ బరువును దించుకోలేకుండావున్నాం! మేం ఎక్కడికెళ్ళాలి? ఏం చేయాలి? చెప్పండి ఇవానిచ్! నన్ను స్వయంగా హింసించి నాకు అపకారంచేసిన ఏ ఒక్క వ్యక్తిని గురించి మాత్రమే నేనిలా అడగడంలేదు. నా కోపం, నా ద్వేషం మగవాళ్ళందరిమీదాను. మాదగ్గరకొచ్చే విటులందరిమీదాను. ఆ దుర్మార్గులు, ఆ నీచులు, ఆ గుర్రపురౌతులు—వాళ్ళు ఎవరైనాకాని వాళ్ళందరిమీదా నాకు ద్వేషం వుంది! అందుకని అక్కచెల్లెళ్ళవంటి తోటి స్త్రీలకు, వాళ్ళ స్త్రీలకు నాకు పట్టిన దుర్గతే పట్టేటట్లు చేయాలని నిశ్చ యించుకున్నాను. ఇది మంచిదా లేక చెడ్డదా? చెప్పండి ఇవానిచ్?'

'జెన్నిచ్కా! నిజంగా నాకు తెలీదు. నీ వడిగినదానికి జవాబు చెప్ప లేను. చెప్పడానికి సాహసించలేను... నాకసలు అర్థంకావడంలేదు జెన్నీ.'

'సరే. ఇప్పుడది అంతముఖ్యమైందికాదు. ఇహ అసలువిషయం చెప్తా వినండి. నేనిలా ఈరోగాన్ని అందరిలో వ్యాపింపచేస్తున్నందుకు నాకేమీ బాధలేదు. పశ్చాత్తాపం, దయ, జాలి, ఇవేవీలేవు. మనిషిఎదుటగాని లేక దేవుడి ఎదుటగాని నేరంచేసినట్లు భయపడను, బాధపడను... పైగా ఆనం దిస్తున్నాను. ఆకలిగొన్న తోడేలు, దేన్నైనా చంపినప్పుడు ఎలా సంతో షిస్తుందో అలా సంతోషిస్తున్నాను. కాని నిన్న ఒకసంఘటన జరిగింది. అదే

నాకర్థం కావడంలేదు. ఒక మిలిటరీకుర్రాడు నన్ను చూడ్డానికి వచ్చాడు. చాలాపసివాడు, అమాయకుడు. ఏడాదిబట్టీ అతను నాదగ్గర కొస్తున్నాడు. అకస్మాత్తుగా అతనిమీద నాకు జాలికలిగింది. అందుకు కారణం అతను అందంగా వున్నాడనీ, చిన్నవాడనీ కాదు. నాతో మంచిగా, మర్యాదగా ప్రవర్తిస్తాడనీకాదు. ఇలాంటివాళ్ళు చాలామంది నాదగ్గర కొచ్చేవాళ్ళు. వాళ్ళను ఎవరినీ దయదలచలేదు. వదిలిపెట్టలేదు. పైగా అలాచేయడం నాకో సరదాగా వుండేది. ఎర్రగా కాల్చిన ఇనుముతో పశువులకు వాతలు పెట్టినట్లు పెట్టేదాన్ని. అయినా ఇతన్నిమాత్రం వదిలిపెట్టాను. ఎందుకలా చేశానో నాకే తెలియడంలేదు. కారణం నేను వ్యక్తంచేయలేను. ఈ కుర్రాణ్ణి చూడగానే నాకెలా అనిపించిందో తెలుసా? ఒక పిచ్చివాడిదగ్గరనో, మూర్ఖుడిదగ్గరనో డబ్బు దొంగిలిస్తున్నట్లు, లేక ఒకగుడ్డివాణ్ణి తలపగులగొడుతున్నట్లు, లేక ఒక నిద్రపోయేమనిషిని గొంతుకోస్తున్నట్లు అనిపించింది నాకు. పోనీ, దుర్బలుడై రోగంతో నవుస్తూ, అసహ్యంగావున్న వృద్ధుడైనా కొంతవరకు బాగుండేది. నాపనినేను చేసుకుపోయేదాన్ని. ఇతను మంచి యవ్వనంలో వున్నాడు, బలంగాను, ఆరోగ్యంగాను, అందంగాను, ఒక చక్కని శిల్పంలాగా వున్నాడు. అతనితో ఆపని చేయలేకపోయాను. అతని డబ్బు అతనికిచ్చేశాను. నారోగం చూపించాను. ఒక్కమాటలోచెప్పాలంటే కళ్ళనీళ్ళు నింపుకుని అతిమెత్తని మనస్సుతో ప్రవర్తించాననుకోండి! అతను నన్నొదిలిపెట్టి పెద్దపెట్టున ఏడ్వసాగాడు. అందుచేత నిన్నరాత్రినుంచీ నాకు నిద్రపట్టలేదు. ఆలోచిస్తూనే వున్నాను. ఏదో ఆవేదన, బాధ. పిచ్చిదానిలా మంచులో తిరుగుతున్నాను. ఇప్పుడాలోచిస్తే నాకొకటి అనిపిస్తోంది. ఇంత కాలంబట్టీ మనుషులకు నారోగం అంటించాలని ఆదుర్దాపడ్డాను. వాళ్ళ తల్లులకు, తండ్రులకు, అక్కలకు, చెల్లెళ్ళకు, ప్రియులకు, ప్రియురాండ్రకు అందరికీ నా రోగం తగిలించి, ప్రపంచాన్ని అంతా నాశనంచేయాలనుకున్నాను. ఇలా అనుకోవడం కేవలం నా మూర్ఖతఅనీ, తెలివితక్కువఅనీ ఇప్పుడు తెలుసుకున్నాను. నేను ఊహించింది నిజంకాదనీ, కేవలం స్వప్నమనీ ఇప్పుడు గ్రహించాను. ఇలా గ్రహించినతరువాత ఆపని చేయలేకపోయాను. వెంటనే ఆపుచేశాను. రాత్రినుంచి ఇంతవరకూ మళ్లీ ఏ మగాణ్ణి దగ్గరకు రానీయలేదు. చెప్పండి ఇవానిచ్! మీరు గొప్ప మేధావంతులు.

ఎంతో అనుభవం గడించినవారు. ఎంతో జీవితాన్ని చూచి, కాచివడపోసి, జీర్ణించుకున్నవారు. ఎందుకిలా చేశాను? నాకేమీ అర్థంకావడంలేదు. దారి దొరకడంలేదు. నాకోమార్గం చూపించండి ఇవానిచ్!'

'నాకు తెలీదు జెనిచ్కా!' అన్నాడు ప్లాటొనోవ్ ఆలోచిస్తూ 'నీకు సలహా చెప్పడానికి జంకికాదు జెన్నీ! నిజంగా నాకేమీ తెలీడంలేదు. అర్థంకావడంలేదు. ఇది నా శక్తికి అతీతమైనవిషయం జెన్నీ! ఈ విష యాన్ని నా బుద్ధిగాని ఆత్మగాని గ్రహించలేకపోతున్నాయి. దీనిమీద ఒక నిర్ణయాన్ని తీర్పును చెప్పలేకపోతున్నాయి. ఈ సమస్య నాకు తెగదు. ఈ విషయం నాకు అందనిది జెన్నీ'

జెన్నీ బద్ధకంగా వేళ్ళు విరుచుకుని ఇలా అంది.

'నాకూ అర్థకావడంలేదు. నేను అనుకున్నదీ, ఊహించిందీ! అంతా తప్పనిమాత్రం తెలుస్తోంది... అంచేత ఇహ ఇప్పుడు...... నేను చేయు గలిగిందీ, నాకు మిగిలిందీ...ఒక్కటే...ఈ ఉపాయాన్నే నాకీ ఆలోచన తట్టింది....'

'వద్దు వద్దు, ఆపనిచెయ్యొద్దు జెనిచ్కా.' మధ్యలో అందుకుని అన్నాడు ప్లాటొనోవ్.

'...ఇహ నాకు మిగిలిందల్లా...ఉరిపోసుకుని చావడం!'

'వద్దు వద్దు. ఏపనిఅయినా చెయ్యిగాని, ఆపనిమాత్రం చెయ్యొద్దు జెన్నీ! బహుశా ఈ వ్యాపారం ఇహ ఎక్కువకాలం సాగదుకే! త్వరలోనే కొంపలకు తాళాలు పడొచ్చు. నామాట నమ్ము జెన్నీ! అవసరమైతే, నేనే ఆపని చేయించగలను. కాని ఏంలాభం? నీవుకోరేది అదికాదు. నీకిష్టమైతే నేను నీకొకమార్గం సూచించగలను. ఆపనికూడా నిర్దాక్షిణ్యమైందీ, క్రూర మైందీను. కాని అది నీకు మనశ్శాంతి కలిగించదు. నీ ఆగ్రహాన్ని నూరురెట్లు సంతుష్టిపర్చగలదు.'

'ఏమిటది?' అనడిగింది జెన్నీకొంచెం ఆసక్తిగా.

'చెప్తాను విను. నీవింకా చిన్నదానివి, అందంగా వున్నావు. నీ సౌందర్యం చాలాగొప్పది జెన్నీ. నీ సౌందర్యానికి ఎటువంటిశక్తివుందో నీవెరుగవు. నీవెన్నడూ దాన్ని పరీక్షించలేదు. నీఆకారం, నీస్వభావం మను షుల్ని పిచ్చివాళ్ళను చేస్తాయి. మూర్ఛితుల్ని చేస్తాయి. అవి బలమైన గాలం

సుల్లా మనుషుల్ని కట్టేసి బానిసలుగాచేసి నీ కాళ్ళదగ్గర పడేస్తాయి. నీసౌందర్యానికి అంతటి మహత్తరమైన శక్తివుంది జెన్నీ. నీవు ఊహించుకోలేవు. మనుషులు నీకు దాసులవుతారు. నీకాళ్ళదగ్గర కుక్కల్లా పడివుంటారుజెన్నీ. తెలివైనదానివి. స్వతంత్రురాలివి. ధైర్యం, సాహసం కలదానివి. నీవుబాగా చదువుకున్నావుకూడా. కాని నీవు అందరికంటె విభిన్నంగా అగుపిస్తావు. విరుద్ధంగా ఆలోచిస్తావు నీ అదృష్టం బాగుంటే ఈజబ్బు నయం కాకపోదు. ఈ ప్రాంతాల్లోలేకుండా వెళ్ళిపోవచ్చు! మళ్ళీ ఎప్పటికీ ఇక్కడకు రానవసరంలేదు. మనుషులు నీ పాదాక్రాంతు లవుతారు! వారిమీద పెత్తనంచెయ్యి. చేతిలో కొరడాపట్టుకుని అధికారం చలాయించు. వాళ్ళను నాశనంచెయ్యి, పిచ్చివాళ్ళను చెయ్యి. నీవు ఏం చేయాలనుకుంటే అలా నీఇష్టంవచ్చినట్లు చెయ్యి. అలుపువచ్చి, విసుగుపుట్టి, విరక్తికలిగేంతవరకూ అలా హింసించు. చూడు జెన్నీ! ఈనాడు ప్రపంచాన్ని శాసిస్తున్నది ఎవరనుకుంటున్నావు! స్త్రీలు! నిన్నటిదాసీది, పాటలుపాడేది, పనిచేసేది, ఈనాడు కోట్లకొద్దీ మనుషులను రింజల్లా గుప్పిట్లోపెట్టుకుని ఆడిస్తోంది. ఒకస్త్రీ తనపేరు సంతకంచేసి ఎవరో మరొకమనిషిద్వారా ఒక సామ్రాజ్యంయొక్క భవిష్యత్తును చిటికెలో తేల్చివేయగలదు. మణిమయ కిరీటాదులు ధరించిన రాజులు, మహారాజులు, చక్రవర్తులు, సామ్రాజ్యాధిపతులు వీరంతా బజార్లోతిరిగే ఆడదాన్ని లేకపోతే వేశ్యను పెళ్ళిచేసుకున్నవారే. ఆస్త్రీలే ఆమహారాజుల్ని బుట్టలోపెట్టుకుని సమస్తరాజ్యాంగతంత్రాలు నడిపారు. ఇదే జెనీచ్ కా నా సలహా. విశాలమైన ప్రపంచం వుంది. ఈవిధంగా మగాళ్ళమీద నీకసి తీర్చుకోవడానికి బోలెడు అవకాశం వుంది. దూరంగావుండి, నేనూ నిన్ను పొగడుతాను.'

'వద్దు.' ఏమీ ప్రయోజనం లేదన్నట్లు మందహాసం చేసింది జెన్నీ. 'ఇది నేను ఇంతకుముందే ఆలోచించాను. కాని ఏదో ఒలీయమైనశక్తి నాలో ప్రవేశించి చిరకాలంనుంచీ నన్ను దహించివేస్తూవచ్చింది. ఇప్పుడు నాలో ఏమాత్రం శక్తి మిగల్లేదు. కోరికలులేవు. ఆత్మశక్తిలేదు. నాలో అన్నీ నశించిపోయాయి. నాలో శూన్యంతప్ప మరేమీ లేదనిపిస్తోంది. తొలిచివేసిన కర్ర మాదిరి వున్నానని తోస్తోంది. జీవితమే నన్ను తొలిచివేసింది ఇవానిచ్! ఇహ మిగిలిందల్లా ద్వేషం జుగుప్స తప్ప నాలో మరేమీ

లేదు. కాని నా ద్వేషానికికూడా బలంలేదు. గట్టితనంలేదు. నేను నిస్సారమై పోయినట్లే నా ద్వేషంకూడా నిస్సారమైపోయింది. మళ్లీ నాకు ఎవడో వయసు కుర్రాడు తటస్థపడ్తాడు. అతన్ని చూచి మళ్లీ జాలిపడడం, విచారించడం జరుగుతుంది! ఓ! లాభంలేదు ఈ జీవితాన్ని యథాతథంగానే వుంచడం మంచిది.'

ఆమె మౌనం వహించింది. ఏం చెప్పాలో ప్లాటొనోవ్‌కుకూడా తెలీదు. ఇద్దరూ బాధలో మునిగిపోయారు. చివరకు జెన్నీ లేచి ప్లాటొనోవ్ వంక చూడకుండా తన చెయ్యి అతనికి అందించింది.

'సెలవు తీసుకుంటాను సెర్జీ ఇవానిచ్! ఇంతసేపూ మిమ్మల్ని కూచోబెట్టాను. మీ కాలాన్ని వృథాచేసినందుకు నన్ను క్షమించండి. చేయగలిగిన సహాయం ఏమైనావుంటే అది మీ రొక్కరే చేస్తారని నాకు తెలుసు. కాని ఏం చేస్తాం? చేసేదేమీ కనిపించడంలేదు. సెలవు.'

'పిచ్చిపనులు ఏమీ తలపెట్టకు జెన్నీ! నిన్ను బ్రతిమాలుతున్నాను. అలాంటి పనేమీ చెయ్యకు.'

'సరేలెండి' ఆయాసంగా జవాబుచెప్పి వెళ్లొస్తానని చెయ్యి ఊపింది. హోటలుబయటిదాకా ఇద్దరు కలిసివచ్చి తరువాత విడిపోయారు. కాని ప్లాటొనోవ్ కొద్దిదూరమైనా వెళ్ళకముందే వెనుకనుంచి జెన్నీ పిలిచింది.

'సెర్జీ ఇవానిచ్! ఓ సెర్జీ ఇవానిచ్!'

అతను వెనక్కుమళ్ళి ఆమెదగ్గరికి వచ్చాడు.

'నిన్న కోలీ-పోలీ మా కొంపలోనే, హాలులో పడి చచ్చాడు. చాలా అకస్మాత్తుగా మాట్లాడుతూ మాట్లాడుతూ పోయాడు పాపం! మొత్తానికి సుఖమరణం. ఓ! ఎందుకు పిలిచానంటే నే నడగాల్సిన ప్రశ్న మరొకటుంది. ఇదేలెండి చివరి ప్రశ్న. సెర్జీ ఇవానిచ్! దేవుడున్నాడా లేడా? ఈ ఒక్కవిషయం చెప్పండి.'

ప్లాటొనోవ్ కనుబొమలు చిట్లించాడు.

'నేను నీకు ఏం జవాబు చెప్పను జెన్నీ? ఈ విషయం నాకే తెలీదు. దేవుడున్నాడనే నే ననుకుంటాను. కాని మనం ఊహించుకుంటున్న విధంగా లే డతను. అతను చాలా బలమైనవాడు, న్యాయం కలవాడు.'

'పోతే, మళ్ళీ జన్మలో ఏం జరుగుతుంది? అంటే మనం చచ్చిం తరువాత? స్వర్గం వుందనీ నరకం వుందనీ చెపుతారు; అది నిజమేనా? లేక ఏమీ లేదా? వట్టి శూన్యమేనా? స్వప్నాలు లేని గాఢమైన నిద్రా? అంధకారమా?'

ప్లాటొనోవ్ మళ్లీ జెన్నీ వంక చూడకుండా మౌనం వహించాడు. అతని కేదో విపరీతమయిన భయం కలిగింది.

'నాకు తెలీదు.' చివరకు సమాధానం చెప్పాడు ఎంతో కష్టంమీద 'నీతో అబద్ధాలు చెప్పడం నా కిష్టంలేదు.'

జెన్నీ నిట్టూర్పు విడిచి మందహాసంచేసింది. ఆమె నవ్వులో జాలి విచారం అగుపిస్తున్నాయి.

'సరే, ఏం చేస్తాం? నమస్కారమండీ! మీరు సుఖంగా వుండాలని ఎప్పుడూ మనస్ఫూర్తిగా వాంఛిస్తాను. మరి సెలవు. నమస్కారం; నమస్కారం.'

ఆమె గిరుక్కున వెనక్కుతిరిగి మెల్లగా కొండ ఎక్కడం ప్రారంభించింది. ఆమె అడుగులు తడబడుతున్నాయి.

ప్లాటొనోవ్ తన సామానులు వేళకు మళ్ళీ పనిలోకివచ్చాడు. అప్పడే కూలీలంతా మళ్ళీ యథాస్థానాల్లోకి చేరుకుని పని ప్రారంభించ బోతున్నారు. మేనేజరు ప్లాటొనోవ్‌ను అంత దూరాన్నే చూచి పెద్దగా వార్ఫుఅంతా ప్రతిధ్వనించేలా అరిచాడు.

'సరీగ్గా సమయానికొచ్చావు; లేకపోతే కాళ్ళు చేతులు కట్టి అవతల పారేద్దామనుకుంటున్నా. సరే, నీ స్థానంలోకి నీవు రా.'

# 6

ఆ మరుసటిరోజు శనివారం. డాక్టరు పరీక్షచేసేరోజు. వారాని కొకసారి, అంటే ప్రతిశనివారం డాక్టరువచ్చి వేశ్యలందరినీ పరీక్షచేస్తాడు. మామూలుప్రకారం ఇవాళకూడా సానులంతా శ్రద్ధగా, భయభక్తులతో అలంకరించుకుని డాక్టరుపరీక్షకు సంసిద్ధులవుతున్నారు. సంసారస్త్రీలు ఎవరికైనా చూడ్డానికి వెళ్ళేటప్పుడు ఎలా తయారవుతారో, అలా తయారవుతున్నారు. ఒళ్ళంతా పరిశుభ్రంగా తోముకున్నారు. వారిదగ్గర వున్న వాటిల్లోకల్లా మంచివిచూచి లంగాలు కట్టుకున్నారు. 'అన్నా' ఇంటికిటికీ తలుపులన్నీ మూసివున్నాయి. ఒక కిటికీదగ్గర పొడుగాటి బల్లఒకటి వేశారు, దానిమీద ఒక గట్టి తలగడ అమర్చారు.

వేశ్యలంతా ఆందోళనపడుతున్నారు. కాదూ మరి! ఏదైనా రోగం తగిలివున్నదీ అంటే, డాక్టరుపరీక్షలో బయటపడుతుంది. ఇక ఆతరువాత పీక్కోలేక చావాలి. ఇక్కడ అవమానం జరగడమే కాకుండా, అక్కడ ఆసుపత్రికి తీసుకుపోయి పడేస్తారు. ఆసుపత్రి జీవితమంటే మరి చెప్పక్కర్లేదు. సరైనతిండీ, పోషణ వుండదు. రోగం నయం అయిందాకా నెలలతరబడి అక్కడ యమయాతన అనుభవించాలి. పైగా వారుచేసేచికిత్స, వైద్యవిధానంకూడా భయంకరంగా వుంటాయి. బాధకలిగిస్తాయి! అంచేతనే పడుపుకత్తెలంతా ఎవరికర్మ ఎలావుందోఅని, గుండెలు పిసుక్కుని చస్తున్నారు.

వేశ్యలందరిలో పెద్దమంకా, జోయా, హెన్రీటా; ఈ ముగ్గురు ఏమాత్రం చలించకుండా, ఆరితేరిన సర్కస్ గుర్రాలమాదిరి వున్నారు. వీరు ముగ్గురూ ముప్పయ్యోపడిలోపడ్డారు. యామాలోవుండే వేశ్యలను బట్టిచూస్తే వీరు వయోవృద్ధులయినట్లే లెక్క. పడుపువృత్తిలో అనేక ఢక్కామొక్కీలు తిని, ఎన్నోవిషయాలుచూచి కాచివడపోసి, అనేక అవాంతరాలుదాటి, కష్టాలు అనుభవించి రాటుదేలిన మనుషులు వీరు. పెద్దమంకా అనేకసార్లు తననుగురించి ఇలా చెప్పుకునేది—'ఇలాంటి విషయాలు నాకు మంచి నీళ్ళప్రాయం. ఈ వృత్తిలో నేను నరకాన్ని చూచాను పైఅంతస్తులోకి పోయి స్వర్గాన్ని చూచాను. అంచేత నాకిప్పుడు ఏమాత్రం బెదురులేదు.'

ఇలాంటివారు కనుకనే ఇవాళకూడా ఈ ముగ్గురూ రాబోయ్యే ప్రమాదాలకు భయపడకుండా, నిబ్బరంగా నిశ్శబ్దంగా వున్నారు.

జెన్నీమాత్రం పొద్దుటినుంచీ అదోలావుంది. ఏదో నీరసంగా ఆలోచిస్తున్నట్లు, ఆందోళనపడుతున్నట్లు అగుపిస్తోంది. తనస్నేహితురాలు తెల్లమంకాకు ఒక బంగారపుగొలుసు బహుమతిగా ఇచ్చింది. గొలుసులో ఒక బిళ్ళకూడావుంది. ఆ బిళ్ళలో తనఫొటో, వెండితో చేసిన శిలువగుర్తు (†) అమర్చివున్నాయి. బిళ్ళకుపైన మూతకూడా వుంది. ఈ గొలుసు మెళ్ళో ధరించమని మంకాకు బహుమానంగా ఇచ్చింది జెన్నీ. తరువాత టమారాకు రెండు ఉంగరాలు ఇచ్చింది. ఒకటి వెండిది. మూడుచుట్లతో తయారుచేసింది. ఈ మూడుచుట్లూతీస్తే ఎడమెడంగా వస్తాయి. మధ్యచుట్టుమీద రెండు కొక్కములుకూడా అమర్చివున్నాయి. ఇహ రెండోది బంగారపు ఉంగరం. సన్నని తీగలో చేయబడింది. మధ్యన ఒకరాయికూడావుంది. రాయి జాతిరాయి కాదు. ఏదో నకిలీరాయి. ఈ రెండుఉంగరాలు తన జ్ఞాపకార్థం పెట్టుకోమని టమారాకు ఇచ్చింది జెన్నీ.

'టమారా' నేను లోపలవేసుకునే డ్రాయరు (చిన్నలాగు) వుంది చూశావూ? అది మనపనిమనిషి అన్నూష్కాకు ఇచ్చేయ్. బాగా నీళ్ళల్లో ఉడకబెట్టి ఉతికి, నా జ్ఞాపకార్థం కట్టుకోమని చెప్పు.' అంది జెన్నీ.

వీరిద్దరూ టమారాగదిలో కూచున్నారు. పొద్దున్నే తనకోసం కొంత కాగ్నాక్ (ఒకరకమైన బ్రాందీ) తెప్పించుకుంది జెన్నీ. ఇప్పుడు మెల్లిగా, బద్ధకంగా, ఒక్కోగ్లాసు తాగుతోంది. మధ్య మధ్య నిమ్మకాయముక్కలు పంచదారలో అద్దుకుని తింటోంది. టమారా నివ్వెరపోయి చూస్తోంది. ఎందుకంటే జెన్నీ సాధారణంగా తాగదు ఎప్పుడో వచ్చినవిటులు బలవంతం చేస్తేతప్ప ఆమెకు నిత్యం తాగేఅలవాటు లేదు.

'ఏమిటీసంగతి జెన్నీ? ఇవాళ నీ వ్యవహారంఅంతా వింతగావుందే! నీ వస్తువులన్నీ అందరికీ పంచిపెడుతున్నావు. చావడానికి సిద్ధమైనట్లో, లేక సన్యాసం పుచ్చుకోనున్నట్లో, ఏమిటీ అప్పగింతలన్నీ?' అనడిగింది టమారా ఆశ్చర్యంగా.

'అవును; నేను ఆ పనే చెయ్యొచ్చు.' నిర్లక్ష్యంగా జవాబుచెప్పింది జెన్నీ. 'నాకు విసుగుపుట్టింది టమారా.'

'ఇక్కడ సుఖంగా సంతోషంగా వున్నదెవరు?' అంది టమారా.

'అదికాదు టమారా, కేవలం విసుగెత్తి కాదు ఈపని చేయడం. ఇక నేను చేయాల్సింది చేయగలిగింది ఏమీ కనిపించడంలేదు. టమారా, నేనిక్కడ ఇప్పుడు ఈ బల్లముందు కూచునివున్నాను. ఇంతింత చేతులు, కాళ్ళు పెట్టుకుని కూచున్నాను. నిన్ను చూస్తున్నాను. ఈ సీసాను చూస్తున్నాను. మనసులో ఆలోచిస్తున్నాను. నిజం చెప్పాలంటే, ఈ నా పనికి ఏమైనా అర్థముందా? నేనెవర్ని? ఎందుకున్నట్టు? ఏంచేస్తున్నట్టు? ఒక్కదానికూడా అర్థంలేదు! చూడు. ఆ వీధిలో ఎవడో సోల్జరు పోతున్నాడు. ఏముంది అతనిలో? అతనొక పనికిమాలిన బొమ్మలా నా కంటికి కనిపిస్తున్నాడు. వర్షానికి ముద్దయివున్నాడు. నేనూ అంతే టమారా! నిజం ఆలోచిస్తే అతను చచ్చిపోతాడు. నేనూ చచ్చిపోతాను. నీవూ చచ్చిపోతావు. కనుక నాకేమీ తేడా కనిపించడంలేదు. భయంగాని, ఆశ్చర్యంగాని వెయ్యడంలేదు. అంచేత ప్రతివిషయం ఇంతే—ప్రతిదీ చాలా అల్పంగాను, వ్యర్థమైందిగాను కనిపిస్తోంది.' జెన్నీ వేదాంతిలా మాట్లాడి ఒక క్షణం మౌనం వహించింది. తరువాత మరో గ్లాసు కాగ్నాక్ తాగింది. నిమ్మబద్ద పంచదారలో అద్ది కొరుక్కుంది. ఆమె ఇంకా వీధిలోకే చూస్తోంది. అకస్మాత్తుగా ఇలా అడిగింది.'

'టమారా! నీవు ఎక్కణ్ణుంచివచ్చావో ఇంతకుముందెప్పుడూ అడగలేదు. ఇప్పుడుచెప్పవే. నీవు ఎక్కణ్ణుంచి వచ్చావు? ఎలా ఈ కొంపలో ప్రవేశించావు? మా అందరివంటిదానవి కాదే నీవు. నీ వెంతో జ్ఞానం కలదానవి. నీవుచేసే ప్రతిపనికీ, నీవుమాట్లాడే ప్రతిమాటకూ ఒకఅర్థమూ విలువా వున్నాయి టమారా. అందరిలా వ్యర్థంగా ఏపనిచెయ్యవు. ఒకసారి మా అందరికీ ఆశ్చర్యం కలిగేలా ఫ్రెంచిభాషలో మాట్లాడావు. ఇంతమంది పిల్లల్లో ఒక్కరికైనా ఆ భాష వచ్చునా? నీజీవితంఏమిటో, నీ రహస్యాలు ఏమిటో ఇక్కడ ఒక్కరికికూడా తెలీదు. చెప్పు టమారా. నీవెవరు?

'జెన్నీచ్కా! నీ ఆసక్తేగాని, నిజంగా నాజీవితంలో చెప్పదగింది ఏమీలేదు. విశేషం అంతకన్నా లేదు. అందరి జీవితాల్లాంటిదే నాదికూడా. నేను బోర్డింగ్ స్కూలులో చదువుకున్నాను. పిల్లలకు పోషకురాలిగా పని చేశాను. పాటకులతో మేళగాళ్ళతో కలిసి పాటలుపాడాను. క్రీడాస్థలాలకు

పరుగెత్తి, అక్కడ తుపాకులు, రైఫిల్సు కాల్చడం నేర్చుకున్నాను. అప్పుడే ఒక దుర్మార్గుడితో నాకు స్నేహం కలిసింది. తరువాత ఒక సర్కస్ కంపెనీలో చేరి, దాంతో అనేక దేశాలు తిరిగాను. పిమ్మట ఎలాగో స్త్రీలమఠంలో చేరాను. అక్కడ రెండుసంవత్సరాలుండి, ఎంతో కృషిచేశాను. ఎంతో సేవ చేశాను. ఇంకా నేను చేసినపనులన్నీ జ్ఞాపకంలేవు జెన్నీ. నేనుదొంగతనాలు కూడా చేశాను.'

'నీజీవితం అనేక సాహసాలతో కూడుకున్నది. నీవు నిజంగా ఎన్నో రకాల జీవితాన్ని చూచావు టమారా!'

'సరే- ఇవాపోనే, నేను చిన్నదాన్ని, అనుకుంటున్నావేమో! కాదు. నీవు చెప్పు, నాకెంతవయస్సు ఉంటుందంటావు?'

ఇరవైరెండో లేక ఇరవైనాలుగో.'

'కాదే పిచ్చిపిల్లా! మొన్ననే, అంటే క్రిందటి వారానికే నాకు ముప్ఫయిరెండో ఏడు వచ్చింది. బహుశా అన్నాఇంట్లోవుండే మాను లందరిలోకీ నేనే పెద్దదాన్ని అనుకుంటున్నా. చూచావు జెన్నీ! నేను ఎప్పుడూ, ఏ విషయాన్నిగురించికూడా చింతించను, బాధపడను. పట్టించు కోను. ఆశ్చర్యపోనుకూడా. అన్ని విషయాల్లో అంటీఅంటనట్లుంటాను. నీకు తెలుసుకదా? నాకు తాగుడు అలవాటులేదు. నా శరీరాన్ని గురించి ఎంతో శ్రద్ధతీసుకుంటాను. ,ఇంకా ముఖ్యవిషయం ఏమిటంటే, నే నింత వరకు ఎప్పుడూ ఎవరిని ప్రేమించలేదు. నా అంతట నేను ప్రేమించి ఏ మగాడివల్లో పడ్డేదు.'

'మరి నీతో తిరిగే ఆ 'శంకా' సంగతేమిటి?'

'అతనా! అది వేరే కథ. చూడు జెన్నీ! స్త్రీ హృదయం చాలా చెడది. అర్థంలేనిది. ప్రేమలేకుండా అది జీవించలేదు. అయినప్పటికీ, 'శంకా'ను నేను నిజంగా ప్రేమించలేదు...అది ఏదో...ఆత్మవంచన... అంతకన్నా మరేం కాదు...పైగా తొందరలోనే నాకు అతనితో అవసరం కూడా వుంది.'

అకస్మాత్తుగా జెన్నీకి ఉత్సాహం పుట్టుకొచ్చింది. స్నేహితురాలి వంక ఆసక్తితో చూచింది.

'మరి టమారా! ఒక్క విషయమే. ఇంత తెలివైనదానివి, సమర్థురాలివి, అందమైనదానివి, చివరకు ఈ కూపంలోవచ్చి ఎట్లా పడ్డావే?' అనడిగింది జెన్నీ ఆసక్తితో.

'అది చాలా పెద్దకథ. చెప్పడానికూడా నాకు ఓపికలేదు. ఎలాగైతేం, ప్రేమలోపడే నేనిక్కడికొచ్చాను. జెన్నీ ఒక యువకుడిమీద మోజుపడ్డాను. మే మిద్దరం కలిసి ఫ్రాన్సులో ఒక విప్లవం లేవదీశాం. చూడు జెన్నీ! స్త్రీల దల్లా ఏముందీ? ఏ మగాడిమీద మోజుపడితే, ఆ మగాడు చెప్పిందల్లా చేస్తాం. అతను ఎటువైపుచూస్తే మనమూ అటువైపే చూస్తాం. నిజంగా నాకు అతను చేసే పనిలో నమ్మకంలేదు. అయినా అతన్ని అనుసరించాను. అతను చాలా తెలివైనవాడు. మంచి మాటకారి. అందమైనవాడుకూడా. కాని చివర కతను ఒక పచ్చి దొంగగా, నీచుడుగా ద్రోహిగా మారిపోయాడు. ఒకవైపు విప్లవంలో పాల్గొంటూ, మరొకవైపు అతని కామ్రేడ్స్‌కే ద్రోహం తలపెట్టాడు విరోధులయిన ఫ్రెంచిసాయుధ పోలీసుదళాలతో చేతులు కలిపి, వాళ్ళకు రహస్యంగా వార్తలు అందించే ఏజంటుగా పనిచేయడం మొదలెట్టాడు. ఆఖరుకు అతను చేసినపాపం అంతా బయటపడింది. అతని దుర్మార్గం వెల్లడిఅయింది. అతన్ని హింసపెట్టి చంపేశారు. ఇహ నా గతేమిటి? దిక్కులేనిదాన్ని అయిపోయి, కుమిలి కుమిలి ఏడ్చాను. చివరకు ఎక్కడో ఒకచోట దాక్కోవాల్సివచ్చింది. అందువల్ల ఒక తప్పుడు ప్యాస్‌పోర్టు సంపాయించాల్సివచ్చింది. పచ్చటికెట్టు తీసుకుని పడుపువృత్తిలో ప్రవేశించినట్లయితే ఎవరూ కనుక్కోలేరనీ, ప్రమాదం తప్పుతుందనీ, ఇదే సులభమైనమార్గమనీ, నాకు కొందరు సలహా ఇచ్చారు. ఇంకేం? అపనే చేశాను. కాని ఇక్కడకూడా, సమయంకోసం ఎదురు చూస్తూ కాలం వెళ్ళదీస్తున్నాను జెన్నీ. అంతకన్నా మరేంలేదు. సరైన సమయం దొరకగానే ఇక్కడినుంచి వెళ్ళిపోతాను.'

'ఎక్కడికి?' ఆదుర్దాగా అడిగింది జెన్నీ.

'ప్రపంచం చాలా విశాలమైంది. ప్రాణంమీద నాకు తీపివుంది! జీవితమంటే ప్రేమ వుంది! అంచాత నాజీవితంలో ఎప్పుడూ అకస్మాత్తుగా ఏదో చెప్పలేనంత మార్పువస్తుంది. మొదటినుంచీ అంతే. స్త్రీలమఠంలో చేరానా పనేమీ లేకుండా అస్తమానం ప్రార్థనచేస్తూ పాటలుపాడుతూ, ఏండ్లతరబడి

గడిపాను. చివరకు విసుగెత్తింది. గభాలున విప్లవంలో దుమికాను! అలాగే ఇప్పుడుకూడా జరుగుతుంది. మళ్ళీ అకస్మాత్తుగా ఎందులోకో, ఎక్కడికో దుముకుతాను. ఎలా చెప్తాం? నాటకాల్లో ప్రవేశించవచ్చు. లేదా సర్కస్ కంపెనీలో చేరొచ్చు. లేదా ఏ నర్తకుల గుంపులోనో పడొచ్చు. కాని జెనీచ్కా! అన్ని పనులలోకీ నాకు అత్యంత ప్రీతికరమైంది, నన్ను మోహింపచేసేది ఏంపని అనుకుంటున్నావు? దొంగతనం! దొంగతనంచేస్తూ బ్రతకడం నాకెంత సరదాగా వుంటుందో వర్ణించలేను. ఆ సాహసం, ఆ ప్రమాదాలను ఎదుర్కోవడం, మనం భయపడటం, ఇతర్లను భయపెట్టడం; ఓ! నాకు పిచ్చెక్కిస్తుందనుకో! బయటికి నన్నుచూచి అంతా ఏమనుకుంటారు? హు! నా వినయం, నా తెలివితేటలు, నా ప్రవర్తన; ఇవిచూచి నేనొక మంచిమనిషిననీ, మర్యాదస్తురాలిననీ నిర్ణయించుకుంటున్నావు కదూ? కాదు జెన్నీ! నా జీవితం వేరు, నా లోపలిజీవితం వేరు! చాలా విరుద్ధమైంది! బయటి టమారా వేరు, లోపలి టమారా వేరు జెన్నీ! నీవు అదితెలుసుకుంటే ఆశ్చర్యపోతావు.' ఇలా అనేసరికి ఆమెకళ్ళు ఆనందంతో మిలమిల మెరిశాయి. 'నా లోపల ఒక బ్రహ్మాండమైన రాక్షసి, ఒక పెనుభూతం వున్నది జెన్నీ!' అంది ఆమె తిరిగి.

'నీవు అదృష్టవంతురాలివి.' అంది జెన్నీ బద్ధకంగా ఆలోచిస్తూ 'జీవితంనుంచి నీవేదో ఆశిస్తున్నావు. మరి నేనో? నేను చచ్చినదానిలో జమ. నా వయస్సు ఇరవైయేండ్లు. అయితేఏం? అప్పుడేనూరేండ్లు నిండినట్లనిపిస్తోంది. నాకు వృద్ధాప్యం వచ్చింది టమారా! మానసికంగా నేను వృద్ధురాలనయిపోయాను. నాగుండె కుళ్ళిపోయి, శ్మశానంలో శవంలా కంపుకొడుతోంది. పోనీ, ఇంతవరకైనా నేను జ్ఞానంతో జీవించానంటావా? అదీలేదు. ఛీ! నా జన్మ నిరర్థకం. నా జీవితం శూన్యం. నా జీవితం ఒక రొచ్చుగుంట టమారా!'

'ఇహ అంతటితో ఆపు జెంకా. ఏమిటా పిచ్చిమాటలు? నీవు మాట్లాడేదానికి అర్థంలేదు. నీకేం తక్కువ? నిక్షేపంలాంటిదానివి నీవు. నీ తెలివి, నీకున్నశక్తి మరెవరికీ లేవు. మగాళ్ళు నీచుట్టూ ప్రదక్షిణంచేసి నీకాళ్ళమీద పడతారు జెన్నీ! నీవుకూడా ఈ రొంపిలోంచి వెళ్ళిపోవాలి; తప్పదు. కాని

నాతోకాదు. నేనెప్పుడూ ఒంటరిగా వెళ్లేదాన్నే. నీ అంతటనీవే ఎప్పుడో వెళ్ళిపోవాలి.'

జెన్నీ తలూపింది. పిమ్మట మెల్లగా తనరెండు చేతులతో మొహాన్ని కప్పుకుంది. చాలసేపు మౌనంగావుండి తరువాత ఇలా అంది.—

'లేదు. ఇక్కణ్నుంచి వెళ్ళిపొయ్యే ప్రాప్తం నాకులేదు. జీవితం నన్ను నమిలివేసింది. ఇహ నే నెప్పటికీ మనిషినికాను. నాలో జీవంలేదు. నా వ్యక్తిత్వం నశించింది. జీవితమనే పశువు నన్ను గడ్డిలా నమిలివేసింది. ఛీ! అది నెమరువేసి వెళ్ళగక్కిన అసహ్యమైన ఆహారాన్ని నేను!' అంటూ ఆమె అభినయిస్తూ తన్నుతానే సంబోధించుకోసాగింది. 'రా జెన్నీచ్కా! మరికొంచెం బ్రాందీ సేవించు. హు! ఇది ఎంత విషతుల్యమైంది! నాకు ఆశ్చర్యంవేస్తుంది. అనూష్కా ఈ బ్రాందీ ఎక్కణ్నుంచి తెస్తుందో ఏంపాడో! దీన్ని తీసుకుపోయి ఒకకుక్కమీద పోస్తే, దాని వెంట్రుకలుకూడా మాడిపోతాయి. తప్పదు. అలాంటి అగ్నిహోత్రం ఇది. పాడుముండ, ఆ అనుష్కా ఎప్పుడూ నాదగ్గర, అందరికంటె ఓ యాభైకోపెక్కులు ఎక్కువ కాజేస్తుంది. ఒకసారి 'ఏమే, ఇంతడబ్బు సంపాయించి చివరకు ఏంచేద్దామని?' అన్నాను నేను. 'నా పెళ్ళికోసం' అని ఆమె జవాబు చెప్పింది.

'నా మొగుడు ఎంతో సంతోషిస్తాడు. కనీసం కొన్నివందల రూబుల్సు అయినా పోగుచెయ్యాలి.' అంది ఆమె. ఆమె చాలా అదృష్టవంతురాలు! టమారా! అద్దంక్రిందవున్న, నా పెట్టె సొరుగులో కొంత డబ్బుందిగాని, దయచేసి ఆమె కివ్వవే.'

'ఏమిటే మూర్ఖురాలా? ఏమి టీ అప్పగింతలన్నీ? చావాలనా?' కోపంగా అడిగింది టమారా.

'కాదే. ఊరికనే. ఆ డబ్బు తీసుకో. ఎవరెరుగుదురు? నేను ఆస్పత్రికి చేరే అవస్థ పట్టొచ్చు. అక్కడ ఏం జరుగుతుందో, నా గతి ఏమవుతుందో ఎవరికి తెలుసు? నా దగ్గర ఇంకా కొంచెం చిల్లర వుంది. ఏదయినా అవుసరం వస్తుందని ఉంచుకున్నా. సరేగాని, టమారా! నాకు నేనే ఏదైనా అపకారం చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నా ననుకో, అప్పుడు నీవు ఏం చేస్తావ్? నన్ను ఆపుచేస్తావా?'

టమారా ఆమెవైపు నిశ్శబ్దంగా, తీక్షణంగా, ఆమెభావాలు తూకం వేస్తున్నట్లుగా చూచింది. జెన్నీ మొహంలో విషాదచ్ఛాయలు స్పష్టంగా అగుపిస్తున్నాయి. ఆమె మొహంలో జీవకళ లేదు. ఆమె కళ్ళు నిర్జీవంగా వున్నాయి. వాటిచుట్టూ ఏదో శూన్యత ఆవరించింది.

'లేదు.' మెల్లగా, గంభీరంగా జవాబుచెప్పింది టమారా.

'లేదు జెన్నీ. నేను ఆపుచెయ్యను. నీవు నిజంగా ప్రేమకోసం ఆ పని చేసినట్లయితే ఆపుచేసేదాన్ని. లేక డబ్బుకోసం అలా చేస్తున్నా, ఆ విషయాన్ని గురించి నీతో మాట్లాడేదాన్ని. కాని కొందరికి ఇతరులెవరూ జోక్యంకలిగించుకోవడానికి అసాధ్యమైన సందర్భాలు కొన్ని అప్పుడప్పుడు వస్తుంటాయి. మరి అలాంటప్పుడు నేనేం చేయగలను? అంచేత నిన్ను వద్దని చెప్పడంకాని, ఆపుచెయ్యడం కాని, చేయను.'

వీ రిలా మాట్లాడుతూవుండగా అదే సమయానికి పనిమనిషి జోస్యా నడవలోంచి వెడుతూ పెద్దగా కేకలుపెడుతోంది.

'అమ్మాయిలూ! త్వరగా తెమలండి. డాక్టరువచ్చి చూచున్నాడు. త్వరత్వరగా ముస్తాబై బయటకు రండి.'

అది విని జెన్నీ లేచి నిలబడి మెల్లగా ఇలా అంది.

'సరే టమారా! నీవు నీపని చూచుకో. నే నొక నిముషం నా గది లోకి వెడతాను. ఇంకా నేను బట్టలు మార్చుకోలేదు. ఇవైనా ఫరవాలేదు గాని, అయినా ఎందుకు? ఒక నిముషం. ఈలోగా నా పేరు పిలిచి, నేను అప్పటికి అక్కడ హాజరుకాకపోయినట్లయితే నాకోసం కబురు పెట్టు. లేదా నీవైనా నాకోసం రా. సరేనా'

జెన్నీ వెళుతూ వెడుతూ ఏదో యాదాలాపంగా వేసినట్లు, తనచెయ్యి టమారాభుజంమీద వేసింది. ప్రేమతో ఆమెభుజాన్ని తట్టింది.

డాక్టరు క్లిమెంకో స్త్రీలను పరీక్షించడానికి అవసరమైన సామగ్రి, సరంజామాఅంతా సిద్ధంచేసుకుని ఒకటేబుల్‌మీద సర్దుకుంటున్నాడు. వుండుపడినచోట, చెడిపోకుండా కుళ్లిపోకుండా వుండడానికి ఉపయోగించే ద్రావకము, పౌడర్లు, వాస్‌లైను, ఇంకా ఇతరమందులు, సామానులు; అన్నీ టేబుల్‌మీద అమర్చుకుంటున్నాడు. అతనిదగ్గర పడుపుకత్తెలందరికీ సంబంధించిన పచ్చటిక్కెట్లు వున్నాయి. వారిపేర్లన్నీ వరుసగా అక్షర

క్రమంలో వ్రాసిన జాబితాకూడా ఒకటివుంది. పానులంతా రాత్రిపూట వేసుకునే గౌనులు తొడుక్కుని వున్నారు. కాళ్ళకు స్లిప్పర్లు, మేజోళ్ళు వున్నాయి. వీరంతా డాక్టరుకు కొంచెం దూరంలో కూచునివున్నారు. కొందరు నిలబడ్డారుకూడా. టేబుల్‌కు ఆనుకుని యజమానురాలు 'అన్నా మార్కొవ్నా' నిలబడివుంది. ఆమెకు కొంచెం వెనుక, ఇంటిపెత్తందారు 'ఎమ్మా ఎడ్వర్డోవ్నా', పనిమనిషి జోస్యా నిలుచున్నారు.

డాక్టరు క్లిమెంకో నగరవైద్యుడు. వృద్ధుడయిపోయాడు. ప్రతివిష యాన్నీ నిర్లిప్తభావంతో చూడ్డానికి అలవాటుపడిన మనిషి. కళ్ళజోడుతీసి వంకరగా పెట్టుకుని ముక్కుమీద సర్దుకున్నాడు. చేతిలోవున్న జాబితాను చూస్తూ పిలిచాడు.

'అలెగ్జాండ్రా బుజిన్‌స్కాయా'

చప్పిడిముక్కుగల 'నైనా' అనే పొట్టిఅమ్మాయి ముందుకొచ్చింది. డాక్టరుపిలిచింది ఈ పిల్లపేరే. అవును, పచ్చటికార్డులమీద వేశ్యల మారుపేర్లు కాక, అసలుపేర్లు వుంటాయి. డాక్టరువద్దకు వచ్చేసరికి ఆ అమ్మాయి గజ గజ వణికిపోతోంది. ఎంతోకష్టంమీద ఊపిరితీస్తోంది. ఆలుపుతో, ఆయా సంతో, బల్లమీదికెక్కి కూచుంది. డాక్టరు తనకళ్ళద్దాలలోంచి విక్రుతంగా, విడ్డూరంగాచూస్తూ ఆమెను పరీక్షచేశాడు.

'బాగానే వున్నావులే. ఇహ నీవు వెళ్ళొచ్చు.' అని ఆజ్ఞాపించాడు డాక్టరు.

పచ్చటికార్డు వెనుకపక్కన తారీఖు వేసి పరీక్షాఫలితం వ్రాశాడు. 'ఆగస్టు28 —ఆరోగ్యం బాగుంది' అలావ్రాసి అడుగున తనసంతకంపెట్టాడు. తరువాత మరో అమ్మాయిని పిలిచాడు.

'వాశ్చెంకోవా ఇరినా.'

అది ల్యూబా పేరు. తనవంతు వచ్చేసరికి ఆమె మరీ గాభరాపడింది. గత ఆరువారాలనుంచీ ఆమె ఇక్కడ లేనందున, వార వారం జరిగే ఈ పనిలో అలవాటు తప్పిపోయింది. డాక్టరు ఆమెరొమ్ములమీద గుడ్డ తొలగించి పరీక్ష చేయబోయేసరికి, వెంటనే ఆమెకు చచ్చేసిగ్గు పుట్టు కొచ్చింది. ఆమె బుగ్గలు, మొహం ఎర్రబారాయి. ఆ ఎరుపుదనం మెడ చుట్టూ, వీపుమీదకూడా వ్యాపించి భయంకరంగా అగుపించింది.

తరువాత వరుసగా జోయా, టమారా, తెల్లమంకా, న్యూరా, వీరందరినీ డాక్టరు పరీక్షచేశాడు. చివరిపిల్ల న్యూరాకుమాత్రం గనేరియా తగిలిందనీ, ఆసుపత్రిలో చేరాలనీ, డాక్టరు ఉత్తర్వుచేశాడు.

డాక్టరు అతివేగంగా పరీక్షచేయడం ముగిస్తున్నాడు. అవును, అతనికి ఈ పనిలో ఇరవైఏండ్ల అనుభవం వుంది. ప్రతి శనివారం సానికొంపలకు రావడం, వాళ్ళను పరీక్షచేయడం, ఆవిధంగా ఇప్పటికి కొన్నివందలమంది వేశ్యలను పరీక్షచేసివుంటాడు. అందువల్ల ఈ పనిలో అతనికి ఒక కష్టంగాని చింతగాని ఏమీ వుండదు. చాలా చురుగ్గా, నిర్లిప్తంగా, నిర్లక్ష్యంగా, యంత్రంమాదిరి చకచకా పని చేసుకుపోతాడు. మనుషులను పరీక్షచేస్తున్నాననీ, మనుషులతో మెలగుతున్నాననే విషయమే మరిచిపోతాడు. అవును. పడుపువృత్తి అనే ఈ భయంకరమైన గొలుసుకు అతను ముడివేయబడ్డాడు. పలువిధములైన కట్టుబాట్లతో, పకడ్‌బందీగా సాగుతోన్న ఈ వ్యభిచార వృత్తికోసమే ఇతను పుట్టాడాఏం? అనిపిస్తుంది. ఇతని వైద్యవృత్తి ఇదేనా? ఇహ వేరే రోగుల్ని పరీక్షచేయడం లేనే లేదా? కాదు. మొదట్లో అతను మామూలు వైద్యుడే. తరువాత ఈపని తగిలింది. బహుశా ఇదే అతని అభ్యున్నతికి పునాదిఅయివుండవచ్చు. ఇప్పుడు ఇతనికికనిపించేదల్లా నగ్నంగా వున్న స్త్రీల శరీరాలు, వారి కాళ్ళు, చేతులు, పొట్టలు, వీపులు, స్తనాలు, ముక్కు, నోరు, ఇవీ. ప్రతి శనివారం ఉదయం గుంపులు గుంపులు ఆడవాళ్ళను పరీక్షచేసి వెళ్ళినతరువాత, వారిలో ఎవరో ఒక స్త్రీని మళ్ళీవీధిలో చూడడం తటస్థిస్తే, అతను పోల్చుకోలేడు. ఎవరైందీ చెప్పలేడు పాపం! ఇతని పనిఅల్లా ఏముంది? ఒక సానికొంపలో పరీక్ష పూర్తిచేయడం, తరువాత రెండోకొంపకు వెళ్ళడం, అటుపిమ్మట మూడోది, నాలుగోది; అలా చివరకు ఇరవై, ముప్ఫయి; ఆఖరుఇల్లువరకూ తనిఖీ పూర్తిచేసి వెళ్ళిపోతాడు. అంతే!

'సుసానా రెయిడ్జినా!' అని పిలిచాడు డాక్టరు.

ఎవరూ ముందుకు రాలేదు. సానులంతా ఒకరివైపు ఒకరు చూచుకుంటూ గుసగుసలు ప్రారంభించారు. 'జెంకా, జెంకా, జెన్నీఎక్కడుంది?' అవును, ఆ పిలిచింది జెన్నీనే.

జెన్నీ గదిలో లేదు.

అప్పుడే పరీక్షఅయిపోయి ఇవతలికొచ్చిన టమారా, డాక్టరువద్దకు వచ్చి ఇలాఅంది. 'ఆమె ఇక్కడ లేదు డాక్టరుగారూ! బహుశా ఆమె ఇంకా బట్టలు వేసుకుంటూవుండేవుంటుందేమో! నే వెళ్ళి ఆమెను పిలుచుకొస్తాను వుండండి.'

టమారా నడవలోకి పరుగెత్తింది. కాని తిరిగిరాలేదు. 'ఎమ్మా' కూడా ఆమెవెంట వెళ్ళింది. తరువాత జోస్యా, ఇంకా ఇతర వేశ్యలు, ఆఖరుకు యజమానురాలు 'అన్నా'కూడా వెళ్ళింది. అందరూ కలిసి జెన్నిని వెదకడం ప్రారంభించారు.

'ఛీ! ఎంత అవమానం, ఎంత అవమానం! ఈ జెంకాతో ఎప్పుడూ ఇంతే. పాడుముండ ఏదో ఒక పెటకం తెచ్చిపెడుతూవుంటుంది. ఎంతో ఓర్చుకున్నాను. కాని ఇహ లాభంలేదు. దీనివల్ల అందరిపరువూ పోతోంది.' అంటూ ఎమ్మా నడవలో పిచ్చికుక్కలా తిరుగుతూ అరుస్తోంది.

ఎక్కడ వెదకినా జెన్నీ అగుపించలేదు. ఆమె గదిలోకి వెళ్ళి చూచారు. టమారా గదిలో చూచారు. ఇల్లు నాలుగుమూలలా వెదికారు. అంతా కలయచూచారు. ఊహూ. జెన్నీ ఎక్కడా లేదు.

'పోనీ స్నానాలగదిలో చూద్దాం. బహుశా అక్కడుందేమో!' అంటూ సలహా చెప్పింది జోస్యా.

అందరూ స్నానాలగదిదగ్గరికి వచ్చి చూచారు. గది తలుపు లోపల వేసివుంది. తాళంకూడా వేసివున్నట్లు కనిపించింది. 'ఎమ్మా' తలుపుమీద పిడికిలితో గుద్దుతూ పెద్దగా అరిచింది.

'జెన్నీ, ఇవతలికిరావే! ఈపని ఏమిటే పాపిష్టిదానా?'

జవాబులేదు. మళ్ళీ గొంతెత్తి అరుచుకుని కేకలు పెట్టింది. 'భయపడడం లేదాపండీ! తలుపుతీయి. డాక్టరు నీకోసం వేచివున్నారు. రావే పాడుముండా!' ఊహూ. ఇప్పుడుకూడా సమాధానం రాలేదు. అందరూ ఒకరి వంక ఒకరు భయంతో చూచుకున్నారు. అందరి మనస్సుల్లో భయం ఆవరించింది.

ఎమ్మా, తలుపుబోల్డె పట్టుకుని గట్టిగా నెట్టింది. అటూఇటూ ఊపింది. ఊహూ. లోపల తాళం వేసివున్నందువల్ల తలుపు వచ్చేస్థితిలో లేదు.

'సిమన్‌ను పిలవండి.' ఆజ్ఞాపించింది, యజమానురాలు అన్నా.

సిమన్ మామూలుగా కళ్ళు నలుపుకుంటూ, నిద్రమత్తు తోలుకుంటూ వచ్చాడు. అందరిమొహాలు చూడగానే అతని కర్థమైంది. ఏదో కొంపమునిగిందని వెంటనే గ్రహించాడు. అవును. ఇలాంటి సంఘటనలు ఎన్నో జరగడం అతను ఎరుగును. పిమ్మట వాళ్ళు జరిగినసంగతంతా అతనితో చెప్పారు. అప్పుడు సిమన్, ఇలాంటిసందర్భాల్లో తను సహజంగా వుపయోగించే బలం, సాహసం తెచ్చుకుని తలుపుతెరవడానికి ప్రయత్నించాడు. దూలాల్లా వున్న తన చేతులతో తలుపుబొడ్డెను పట్టుకుని తనబలమంతా ఉపయోగించి అటూ ఇటూ లాగడం మొదలెట్టాడు. చివరకు అంతలావు ఇనపబొడ్డె, అతని చేతుల్లోకి ఊడిరావడం, అతను వెనక్కు తూలి వెల్లకిలాపడిపోవడం జరిగింది. తలుపుమాత్రం రాలేదు. 'ఛీ! దీనిపాడుగాను. వంటింట్లో పెద్దకత్తివుంటుంది పట్టుకురాండి.' అంటూ అరిచాడు సిమన్ లేస్తూ.

కత్తిని తలుపుసందుల్లోంచి లోపలికి పోనిచ్చి గడియను కోయడం మొదలెట్టాడు సిమన్. అతనివళ్ళంతా చెమటలుపోశాయి. అందరూ భయభ్రాంతులైపోయి నిలబడ్డారు. చివరకు పెద్దయుద్ధంచేసి విశ్వప్రయత్నంతో గడియ కోసివేశాడు సిమన్.

తలుపు తీశారు.

జెన్నీ గొంతుకు ఉరిపోసుకుని వ్రేలాడుతోంది. లాంతరు తగిలించే కొక్కానికి, తన జాకెట్టుజల్తారుతో ముడివేసి గొంతుకు బిగించుకుంది. ఆమె శరీరం మెల్లగా, నిశ్శబ్దంగా కొంచెం అటూ ఇటూ ఊగుతోంది. ఆమె మొహం ఎరుపు నీలం కలిసిన రంగుకు మారిపోయివుంది. గట్టిగా కరుచుకుపోయివున్న పళ్ళమధ్యలోంచి నాలుక కొద్దిగా బయటికి వెళ్ళుకొచ్చింది. మరణవేదనపొంది క్రూరంగా బాధపడినట్లు ఆమె మొహం స్పష్టం చేస్తోంది. వళ్ళంతా నీలుక్కుపోయివుంది.

కొక్కానికి వేళ్ళాడగట్టే లాంతరుతీసి క్రింద పెట్టివుంచి.

ఆమెను గూర్చి ఒకరిద్దరు అమ్మాయిలు పెద్దగా, పిచ్చిగా కెవ్వున కేక పెట్టారు. తరవాత వేశ్యలంతా గుంపుగా, భయపడిన మందలాగా, ఒకరినొకరు తోసుకుంటూ నడవలోకి పరుగెత్తారు. ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా అయిపోయారు. కొందరు ఏడుస్తున్నారు. కొందరు మూలుగు

తున్నారు. మరికొందరు కేకలు పెడుతున్నారు. ఇంకొందరు స్పృహ తప్పి ఏవేవో పిచ్చిపనులు చేస్తున్నారు.

ఈ ఏడ్పులు, పెడబొబ్బలు డాక్టరుకు వినిపించాయి. మెల్లగా స్నానాలగదవద్దకు వచ్చి చూచాడు. జరిగిన సంగతి గ్రహించాడు. కాని అతను ఆశ్చర్యపడ్లేదు. భయపడ్లేదు. విచారించలేదు. నగరవైద్యుడుగా ఆతని అనుభవంలో ఇలాంటి సంఘటనలు అనేకం చూచాడు. తనహయాంలో ఇలాంటివి ఎన్నో జరిగాయి. ఎన్నో ప్రాణులు పడిన యాతన, హింస, బాధ, మరణం ఇవన్నీ కళ్ళారా చూచిన ఘనుడు. అందుచేతనే వీటన్నిటికీ అతను అలవాటుపడిపోయాడు.

ఆమె శవాన్ని కొంచెం పైకెత్తమని సిమన్‌ను ఆజ్ఞాపించాడు డాక్టరు. తరువాత తనే స్వయంగా దగ్గరున్న చాకుతో, ఆమె గొంతుకు వ్రేలాడుతోన్న జల్తారు తాడును కోసివేశాడు. తన ధర్మం తను నెరవేర్చాలి గనుక, శవాన్ని, ఆమె గదిలోకి మోసుకుపొమ్మని చెప్పాడు. పిమ్మట ఆమెకు కృత్రిమంగా శ్వాస కలిగించడానికి ప్రయత్నించాడు. ఇంకేముంది అక్కడ? చచ్చినవాళ్ళకు శ్వాస ఎలా వస్తుంది? ఓ అయిదు నిముషాల తరువాత 'ఇహ లాభంలేదు. ప్రాణం పోయింది.' అన్నట్లుగా కళ్ళద్దాలుతీసి 'పోలీసులను పిలవండి' అని ఆజ్ఞాపించాడు.

పోలీసు ఆఫీసరు కెర్బెష్ వచ్చాడు. పదే పదే జెన్నీని చూచి వెళ్ళి, ఎంతోసేపు యజమానురాలి గదిలో కూచుని ఆమెతో రహస్యాలోచనలు జరిపాడు. గదిలోంచి బయటికి రావడం, లోపలికి పోవడం, అటూ ఇటూ తచ్చాడడం, ఏదేదో గుసగుసలాడడం; ఇలా ఎంతోసేపు జరిగింది. చివరకు నూరు రూబుల్సు నోటు— కొత్తనోటు అతని జేబులో పడింది.

వెంటనే కూచుని అయిదునిముషాల్లో పోలీసు రిపోర్టు తయారుచేశాడు కెర్బెష్. తరువాత జెన్నీకి బట్టలుకూడా కట్టకుండా ఖననం చేయడానికి ఏర్పాట్లు చేశారు. ఆమె చచ్చిపోయేటప్పుడు ఏ దుస్తులతో వుందో, అవే దుస్తులతో వుంచారు. పాపం, వంటినిండా గుడ్డకూడా లేదు. రెండు గడ్డి చాపలుమాత్రం మీద కప్పారు. పిమ్మట జెన్నీశవాన్ని బండిమీద వేసుకుని శవాలను భద్రపరచే స్థలానికి తీసుకుపోయారు.

జెన్నీ చచ్చిపోతూ వ్రాసిపెట్టిన చీటీ, ఆమెగదిలో టేబుల్‌మీద ఉండగా మొట్టమొదట 'ఎమ్మా' చూచింది. తన అకౌంటు బుక్కులోంచి ఒక కాగితంచింపి దానిమీద వ్రాసింది జెన్నీ. ఆత్మహత్య చేసుకోబోయే ముందు, వణుకుతోన్న చేతులతో వంకరటింకరగా, పసిపిల్లలమాదిరి పెద్ద పెద్ద అక్షరాలు పెన్సలుతో వ్రాసింది జెన్నీ.

'నా మరణానికి ఎవరూ కారకులు కారు. ఇందుకు ఎవరినీ నిందించాల్సినపని లేదు. నాకు భయంకరమైన అంటురోగం తగిలింది. మనుషులు, దుర్మార్గులు, మోసగాళ్ళు, వంచకులు; ఈ నీచులమధ్య బ్రతకడం నాకు రోత అనిపించింది. నాకు జీవితంమీద విరక్తిపుట్టింది. చచ్చిపోతున్నాను. నావస్తువులు ఏం చేయాలో టమారాకు తెలుసు. ఆమెకు అన్నివిషయాలు వివరంగా చెప్పాను.'

ఇదీ ఆచీటీలో వ్రాసింది. అదిచదివి ఎమ్మా, కొంచెం ఎడంగా నిలబడివున్న టమారావైపు చూచింది. ఆమెప్రక్కన ఇంకొకొందరు అమ్మాయిలు నిలబడివున్నారు.

'ఏమే ద్రోహీ! ఈవిషయం నీకు తెలుసునన్నమాట. జెన్నీ ఏంచేయబోతున్నదీ నీకు ముందే తెలుసునటే దుర్మార్గురాలా! తెలిసికూడా ఒక్కమాటకూడా చెప్పలేదేమే లంజా!......' కళ్ళల్లోంచి నిప్పులు కక్కుతూ అడిగింది ఎమ్మా. అలాఅంటూనే తన అలవాటుప్రకారం చెయ్యెత్తి టమారాను బలంగా కొట్టబోయింది. కాని అకస్మాత్తుగా టమారానుచూచి ఆగిపోయింది. నోరుతెరచి కళ్ళుపెద్దవిచేసి ఆశ్చర్యంగా ఆమెవంక చూడసాగింది. అవును. టమారా భయంకరంగా మారిపోయింది. అలాంటిస్థితిలో ఆమెను చూడడం 'ఎమ్మా' కిదే మొదటిసారి. టమారా మొహం క్రోధోద్వేగంతో పొంగిపోయింది. ఆమె కళ్ళల్లోంచి ద్వేషానలం కక్కుతోంది. ఒక చిన్న రివాల్వరు చేత్తోపట్టుకుని సరిగ్గా ఎమ్మామొహానికి గురిపెట్టి కాల్చబోయింది టమారా.

౬

ఆరోజు సాయంత్రం 'అన్నా' ఇంట్లో అతిముఖ్యమైన సంఘటన ఒకటి జరిగింది. యజమానురాలు అన్నా తన వ్యాపారసంస్థను, ఎమ్మాకు అమ్మేసింది. వేశ్యలతోసహా తన ఇల్లూ, ఇంట్లోవున్న సామానులు, భూమి పుట్ర, నగ నట్ర, ఇంకా తన హక్కుభుక్తంలోవున్న యావత్తు స్థిరచరాస్తులు, తన తరువాత ఇంటి పెత్తనంచేసే ఎమ్మా చేతుల్లో పెట్టింది.

ఈ విషయం ఇంట్లో అందరికీ తెలుసు. ఇలా జరుగుతుందని చాలా కాలంనుంచి అందరూ అనుకుంటూనేవున్నారు. కాని తీరా జెన్నీ చావడంతోనే ఇది నిజం కావడంవల్ల, వేశ్యలందరికీ ఒక రకమైన భయం, ఆశ్చర్యం కలిగాయి. ఎంతోకాలంనుంచో అనుకుంటూ వాయిదాలుపడుతూ వచ్చిన ఈ పనీ జెన్నీ మరణించిన ఈనాడే పరిష్కారమైపోవడానికి కారణమేమిటో ఎవరికీ అర్థంకాలేదు. అన్నిటికీ కలిపి కుదిరిన ధన ఆ వైవేల రూబుల్సు ఎమ్మా చెల్లించాల్సివుంది. ఈ సొమ్ములో మూడోవంతు పోలీసు ఆఫీసరు కెర్బేష్‌ది. ఇందులోకూడా దాపరికం ఏమీ లేదు. అంతే ఎమ్మా అతిదుర్మార్గురాలు, అత్యాశగలమనిషి. ఆమెకు తోడు క్రూరుడైన ఈ కెర్బేష్‌గాడు ఒకడు తోడయ్యాడు. ఇంకేం? అగ్నికి వాయువు తోడైనట్లు ఈ దుష్టులిద్దరూ చేతులు కలిపి, భాగస్వాములుగా వ్యాపారం సాగిస్తే ఎం జరుగుతుందో మరి చెప్పనక్కరలేదు. క్రూరులు, పాషాణహృదయులు అయిన వీరిద్దరూ తమమీద పెత్తనంచేస్తే, ఇక ముందు ముందు తాము ఎలాంటి దుస్థితి పట్టనున్నదో, ఎన్ని అష్టకష్టాలు పడవల్సివున్నదో ఎలాంటి హింసలకు గురికావల్సివున్నదోనని వేశ్యలంతా భయకంపితులు కాసాగారు.

నిజంఆలోచిస్తే అన్నా, తన వ్యాపారసంస్థను చౌకలోనే పోగొట్టిందని చెప్పాలి. కాని అందుకు కారణాలు లేకపోలేదు. కెర్బేష్ అంటే 'అన్నా' హడలుకుని చస్తుంది. అవును. తన బ్రతుకంతా అతనికి తెలుసు. తన గుట్లు, తన వ్యాపారంలోవున్న తూట్లు, తను చేసే తప్పుడుపనులు, కుతంత్రాలు, అన్నీ అతను ఎరుగును. కనుక అతనుతలుచుకుంటే క్షణంలో అయినా తన బండారం బయటపడేసి, తన జీవితాన్నే పూర్తిగా నాశనం

అలా చేసింది. అటు జెస్సీ మరణించడం, ఇటు వ్యాపారాన్ని ఎమ్మా చేతుల్లో పెట్టడం; రెండు సంగతులూ వెంటనే జరిగిపోయాయి, అప్పుడు ఆమె చేసినపని ముగ్గురికీ సరియైనదై, సక్రమమైనది. ఈ సానికొంపలోంచి అన్నా మార్కోవ్నా వైదొలగడం, ఈవాటికించే ఎమ్మా ఎడ్వర్డోవ్నా సర్వాధికారిణి కావడం, దీనితో పరిస్థితులన్నీ తారుమారైనాయి. అన్నా ఊహించినది అక్షరాలా నిజమైంది! ఏ క్షణంలో అయితే ఎమ్మా చేతుల్లోకి అధికారం వచ్చిందో, ఆ క్షణంనుంచే కొంపకు తిప్పలు వచ్చాయి. ఒకదాని తరువాత ఒకటి అవాంతరాలు రావడం, షేక్స్పియర్ నాటకాలలో మాదిరి అనేక విషాద సంఘటనలు జరగడం మొదలెట్టాయి, ఒక ఈ ఇంట్లోనే కాదు. యామాలోవున్న అన్ని కొంపలకూ ఎలాగో ఒకలాగు యీ నిప్పు అంటుకుంది.

సానివ్యాపారంలో తనకుగల లావాదేవీ లన్నీ పరిష్కారంచేసుకుంది అన్నా. ఆ వ్యాపారంతో పూర్తిగా తెగతెంపులు చేసుకుంది. కాని ఆ తరువాత వారంరోజులయినా తిరక్కముందే ఆమె మరణించింది. అనేక సంవత్సరాలు ఒకే రకమైన జీవితాన్ని గడిపినవారందరికీ సాధారణంగా ఇలాగే సంభవిస్తూవుంటుంది. ఆ జీవితంలోంచి ఇవతలికి రాగానే వీరికి అకస్మాత్తుగా ఒక విధమైన మాంద్యం కలుగుతుంది. అలాగే ఈమెకూ జరిగింది. కాని విచిత్రం ఏమిటంటే, సక్రమంగానే రావాల్సినచావు ఈమెకు రాకడం! చేసినది చెడుపనులైనా చివరకు దర్జా చావు చచ్చింది ముండ! ఒకనాడు చీట్లపేక ఆడుతూ మధ్యలో అకస్మాత్తుగా ఆపి, తనకు వంట్లో ఏదో ఇబ్బందిగా వుందనీ, ఒక నిముషం ఒత్తిగిలుతాను. అంచాత ఆట ఆపవలసిందనీ, స్నేహితురాండ్రకు చెప్పి మంచంమీద పడుకుంది. వెంటనే గట్టిగా నిట్టూర్పు విడిచి చనిపోయింది. ఎంత సుఖమరణం! ఆమెను చూస్తే చచ్చినమనిషిలా లేనేలేదు. ముఖం ప్రశాంతంగా వుంది. పెదవులమీద చిరునవ్వు పోలేదు. ఆ తరువాత ఒక నెలరోజులలోనే ఆమెజీవితంలో భాగస్వామి, విశ్వాసపాత్రుడు అయిన యిసయా సవిచ్ కూడా చనిపోయాడు.

పిమ్మట 'అన్నా' ఆస్తికంతకూ, కూతురు 'బెర్తా' యజమానురాలు అయింది. యిల్లు, ఊరివెలుపలవున్న కొన్ని భూములు, మంచిధర రాబట్టి అమ్మేసింది. తల్లి అనుకున్నట్టే 'బెర్తా'కు వివాహం జరిగింది. సంబంధంకూడా

మంచిదే వచ్చింది. ఆమె తండ్రి ఒకగొప్ప వ్యాపారసంస్థలో పెద్ద ఉద్యోగిగా పనిచేస్తూ ఒడెస్సానుంచీ, నోవోగొరొసిస్క్ నుంచి గోధుములు ఆసియా మైనర్‌కు రవాణా చేస్తుండేవాడు. ఆ పిల్ల తృప్తిగా జీవించసాగింది.

యిహ అదేరోజున— అంటే ఉదయం జెన్నీ ఆత్మహత్య చేసుకోవడం, పిమ్మట అన్నా తనవ్యాపారం యావత్తూ ఎమ్మా చేతుల్లో పెట్టడం జరిగినతరువాత, సాయంత్రం 10 గంటలకు వేశ్యలందరినీ అలంకరించుకుని హాలులోకి రమ్మని ఎమ్మా ఆజ్ఞాపించింది. కాదూమరి? యిప్పుడు తనే యజమానురాలు. అప్పటికింకా విటులు వచ్చేవేళ కాలేదు. పైగా అంతకుముందే కదా జెన్నీ శవాన్ని తీసుకెళ్ళింది! ఇలాంటి పరిస్థితిలో వేశ్యల మనసు ఎలావుంటుంది? పాపం వాళ్ళ హృదయాల్లో ప్రాణస్నేహితురాలు జెన్నీ మరణానికి సంతాపం పోనేలేదు. అలాంటప్పుడు ముస్తాబై హాలులోకి అందరినీ రమ్మని క్రూరంగా ఆజ్ఞాపించడం ఎంత అన్యాయం? అయినప్పటికీ, ఎమ్మా ఆజ్ఞను ధిక్కరించలేక సానులంతా హాలులో హాజరయ్యారు. వారిని పాటలు పాడమనీ నృత్యంచేయమనీ, సరదాగా వుండమనీ ఎమ్మా ఉత్తర్వులు పంపించింది. పాపం! ఏ పిల్లకుకూడా మనసు సరిగాలేదు. అందరూ దిగులుగా, దీనంగా వున్నారు. ఇలా చేయాల్సివచ్చిందేఅని మనసులో విచారిస్తున్నా, ఏ ఒక్కరుకూడా ఎమ్మాను ఎదిరించి మాట్లాడడానికి సాహసించలేక పోయారు.

చివరకు ఆమే స్వయంగా హాలులోకి వచ్చింది. ఇవాళ ఆమె ఎన్నడూ, ఎప్పుడూ లేనంత ఠీవిగావుంది. మంచి నల్లటి సిల్కుదుస్తులు ధరించింది. ఆమె బ్రహ్మాండమైన స్తనాలు రెండూ, రెండు పెద్ద గోపురాల మాదిరి బయటికి పొడుచుకొచ్చి వున్నాయి. మందంగా తయారుచేసిన మూడు పేటల బంగారపు గొలుసు ఒకటి మెళ్ళో ధరించింది. గొలుసు చివర ఒక పెద్ద బిళ్ళకూడా వుంది. అది పొడుగ్గా, క్రిందికిజారి పొట్టవరకూ వ్రేలాడుతోంది. రెండు చేతులకూ నల్ల సిల్కు మేజోళ్ళు వేసుకుంది.

'అమ్మాయిలూ! మీతో కొంచెం మాట్లాడాలనుకుంటున్నాను' అంటూ ఆమె మొదలెట్టింది. 'లేచి నిలబడండి!' ఆజ్ఞాపిస్తూ పెద్దగా అరిచింది 'నే నొచ్చి మాట్లాడుతున్నప్పుడు మీరు లేచి నిలబడి వినాలి' అంది ఆమె మళ్ళీ అధికారం చలాయిస్తూ.

సానులంతా గాభరాపడి ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు అప్పుడు. ఇంతకుముందు ఈ ఇంట్లో ఇలా ఎవరూ ఆజ్ఞాపించలేదు. యజమానురాలు రాగానే వేశ్యలంతా లేచి నిలబడాలా? ఇలాంటి ఆచారం ఎన్నడూ లేదే? అనుకున్నారు వేశ్యలంతా తమలో. ఎలాగైతే నేం, అందరూ సంకోచిస్తూ, కళ్ళు పెద్దవిచేసి, నోళ్ళు తెరుచుకుని లేచి నిలబడ్డారు.

'ఇవాళ్టి మొదలుకొని మీరంతా నన్ను యజమానురాల్ని గౌరవించినట్లు గౌరవించాలి. తెలిసిందా?' అంటూ ఎమ్మా మళ్ళీ మాకుకుగా, ధీమాగా మాట్లాడసాగింది. 'ఇవాల్టినుంచి, అంటే ఈ తారీఖునుంచి ఈ ఇల్లు, ఈ వ్యాపారం అంతా న్యాయానుసారంగా నాకు సంక్రమించింది. ఉదారబుద్ధిగల అన్నా కృపవల్ల నాకిది దక్కింది. అందువల్ల ఈక్షణంనుంచీ నేనే మీకు యజమానురాలిని. అమ్మాయిలూ! ఒక మాట చెపుతాను వినండి. మనలోమనం తగవులు లేకుండా మర్యాదగా వ్యాపారం వెళ్ళదీసుకోవాలి. మీరందరూ సద్బుద్ధితో, వినయ విధేయతలతోను, బంగారు తల్లుల్లా ప్రవర్తించాలి. నేను మీకు తల్లినని భావించండి. తల్లిగా, పెద్దదాన్నిగా మీ అందరినీ ఆజ్ఞాపిస్తున్నాను. పిచ్చిపిచ్చి వేషాలు నాదగ్గర పనికిరావు. సోమరితనాన్ని నేను సహించను. దుర్బుద్ధులు పుట్టినా, దుర్మార్గపు ఆలోచనలు చేసినా, అనవసరమైన గొడవలు లేవదీసినా నేను ఊరుకునేదాన్ని కాదు. 'మేడమ్ అన్నా' దయార్ద్రహృదయురాలు కనుకనే మీకు కావల్సినంత స్వేచ్ఛ ఇచ్చింది. మీ ఇష్టంవచ్చినట్లు చైతక్కలాడుతుంటే చూస్తూ ఊరుకుంది. కాని నేనుమాత్రం మంచిదాన్ని కాదే పిల్లల్లారా! ముందే చెప్తున్నాను నేను చాలా నిక్కచ్చిమనిషిని. అలాంటి వేషాలు నాదగ్గర పనికిరావు. ఏ వ్యవహారమైనా నాతో నిక్కచ్చిగావుండాలి. ముందు క్రమశిక్షణ అలవర్చుకోండి. అదేమిటో రష్యన్ పిల్లలకు బొత్తిగా జ్ఞానంలేదు. చాలా అసహ్యంగా, నీచంగా ప్రవర్తిస్తారు. పందుబోతుతనం జాస్తి. వాళ్ళనుచూస్తే ఒక్కోసారి నాకు జాలివేస్తోంది. అయినా, మరేం దిగులుపడకండి అమ్మాయిలూ! మీకు అంతా నేను నేర్పుతాను. మీ మంచికోసమే సుమా నేను చెప్తున్నది. నా ఆశయం అల్లా ఒక్కటే. మీ రీ వృత్తిలో బాగుపడాలి మిమ్మల్ని అంటిపెట్టుకుని వున్నందుకు నాకూ పేరు, ప్రతిష్ట రావాలి. మన ఉభయులకోసమే ఇదంతాను. అందుకని ముందు మనం, మనకు

పోటీగానడుస్తున్న ఆ (కైవెల్లు కొంపను పడగొట్టాలి! మనదెబ్బకు దాని వ్యాపారం పడిపోయేటట్టు చూడాలి. దాన్ని పూర్తిగా నాశనంచేస్తేగాని నాకు నిద్రపట్టదు. నా ఇంటికొచ్చేవాళ్ళంతా ఏవెధవలో, పనీపాటాలేని ఏ భటావోర్లో, తలతిక్కసటులో, వెర్రివేషాలేసే విద్యార్థులో కాకూడదు. నా ఖాతాదార్లంతా శ్రీమంతులు, గౌరవనీయులు, పుర ప్రముఖులు అయి వుండాలని నా ఆకాంక్ష. అంచేత మీరంతా ఇదివరకటిలాగాకాక, తగిన కట్టుబాట్లతో వెలగాలి. చూచారా అమ్మాయిలూ! నగరవేశ్యలందరి లోకీ మీరు నాజూగ్గా, నగిషీగా తయారుకావాలి. పట్టణంలో ఇలాంటి పిల్లలు లేరనిపించాలి.

'ఏమ్మా ఇంట్లో వేశ్యలా! అబ్బో! వాళ్ళెక్కడండీ! ఆ అందం, ఆ చందం, ఆ మాటా, ఆ మర్యాదా, ఆ ఠీవి, ఆ దర్జా, ఆ కులుకూ, ఆ తళుకూ, ఆ తీరూ, ఆ పద్ధతీ చస్తే మరొకరికి రాదండీ! ఏం పిల్లలు! చూస్తే మూర్ఛపోతారు. వలపులో వాళ్ళను మించినవారు లేరండీ! వుంటే వాళ్ళతోటే వుండాలి' అనుకోవాలి, ఊళ్ళో అందరూ మిమ్మల్ని చూచి. తెలిసిందా? నేను డబ్బుకు లెక్కచెయ్యదల్చుకోలేదు. ఇంట్లోకి మంచి ఫర్నిచరు తెప్పిస్తాను, రకరకాల కుర్చీలు, మంచి మంచి బల్లలు టేబుల్సు విలువైన సామాగ్రి అంతా కొంటాను. మీ గదులనిండా పట్టు సోఫాలు అమర్చదలుచుకున్నాను. ఇల్లంతా మెత్తని తివాచీలు పరుస్తాను. మీదగ్గిరికి వచ్చే విటులు, ఇహ ముందు వెధవ బీరుకు ఆర్డరివ్వరు. ఒకటోరకం బ్రాండీ బోర్డెక్సు వైనూ, షాంపేన్ కావాలని కోరతారు. ఒకటి గుర్తుంచుకోండి అమ్మాయిలూ! డబ్బూ, దర్జాగల వయోవృద్ధు డెవడూ, చౌకబారు ప్రేమను ఆశించడు. అనుభవంలేని పిల్లలంటే ఇష్టపడడు. వలపించి, మరులు గొలపడంలో ఆరితేరిన పడుపుకత్తెనే అతను వాంఛిస్తాడు. వివిధ రకాల ప్రేమను వెల్లడించగల విలాసినులనే అతను కావాలంటాడు. మిమ్మల్ని కొద్దిరోజులలోనే అలాంటి విలాసినులుగా నేను తయారుచేస్తాను. ట్రెప్పెల్సులో ఒకసారికి మూడు రూబుల్సు, రాత్రికి పది రూబుల్సు వసూలు చేస్తున్నారు. నేను ఇకనుంచి ఒకసారికి అయిదు రూబుల్సు, రాత్రికి పాతిక రూబుల్సు వసూలుచేస్తాను. మీ అందరికీ బంగారం, వజ్రాలు బహుమతులుగా ఇస్తాను. మీరు తక్కువరకం కొంపల్లోకి—సోల్జర్లు తొక్కి

తొంబాళీచేసే ఆ పాడు రోగాలలోకి పోకుండా ఇక్కడే స్థిరంగావుండేలా ఏర్పాటుచేస్తాను. అంతేకాదు! మీలో ప్రతిఒక్కరూ నెలనెలా కొంత సొమ్ము వెనుకవేసుకోగలరు. ఆ డబ్బంతా ఎప్పటికప్పుడు నాచేతికిస్తూ వుండండి. దాన్ని నేను బ్యాంకులో దాచిపెడతాను. మీకు కావలసింతవడ్డీ —చక్రవడ్డీవస్తుంది. అలా వడ్డీ పెరిగిపెరిగి ఎంతోసొమ్ము జమ అవుతుంది. కనుక మీలో ఎవరైనా ఓపికలేకపోయినా, విశ్రాంతి తీసుకోవాలనుకున్నా లేక ఒక గౌరవనీయుణ్ణి చూచుకుని పెళ్ళిచేసుకోవాలనుకున్నా కావల్సినంత డబ్బు నిల్వవుంటుంది కనుక, చిక్కేవుండదు. రోగాలలోనూ, తక్కిన విశేషాలలోను వుండే ఒకటోతరగతి వేశ్యాగృహాలలో ఇలాగే చేస్తారు. ఫలానా ఎమ్మా ఒక సాలెపురుగనీ, గయ్యాళిగంపనీ, దుర్మార్గురాలనీ, రక్తంపీల్చే జలగఅనీ ఏ ఒకరూకూడా చెప్పుకోవడానికి అవకాశం లేకుండా ప్రవర్తిస్తాను. కాని ఒకవిషయం. మీలో ఎవరైనాసరే, పందుబోతుతనం అలవాటుచేసుకున్నా, నాపట్ల అవిధేయతతోను, తలబిరుసుగాను ప్రవర్తించినా, తలతిక్క ఆలోచనలు చేసినా నేను సహించేదాన్ని కాదు. నా ఇంట్లోవుంటూ, పక్కపక్కన ప్రియుల్ని పెట్టుకుని రహస్యముగా వారితో ప్రేమకలాపాలు సాగిస్తూవుంటే నేను ఊరుకునేదాన్ని కాదు. అలాంటి తప్పుడు ముండలను ఇక్కణ్ణుంచి మెడపట్టి గెంటేస్తాను. అంతేకాదు. కాళ్ళు చేతులు కట్టి వీధిలో పడేస్తాను. ఇంకా క్రూరంగా శిక్షిస్తానుకూడా...ఇహ ఇప్పుడు నే చెప్పాలనుకున్న సంగతులన్నీ మీకు చెప్పాను. 'నైనా'! ఇలా రా ఒకసారి. తరువాత మీ అందరూకూడా ఒకరి తరువాత ఒకరు నావద్దకు రాండి.'

నైనాఅనే అమ్మాయి కంగారుపడుతూ 'ఎమ్మా'ను సమీపించింది. ఎమ్మా తన కుడిచెయ్యి ముందుకు చాచింది.

'ఒకసారి ముద్దుపెట్టుకో!' ఆజ్ఞాపించింది ఎమ్మా, సింహాసనంమీద కూచున్న ఒక రాణీ మాదిరి పోజుపెట్టి.

పాపం నైనా దిగ్భ్రాంతురాలై, తడబడుతూ ఆమె చేతిని పెద్దగా చప్పుడయ్యేలా ముద్దుపెట్టుకుని పక్కకు తప్పుకుంది. తరువాత జోయా, హెన్రీటా, వాండా, ఇంకా తక్కిన వేశ్యలూ ఒకరు తరువాత ఒకరు వచ్చి ఆమె చేతిని ముద్దుపెట్టుకున్నారు. అందరికంటె వెనుక టమారా వచ్చి

గోడపక్కన, అద్దంవైపు వీపుపెట్టి నిలబడింది. అదే అద్దం. జెన్నీ ఎప్పుడూ ఆ అద్దంముందు కూచుని తను గదిలోకి రాగానే సంతోషంగా అందులోంచి తనవైపు చూచేది. అది జ్ఞాపకం తెచ్చుకుంటూ ఆమె నిలుచుందిగాని, ఎమ్మా చేతిని ముద్దుపెట్టుకోవడానికి ముందుకు రాలేదు.

ఎమ్మా, తీక్షణంగా టమారావైపు దృష్టి నిలిపి చూచింది. కాని ఆ చూపులు ఆమె మీద పనిచేయలేదు. అప్పుడు ఎమ్మా తన చెయ్యి దించేసి, ఒక విషపునవ్వు నవ్వి ఆమెతో ఇలా అంది.

'టమారా! నీతో కొన్ని విషయాలు ప్రత్యేకంగా, ముఖాముఖి మాట్లాడాలనుకున్నాను. ఇలా రా!'

'చెప్పండమ్మా' అంది టమారా, మెల్లగా.

వెంటనే ఆమె లేచి టమారాను ఒక ప్రత్యేకమైన గదిలోకి తీసుకెళ్ళింది. పూర్వపు యజమానురాలు 'అన్నా' ఎప్పుడూ తనవ్యాపారస్థులతో రహస్యాలోచనలు జరిపే గది అది. ఇప్పుడు ఎమ్మాకూడా అదే గదిలో టమారాతో ఏకాంతంగా సంభాషించడం మొదలెట్టింది. ఆమె సోఫామీద కూచుని టమారాను ఎదురుగావున్న కుర్చీమీద కూచోమని చెప్పింది. ఒక క్షణం ఇద్దరూ మౌనంవహించి, ఒకరికళ్ళల్లోకి ఒకరు చూచుకున్నారు. వారిచూపులు ఒకరినొకరు నమ్మలేనట్లు స్పష్టంచేస్తున్నాయి.

'నీవు సవ్యంగానే వ్యవహరించావు టమారా!' అంది చివరకు ఎమ్మా 'వాళ్ళందరూ గొర్లమందలా వచ్చి నన్ను ముద్దుపెట్టుకున్నారు. మరి నీవు మాత్రం అలాచేయడానికి రాలేదు. అవును. ఎలాగైనా నీవు చురుకైనదానివి అభిమానం కలదానివి. నీవలా చేయాలనికూడా నేను కోరడంలేను. నీతో నేను కరస్పర్శ చేయాలనిమాత్రమే వాంఛిస్తున్నాను. ఎంచేతనంటే, నా తరువాత నిన్నే ఈ ఇంటికి పెద్దగా నియమించ దలచుకున్నాను. అందుకు చిహ్నంగా ముందు మనం కరస్పర్శచేయాలి. అంటే నీకు అర్థమైందోలేదో, నా తరువాత ఈ ఇంటికి నీవే యజమానురాలవు. అందుకు నీకు లాభకరంగావుండే షరతులే పెట్టదలచుకున్నాను.'

'చాలా కృతజ్ఞురాలిని.'

'ఉండు. మధ్యలో మాట్లాడకు. నన్ను విషయమంతా పూర్తిగా చెప్పనీయి. ముందు నాకోసంగతిచెప్పు. పొద్దున నామీదికి రివాల్వరు గురి

పెట్టావు. నిజంగా నీవు నన్ను చంపేయాలనుకున్నావా?'

'ఓ! అలాంటిదేం కాదమ్మా.' వినయంగా చెప్పసాగింది టమారా. 'పైగా మీరే నన్ను కొడతారని భావించాను.'

'ఛీ! ఏమిటామాటలు టమారొచ్కా? నాగుణం నీకు తెలీదూ? ఇంతకాలంనుంచీ మనం స్నేహంగా వుంటున్నామే, ఎన్నడైనా నీమీద చెయ్యిచేసుకున్నానా? ఒకసారిఅయినా అసభ్యతగా ప్రవర్తించానా? ఏమిటి టమారా, ఇవాళ అలా మాట్లాడుతున్నావు? నీకూ ఆ వెధవ రష్యన్ ముండలకూ ఎలాంటిపోలికా లేదు. దేవుడికృపవల్ల నేనెంతో అనుభవం గడించిన స్త్రీని. ఏ మనుషులు ఎలాంటివాళ్లో నాకు తెలుసు. నీవు ఎంతో చదువుకున్న యువతివి. నిజం చెప్పాలంటే నాకన్నా ఎక్కువ చదువుకున్న దానివి. నీవు అందమైనదానివి. తెలివైనదానివి. నాగరికత గల పిల్లవు. నీకు ఇతరభాషలు అనేకం వచ్చును సంగీతంలో కూడా నీకు పాండిత్యం వుందని నా నమ్మకం. ఇంకా అసలువిషయం చెప్పాలంటే...... ఎలా చెప్పాలో నాకు తెలీడంలేదు... నీమీద నాకు కొంచెం ప్రేమకూడా వుంది. మరి నీవు, నన్ను కాల్చాలనుకుంటున్నావా టమారా! నన్ను — నీప్రియమైన స్నేహితురాల్ని చంపాలనుకుంటున్నావా! దీనికి ఏం సమాధానంచెపుతావో చెప్పు?'

'చూడండమ్మా!' గొంతుమార్చి, అతివినయంగా చెప్పసాగింది టమారా 'ఇందులో మీరు అపార్థంచేసుకోవాల్సిన అవసరం ఏమీలేదు. జెంకా తలగడక్రింద నాకొక రివాల్వరు అగుపించింది. దాన్ని మీకు ఇవ్వాలని తెచ్చాను. మీరా ఉత్తరం చదువుతోంటే, మధ్యలో మీపనికి భంగం కలిగించకూడదని ఊరుకున్నాను. మీరు నావైపు తిరగగానే మీ కది ఇవ్వబోయాను. అంతేనమ్మా. చూడండి. ఆ రివాల్వరు జెన్నీతలగడక్రింద కనిపించేసరికి నే నాశ్చర్యపోయాను. దగ్గర రివాల్వరు వుంచుకునికూడా ఆపాపిష్టిది కాల్చుకోకుండా, ఇలా నీచంగా, భయంకరంగా ఉరిపోసుకునిచచ్చిందేమా, అని ఆలోచించాను. అంతేనమ్మా.'

మందంగా, వెడల్పుగావున్న తన కనుబొమలు పైకి ఎగరేసింది ఎమ్మా. ఆమె పెదవులమీద సహజమైన చిరునవ్వు కనుపించింది. గభాలున తన రెండుచేతులూ టమారావైపు చాచి ఇలా అంది.

'అంతేనా టమారా! నిజంగా అంతేనా? అయితే సరే...... వాస్తవానికి నే నేమనుకున్నానో ఆ భగవంతుడికే తెలుసు. ఏదీ! నీ చేతులిలా ఇవ్వు, నా చిట్టితల్లీ! నీ తెల్లని చేతుల్ని నా హృదయానికి హత్తుకుని ఒకసారి ముద్దు పెట్టుకోనివ్వు.'

అలా చాలాసేపు టమారా చేతుల్ని తన గుండెమీద వుంచుకుని బలంగా ముద్దు పెట్టుకుంది ఎమ్మా. తరువాత ఆమె కౌగిలిలోంచి ఎంతో కష్టంమీద తప్పించుకుంది టమారా.

'సరే. ఇహ ఇప్పుడు మన వ్యాపారం సంగతి మాట్లాడుకుందాం. మన ఏర్పాట్లు ఇవి: నా తరువాత ఈ ఇంటికి యజమానురాలివి నీవు. నాకు కుడిభుజంగా నిలబడి, ఇంటి పెత్తనమంతా నీవే చెయ్యాలి. వచ్చిన లాభంలో నూటికి 15 రూపాయల్ని నీకు అప్పచెపుతాను. వింటున్నావా టమారా! నూటికి 15. దానికితోడు నీకు కొంతజీతంకూడా ముట్టచెపుతాను. నెలకు ముప్ఫయి, నలభయి—ఇంకా వీలైతే యాభైరూపాయల్ని కూడా ఇస్తాను టమారా. ఏం? లాభసాటిగా లేదూ? ఏమంటావు? ఒప్పుకున్నట్లేనా? నీవు నాకు అన్ని విషయాలలోను అండగా నిలబడి నా వ్యాపారాన్ని ఎంతో ఉచ్ఛదశకు తీసుకుపోతావనీ, మన సంస్థలాంటిసంస్థ ఈనగరంలోనే కాక యావత్తు దక్షిణరష్యాలోనే లేదనేటట్లు చేస్తావనీ నా పూర్తివిశ్వాసం. సానివ్యాపారంలో నీకు ఎంతో ఆసక్తి వుందనీ, ప్రతి విషయాన్నీ నీవు చక్కగా అర్థంచేసుకోగలవనీ నా ఉద్దేశ్యం. పైగా వచ్చినవిటుణ్ణి—వంచడానికి వీల్లేని ఎలాంటి విటుణ్ణి అయినాసరే, ఇట్టే లొంగదీసి, అతన్ని సంతుష్టిపరచగలశక్తి నీ ఒక్కదానిదగ్గరే వుంది. ఒకవేళ ఏ శ్రీమంతుడో ఏపురప్రముఖుడో నీ అందాన్ని చూచి మోహిస్తాడనుకో టమారోచ్కా!' అంటూ ఆమె చెమ్మగిలిన కళ్ళతో టమారా వంక చూచింది. 'అలాంటప్పుడు నీవు అతనితో సరదాగా కాలం గడపవచ్చు. నేనేం అభ్యంతరం పెట్టను; కాని నీవు అతని మోహంలోపడి మిగతా బాధ్యతలు, పనులు మరిచిపోకూడదు. నీవు ఈ ఇంటికి పెద్దదానవనీ, వేశ్యలందరిమీద పెత్తనంచేయాల్సిన దానవనే విషయం ముఖ్యంగాగుర్తుంచుకోవాలి. అంతే నేను కోరేది. ఇంకా నేను చెప్పదలచుకున్నది ఏమిటీ అంటే, నీ ప్రియుణ్ణిగురించి. నీ ఆనందానికి నేను అడ్డురాను, ఆ విషయంలో నిన్ను ఆజ్ఞాపించడానికి నాకు హక్కులేదు

కూడా. కాని నేను కోరేదల్లా ఒకటే టమారా! నీవు తగు జాగ్రత్తతో మెల గాలి. అతన్ని ఇక్కడకు రానీయకూడదు. తరుచు ఇక్కడికివచ్చి నీతో కేళీ విలాసాలు సాగించకూడదు. కాకపోతే అప్పుడప్పుడు నీకు ఒకరోజో, అరరోజో సెలవు ఇస్తూవుంటాను. ఆ సమయాల్లో నీ ఇష్టంవచ్చినట్లు నీవు ఉండొచ్చు. కాని వీలైనంతవరకూ అతనితో అంతగా సంబంధం పెట్టుకోకుండా వుండడమే చాల ఉత్తమం. నీ మంచికే యిలా చెప్తున్నాను. అప్పసంగా ఒకే ప్రియుణ్ణి పక్కన అట్టిపెట్టుకోవడమంటే, మెడకు కాడి తగిలించుకున్నట్లే. ఒక పెద్ద గుదిబండను కట్టుకున్నట్లే. నేను అనుభవంమీద ఈ మాట చెపుతున్నాను టమారా. ఓ మూడు, నాలుగు సంవత్సరాల పాటు ఇలాగే వేచివున్నావూ అంటే, ఈలోగా మనవ్యాపారం ఎంతో అభివృద్ధి చెందుతుంది. అప్పటికి నీ పెట్టుబడిడబ్బు కావల్సినంత పెరుగుతుంది. వ్యాపారంలో నిన్ను నా సగభాగస్తురాలుగా తీసుకుంటాను. యివాల్టినుంచి యింకో పదేండ్లవరకూ కూడా నీ అందం మాసిపోకుండా, నీయౌవ్వనం తీసిపోకుండా వుంటుంది. నీ యిష్టంవచ్చినంతమంది మగాళ్ళను దాసులుగా చేసుకునేశక్తి వుంటుంది. అప్పటిదాకా నీ బుర్రలోకి ఈ ప్రియులనుగురించిన పిచ్చిఆలోచనలురాకుండావుంటే, ఆ తరువాత నీ యిష్టంవచ్చిన అందగాణ్ణి, అన్నివిధాల తగినవాణ్ణి వరిస్తావు. నాకుతెలుసు. నీవు చాల జాగ్రత్తగా, తెలివితేటలతో నీ ప్రియుణ్ణి ఎన్నుకోగలవు. ఒక సర్వజ్ఞుడు బుద్ధిశాలి అయినవాడు మణులలో విలువైన మణిని ఎలా ఏరుకోగలడో, అలాగే నీవు మనుషులలో తగిన మనిషిని ఏరుకోగలవు. ఏం? అవునాకాదా?'

టమారా, కళ్ళుదించుకుని మెల్లగా చిరునవ్వు నవ్వింది. 'మీమాటలు బంగారపు మాటలు మేడమ్! నేను ప్రేమిస్తోన్న ఆ 'శంకా'ను వదిలించుకుంటాను. కాని ఒకేసారికాదు. క్రమేణా అతనిపీడ వదిలించుకుంటాను. కనీసం రెండు వారాలయినా పడుతుంది. యిక్కడికి రావద్దని ఖచ్చితంగా చెప్పేస్తాను. అవును. మీరు చెప్పిన షరతులు నా కంగీకారమే. మీరిచ్చే బాధ్యతను స్వీకరించడానికి సిద్ధంగావున్నాను.' అంది టమారా.

'చాలా సంతోషం టమారా! ఇప్పుడు నా మనసు ఎంతో హాయిగా వుంది.' అంటూ ఎమ్మా సోఫాలోంచి లేచింది.

'మన ఒడంబడికకు చిహ్నంగా ఒక తీయటి ముద్దుపెట్టుకుందాం.' అంటూ ఆమె మళ్లీ టమారాను కౌగలించుకుని బలంగా ముద్దెట్టుకోసాగింది. ఆమె ముందు టమారా ఒక పక్షిపిల్లమాదిరి, ఒక చిన్నఅమ్మాయి మాదిరి అగుపించింది. చివరకు టమారా ఆ పట్టు వదిలించుకుని ఇలా అంది.

'మీరు చెప్పినట్లుచేయడానికి నేను సిద్ధంగావున్నాను. మీరు పెట్టిన నిబంధన లన్నిటికీ ఒప్పుకుంటున్నాను. కాని ఒక సహాయం కోరాలను కుంటున్నానమ్మా! అదేమంత కష్టమైన పనీకాదు, ఖర్చుతోకూడిందీ కాదు. నేనూ తక్కిన అమ్మాయిలు; అందరంకలిసి జెన్నీ అంత్యక్రియలు చూడ్డానికి వెడతాం. అందుకు మీరు అనుమతిస్తారా?

అది విని ఎమ్మా మొహం ముడుచుకుంది.

'అలాగే టమారా, మీరు అంతగా వెళ్ళాలనుకుంటే వెళ్ళండి. నే నేమీ కాదనను. కాని వెళ్ళి ఏం చేస్తారు? దానివల్ల చచ్చిన జెన్నీకి ఏమిటిలాభం? ఆమెను మళ్లీ బ్రతికిస్తారా? పిచ్చి! కేవలం మీ భ్రాంతి,పిచ్చి నమ్మకం! సరే. అయినా నే నేం కాదనడంలేదు. వెళ్ళిరండి. కాని ఒక విషయంమాత్రం గుర్తుంచుకోండి. ఆత్మహత్య చేసుకుని చచ్చినవాళ్ళను శ్మశానంలో పూడ్చిపెట్టడానికి వీల్లేదు. అలాంటి శవాలను శ్మశానం వెనుక వున్న ఒక సొరంగంలో పడేస్తారు. ఇలా చేయమని ప్రభుత్వం రూలుస టమారా.' అంది ఎమ్మా.

'ఏమైనా కానీయండమ్మా. మీరన్నట్లు చచ్చినవాళ్ళను బ్రతికించేది లేదుగాని ఏదో మా అభిలాష. అందరి తరఫున మిమ్మల్ని బ్రతిమాలు తున్నాను. ఇదే నా చివరికోరిక. ఈ ఒక్కసారికే మాకు అనుమతి ఇవ్వం డమ్మా. అందరం వెళ్ళి చూచి వస్తాం. ఆ తరువాత సైనికోద్యోగిదగ్గర సోల్జరు పడివున్నట్లు మీ ఆజ్ఞలకు బద్ధురాలనై పడుంటాను.' అంది మళ్ళీ టమారా వినయంగా.

'సరే' నిట్టూర్పువిడుస్తూ అంగీకరించింది ఎమ్మా. 'నీవు ఏదడిగినా కాదనలేను తల్లీ! ఏదీ! మళ్ళీ ఒకసారి కరస్పర్శ చేయనీ. మనిద్దరం కలిసి మన వ్యాపారం అభివృద్ధికావడానికి కృషిచేద్దాం టమారా.'

ఎమ్మా గది తలుపు తీసి పెద్దగా అరిచింది.

'సిమన్! ఏయ్ సిమన్!'

కొపలాపాడు సిమన్ అక్కడికిరాగానే ఆమె ఇలా ఆజ్ఞాపించింది.

'ఓ బుడ్డి చల్లటి షాంపేను పట్టుకురా. మంచిరకం, విదేశీరకం పట్టుకురా. ఊ! త్వరగా.'

సిమన్ ఆశ్చర్యపోతూ నోరు తెరుచుకుని చూస్తూవుండగా ఆమె టమారావైపు తిరిగి మళ్లీ ఇలా అంది. 'టమారా! మన పని విజయవంతం అయేందుకూ, భవిష్యత్తులో మనవ్యాపారం అద్భుతంగా సాగగలందులకూ పానీయాలు సేవిద్దాం!'

చచ్చేవాళ్ళు సాధారణంగా అదృష్టం తెస్తుంటారని చెపుతారు. ఒక చెంపన చచ్చేవాళ్ళు చస్తే, మరోచెంపన ఉన్నవాళ్ళకు మంచి అదృష్టం కలిసివస్తుందని అంటారు. ఈ మూఢనమ్మకంలో ఏమాత్రం నిజంవున్నా అది ఆ శనివారంనాడు రుజువైంది. మామూలుగా ప్రతిశనివారం వచ్చేవిటులకంటె, ఆ శనివారంనాడు అత్యధిక సంఖ్యలో విటులు పొర్లుకొచ్చారు. వాస్తవానికి ఆనాడు పడుపుకత్తెలంతా ముస్తాబై, జెన్నీగదిముందునుంచి వెడుతోంటే, వారిమనసుల్లో రకరకాల ఊహలు తలెత్తేవి. ఏదో భయంతో బెదురుగా ఆ గదివైపుచూస్తూ గబగబ వెళ్ళిపోయేవారు. కొందరు క్రాస్ చేసుకునేవారుకూడా. కాని ఎలాగైతేనేం చీకటిపడ్డకొద్దీ వారిభయం తగ్గసాగింది. క్రమక్రమంగా వాళ్ళమనసులు కుదుటపడడం మొదలుపెట్టాయి. ఇంట్లో ప్రతిగదీకూడా వేశ్యలతో, వారిపక్కన విటులతో నిండిపోయింది. హాలులో ఒక కొత్తఫిడేలు వాయిద్యగాడు బ్రిహ్మాండంగా పోజుపెట్టి ఫిడేలు వాయిస్తున్నాడు. అవును. పియానోవాయించేఅతను ఈ కొత్త వాయిద్యగాణ్ణి ఎక్కణ్నుంచో పట్టుకొచ్చాడు.

టమారాకు ఇంటిపెత్తనంచేసే పదవి లభించిందని వేశ్యలందరికి తెలిసింది. అంతా ఆశ్చర్యపోయారు. టమారామాత్రం చిరచిరలాడుతూ మొహం ముడుచుకుని ఒకపక్కన మౌనంగా కూచుంది. చివరకు ఎలాగో తెల్లమంకాతో రహస్యంగా ఇలా చెప్పింది.

'ఏమే మాన్యా! నేను కొత్తగా ఇంటిపెత్తందారిణిని అయ్యానని మీరెవరూ ఆందోళనపడనక్కరలేదు. మనవాళ్ళందరితో చెప్పు. మరేం భయంలేదనీ, యథాప్రకారంగా ఇదివరకు ఎలా వుండేవారో అలాగే వుండమనీ చెప్పు. ఎవరికిష్టమొచ్చినపని వారిని చేసుకోమను. ఇప్పటికీ నేను వాళ్ళ

స్నేహితురాలునే అనీ, వాళ్ళమేలుకోరేదాన్నేననీ చెప్పు. నామీదమాత్రం, ఎవరూ ఎలాంటివాడీలు చెప్పకోనక్కరలేదు. కొంతకాలం ఆగితే, తరువాత మనందరం బయటపడేమార్గం ఆలోచిస్తాను.'



# 8

ఆమరుసటిరోజు టమారా చేయవలసిన పని చాలా వుంది. తన స్నేహితురాలైన జెన్నీ శవాన్ని క్రైస్తవచర్చి ధర్మప్రకారం అంత్యక్రియలు జరిపించి, క్రైస్తవ మతాచారాన్ని అనుసరించి పూడ్చిపెట్టడానికి ఆమె దృఢంగా సంకల్పించుకుంది. తనకు అత్యంత సన్నిహితులో ప్రియమైనవాళ్ళో మరణించినట్లుగా ఈమె ఉత్తరక్రియలు సక్రమంగా జరిపించడానికి పూనుకుంది.

టమారాది ఒక విచిత్రమైన ప్రకృతి. ఆమెకుగల అద్భుత శక్తిసామర్థ్యాలు వేశ్యలలో మరెవరికీ లేవు. కాని అవి బయటికి అగుపించవు. పైకి ఏమీ తెలియనిదానికిమల్లే చాతకానిదానికిమల్లే అమాయకురాలులా మౌనంగావుంటుంది. లోపలమాత్రం తన శక్తి సామర్థ్యాలను జాగ్రత్తగా అణచిపెట్టుకుని కాపాడుకుంటూ అవసరమొచ్చినవెంటనే వాటిని జంకూ గొంకూ లేకుండా ఉపయోగిస్తుంది. ఎలాంటి అవాంతరాలనూ ఆటంకాలనూ లెక్కచేయకుండా ముందుకురికి విజయాన్ని సాధిస్తుంది.

మధ్యాహ్నం ఆమె ఒకబండిలో బయలుదేరి పాతపట్టణానికి వెళ్ళింది. మార్కెట్టును సమీపించగానే ఒక అసహ్యమైన తక్కువరకపు హోటలు దగ్గర బండిని ఆపుచేసింది. తను తిరిగివచ్చేంతవరకూ ఆ హోటలుదగ్గరే కనిపెట్టుకుని వుండమని బండివాడితో చెప్పింది. తరువాత ఆమె బండిదిగి హోటల్లోకి వెళ్ళింది. లోపల ఒక బస్సుకుర్రాణ్ణి కలుసుకుని 'శంకా' అక్కడున్నాడా అని అడిగింది. ఆ కుర్రాడిజుట్టు ఎర్రగావుంది. అతను టమారాతో మాట్లాడే వైఖరి, ఆచనువు, ఆ సాహసం, అవినయం, విధేయత; వీటిని బట్టి గమనించితే ఆ కుర్రాడు టమారాను చాలాకాలంనుంచి ఎరిగినవాడికి

మళ్లీ కనిపిస్తున్నాడు. వెంటనే అతను జవాబుచెప్పాడు నిమన్ ఇగ్నాటిచ్ (శంకా) అక్కడికింకా రాలేదనీ, గతరాత్రిఅంతా మేలుకొని ఉదయం ఆరుగంటలదాకా ట్రాన్స్‌వాల్ రెస్టారెంటులో బిలియర్డ్సు ఆడుతూ గడిపాడనీ, అంచేత బహుశా త్వరలో అక్కడికివచ్చే సూచనకూడా కనిపించడంలేదనీ చెప్పాడు. బహుశా తన హోటలుగదిలో పడుకుని నిద్రపోతుంటాడనీ, అత్యవసరమైతే వెంటనే అక్కడికివెళ్ళి కలుసుకోవలసిందని కూడా చెప్పాడు.

అప్పుడు టమారా ఆ కుర్రాడిని అడిగి ఒక చిన్న కాగితం, పెన్సిలు తీసుకుంది. దానిమీద రెండుముక్కలు ఉత్తరం వ్రాసి 'శంకా' రాగానే అతనికి ఇవ్వమని చెప్పింది. అందుగ్గాను ఆ కుర్రాడిచేతులో యాభైకోపెక్కులుకూడా పెట్టింది.

అక్కడినుంచి టమారా, ప్రసిద్ధ గాయకురాలైన ఎల్లెనా రొవిన్స్కాయాను కలుసుకోవడానికి బయలుదేరింది. అవును. ఆమె ఎక్కడవుంటున్నదీ టమారాకు తెలుసు. నగరంలోకల్లా మంచిహోటలు— ప్రసిద్ధమైన యూరప్‌హోటల్లో గదితీసుకుని, వుంటోంది. ఇంకేం? టమారా అక్కడికి వెళ్ళింది. కాని హోటల్లో ప్రవేశించడానికి మొదట కొంచెం ఇబ్బంది కలిగింది. క్రిందవున్న కాపలావాడు, ఎల్లెనా బయటికి వెళ్ళివుంటుందని చెప్పాడు. అయినా టమారా వెనుతిరిగిపోక, ఎల్లెనావుండే గదివద్దకు వెళ్ళి తలుపుకొట్టింది. ఒక దాసి తలుపుతీసి, 'అమ్మగారు విపరీతంగా తలనొప్పితో బాధపడుతోందనీ, ఇప్పుడెవరినీ చూడదనీ' చెప్పింది. అప్పుడు టమారా మళ్లీ ఒక చిన్నచీటీ వ్రాసి ఆమెకిచ్చింది.

'నేను ఒక అమ్మాయివద్దనుంచి వచ్చాను. ఆ అమ్మాయిని మీరు ఎరుగుదురు. ఇంటిపేరు నేను ఉదహరించకుండావున్నాను. మీరొకప్పుడు ఆ ఇంటికి వచ్చారు. ఒక మంచి పాట పాడి వినిపించారు. అప్పుడా అమ్మాయి మీ కాళ్ళమీద పడి వెక్కివెక్కి ఏడ్చింది. మీ హృదయంకరిగిపోయి ఎంతో ప్రేమతో ఆమెను ఆదరించారు. జ్ఞాపకంవుందా? ఆ పిల్ల నిన్నటిదినం చనిపోయింది. అంచేత ఇప్పుడామెకు ఎలాంటి సహాయం అవసరంలేదు. కాని మీరొక ఉపకారం చేయవచ్చు. అది మీ కేమాత్రం కష్టం కలిగించేదికాదు. ఇహ నా విషయం ఆరోజున మీతో బరోనెస్

వాన్ టెప్లింగ్ అనే మా స్నేహితురాలుకూడా వచ్చింది. ఆమెతో నేను కొంత దురుసుగా మాట్లాడాను. సహించరాని సత్యాలు కొన్ని ఆమెతో వెల్లడించి ఆమె మనసును నొప్పించాను. అందుకు నేను ఇప్పటికికూడా విచారిస్తున్నాను. క్షమాపణ చెప్పుకుంటున్నాను.'

'ఈ చీటీ మేడమ్ రొవిన్‌స్కాయాకు ఇవ్వు.' అంటూ టమారా తను వ్రాసిన ఆ చిన్న ఉత్తరం దాసిచేతి కిచ్చింది.

రెండు నిముషాలతరువాత ఆమె తిరిగి వచ్చింది.

'అమ్మగారు మిమ్మల్ని చూస్తానన్నారు.' అంటూ టమారాను వెంటబెట్టుకుని గదిలోకి తీసుకెళ్ళింది.

గాయకురాలు 'ఎల్లెనా' ఒక చక్కని విశాలమైన మంచంమీదపడుకునివుంది. మంచంమీద చాలా ఖరీదైన రగ్గు ఒకటి కప్పివుంది. మందంగా కుట్టిన పెద్ద పట్టు పరుపు, దానిమీద జలతారుతో అల్లిన మెత్తని తలగడలు అమర్చివున్నాయి. వెండిలా ధగధగలాడుతోన్న మెత్తని ఉన్నితో తయారైన రగ్గు ఒకటి పాదాలమీద కప్పుకుంది. ఆమె తన వేళ్ళకు మామూలుగా అనేక ఉంగరాలు ధరించివుంది. వాటిలో కొన్ని పచ్చలు పొదగిన ఉంగరాలు. చూస్తోంటే కళ్ళు చెదిరిపోతున్నాయి.

ఆ ప్రసిద్ధగాయకురాలికి అది చాలా చెడురోజు. క్రిందటిరోజు ఉదయం ఆమెకూ సంగీతనాటకశాల యజమానులకూ ఏదో పేచీవచ్చింది. సాయంత్రంపూట ప్రదర్శన జరిగింది. కాని ఈమెకు ప్రేక్షకులనుంచి మామూలుగావచ్చే ఆదరణ, అభిమానం లభించలేదు. తను ఊహించినంతగా మర్యాద జరగలేదు. దానికి ఆమె ఎంతగానో బాధపడుతోంది. ఇది ఇలా వుండగా పుండుమీద కారంచల్లినట్లు ఇవాళ ఉదయం వార్తాపత్రికలో బుద్ధిలేని విమర్శకు డొకడు పెద్దవ్యాసం ఒకటి వ్రాశాడు. ఈమె ప్రత్యర్థి అయిన 'టిటానోవా' అనే మరోగాయకురాలిని పొగడుతూ వ్రాసినవ్యాసం అది. నిజం ఆలోచిస్తే ఆ వ్యాసంవ్రాసిన సంగీత విమర్శకుడికి బొత్తిగా సంగీతజ్ఞానంలేదు. గాటికికట్టేసిన ఆవుకు ఖగోళ శాస్త్రం ఎంత తెలుసునో, ఇతనికి సంగీతాన్నిగురించి అంతే తెలుసు. అయినా వ్రాశాడు, అందువల్ల తనకు అవమానం జరిగిందనీ, గౌరవభంగం కలిగిందనీ, ఎల్లెనా విపరీతంగా బాధపడింది. ఆ బాధలో ఆమెకు భరించలేని తలనొప్పివచ్చింది. కణతల్లో

నరాలన్నీ కటకటలాడుతున్నాయి. ఆమె గుండెల్లోకూడా పోటు ప్రారంభమై ఆయాసపడుతోంది. ఈ పరిస్థితిలో టమారా ఆమెను కలుసుకుంది.

'ఏమమ్మా, కులాసాగా వున్నావా?' అంటూ ఎల్లెనా టమారాను ఆహ్వానించింది. ఆమె కంఠస్వరం చాల బలహీనంగా, పేలవంగా వుంది. మధ్య మధ్య ఆగుతూ మాట్లాడింది. నిజంగా ఆమెస్థితిచూస్తే, నాటకంలో ప్రియుడికోసం విలపించో, క్షయవ్యాధితో బాధపడో చచ్చిపోయే కథానాయకికిమల్లే వుంది.

'ఇటు కూచో. నిన్ను చూడగలిగినందుకు చాల సంతోషంగావుంది. చూడమ్మాయ్! మరేమీ అనుకోకు. నాకు తలనొప్పి,గుండెపోటు వచ్చింది. మాట్లాడ్డానికికూడా కష్టంగావుంది. బహుశా నేను అతిగా పాటకచ్చేరీలు చేయడంవల్లనో ఏమో, నా కంఠస్వరంకూడా సన్నగిలిపోయింది.' అంది ఆమె తిరిగి.

ఆ సాయంత్రం జరిగిన విషాదసంఘటన 'ఎల్లెనా'కు జ్ఞాపకం రాకపోలేదు. తను తనస్నేహితులతోకలిసి యామావీధులకు షికారుపెళ్ళడం, అన్నా ఇంట్లో టమారా, జెన్నీ మొదలైన వేశ్యలు తమతో అన్న కటువు మాటలు; ఇవన్నీ ఆమె మనసులో మెదిలాయి. వాళ్ళమొహాలు, వాళ్ళ చేష్టలు, అన్నీ కళ్ళముందు సాక్షాత్కరించాయి. ఆమె కేదో సిగ్గనిపించింది. నిద్రలో పీడకలమాదిరి తోచింది. గర్వం, ఆత్మాభిమానంకల జెన్నీని, తన సంగీతప్రజ్ఞచే ద్రవింపచేసి, తన కాళ్ళమీద పడేలా చేయడం ఇప్పుడామెకు ఆశ్చర్యం కలిగిస్తోంది. అవును, అలాంటిసంఘటనలు ఆమె జీవితంలో ఎన్నోజరిగాయి. తనపాండిత్యం, ప్రజ్ఞలతో అసంఖ్యాకులైన ప్రేక్షకుల హృదయాలను ఉర్రూతలూగించిన ఘట్టాలు అనేకం వున్నాయి. ఇవన్నీ మనసులోకి తెచ్చుకునేసరికి, జెన్నీమీదగాని, టమారామీదగాని, కోపం రాకపోగా వారిమీద ఒకరకమైన సానుభూతికూడా కలిగింది ఆమెకు. అవును. ఆమెది కళామూర్తి హృదయం.

ఆమె మెల్లగా, బలహీనంగా తన మృదువైన హస్తాన్ని పైకెత్తి టమారానుదుటిని తాకింది. పచ్చలుపొదిగిన ఆమె వేళ్ళఉంగరాలు ప్రాణం వచ్చినట్లుగా చుట్టూ అద్భుతమైన కాంతులు విరజిమ్మాయి.

'నీవు వ్రాసినచీటీ ఇప్పుడే చదివాను...పాపం ఆ అమ్మాయి......అభాగ్యురాలు...నేను చాలా విచారిస్తున్నాను...ఆ పిల్ల పేరు ఏమిటో గుర్తురావడంలేదు.' అంది ఎల్లెనా తిరిగీ మెల్లగా.

'జెన్ని' గుర్తుచేసింది టమారా.

'ఓ, జెన్నీ. ఇప్పుడు జ్ఞాపకంవచ్చింది. పాపం! చచ్చిపోయిందా! అసలిది ఎలా జరిగింది?'

'నిన్న ఉదయం డాక్టరు పరీక్షచేయడానికి వచ్చిన సమయంలో తనంతటతానే ఉరిపోసుకుని చచ్చింది.'

అది వినేసరికి ఆ గాయనరాలి కళ్ళల్లో ఒకవిధమైన విచారం అగుపించి మళ్ళీ అంతలో అదృశ్యమైంది. ఆమె తన కళ్ళు పెద్దవిచేసి, అద్భుతంగా ఆశ్చర్యంగా చూడసాగింది. ఆ వ్రేళ్ళకున్న పచ్చలకుమల్లేనే ఆ కళ్ళుకూడా ప్రాణకాంతితో ప్రకాశించసాగాయి. ఆ కళ్ళల్లో ఒకరకభయం, ఆశ్చర్యం, అసహ్యం అగుపిస్తున్నాయి.

'ఓరి భగవంతుడా! ఆ పిల్ల ఎంత చక్కనిది! సహజంగా సాహసాలు కలది! ఎంత అభాగ్యురాలు! పాపం! ఎందుకు ఆ అమ్మాయి అలాచేసింది?' అనడిగింది ఎల్లెనా.

'మీకు తెలీదూ? ఆమె జబ్బుతోవుంది. అప్పుడొచ్చినప్పుడు మీతో కూడా చెప్పింది.'

'అవునవును, నాకు జ్ఞాపకముంది. అయితేమాత్రం ఉరిపోసుకుని ఆత్మహత్య చేసుకోవడమా! ఎంత దారుణం! చికిత్సచేయించుకోమని నేను సలహా ఇచ్చాను. ఈ రోజుల్లో మందులకు లొంగని వ్యాధి లేదు. ఇంతకంటె భయంకరమైనవ్యాధులు వచ్చినవాళ్ళను నే నెరుగుదును. వాళ్ళందరికీ పూర్తిగా—అవును పూర్తిగా నయమైపోయింది. వారికి ఆ రోగం తగిలిందని అందరికీ తెలుసు. సమాజంలో అందరూ ఎక్కడికివెళ్ళినా వారిని గౌరవిస్తూనేవచ్చారు. పాపం, ఆ పిల్ల ఎంత అభాగ్యురాలు!'

'అందుకనే మీ దగ్గరికి వచ్చానమ్మా. మిమ్మల్ని కష్టపెట్టాలని ఎప్పుడూ అనుకోలేదు. కాని ఏంచేయను? మీరుతప్ప నాకు మరెవరూ ఆధారంకనిపించలేదు. సాహసంచేసి వచ్చాను. మీరు చాలా దయగలవారు. ఆ రోజు సాయంత్రం మా అందరితో ఎంతో చనువుగా స్నేహంగా

వున్నారు. మా కష్టాల్ని ఎంతో సానుభూతితో పరిశీలించారు. నాకు కేవలం మీ సలహా కావాలి. నాకోసం మీ పలుకుబడి, పరపతి వినియోగించాల్సివుంటుంది.'

'అలాగేనమ్మా. నేను చేయగలిగినదంతా చేస్తాను. కాని నా తలతిరిగి పోతోంది. అసలే బాధపడుతోన్న నేను, ఎంతటిదారుణమైన వార్త వినాల్సి వచ్చింది! చెప్పమ్మా! నేను నీకు ఏవిధంగా ఉపకరిస్తానో చెప్పు.'

'నిజంగా ఏంచేయాలో నాకే తెలీడంలేదు.' సమాధానం చెప్పింది టమారా. 'చూడండమ్మా! ఆ పిల్లను, శవాలను భద్రపరచే స్థలానికి తీసుకుపోయారు. కాని ఆమె మరణాన్నిగురించి మనుష్యులను ప్రశ్నించడానికీ, ఆ కేసునుగురించి రిపోర్టు తయారుచేయడానికీ కొంతవ్యవధి పట్టింది. తరువాత శవాన్ని తీసుకుపోయారు. ఇంకా ఆమె మరణాన్నిగురించి దర్యాప్తు వలసివుంది. అంచేత స్వయంగా శవపరీక్షజరపడం ఇంకా పూర్తిఅయివని నేననుకుంటున్నాను. సాధ్యమైతే ఆమెశవాన్ని కోయకుండా అని నా ఆలోచన. ఇవాళ ఆదివారం. కనుక రేపటివరకూ అధికార్లు న్ని అలాగే అట్టిపెట్టి వుంచుతారు. ఈలోగా ఆమెకోసం మనం ఏదో కటి చేయడానికి వీలుంది.'

'నాకూ ఈ వ్యవహారం తోచదమ్మా! ఉండుచెప్తాను. నాకుతెలిసిన డాక్టరు ఎవరయినా ఉన్నారేమో? ఉండు. అడ్రెస్సుల పుస్తకంచూచి చెప్తాను. బహుశా ఆమెకోసం మనం ఏదోఒకటి చెయ్యొచ్చు'

'మరోవిషయంకూడా వుందమ్మా' తిరిగీ టమారా చెప్పసాగింది. 'నా స్వంతఖర్చుతో ఆమెను పూడ్చిపెట్టాలని నిశ్చయించుకున్నాను. ఆమెను నేను నా ప్రాణంతో సమానంగా ప్రేమిస్తున్నానమ్మా.'

'చాలసంతోషం. నేనూ నాచేతనైన ధనసహాయం చేస్తాను.'

'వద్దమ్మా. థాంక్స్. మీకు నా వందన సహస్రాలు. నాదగ్గర డబ్బుంది. మనస్ఫూర్తిగానే ఈపనికి పూనుకున్నాను. మిమ్మల్ని సహాయం కోరడానికికూడా నేను సంకోచించడంలేదు. కాని చూడండమ్మా, ఒక ప్రాణస్నేహితురాలి జ్ఞాపకార్థం నే నీపని చేస్తానని ప్రమాణం చేసుకున్నాను. ఉన్నకష్టమల్లా ఏమిటంటే సనాతన క్రైస్తవ ధర్మప్రకారం అంత్యక్రియలు జరిపించి, ఆమెశవాన్ని పూడ్చిపెట్టడం. అదే నేనుకోరేది.

నా అభిప్రాయంలో ఆమె ఇంగ్లండువాళ్ళమీద నమ్మకంలేని మనిషి. మతం పుచ్చుకున్న మనిషికూడా కాదేమో. నామటుకు నేనుకూడా మతవిశ్వాసం లేని మనిషినే. అయినప్పటికీ ఆమెను ఒక కుక్కవలె ఏ కందకంలోనో పారేయడానికి నే నిష్టపడడంలేదు. అంత్యప్రార్థనలు జరపకుండా నీచంగా ఏ గోతిలోనో తోయడానికి నేను సమ్మతించడంలేదు. సక్రమమైనపద్ధతిలో ఉంటే, మతాచార్యులు మంత్రాలు పఠిస్తూ ఉండగా, మేళతాళాలతో ఆమె శవాన్ని ఊరేగించి అంత్యక్రియలు జరపాలని నా అభిలాష. అందుకు ప్రభుత్వాధికార్లు అనుమతి ఇస్తారో లేదో తెలీదు. అందుకనే మీ దగ్గరికి వచ్చాను. మీ సలహా కావాలని కోరుతున్నాను. ఇది నెరవేరడానికి ఏం చేయాల్సివుంటుందో, ఎవరిని కలుసుకోవాల్సివుంటుందో చెప్పండమ్మా.'

ఇవన్నీ వినేసరికి ఎల్లెనా క్రమక్రమంగా తన తలనొప్పి బాధ మరచిపోతోంది. ఇంతవరకూవున్న నీరసం అదీ ఎక్కడికి ఎగిరిపోయిందో ఏమో. ఇప్పుడామె టమారా చెప్పే విషయంలో అత్యంత ఆసక్తి, శ్రద్ధ చూపుతోంది. తనొక ఆర్టిస్టుననీ, తనహృదయం అత్యంతవిశాలమైనదనీ గుర్తుచేసుకుంది. ఒక పతితురాలిమీద, ఒక భ్రష్టురాలిమీద దయ, సానుభూతి చూపించడం తన ధర్మమని భావించింది. అలా అనుకునేసరికి ఆమె హృదయం ఎంతో తేలికఅయింది. బాధ మరిచిపోయింది. గొప్ప గీతాన్ని గానం చేస్తోంటే ఎంత ఆనందం కలుగుతుందో అంత ఆనందం కలిగింది ఆమెకు!

కొద్దిసేపు మౌనంవహించి తరువాత ఆమె ఇలా అంది.

'ఏం చేయాల్సివుంటుందో ఇప్పుడప్పుడే నాకు తోచడంలేదు. కాని ఎంతటి అసాధ్యమైన పనిఅయినా చేయాలని పట్టుబడితే సాధించవచ్చు. నేను మనస్ఫూర్తిగా నీకు సహాయపడాలని కోరుతున్నాను. ఉండుండు. నా కిప్పుడొక అద్భుతమైన ఆలోచన తట్టింది! ఆ రోజు సాయంత్రం నాతో బరోనెస్ కెఫ్లింగ్ కాక, మరో అతను వచ్చాడు కదూ?...'

'ఎవరో వచ్చారు. వారిని నేను ఎరుగను.' వెంటనే జవాబుచెప్పింది టమారా. 'కాని ఆవచ్చినవారిలో ఒకాయన వెళ్తూ వెళుతూ వెనక్కి వచ్చి జెన్నీచేతిని ముద్దుపెట్టుకున్నాడు. ఎప్పుడు అవసరమైతే అప్పుడువచ్చి సహాయం చేస్తానని ఆమెతో చెప్పాడు. తనవిలాసంవున్న కార్డుఒకటి ఆమె

చేతికిచ్చి, ఎవరికీ చూపించవద్దనికూడా చెప్పాడు. తరువాత ఎలాగో నాకీ విషయం జ్ఞాపకంలేకుండాపోయింది. అతను ఎవరనికూడా ఆమెను అడిగి తెల్సుకోవడం జరగలేదు. నిన్న ఈవిషయం గుర్తువచ్చి ఆ కార్డుకోసం జెన్నీ గదిఅంతా వెదికాను. కాని కనిపించలేదు.'

'ఒక్కక్షణం ఉండు. ఒక్కక్షణం. నేనే జ్ఞాపకం తెచ్చుకుంటాను.' అంటూ ఆ గాయకురాలు ఒకక్షణం ఆలోచించింది. 'అవునవును గుర్తొచ్చింది.' అంటూ ఆమె గఛాలున మంచంమీదనుంచి లేచి కూచుంది. 'అతనిపేరు రియాసనోవ్.' 'ఇరాస్ట్ ఆండ్రీవిచ్ రియాసనోవ్.' లాయరు. అతనితో మాట్లాడుతాను. నిజంగా నాకు మంచిఆలోచనే తట్టింది.'

ఆమె పక్కనవున్న టేబుల్‌వైపు తిరిగింది. టేబుల్‌మీద పెటివున్న టెలిఫోన్ ఎత్తి ఇలా మాట్లాడింది.

'ప్లీజ్! నెంబరు 13–15. థాంక్యూ. హాలో! నాకు ఆండ్రీవిచ్ కావాలి. ఆఁ! వారితో మాట్లాడాలి. అవును. నేనా! మేడమ్ రోవిన్‌స్కాయాను. హాలో! ఎవరూ! ఆండ్రీవిచ్? సంతోషం. చాలసంతోషం. ఫరవాలేదు. నాచేతులు కందిపోతే మానె. మీరు తీరుబడిగావున్నారా? ఇహ అంతటితో ఆపుదురూ, మీపరిహాసాలు, ఇది చాలా ముఖ్యమైన విషయం. సీరియస్. ఒకమాటు ఇక్కడికి రాగలరా? కొద్దినిముషాలు. లేదు. లేదు. అవును. ఏదో తెలివైనవారనీ, దయగలవారనీ. మిమ్మల్ని మీరే కించపరచుకుంటున్నారు. సరే. చాలసంతోషం. నేను పూర్తిగా దుస్తులు ధరించలేదు. అవును. ఏం చేయమంటారు? తలనొప్పి విపరీతంగావుంది. కాదు. ఒక చిన్న అమ్మాయి—మీరేచూస్తారుగా. వీలైనంత త్వరగా రండి. నమస్కారం. సెలవు.'

'అతను సరాసరి ఇక్కడికొచ్చేస్తాడు.' అంటూ ఆమె టెలిఫోను టేబుల్‌మీద పెడుతూ చెప్పింది. 'ఆయన చాలమంచివాడు. అమోఘమైన తెలివికలవాడు. ఎలాంటిపనైనా చేయగలడు. ఎంతటి అసాధ్యమైన పని అయినాసరే, ఇతర్లెవరూ చేయలేనిపని అతను చేస్తాడు...... ఓల్గా... క్షమించమ్మా. నీపేరేమిటికి?'

టమారా కొంచెం తటపటాయించి, తరువాత తనలోతానునవ్వుకుంది

'మరేం ఫరవాలేగు లెండి. దీనికి క్షమాపణ చెప్పాలా. నా అసలు పేరు 'అనాస్టాసియా నికోలెవ్‌నా.' కాని నా మారుపేరు టమారా. అంతా నన్ను టమారా అనే పిలుస్తారు. మరేం ఇబ్బందిలేదు. మీరూ అలాగే పిలవండి. అదే నాకు అలవాటు పడిన పేరు.' అంది టమారా.

'టమారా! చాలా చక్కని పేరు. సరే టమారా! నీవు నాతో కలిసి ఫలహారం చేయవూ? బహుశా రియాసనోవ్ కూడా వస్తాడు.'

'క్షమించండమ్మా. నాకు వ్యవధిలేదు.'

'అవునుమరి. ఏం చేస్తాం? సరే. మరోమాటు వచ్చినప్పుడు. సిగరెట్టు కాల్చవూ?' అంటూ ఆమె తన బంగారపు సిగరెట్ కేసు టమారాకు అందించింది. దానిమీద 'ఇ' అనే పెద్ద అక్షరం చెక్కి వుంది. ఆ అక్షరం చుట్టూ పచ్చలు పొదిగివున్నాయి.

ఆ తరువాత రియాసనోవ్ త్వరలోనే అక్కడికి వచ్చాడు. అంతకు ముందు అన్నా ఇంటికి వచ్చినప్పుడు టమారా అతన్ని పరిశీలించలేదు. ఇప్పుడతన్ని పరీక్షగా చూచి ఆమె దిగ్భ్రాంతురాలైంది. ఆయన చాలా బలంగా పొడుగ్గా వున్నాడు. వ్యాయామం చేసినవాడికిమల్లే శరీరం పుష్టిగా ఎదిగి కండలు తేలివుంది. మంచి రూపసి నల్లనిజుట్టు వంకులొంకులు వచ్చేలా చక్కగా దువ్వుకున్నాడు. పుష్టిగావున్న పెద్ద నోరు. మంచి వక్తలా కని పిస్తున్నాడు. మిలమిల మెరిసే చక్కటి కళ్ళు. స్ఫురద్రూపి. మొత్తానికి ఎంతమందిజనంలో నిల్చున్నా, అతన్ని ప్రత్యేకంగా గుర్తించవచ్చు. అతనిలో వ్యక్తిత్వం వుందని ఇట్టే కనిపెట్టవచ్చు. ఆయన చాలా ఉత్సాహవంతుడు. జీవితాన్ని గాఢంగా ప్రేమించినవాడు. బ్రతుకంటేఅలసట లేనివాడు. ఎన్నో హృదయాలను ఆకర్షించినవాడు. ఎటువంటి సాహస కృత్యాల్లో అయినా జంకూ గొంకూ లేకుండా దూకగల సమర్థుడు. అతన్ని ఆపాదమస్తకం పరిశీలించి టమారా తనలో ఇలా అనుకుంది.

'నా జీవితం నన్నింత ఘోరంగా విచ్ఛిన్నం చేయకుండా వున్నట్ల యితే, నా జీవిత సర్వస్వాన్ని సంతోషంగా, చిరునవ్వుతో ఇతని పాదాల ముందు పడేసేదాన్ని. ఒక యువతి తన ప్రియుడకాళ్ళమీద వుంచే గులాబి పువ్వు లాగా నా జీవితాన్ని నిస్సందేహంగా, నిస్వార్థంగా ఇతని

పాదాలమీద వుంచేదాన్ని. ఇతనొక్కడే అందుకు తగినవాడు. నేను కోరదగిన మనిషి!'

అలా అనుకుని టమారా అతని రూపురేఖావిలాసాదులు పరిశీలిస్తూ, తనలో తాను పొంగిపోయింది.

రియాసనోవ్, రోవిన్స్కాయా చేతిని ముద్దుపెట్టుకొని పిమ్మట టమారాను మామూలుగా ఇలా పలుకరించాడు.

'ఆ రోజు సాయంత్రం నీతో మాకు పరిచయం కలిగింది. నీవు ఫ్రెంచి భాషలో మాట్లాడి మమ్మల్ని ఆశ్చర్యపరిచావు. మనమధ్య జరిగిన సంభాషణ పరస్పర విరుద్ధమైనది. అయితేమాత్రం ఏం? నీవు ఆ సాయంత్రం మాట్లాడిన ప్రతిమాటా ఎంతో బరువుగా, బలంగా వుండి, ఇప్పటికీ అవి నా చెవుల్లో గింగురుమంటున్నాయి. సరే, ఇప్పుడు చెప్పు ఎల్లెనా.' అంటూ అతను గాయకురాలివైపు మళ్లి ఒక చిన్న స్టూలుమీద కూచుని తిరిగీ ఇలా అడిగాడు 'నన్ను పిలిపించిన కారణం ఏమిటి? నీవు ఏం చేయమంటే అది చేయడానికి సిద్ధంగా వున్నాను.'

గాయకురాలు తిరిగీ నీరసంగా మునివేళ్ళతో కణతలు నొక్కుకుంది.

'ఓ! నిజంగా నాకు బుర్ర తిరిగిపోతోంది రియాసనోవ్.' అంది ఆమె అతనివైపు చూస్తూ. ఆమె కళ్ళల్లో శూన్యం తప్ప మరేం లేదు. 'నా తల... దయచేసి ఆ టేబుల్ మీద తలనొప్పి పొడర్లు వున్నాయి. ఒక మాటు ఇలా ఇద్దురూ. జరిగినకథంతా టమారా మీకు చెపుతుంది. నేను చెప్పేస్థితిలో లేను. అది చాలా భయంకరమైన విషయం.'

పిమ్మట టమారా జరిగినకథ క్లుప్తంగా లాయరుతో చెప్పింది. జెన్ని ఎలా చనిపోయిందీ, ఆమెకు అతను తన విలాసంగల కార్డు ఇచ్చి అవసరమొచ్చినప్పుడు సహాయంచేస్తానని వాగ్దానంచేసిన సంగతి చెప్పింది.

'అవునవును. సహాయం చేస్తానన్నాను.' అంటూ రియాసనోవ్ గదిలో అటూ ఇటూ పచారుచేయడం మొదలెట్టాడు. ఏదో ఆలోచిస్తూ అలవాటుప్రకారం తన జుట్టును చేత్తో వెనుకకు సరిచేసుకోసాగాడు. 'నీవు చాలా మంచిపని చేశావు టమారా! మన స్నేహాన్ని మరిచిపోకుండా నా దగ్గరకొచ్చావు. చాలా సంతోషం. ఇహ ఇప్పుడు నీకు కావల్సిందల్లా ఆమె

శవాన్ని సక్రమంగా పూడ్చిపెట్టడం. అందుకు అనుమతి ఇప్పించాలికదూ! ఊఁ! నన్ను కొంచెం ఆలోచించనీయి.'

అతను తన చేత్తో నుదుటిమీద రుద్దుకున్నాడు.

'ఆ...ఆ...చర్చి నియమాల్లోని నూటడెబ్బయిరెండో నిబంధన ప్రకారం...అవును. నూటడెబ్బయిరెండో రూలు ఎనిమిదో పేరాప్రకారం చూస్తే ఆత్మహత్య చేసుకుని మరణించిన మనిషికి శాస్త్రోక్తంగా అంత్యక్రియలు జరపడానికి వీల్లేదు. కాని ఒకటుంది. మతిభ్రమవల్ల వళ్ళు తెలీక అలా చేసివున్నట్లు రుజువుచేయగలిగితే ఆ రూలు వర్తించదు, ఆ మనిషికి మామూలుగా సక్రమమైనపద్ధతిలో ఉత్తరక్రియలు జరుపవచ్చు. అవును. నాకు బాగా జ్ఞాపకముంది. ఇది కరెక్టు. 'తిమోతీ ఆఫ్ అలెగ్జాండ్రియా' వ్రాసిన వ్రాతలనుండి ఈ నిబంధన చేర్చబడింది. సరే, టమారా. ఆమె ఉరి తీసుకున్నప్పుడు మీ డాక్టరు పరీక్షచేశాడని చెప్పావుకదూ? అతను నగర వైద్యుడేనా? అతనిపేరేమిటి?' అనడిగాడు లాయరు రియాసనోవ్.

'అవును. నగరవైద్యుడే. ఆయనపేరు క్లిమెంకో.' చెప్పింది టమారా.

'బహుశా అతన్ని నేనెక్కడో కలుసుకున్నట్లు జ్ఞాపకం. సరే, మీ జిల్లా పోలీసుఆఫీసరు ఎవరు?

'కెర్బెష్.'

'ఓ! అతనా? అతన్ని నే నెరుగుదును. మనిషి మొద్దులా వుంటాడు, ఎర్రటిగడ్డం, అతనా! అవునా?

'అవును. అతనే.'

'సరే, అతను నాకుతెలుసు. ఎంతో కాలంక్రిందటే వాడికి కఠినశిక్ష పడాల్సిన మాట. కటికి దుర్మార్గుడు. వాణ్ణి జైల్లో పెట్టించాలని దాదాపు పదిసార్లు ప్రయత్నించాను. కాని దొంగవెధవ, ఏదోవిధంగా ప్రతిసారీ తప్పించుకుపోయాడు. తప్పుడువెధవ. చేపపిల్లలా చిక్కకుండా జారిపోయాడు. వాడిచేతిలో లంచం పోయాల్సిన అవసరముంది. సరే. ఇహ అంత్యక్రియలవిషయం. శ్మశానానికిప్పుడు తీసుకుపోవాలనుకుంటున్నారు'?

'చెప్పలేను. వీలైనంతత్వరలో పూర్తిచేయడం మంచిది. వీలైతే ఇవాళే తీసుకెళ్ళొచ్చు.'

'ఓ! ఇవాళా! నేనుగట్టిగా చెప్పలేను. ఎందుకంటే ఇవాళే ఈ పనులన్నీ పూర్తిచేయడానికి తగినంత వ్యవధి లేదు. అయినా ప్రయత్నిస్తాను. చూడమ్మాయ్! ఇదుగో నా అడ్రెస్సుల పుస్తకం. ఇందులో టి—అనే అక్షరంకింద నీపేరు— టమారాఅనిరాసి, నీచిరునామాకూడా అక్కడరాసి పెట్టు. సుమారు రెండుగంటల్లో ఏం జరిగిందీ నీకు తెలియజేస్తాను. సరేనా? కాని మరొకమాట చెపుతున్నాను. బహుశా అంత్యక్రియలు రేపటికి వాయిదా వేయాల్సివస్తుంది. ఉన్న విషయం దాచకుండా చెప్పుతున్నందుకు నన్ను క్షమించమ్మా. నీకేమైనా సొమ్ము అవసరముందా?'

'వద్దు. మీ అభిమానానికి ఎంతో కృతజ్ఞురాలిని. నాదగ్గర డబ్బుంది. మీరు నాపట్ల చూపిస్తున్న ఆదరణకు, అభిమానానికీ మరోసారి నా హృదయపూర్వక నమస్కారాలు. ఇహ నేను వెడతాను. మీరుచేసిన సహాయానికి ఎంతో కృతజ్ఞురాలిని. మేడమ్ ఎల్లెనా! నమస్కారం. సెలవు.'

'ఏసంగతీ రెండుగంటలలో నీకు తెలియపరుస్తాను.' మళ్ళీ అన్నాడు రియాసనోవ్. గదివాకిలిదాకా ఆమెతో వెళ్ళి సాగనంపాడు.

టమారా వెంటనే అక్కణ్ణుంచి సరాసరి ఇంటికి వెళ్ళలేదు. పక్క సందులోవున్న ఓ చిన్న కాఫీహోటలు ముందు ఆగింది. అక్కడ 'శంకా' ఆమెకోసం వేచివున్నాడు. శంకా చాలా ఉల్లాసంగావుండే యువకుడు. చక్కనివాడుకూడా. నల్లటికళ్ళు. మెదమెదలాడే మొహం. నలుపు నీలంకలిసిన తలవెంట్రుకలు. ఎప్పుడూ మందహాసంతో వుంటాడు. అతనివృత్తి దొంగతనం. తన వృత్తిలో అతను ఎంతో చలాకీగావుండి మిక్కిలి ధైర్యసాహసాలు ప్రదర్శిస్తాడు. స్థానికంగావుండే దొంగలలో ఇతను ప్రసిద్ధుడు. వాళ్ళంతా ఇతన్నిగురించి గొప్పగా చెప్పుకుంటారు, అందుకు శంకా గర్వపడుతుంటాడుకూడాను. ఇంకా చెప్పాలంటే నగరంలో దొంగలగుంపుకంతా ఇతనే గురువు, నాయకుడు.

శంకా కుర్చీమీదనుంచి లేవకుండా టమారాను ఆహ్వానించాడు. ప్రేమతో పక్కనవున్న కుర్చీ దగ్గరికి జరిపి ఆమెను కూర్చోమన్నాడు.

'హల్లో టమారా! ఎంతకాలమయింది నిన్ను చూచి. నా దురదృష్టంవల్ల తటస్థపడలేదు. కొంచెం కాఫీ తాగవ్?'

'వద్దు. ముందు వ్యవహారం తరవాత ఫలహారం. రేపు జెంకాకు అంత్యక్రియలు జరపాలనుకుంటున్నాం. ఆమె ఉరిపోసుకుని చచ్చింది.'

'అవును, నేను పేపర్లో చూశాను.' అన్నాడతను నిర్లక్ష్యంగా 'కాని ఎవరికేం పట్టింది!'

'నాకు తక్షణం యాభై రూబుళ్ళు కావాలి. ఇవ్వండి.'

'నా ప్రేయసీ! టమారోచ్కా! నా దగ్గర ఒక్క పెన్నీ కూడా లేదు.'

'నాకు డబ్బుతో అవసరముందనీ తీసుకొచ్చి ఇవ్వమనీ ఇదివరకే చెప్పాను.' అంది టమారా ఏదో ఆజ్ఞాపిస్తున్నట్టు.

'ఓరి దేవుడా! నీ డబ్బు నేను ముట్టుకోలేదు టమారా! నేను అది వాడుకోనని నీకు వాగ్దానం చేశాను. అలాగే అట్టిపెట్టివుంచాను. కాని ఇవాళ ఆదివారం, బ్యాంకుకు సెలవు.'

'సెలవో గిలవో అదేం నాకు తెలీదు. ఆ బ్యాంకు పుస్తకం తీసుకెళ్లి బురదలో పారేయండి. నాకిప్పుడు డబ్బు అవసరం. మీరేమయినా చేసుకోండి.'

'ఏమిటంత అవసరం నా ముద్దులగుమ్మా!'

'అవసరమేమిటి? ఆమాత్రం అర్థంచేసుకోలేరూ? మొద్దుబుర్రాని మీరూను. జెన్నీకి అంత్యక్రియలు జరిపించాలి.'

'ఓ! అదా సంగతి! అయితే సరే.' అంటూ శంకా నిట్టూర్చి మళ్ళీ ఇలా అన్నాడు. 'బహుశా వీలైతే సాయంత్రానికే పట్టుకొచ్చి ఇస్తాను. సరేనా? టమారోచ్కా! నీవులేకుండా ఒంటరిగా జీవించడం చెడ్డకష్టంగా వుంది. నిన్ను చూడకపోతే పిచ్చెక్కినట్టు వుంటోంది. ఏదీ ప్రేయసీ! నిన్ను ముద్దుపెట్టుకోవాలనివుంది. ముద్దుమీద ముద్దు, గట్టిగా. రాత్రంతా నిన్ను నిద్రపోకుండా చేయాలనివుంది. ఏం? రమ్మంటావా?'

'వద్దు వద్దు. నామీద దయవుంచి నేను చెప్పినట్టు చెయ్యి సెనీచ్కా! ఇహ మీరు అక్కడికివచ్చి నన్ను చూడ్డానికి వీల్లేదు. ఇప్పుడు ఇంటిపెత్తనం నాకప్పచెప్పారు.'

'అయితే మరం అనుకున్నదంతా మట్టికొట్టుకు పోవల్సిందేనా?' కొంచెం నివ్వెరపోతూ అడిగాడు శంకా.

'లేదు లేదు. ప్రస్తుతం కొంతకాలంవరకూ మాత్రమే ఇలా వ్యవహరించాలి. తరువాత — ప్రియా! ... మీరు చెప్పినట్లు చేయడానికి నాకెట్టి అభ్యంతరమూ లేదు. త్వరలోనే మనం ఆలోచించుకున్నవన్నీ పరిష్కారమయిపోతాయి. అందాక కొంచెం ఓపికపట్టండి.'

'ఓ! ఎన్నాళ్ళని ఇలా బాధిస్తావు టమారా! నేను ఓర్చుకోలేను. మన వ్యవహారం వీలైనంత త్వరలో తేలిపోవాలి.'

'మీరేం బాధపడకండి. త్వరలోనే తగిన ఏర్పాట్లన్నీ చేస్తాను. మరో వారంరోజులు ప్రియా! అంతకన్నా ఎక్కువ పట్టదు. మీ రా మందు పొట్లాలు సంపాయించారా?'

'మందు పొట్లాలా! ఓ! అదెంతపని?' అన్నాడు శంకా కొంచెం అయిష్టంగా 'మరిచాను. అది పొడకుకాదు, మాత్రలు '

'అయితే అవి వెంటనే నీళ్ళల్లో కరుగుతాయా?'

'అందుకు సందేహంలేదు. క్షణంలో కరిగిపోతాయి. నేను నా కళ్ళారా చూచాను.'

'అయితే అతను చావడుకదూ? విను శంకా! మళ్ళీ చెప్పండి. నిజం చెప్పండి. అతను చచ్చిపోడుకదూ?'

'ఏం, చచ్చిపోడు టమారా! అతనికి ఏమాత్రం ప్రమాదం జరగదు. కొంతసేపటివరకూ మత్తుగా పడుంటాడు. అంతే.' అంటూ అతను గభాలున టమారామీదికి వంగి రహస్యంగా ఇలాఅన్నాడు. 'దైవసాక్షిగా చెపుతున్నాను. ఆపని త్వరగా జరిగిపోవాలి టమారా! ఆపని పూర్తిచేయడం, మనిద్దరం ఇక్కణ్ణుంచి ఉడాయించడం! ఇహ ఏమాత్రం కాలయాపన పనికిరాదు. నీవు ఎక్కడికివెడదామంటే, అక్కడికి వస్తాను ప్రేయసీ! నేను పూర్తిగా నీ స్వాధీనంలో వున్నాను. నీకిష్టమైతే ఒడెస్సా వెడదాం. లేకపోతే ఇంకా దూరదేశానికి వెళ్ళిపోదాం. నేను కోరేదల్లా ఒకటే—ఈపని తక్షణం అయిపోవాలి.

'త్వరగానే అయిపోతుంది. అవును. అతిత్వరలోనే ముగించేద్దాం.'

'నీవు ముందుగా సైగచేస్తే చాలు. వెంటనే నేను ఆ మాత్రలు తెచ్చి సిద్ధంగావుంటాను. ప్యాస్‌పోర్టులు సంపాదించి, సామానంతా సర్దు

కుని ప్రయాణానికి సిద్ధంగావుంటాను. ఇహ ఆతరువాత— మనం ఉడాయించడం! టమారోచ్కా! నా దేవీ! నా రాణీ! నా హృదయాధిదేవతా! నీమీదే అన్ని ఆశలు పెట్టుకున్నాను.'

శెంకా సాధారణంగా పదిమందిలో తిరిగేటప్పుడు మౌనంగా, బెట్టుగా వుంటాడు. అలాంటిది ఇప్పుడు ఎక్కడున్నదీ, ఏంచేస్తున్నదీ మరిచిపోయి టమారాను తనచేతుల్లోకి తీసుకోవడానికి ప్రయత్నించాడు.

'వద్దు వద్దు. ఇది తరుణంకాదు ప్రియా!' అంటూ ఆమె గభాలున పిల్లిమాదిరి కుర్చీలోంచి అవతలికి గెంతింది. సెనీచ్కా! తరువాత నేను మీదాన్నే. మీఇష్టం. ఎదురు మాట్లాడను అడ్డుచెప్పను. చూడండి, మీరిప్పటికే ఎలా అలిసిపోయారో! ఆలస్యమైంది. మరి వెళ్లొస్తాను. సెలవు'

టమారా అతని ఉంగరాల జుట్టును గబగబ తనచేత్తో సవరించి అక్కడినుంచి వేగంగా వెళ్ళిపోయింది.



మరుసటి రోజు సోమవారం. ఉదయం పదిగంటలకల్లా అన్నా ఇంట్లో ఉండే వేశ్యలలో దాదాపు అందరూ (ఈ వేశ్యలంతా ఇప్పుడు ఎమ్మా స్వాధీనంలో వున్నారు) బండిమీద బయలుదేరి, నగరం మధ్యలో ఉన్న శవాలు భద్రపరచే స్థలానికి వెళ్ళారు. ముగ్గురు మాత్రం వారితో వెళ్ళకుండా ఇంట్లోనే ఉన్నారు. ఒకామె హెన్రీటా, రెండో ఆమె నైనా, మూడోపిల్ల పాషా. హెన్రీటా ఇలాంటివి చాలా చూసింది. అంచేత ఆమెకు వెళ్ళాలనిపించలేదు. పోతే, నైనా భయస్తురాలు. ఇలాంటివి చూస్తే ఆమెకు అణుమాత్రం విచారంగాని, దయగాని కలుగదు. ఇహ మిగిలిందల్లా పాషా, రానురాను ఆమె హృదయం దుర్బలమైపోతోంది. ఇప్పటికి రెండు రోజులనుంచీ మంచంమీదనుంచి లేవడంలేదు. నోరుతెరచి మాట్లాడడం లేదు. అడిగినదానికి సమాధానం చెప్పడంలేదు. వెర్రిచూపులు చూస్తూ, వెకిలిగా నవ్వుతూ, పిచ్చిదానికి మల్లే నోరు చప్పరించుకుంటూ

గొడ్డుమాదిరి మంచంమీదపడి కొట్టుకుంటూ వుంది. ఎవరూ భోజనం పెట్టక పోతే అదేమని అడగదు. ఎవరైనా పట్టుకొచ్చి పెడితే తన చేతులు ఉపయోగించి అవురావురున తినేస్తుంది. ఇలా ఉంది ఆమె స్థితి. ఆమె చాలా అపరిశుభ్రంగానూ, అసహ్యంగానూ తయారయింది. తను అవసరంగా చేసుకోవాల్సిన పనులలో కనీసం కొన్ని అయినా జ్ఞాపకం ఉంచుకోవాలనీ, లేక పోతే కష్టపడాల్సివస్తుందనీ కూడా ఆమెకు తెలియడం లేదు. అంత మతిమరుపు పుట్టింది పాపం! ఆమె కోసం అప్పనంగా వచ్చే విటులు కొందరున్నారు. వారు ప్రతిరోజూ 'పాషా ఎక్కడుంది' అని అడుగుతూనే ఉన్నారు' అయినా ఎమ్మా ఆమెను వారివద్దకు పంపడం లేదు. ఇంతకు ముందుకూడా పాషాకు అప్పుడప్పుడు మతిభ్రమకలగడం కద్దు. అయినా ఎప్పుడూ ఇంత కాలం వుండేది కాదు. ఏదో మైకం కమ్మడం, అంతలోనే మళ్ళీ తెలివి రావటం జరిగేది. ఈసారి అలా కాకుండా, దీర్ఘ కాలం చిత్త చాంచల్యంలో వుండిపోయింది. ఆమె పరిస్థితి ఎప్పుడు బాగుపడుతుందా అని ఎమ్మా ఎదురుచూస్తోంది. నిజానికి ఈ సానికొంపకు పాషా ఒక నిక్షేపంలా దొరికింది ఆమెను చూసి డిమాండు ఉంది. విటులు చాల మంది ఆమే కావాలని కోరుకుంటారు. కాని చివరకు ఈ అభాగ్యురాలు ఒక విషాదమూర్తియై ఈ కొంపకు బలిఅయిపోయింది. కనుక ఈ ముగ్గురూ తప్ప తక్కినవాళ్ళంతా జెన్నీ శవాన్ని చూడ్డానికి వెళ్ళారు.

శవాలను భద్రపరిచే స్థలం నగరంమధ్యలో ఒకచోట ఒక అంతస్తు గల భవనంలో వుంది. భవనం కిటికీలకు, ద్వారాలకు తెల్లని తెరలు కట్టారు. దాని దగ్గరకువెళ్ళి ఎగా దిగా చూచినట్లయితే, ఏదో భయం, విషాదం ఆవరిస్తాయి. ఏదో అమంగళంగా కళ్ళకు కొరుస్తున్నట్లు అగుపిస్తుంది ఆ ప్రదేశం. వేశ్యలంతా ఒకరితరువాత ఒకరు భవనంలో ప్రవేశించారు. ప్రతిగేటు దగ్గరా ఆగుతూ, గుండె బెదురుతో ముందరవున్న ఖాళీజాగా దాటి చర్చి లాంటి చిన్న ప్రార్థనామందిరంలో ప్రవేశించారు. దాని కిటికీలకు, ద్వారాలకుకూడా తెల్లటి తెరలు వ్రేలాడుతున్నాయి.

తలుపు తాళంవేసివుండడంవల్ల కాపలావాణ్ణి వెదకడం కోసం టమారా వెళ్ళింది. ఆఖరుకు అతను వచ్చాడు. అతను వృద్ధుడు. పొట్టిగా బట్టతలా అతనిది. ముఖమంతా తెల్లగా నెరసి నిక్కపొడుచుకుని వున్న వెంట్రుకలతో

నిండివుంది. పుసులు తోడుతున్న చిన్నకళ్ళు. గుబురుగా రక్తవర్ణంగావున్న ముక్కు.

అతనువచ్చి, తలుపుకు వేసివున్న పెద్ద కప్పతాళాన్ని తీశాడు. బలంగావున్న గడియను వెనక్కుపెట్టి తలుపునతోశాడు. తుప్పుపట్టి వుండడం వల్ల తలుపు తీస్తోంటే కిరకిరమని పెద్దచప్పుడైంది.

తలుపు తీయగానే లోపల్నుంచి చలిగాలి, చెమ్మతోనానిన రాళ్ళ వాసన గుప్పుమంది. అంతలోనే మురిగిన, కుళ్ళిపోయిన, మాంసపువాసన ముక్కులు పగులగొట్టేలా వచ్చింది. వేశ్యలంతా ఆ దుర్గంధం భరించలేక ఉక్కిరిబిక్కిరి అయిపోయారు. అందరూ భయాందోళనలతో గుంపుగా కూడి అక్కడే ఆగిపోయారు. ఒక్క టమారా మాత్రం కొపలావాడివెంట లోపలికి వెళ్ళింది.

లోపలఅంతా చీకటిగావుంది. ఒకచిన్న ఇరుకైన కిటికీగుండా మాత్రం ఆకులురాలేకాలపు ఎండవెలుతురు మందంగా అక్కడక్కడ పడుతోంది. రెండుమూడు నల్లటితెరలు పొడుగ్గా, కళావిహీనంగా, పాడుకొట్టుకుంటూ గోడలకు వేళ్ళాడుతున్నాయి. అనేక శవపేటికలు నేలమీద పెట్టివున్నాయి. వాటి మధ్యలోవున్న ఒక్క పెట్టె ఖాళీగావుంది.

'ఇందులో ఏది మీదిక్కీ?' అనడిగాడు. కొపలావాడు ముక్కుపొడుం పీల్చుతున్నవాడికిమల్లే బొంగురు గొంతుతో మాట్లాడాడు అతను. 'ఆమె మొహాం నీవు గుర్తుపట్టగలవాక్కీ?'

'ఆ! గుర్తుపట్టగలను.' అని సమాధానం చెప్పింది టమారా.

'అయితే ఇక్కడికొచ్చి చూడు. నీకు అన్నీచూపిస్తాను. ఇది మీదాక్కీ?' అంటూ, అతను ఒక్క శవపేటికమూతతెరచి చూపించాడు. దాని కింకా మేకులుకొట్టి బిగించలేదు.

ఆ శవాన్ని చూచి అది కాదన్నట్లు తలూపింది టమారా.

'ఇది కాదాక్కీ? అయితే సరే. ఇక్కడ ఇంకా కొన్ని ఉన్నాయి చూడు.' అంటూ ఆతను ఒకదాని తరువాత ఒకటి, శవపేటికల మూతలు తెరచి శవాలు చూపించడం మొదలెట్టాడు. వాళ్ళంతా దిక్కూ దివానీ లేకుండా చచ్చిన దౌర్భాగ్యులు. నగర వీధుల్లో చచ్చిపడివుంటే తీసుకొచ్చారు. అందులో కొందరు తాగుబోతులు. మరికొందరు వీధులవెంట తిరిగే

బికార్లు, కొందరికి కళ్ళుపోయి ఉన్నాయి. మరికొందరికి కాళ్ళు, ఇంకా కొందరికి చేతులు తెగి ఉన్నాయి. కొందరి మొహాలు, తలలు చితికిపోయి వున్నాయి. మొత్తానికి శవాలన్నీ ఛిన్నాభిన్నంగా చెదరిపోయి గుర్తించడానికి వీల్లేకుండా వున్నాయి. వాటినుంచి దుర్భరమైన దుర్గంధం వెలువడుతోంది. టమారా నిలబళ్ళేకపోయింది. డోకు వస్తున్నట్లు అనిపించింది. ఆ దుర్గంధం తన రోమరోమాలలో ప్రవేశించి శరీరమంతా పూత పూసినట్లు తోచింది ఆమెకు.

'చూడు నాయనా!' ఆమె అకస్మాత్తుగా కాపలావాణ్ణి అడిగింది 'ఏమిటి కాళ్ళక్రింద కరకరమని శబ్దం వస్తోంది!'

'కరకరమనిశబ్దమా?' అంటూ అతను నెత్తి గోక్కున్నాడు. బహుశ ఏవో ఎలుకలు, పురుగులు తిరుగుతుంటాయి.' అంటూ నిర్లక్ష్యంగా జవాబు చెప్పి మళ్ళీ ఇలా అన్నాడు 'అయితే, ఏమమ్మా! ఇక్కడ బోలెడు శవాలు పడున్నాయి. ఇంతకూ నీకు కావల్సింది ఎవరు?'

'ఒక ఆడమనిషి'

'ఆమె వీటిల్లోవుందా?'

'లేదు. ఈ శవాలన్నీ ఎవరివో నే నెరుగను.

'అయితే మనం వేరేచోటుకు వెళ్ళాలి. శవాలను భద్రపరచేస్థలం మరొకటుంది. అక్కడికివెళ్ళిచూద్దాం. ఇంతకూ ఆమెను ఇక్కడికి ఎప్పుడు తీసుకొచ్చారు?'

'శనివారంనాడు.' అని చెప్పింది టమారా. అలా చెపుతూ ఆమె తన పర్సులోంచి కొంతడబ్బుతీసి ఆ వృద్ధుడిచేతిలో పెట్టింది.

'ఇదుగో! నీకు బాగాను కొనుక్కోవడానికి ఇస్తున్నాను. ఆమెను శనివారం నాడు మధ్యాహ్నం ఇక్కడికి తీసుకొచ్చారు.'

'శనివారమా? అయితే 217 నెంబరు అయివుండాలి. ఆమె పేరేమిటి?'

'సుసానా రెయిడ్లిస్.'

'నేవెళ్ళిచూస్తాను. బహుశా ఆమెశవం అక్కడ వుండొచ్చు. సరే అమ్మాయిలూ! 'అంటూ అతను తలుపుదగ్గర మూగివున్న వేశ్యలవైపుచూస్తూ ఇలా ప్రశ్నించాడు. 'మాతో రావడానికి మీలో ఎవరికి ధైర్యముంది? భయ

పడకుండా రాగలిగినవాళ్ళెవరో చెప్పండి మీ స్నేహితురాలిని శనివారం ఇక్కడికి తీసుకొచ్చివున్నట్లయితే, ఇప్పటికి ఆమెను వంటిమీదగుడ్డలేకుండా వుంచుతారు. పుట్టినప్పుడు ఎలావుందో అలా దిగంబరిగా వుంచుతారు. అంచాత మీరు చూడడం అంతమంచిదికాదు. భయపడవచ్చుకూడా. అందుకని ధైర్యంకలవాళ్ళు ఇద్దరు మావెంట రండి. ఆమెకు బట్టా అదీ కట్టడానికి పనికొస్తారు.'

'నీవు రావడం మంచిది మంకా' అంటూ టమారా, తెల్లమంకాను ఆజ్ఞాపించింది. పాపం మంకా అప్పటికే భయపడిపోయి వణుకుతోంది. ఆమెముఖం పాలిపోయింది. కళ్ళు పెద్దవిచేసి బెదురు బెదురుగా శవపేటికలవైపు చూస్తోంది.

'ఎందుకే అంతభయం? పిచ్చిదానా! నేను నీ వెంట ఉంటానుగా. చూడు మంకా. నిన్ను ఆమె క్షేమించింది. మరి నీవు తప్ప ఎవరొస్తారే?' మళ్ళీ అడిగింది టమారా కొంచెం తీవ్రంగా.

'నేనా... నేనా... సరే' వణుకుతున్న పెదవులతో గొణిగింది మంకా. 'సరే. వెడదాం పద.'

చర్చిలాంటి ఆ మందిరానికి వెనుకవైపు శవాలు భద్రపరిచే స్థలం వుంది. అది నేలలో సొరంగంమాదిరిగా వుంటుంది. ఆ భూగృహం ఒక భూతగృహంలా కటికి చీకటితో, దుర్గంధంతో భయంకరంగా వుంటుంది. క్రిందికి ఆరుమెట్లు వున్నాయి. ఆ మెట్లమీదినుంచి వెడితే లోపల చీకటి గుహ కనిపిస్తుంది.

కాపలావాడు ఎక్కడికోవెళ్ళి కొంచెంసేపట్లో తిరిగొచ్చాడు. వస్తూవస్తూ ఒక చిన్న కొవ్వొత్తిముక్క, ఒక చిరిగిపోయిన పుస్తకం పట్టుకొచ్చాడు. తరువాత అతను కొవ్వొత్తి వెలిగించి సొరంగంలో ప్రవేశించాడు. ఆ యిద్దరు స్త్రీలు అతనివెంట వెళ్లారు. మెట్లుదిగి గుహలో ప్రవేశించేసరికి, ఆ కొవ్వొత్తి వెలుగులో ఒకటిరెండుశవాలు వరుసగా నేలమీద పడేసివుండడం ఆ పిల్లలు చూచారు. క్రింద అంతా రాతిపరుపు. ఆ రాళ్ళమీద వరుసలో వరుసలుగా శవాలు పడేసివున్నాయి. పగిలిన పుర్రెలు, చితికిన మొహాలు నల్లగా, నీలంగా శరీరమంతా కమలిపోయి భీభత్సంగా అగుపిస్తున్నాయి

నోళ్ళు తెరచుకుని, పళ్ళు ఇకిలించుకుపోయి, చూడ్డానికి భయంకరంగా వున్నాయి. ఆ మొఖాలలో వివిధరకాల మరణవేదన స్పష్టమవుతూవుంది.

'ఒక్కనిముషం ఉండండి, ఒక్కనిముషం' అంటూ కాపలావాడు తన వేలితో శవాలతలు ఒక్కొక్కటి లెక్కపెడుతున్నాడు. 'నిన్నగాక మొన్న...అంటే శనివారం, శనివారం. ఆమె పేరేమిటి?'

'సుసానా రెయిజీనా.'

'సుసానా రెయిజీనా, సుసానా రెయిజీనా.' అంటూ అతను పాట పాడుతున్నట్లు ఆ పేరు పదేపదే ఉచ్చరించసాగాడు. 'సుసానా రెయిజీనా. నేను ఇందాక చెప్పినట్లు రెండొందల పదిహేడు అయివుండాలి!'

శవాలమీదికి వంగి, కొవ్వొత్తి వెలుతురులో పరీక్షగా చూస్తూ వరుస లారుసలుగావున్న ప్రతి ఒక్క శవాన్ని పరిశీలించసాగాడు. చివరకతను ఒక శవం దగ్గర ఆగాడు. ఆ శవం కాళ్ళదగ్గర 217 అనే సంఖ్య పెద్ద అక్షరాలతో వేయబడివుంది.

'ఇదుగో! ఇక్కడుంది. నే నీమెను నడవలోకి మోసుకొస్తాను. అప్పుడు మీరు కావలసిన వ్యవహారమంతా చూద్దురుగాని. ఒక్క క్షణం ఆగండి.' అన్నాడు కాపలావాడు.

జెంకా శవాన్ని కాళ్ళతో పైకెత్తి అతను తన వీపుమీద వేసుకున్నాడు. అంత వృద్ధాప్యంలో వున్నా, ఆ శవాన్ని మీది కెత్తుకోవడానికి అతను ఏ మాత్రం కష్టపడ్లేదు. కొంచెం ఊతంకోసం మూలిగాడు, అంతే. అలా గొడ్డుశవాన్నో, బంగాళాదుంపలుపోసిన గోనె సంచినో, మీద వేసుకున్నట్లు వేసుకుని నడవలోకి మోసుకొచ్చాడు.

నడవలో కొంచెం వెలుతురుగావుంది. మీదవున్న బరువును మెల్లగా అతను కిందికి దించాడు. టమారా తనరెండు చేతులతో మొహాన్ని కప్పుకుంది. మంకా తన మొహం అవతలవైపుకు తిప్పుకుంది. ఇద్దరూ వెక్కివెక్కి ఏడ్వసాగారు.

'మీకేమైనా కావల్సింటేచెప్పండి.' అనడిగాడు వారిని కాపలావాడు. 'మీకు ఏదికావాల్సింటే అది ఇక్కడ దొరుకుతుంది. ఆమెకు దుస్తులు వేయాలనుకుంటే రకరకాలదుస్తులు వున్నాయి. పీనుగుమీద కప్పడానికి బంగారు తళుకుతో అద్దిన మేలురకంగుడ్డవుంది. పమిటమాదిరిగా వేయ

దానికి చిన్న చిన్న గుడ్డలున్నాయి. సిల్కు గుడ్డలు, దోమతెరగుడ్డలు, ఇంకా రకరకాలున్నాయి. మెళ్లోవేసుకుడానికి మాలలుకూడా సిద్ధంగా వున్నాయి. ఇక్కడ మేము అన్నీ ఎప్పటికప్పుడు సిద్ధంగావుంచుతాం. మీకు ఏంకావాలంటే అది కొనుక్కోవచ్చు. ఒకటీరెండు గుడ్డలుగాని, స్లిప్పర్లుగాని, మీ ఇష్టం, ఏంకావాలో చెప్పండి.'

టమారా, కొంతడబ్బుతీసి అతనిచేతిలో పెట్టింది. అతను వెళ్ళిపోయాడు. ఆ తరువాత ఆమె మంకాను వెంటబెట్టుకుని గాలిపీల్చుకోడానికి బహిఃప్రదేశంలోకి వచ్చింది.

కొంతసేపయింతరువాత రెండు మాలలు తయారయి వచ్చాయి. అందులో ఒకటి టమారాకోసం తయారు చేయించింది. నల్ల రిబ్బన్ మీద రకరకాల పూలు, లతలు వేసి కుట్టారు. ఒక వైపున తెల్లని అక్షరాలతో ఇలా వ్రాసివుంది. 'ప్రియమైన జెన్నీకి—స్నేహితురాలు టమారా ఇచ్చింది.' ఇహ పోతే రెండోది రియాసనోవ్ తయారుచేయించి పంపించాడు. ఎర్రని గుడ్డపీలికమీద, పలురకాల ఎర్రరంగు పీలికలు కుట్టారు. ఒకవైపు బంగారు తళుకుతో అక్షరాలున్నాయి. 'బాధల ద్వారానే మనం పవిత్రులం అవుతాం.' అని వ్రాసివుంది. రియాసనోవ్ ఒక చిన్న ఉత్తరం కూడా వ్రాసి పంపాడు. ఏదో అత్యవసరమయిన మీటింగులో పాల్గొనాల్సివచ్చిందనీ, అందుచేత రాలేకపోయాననీ, దయతో క్షమించవలసినదిగా కోరుతున్నాననీ వ్రాసి పంపాడు.

ఆ తరువాత పాటగాళ్ళు వచ్చారు. అంతకు ముందే టమారా బ్యాండుమేళగాళ్ళతో మాట్లాడి, వాళ్ళకు ఇవ్వవలసిన డబ్బు ఇచ్చేసి, రమ్మని చెప్పి వచ్చింది. నగరంలోకల్లా మంచి వాయిద్యగాళ్ళు, చర్చిలలో వాయించే బ్యాండుమేళగాళ్ళు పదిహేనుమందిజట్టు వచ్చారు.

బ్యాండు మాస్టరు మహా దర్జాగా వున్నాడు. పొడుగాటి మీసాలు. బూడిదరంగు ఓవరుకోటు ధరించి, నెత్తిమీద అదేరంగు హేటు పెట్టుకున్నాడు. మిలిటరీవాళ్ళకు మల్లే యూనిఫారంలో వున్నాడు. పసుపుకత్తెలలో ఉన్న వెర్కా అనే అమ్మాయిని చూచి అతను నివ్వెరపోయాడు. నీరసంగా చిరునవ్వు నవ్వి ఆమెను చూస్తూ సైగచేశాడు. అవును. ఇతను ఆ అమ్మాయిని ఎరుగును. బ్యాండు మాస్టర్లు, ప్రార్థనలు చదివేవాళ్ళు, మత

గురువులు, పురోహితులు, వీళ్ళంతా కూడా తమ తమ యజమానురాళ్ళ ఇళ్ళకు వెళ్ళి సానికొంపలన్నీ చుట్టబెట్టేవారు. చివరకు అన్నా ఇంట్లో ప్రవేశించి అక్కడ తమకు నచ్చిన వేశ్యలను ఎన్నుకొని గంటల తరబడి కాలక్షేపం చేసేవాళ్ళు. ఈ బ్యాండు మాస్టరు కూడా వారందరితో కలిసి కనీసం నెలకు రెండు మూడు సార్లయినా యామాకు వెళ్ళేవాడు. వెళ్ళినప్పుడల్లా ఇతను అన్నా ఇంట్లో వుండే వెర్కానే తప్పకుండా ఎన్నుకుని ఆమెతో గడిపే వాడు. అంచేతనే ఇప్పుడా అమ్మాయిని చూచి ముసి ముసి నవ్వులు నవ్వు కుంటూ మురిసిపోతున్నాడు.

బ్యాండు మాస్టరు మాంచి రసికుడు, ఉత్సాహవంతుడు. బ్యాండు వాయించడంలోను, నృత్యం చేయడంలోను సమర్థుడు, చక్కని పాండిత్యం కలవాడు. ఒక్కోసారి ఆ ఉత్సాహంలో మైమరిచి నృత్యం చేసేవాడు. గానంలో తన్మయత్వం చెంది ప్రేక్షకులను, శ్రోతలను కూడా ఆనందంలో ముంచెత్తేవాడు.

బ్యాండు మేళగాళ్ళతో పాటు పీనుగులను మోసుకుపోయే బండి కూడా వచ్చింది. అది కూడా టమారా డబ్బు చెల్లించి అద్దెకు మాట్లాడుకున్నదే. బండికి రెండు గుర్రాలను కట్టారు. బండి వెంట అయిదుగురు బంట్రోతులు కూడా వున్నారు. బండిమీద శవాన్ని పెట్టుకుని మోసుకుపోవడానికీ, శవం చుట్టూ జ్యోతులు వెలిగించి పట్టుకోవడానికీ వీరు ఉపకరిస్తారు. బండిమీద ఒక శవపేటిక వుంచారు. దానిమీద తెల్లని వెండి జలతారు చేత అలంకరించారు. శవపేటికతో పాటు ఒక ఎత్తయిన విగ్రహపీఠం కూడా వుంది. పీఠంమీద ఒక నల్లని కాలికో గుడ్డను కప్పారు. ఆ అయిదుగురు మోతగాళ్ళు మెల్లగా నేర్పుతో జెన్నీ శవాన్ని ఎత్తుకొని బండిమీద వున్న శవపేటికలో వుంచారు. వంటినిండా బంగారు జలతారు వస్త్రం కప్పారు. మొహంమీద తెల్లగా ధగధగ మెరిసే దోమతెరగుడ్డ కప్పారు. పిమ్మట మూడు కొవ్వొత్తులు వెలి గించి ఒకటి జెన్నీ శిరస్సు దగ్గర, రెండు ఆమె పాదముల దగ్గర పెట్టారు.

అటూ ఇటూ ఊగుతోన్న కొవ్వొత్తుల కాంతిలో జెన్నీ మొహం ఇంకా స్పష్టంగా అగుపిస్తోంది. అక్కడక్కడ తప్ప ఆమె మొహం ఇప్పుడు నీలివర్ణంగా లేదు. కాని ఆమె మెడమీద ఉన్న రెండు గుర్తులు మాత్రం మాసిపోలేదు. మెడ చుట్టూ తాడుతో కొట్టిన వాత ఒకటి, ఇంకా కొంచెం

దిసువున ఎర్రగా గీసుకుపోయిన గుర్తు ఒకటి, ఈ రెండూ స్పష్టంగా అగు పిస్తున్నాయి. ఈ రెండూ కూడా ఆ దుర్మార్గుడు సిమన్‌తో పోట్లాడు తున్నప్పుడు తగిలిన దెబ్బలే. రెండూ రెండు భయంకరమైన హారాలవలె ఆమె మెడచుట్టూ వున్నాయి. టమారా ఆమెమీదికి వంగి, లేసుతోఅల్లిన ఆమెచొక్కా మెడపట్టీకి పిన్నీసు పెట్టింది. అలా చేయడంవల్ల మెడ మీదవున్న ఆ రెండు భయంకరమైన గుర్తులు కనిపించకుండాపోయాయి.

తరువాత మతగురువు వచ్చాడు. ఆయనవృద్ధుడు. తల తెల్లగా నెరిసి పోయింది. పొట్టిగావున్నాడు. బంగారు ఫ్రేముగల కళ్ళజోడు పెట్టు కున్నాడు. తలకు అంటుకునివున్న టోపీ ఒకటి పెట్టుకున్నాడు. మొహానికి రంగు పూసుకున్నట్లు విచిత్రంగా అగుపిస్తున్నాడు. వదులుగావున్న పొడు గాటి ఉడుపులు ధరించాడు. ఈయన చర్చిలో పనిచేసే మతాచార్యుడు. ప్రార్థనాగీతాలు పఠించడంలో కడు నేర్పరి; అనుభవజ్ఞుడు.

టమారా మతగురువువద్దకు వెళ్ళింది.

'ఫాదర్! అంత్య సంస్కారం ఎలా జరపాల్సివుంటుంది? అందరినీ కలిపి ప్రార్థనచేయిస్తారా లేక విడివిడిగా జరుపుతారా?' అనడిగింది ఆమె.

'మేం సాధారణంగా అందరినీ కలిపి చేయిస్తుంటాం.' మతగురువు జవాబుచెప్పాడు. 'అయినా మీరు ప్రత్యేకంగా కావాలని కోరితే, వేరు వేరుగా జరిపించడానికికూడా వీలుంది. ఆమె ఏ జబ్బుతో చనిపోయింది?'

'ఆమె ఆత్మహత్యచేసుకుంది ఫాదర్!'

'ఓ! ఆత్మహత్యా? అమ్మాయీ! నీకు తెలుసునోలేదో? చర్చి నిబం ధనలప్రకారం ఆత్మహత్య చేసుకున్నవారికి ఈవిధంగా అంత్యక్రియలుజరః డానికి వీల్లేదు. ఏదో తప్పనిసరి అయితే మధ్యవర్తుల కోరికపై అనుమతి తీసు కోవాలి. అప్పుడుమాత్రమే అంత్యసంస్కారానికి వీలవుతుంది. అదైనా ప్రత్యేకమైన సందర్భాలలోనే.'

'అందుకు అవసరమైన సర్టిఫికెట్లన్నీ నాదగ్గర వున్నాయి ఫాదర్! ఒకటి పోలీసువారు ఇచ్చింది, మరొకటి డాక్టరుఇచ్చింది, రెండూవున్నాయి. ఆమెకు చిత్తచాంచల్యం వుందని, సర్టిఫికెట్లు వ్రాసిఇచ్చారు ఫాదర్' అంటూ టమారా తనవద్దనున్న కాగితాలు మతగురువుకు ఇచ్చింది. అవును. ఆ సర్టిఫికెట్లు క్రిందటి సాయంత్రం, రియాసనోవ్ సంపాయించి, ఆమెకు

పంపించాడు. ఆ సర్టిఫికెట్లతోపాటు మూడు పదిరూబుల్స్ నోట్లుకూడా గురువుగారికి అందించింది. 'ఫాదర్! మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను. దయచేసి ఆమెకు జరగాల్సిన సంస్కారంఅంతా సక్రమంగా జరిపించండి. మీకెంతో పుణ్యంవుంటుంది. ఆమె సామాన్యమైన వ్యక్తిగాదు. అద్భుతమైన స్త్రీ. ఎన్నో బాధలుపడింది. కాబట్టి మీరు శ్మశానానికికూడా వెళ్ళి అక్కడ 'జేడియమ్' (పాశ్చాత్య చర్చిలలో పఠించే ఒకానొక ప్రసిద్ధ లాటిన్ ప్రార్థనాగీతం గానంచేయాలని నా కోరిక.'

'నేను శ్మశానానికి వెళ్ళడానికే వెడతాను. కాని రూల్సు ప్రకారం అక్కడ వ్యవహారం జరపడానికి నాకు అధికారంలేదు. అక్కడ వేరే పురోహితుడు వుంటాడు. అక్కడి తతంగంఅంతా అతనే జరపాల్సి వుంటుంది. చూడమ్మా! వీళ్ళందరికోసం నేను మళ్ళీ ఇక్కడికి రావాలి. అందుకని మరో పదిరూబుల్సుకూడా కలిపి ఇవ్వేం ?'

ఆయనకోరికప్రకారం మరో పదిరూబుల్సునోటుకూడా ఇచ్చింది టమారా. ఆ మొత్తండబ్బు అతను జేబులో భద్రపరచుకుని ప్రార్థనా గ్రంథం తెరచి చేత్తోపట్టుకున్నాడు. ఆశీర్వాదములు పఠిస్తూ శవపేటిక చుట్టూ ప్రదక్షిణంచేశాడు. తలదగ్గర నిలబడి విచారంగా, గద్గద స్వరంతో ఇలా ప్రార్థించాడు—

'ఓ ప్రభూ! సర్వకాలాల్లోనూ, సమస్త ప్రాణులలోనూ సర్వాంత ర్యామివై చరిస్తున్న ఓ ఈశ్వరా! ఓ నిత్యుడా! మమ్మలను కనికరించి ఆశీర్వదించు.'

జెన్నీ అంత్యసంస్కారాలు ప్రారంభమైనాయి. అక్కడున్నవారం దరికీ కొవ్వొత్తులు పంచిపెట్టారు. ప్రతివారూ తమతమ జ్యోతులు వెలిగించి పట్టుకున్నారు. బ్యాండువాయిద్యాలు ఒక్కసారిగా మ్రోగాయి.

మతాచార్యుడు, ఉపగురువు, భజనకీర్తనలు పఠించేఆయన, అంతా కలిసి శ్రావ్యంగా ప్రార్థనాగీతాలు పాడారు. మనోహరంగా, మధురంగా విచారసూచకంగా పాడిన ఆ గీతాలు భూమ్యాకాశాలు వ్యాపించాయి. పైనుంచి దేవతలు విషాదగీతాలు గానంచేస్తున్నట్లనిపించింది.

టమారా చాల శ్రద్ధగా ప్రార్థనలు వింటోంది. దుఃఖంతో వెగటుగా మందహాసంచేసింది. జెంకా మాట్లాడే బలీయమైన మాటలు,

రాశా నిస్పృహాలతో, అవిశ్వాసంతో అన్నమాటలు ఆమె మనసులో మెదిలాయి. 'సర్వశక్తిసంపన్నుడు, దయామయుడు అయిన ఈశ్వరుడు ంకొను రక్షిస్తాడా? ఆమె గడిపిన నికృష్టమైన జీవితాన్ని, చేసిన నీచపు పనులను క్షమిస్తాడా? ఒక భయంకరమైన వ్యభిచారిణి, ఒక దుర్మార్గురాలు మహాపాపి, నాస్తికురాలు, తిరుగుబాటుదారు, దేవుణ్ణి దూషించిన అమాయకురాలు, అబద్ధాలకోరు అయిన ఆమెను సర్వజ్ఞుడైన ఆ ఈశ్వరుడు కరుణిస్తాడా! ఓ ప్రభూ! దయామయా! నీ కృపయే మాకు ఆధారం!' అని తనలో ప్రార్థించుకున్నది టమారా.

స్త్రీలంతా హృదయవిదారకంగా 'ఓ జెన్‌చ్కా!' అంటూ పెద్దపెట్టున ఏడ్వసాగారు. తెల్లమంకా మోకాళ్ళమీదకూచుని నోటికి రుమాలు అడ్డుపెట్టుకుని వచ్చేదుఃఖాన్ని ఆపుకుంటోంది. తక్కినవేశ్యలందరూకూడా మోకాళ్ళమీద కూచుని వెక్కి వెక్కి ఏడుస్తున్నారు. మూలుగులు, ఎక్కిళ్లు ఏడ్పులు, నిట్టూర్పులు; వీటితో ఆ ప్రదేశమంతా ప్రతిధ్వనించింది.

ఆఖరుకు చిట్టచివరి గీతం పాడారు. 'ఆమె స్మృతిచిహ్నం శాశ్వతంగా వుండుగాక!' అంటూ పాడిన గీతం అది. పిమ్మట జ్యోతులన్నీ ఆర్పివేశారు. మతాచార్యుడు అందరూ ఎడబాసివెళ్ళిపోయే ప్రార్థనచేశాడు. అందరూ నిశ్శబ్దంగా, నిశ్చలంగా ఆ ప్రార్థన జరిపారు. ఆ తరువాత ఆయన చిన్న పారతో కొంచెం ఇసుకతీసుకుని శవపేటికమీద క్రాస్ గుర్తుపడేలా చల్లాడు.

వేశ్యలందరూ తమ స్నేహితురాలిశవంవెంట శ్మశానందాకా వెళ్ళారు. అప్పటికి మబ్బువిడిపోయి మంచి ఎండకాస్తోంది. శ్మశానంలో ఎక్కువగాతతంగంజరగలేదు. స్వల్పంలో అన్నిపనులూముగించి, చిన్నగుంట తవ్వారు. అందులో శవపేటికనువుంచి పైన మట్టిపోసి గోరీకట్టారు.

'దీంతో అంతా అయిపోయినట్లే.' అంది టమారా తన స్నేహితురాండ్రతో. 'నేను జెంకాను ఎన్నటికీ మరచిపోలేను. ఆమెలాంటిమనిషిని మనం ఎన్నడూ చూడం. అమ్మాయిలూ! జెన్నీమరణానికి మనమంతా విచారిస్తున్నాం. కాని బ్రతికివున్న మనకంటే చచ్చిన ఆమే పుణ్యాత్మురాలు. మనం బ్రతికి ఇక్కడ ఈ యమకూపంలో కొట్టుకుంటున్నాం. ఆమె చచ్చి సుఖంగావుంది. ఇహ మనం చివరిసారి క్రాస్ చేసుకుని ఇంటికి వెడదాం పదండి.'

పడుపుకత్తెలంతా ఇంటిముఖం పట్టారు. ఇల్లు సమీపిస్తూవుండగా అకస్మాత్తుగా టమారా ఇలా అంది. ఆమె వాక్కులు అతివిచిత్రంగా, అద్భుతంగా, భవిష్యత్తును సూచిస్తున్నట్లుగా వున్నాయి.

'అమ్మాయిలూ! ఇహ మనం ఎంతోకాలం ఇక్కడ కలిసివుండం. గాలికి కొట్టుకుపోయినట్లుగా మనమంతా తలకొక దిక్కుకు చెదరిపోతాం. తప్పదు! జీవితం ఎంతమంచిది! చూడండి! ఆ వినీలాకాశం, ఆ సూర్యబింబం ఎలావున్నాయో చూడండి! స్వచ్ఛమైన గాలి వీస్తోంది. చూడండి! చుట్టూ సాలెపురుగులు గూళ్ళు అల్లుకుంటూ ఎగురుతున్నాయి—దీన్నే వాళ్ళు హిందువుల వేసవికాలం అని పిలుస్తారు! ప్రపంచం చాల సుందరమైనది! మనంమాత్రమే, కేవలం మనంమాత్రమే పతితలమై, భ్రష్టలమై, రండలమై రోడ్డుపక్కకు నెట్టిన పెంటపోగులకుమల్లే ఇక్కడ పడివున్నాం! మనకష్టాలు ఇహ ఎక్కువకాలం ఉండవులే! ఈ పాపం పండకపోదులే!' అంటూ టమారా గంభీరంగా పలికింది.

# 10

టమారా అన్నమాటలు అక్షరాల నిజమైనాయి. జోస్యంచెప్పిన దైవజ్ఞుడి వాక్కుల్లా ఆమె వాక్కులు రుజువైనాయి. జెన్నీ మరణించిన తరువాత రెండువారాలయినా తిరక్కముందే అనేక అవాంతరాలు వచ్చి పడ్డాయి. ఆ కొద్దిరోజులలోనే ఎమ్మాఇంట్లో గడిచిన అయిదు సంవత్సరాలలో ఎన్నడూ జరుగని విషాదసంఘటనలు అనేకం జరిగాయి.

జెన్నీఅంత్యక్రియలు అయిపోయిన మరుసటిరోజే, అభాగ్యురాలైన పాషాకును పిచ్చాసుపత్రికి పంపించారు. అక్కడ డాక్టర్లు ఆమెను పరీక్షచేశారు. ఇహ ఆమె కోలుకోదని స్పష్టంగా చెప్పారు. క్రింద ఒక గడ్డి పరుపు పడేసి దానిమీద ఆ పిల్లను పడుకోబెట్టారు. ప్రాణం పోయేంత వరకూ ఆమె అక్కడే పడుంది. పూర్తిగా పిచ్చిదైపోయింది. క్రమక్రమంగా శుష్కించిపోయి మొహానికి ప్రేతకళవచ్చింది. నెలలతరబడి కదలకుండా పక్కమీద పడివుండడంవల్ల ఆమెవంటినిండా భయంకరమైన పుండ్లు

పడ్డాయి. రక్తం చెడిపోయింది. అలా తీపులు, నరాలపోటుతో యమ యాతన అనుభవించి ఆ తరువాత ఆరు నెలలకు చనిపోయింది.

తరువాత టమారా అదృశ్యమయింది.

రెండువారాలు ఆమె ఎమ్మాఇంట్లో పెత్తనంచేస్తూ తన పనులన్నీ సక్రమంగా నిర్వర్తిస్తూ ఉల్లాసంగా, ఉత్సాహంగాపనిచేసింది. కాని అన్ని రోజులూకూడా ఆమెమనసులో ఏవో ఊహలు, ఆలోచనలు రహస్యంగా పనిచేస్తూనే వున్నాయి. పిమ్మట ఒకనాటి సాయంత్రం ఇంట్లోంచి హఠాత్తుగా అదృశ్యమైపోయింది. మళ్ళీ రానేలేదు.

అది ఈవిధంగా జరిగింది. ఆమె ఒక ప్రసిద్ధమయిన లాయరుతో సంబంధం పెట్టుకుని రహస్యంగా ప్రేమకలాపాలు సాగిస్తూవచ్చింది. అతను మధ్యవయస్కుడు. బాగా డబ్బున్నవాడు. కాని పిల్లికి బిచ్చం పెట్టని పిసినిగొట్టు. టమారా ఒక ఏడాది క్రిందట సన్యాసినుల మఠానికి వెడుతూ నీపర్ నదిలో స్టీమరుమీద ప్రయాణంచేస్తున్నప్పుడు అతన్ని కలుసుకుంది. ఈమె అందానికీ, చమత్కారమయిన మాటలకూ, మునిమునినవ్వులకూ ముగ్ధుడై ఆ లాయరు వల్లోపడ్డాడు. ఇంకేం? ఈమె అతన్ని తన బానిసగా చేసుకుని, అవసరాలు తీర్చుకుంటూ, ఉపయోగించుకోసాగింది. అతను ఉన్నతకుటుంబంలోంచి వచ్చినవాడు. బాగా చదువుకున్నవాడు, మంచివాడు. ఇప్పుడిప్పుడే అతనికి తల నెరుస్తూవుంది. టమారా తన అసలు వృత్తాంతం అతనిదగ్గర బయటపెట్టలేదు. తనొక పడుపుకత్తెగా జీవిస్తున్నాననీ చెప్పలేదు. మాటలసందర్భంలో తనొక వివాహితననీ, మధ్యతరగతి కుటుంబానికి చెందినదాననన్నీ చెప్పింది. తన భర్త జూదరిఅనీ, ఎప్పుడూ తనను పీడిస్తుంటాడనీ, అంచేత సంసారసుఖం లేదనీ చెప్పింది. తనకు భగవంతుడు సంతానంకూడా ప్రసాదించలేదని వెలిబుచ్చింది. ఆ సాయంత్రం తనతో గడపవలసిందని అతను కోరాడు. కాని ఆమె ఒప్పుకోలేదు. బెట్టు చేసింది. మళ్ళీ ఎప్పుడూ కలుసుకోవద్దని చెప్పింది. కాని ఆ లాయరుకు ఈమెమీద మోజు జాస్తిఅయి కాళ్ళావేళ్ళాపడడం ప్రారంభించాడు. చివరకు ఆమె తనకు జాబువ్రాయమని చెప్పింది. దొంగపేరుచెప్పి, ఆపేరుతో జనరల్ పోస్టాఫీసు కేరాఫ్‌కు జాబు వ్రాయమని కోరింది. అలాచెప్పి ఆమె వెళ్ళిపోయింది. తరువాత లాయరు ఆమెకు ఉత్తరాలు వ్రాయడం మొద

లెట్టాడు. తన బాధంతా వెళ్ళబోసుకుంటూ ప్రేమలేఖలు వ్రాయసాగాడు. ఆమెకూడా తన దొంగపేరుతో అతనికి జవాబులు వ్రాస్తూవచ్చింది. ఇలా రహస్యంగా కొంతకాలం ఇద్దరిమధ్యా ఉత్తరప్రత్యుత్తరాలు జరిగాయి. అప్పుడప్పుడు టమారా అతన్ని కలుసుకుంటూ, తనొక ఇల్లాలుమాదిరిగానే వ్యవహరిస్తూవచ్చింది.

పిమ్మట కొద్దికాలానికి ఒక పార్కులో అతన్ని కలుసుకోడానికి ఆమె అంగీకరించింది. ఉత్సాహంగా అతనితో తిరిగింది. తీయనికబుర్లు చెప్పింది. కులుకుతూ వగలాడితనమంతా వెళ్ళబోసింది. కాని తీరా అతను రాత్రికి తనతో ఎక్కడికైనా రమ్మని అడిగేసరికి, నిరాకరించింది.

ఈవిధంగా ఆమె తనను వలచివచ్చిన లాయరును వేస్పుగా పట్టుకొస్తూ, రోజురోజుకు తనమీద వ్యామోహం ఎక్కువయ్యేలా చేస్తూ, అతన్ని హింసించసాగింది. ఆఖరుకు వేసవిలో అతనికుటుంబం దూరదేశానికి వెళ్ళడం తటస్థించింది. అప్పుడు అతన్ని కల్సుకోవడానికి ఆమె అంగీకరించింది. వారిద్దరూ అంత ఏకాంతంగా కల్సుకోవటం అదే మొదటిసారి. టమారా సామాన్యురాలా? ఈసారికూడా చాల జాగ్రత్తగా వ్యవహరించింది. చక్కనిచూపులతో, తీయని మాటలతో, పైపై వలపుతో అతన్ని మురిపించి మరపించింది. అతనంటే పంచప్రాణాలని చెపుతూ కంటతడిపెట్టింది. కాని అసలు వ్యవహారందగ్గరకొచ్చేసరికి అంటకూడ దన్నట్లు, జాగ్రత్తగా తప్పించుకొంటోంది. పాపం! ఆ వృద్ధుడికి ఈమె వ్యవహారం చూస్తోన్నకొద్దీ పిచ్చెక్కుతోంది. మతి పూర్తిగాపోతోంది. ఎందుకో ఎన్నడూ ఎరగని మోజు ఆమెమీద పుట్టుకొస్తోంది. రానురాను అతను ఆమెకు బానిస అయిపోయాడు.

ఆ తరువాత మరొకసారి అతను తనఇంటికి రమ్మని అడిగినా ఈమె అంగీకరించలేదు. కాని అతను ఇచ్చినపూలు తీసుకుంది. నగరం వెలుపలవున్న రెస్టారెంటులో అతనితోకలిసి ఫలహారంచేయడానికి, షికారువెళ్ళడానికి అంగీకరించింది. ఇంతచేస్తున్నా ఆమె, అతనినుండి ఎటువంటి విలువైన బహుమతులూ తీసుకోవడంలేదు. ఆ విషయంలో అతిజాగ్రత్తగా, తెలివిగా వ్యవహరిస్తూ, గంభీరంగా వుంటూవచ్చింది. అంచాత లాయరు ఆమెకు ఎన్నడూ డబ్బివ్వడానికి సాహసించలేకపోయాడు, ఒకసారి అతను,

వేరే ఇల్లు తీసుకుని అన్ని వసతులు ఏర్పాటు చేస్తానని ఆమెతో అన్నాడు. పాపం సంకోచిస్తూనే అన్నాడా మాటలు. వెంటనే టమారా అతని కళ్ళల్లోకిచూచింది. అంతే! ఆమెచూపులు ఎంతో బరువుగా, బలంగా, తీవ్రంగా అతనికి తగిలాయి. పాపం అతను పసివాడిలా అయిపోయాడు. నెరిసిన అతని తలలో అమాయకత్వం ఆవరించింది కుర్రాడికిమల్లే భయపడ్డాడు. తత్తరపాటుతో ఆమెచేతులు పదేపదే ముద్దు పెట్టుకుంటూ క్షమాపణలు చెప్పసాగాడు.

తానొక స్థిరమైన సంకల్పానికి వచ్చేంతవరకూ, తనిపని నెరవేరడానికి కావల్సిన వీలు చిక్కేటంతవరకూ, టమారా అతనితో ఇలాగే నటిస్తూ వచ్చింది. అతని ఇనప్పెట్టెలో పెద్దమొత్తంలో పైకం ఎప్పుడెప్పుడు వుంటుందో ఆమె కనిపెట్టింది. అయినా ఆమె తొందరపడకుండా, తొణకకుండా సమయంకోసం ఎదురుచూస్తూవచ్చింది. అప్పను. తొందరపడితే తన వ్యవహారమంతా, చేసిన కృషియంతా నాశనం అయిపోతుందని భయపడింది.

చివరకు ఆమె ఎంతో కాలంనుంచి ఎదురుచూస్తున్నరోజు వచ్చింది. ఆ శుభసమయం అసన్నమైంది నగరంలోవున్న కంట్రాక్టర్లందరూ తమతమ లాయర్లతో అగ్రిమెంట్లు వ్రాయించుకుని, లావాదేవీలు ముగించుకుని పెద్ద మొత్తాలలో ఫీజులు చెల్లించారు. ఈ లాయరుకుకూడా చాలాడబ్బు వచ్చివుంటుందని టమారాకు తెలుసు. ఇనప్పెట్టెలోవున్న డబ్బంతాతీసుకుని శనివారంనాడు బ్యాంకులోకట్టడానికి వెడతాడనికూడా ఆమె ఎరుగును. అలా చేసి అతను ఆదివారంనాడు రికామీగావుంటాడు. అందుకని టమారా శుక్రవారంనాడు మధ్యాహ్నమే అతనికి చేరేలా ఒకజాబు వ్రాసింది.

'నా ప్రియమైన రాజాకు. మీరు నిజంగా ప్రభువు సాలొమన్‌ను మించిన మేధావులు! మీ రాణి, మీ దాసిత్కుగుత్తి, మిమ్మల్ని మననూత్రిగా ఆహ్వానిస్తోంది. మీకు ముద్దులు అందిస్తోంది. నా ప్రియమైనప్రియా! మైడార్లింగ్! ఇవాళ నాకు సెలవురోజు. నాకు ఎంతసంతోషంగావుందో మాటలతో వర్ణించలేను. పనేమీలేక ఖాళీగావున్నాను. 'ఆయన' తన వ్యాపారంమీద ఎక్కడికో వెళ్ళాడు. ఆదివారంవరకూ రాడు. అంచేత నేను ఇవాళ సాయంత్రంఅంతా మీతో గడపాలనుకున్నాను. ఈ రాత్రి 'అంతా'కూడా మీ దగ్గరే వుండాలనుకుంటున్నాను. ఓ! నా ప్రేమమూర్తీ!

నా జీవితమంతా మీతో గడిపినట్లయితే ఎంత హాయిగావుంటుంది! నాకు ఎక్కడికీ వెళ్ళాలనిలేదు. హోటళ్ళూ, నైట్ క్లబ్బులూ తిరిగి తిరిగి విసుగు పుట్టింది. మొహంమొత్తింది. నాకు కావలసిందల్లా మీరు...మీరు...మీరు మాత్రమే! నా మధురమూర్తీ, ఇవాళ రాత్రి పదకొండుగంటలకల్లా నేను అక్కడికి వస్తాను. నాకోసం ఎదురుచూస్తుంటారుకదూ! కొన్ని మంచిరకం ఖర్జూరపండ్లు, చల్లని తెల్లవైనూ, వీలైతే తెప్పించివుంచండి. ఓ! కామం నా శరీరమంతా దహించివేస్తోంది. కామంతో చచ్చిపోతున్నాను. మిమ్మల్ని ఇప్పటికే ఎంతో బాధపెట్టానని అనుకుంటున్నాను. ఇహ ఆలస్యంచేయను. చేయలేను ప్రియా! నా తల తిరిగిపోతోంది. నా మొహం కాలిపోతోంది. నా చేతులు చల్లగా మంచుగడ్డల్లా అయిపోయాయి. మిమ్మల్ని గాఢాలింగనం చేసుకోవాలి. అప్పుడుగాని......ఇట్లు, మీ, వాలెంటీనా.'

ఈ జాబు చదువుకుని లాయరు ఆరాత్రి ఆమె రాకకోసం ఎదురు చూస్తున్నాడు. అనుకున్న వేళకు టమారా వచ్చింది. రాగానే అతని యోగ క్షేమాలు విచారించి తెలివిగా మాటల్లోకి దింపింది. అతని వ్యాపారం ఎలా వుందనీ, ఒడుదుడుకులు లేకుండా సుఖంగా జరుగుతోందా అనీ, మాటల సందర్భంలో అడిగింది. ఆ అమాయకుడు తన స్థితిగతులు బాగావున్నాయని చెప్పాడు. తన ఫైళ్ళు, రికార్డు, అంతా ఆమెకు చూపించాడు. చివరకు ఆమెను తన ఆఫీసుగదిలోకి తీసుకుపోయి ఇనప్పెట్టెకూడా తెరచి చూపించాడు. టమారా అతివేగంగా దృష్టి నిగిడ్చి, ఇనప్పెట్టెలో వున్న అరలన్నీ పరిశీలించి చూచింది. తరువాత అవతలకుమళ్ళి బద్ధకంగా ఆవులిస్తూ ఇలా అంది.

'అబ్బ! బద్ధకంగా వుందండీ!'

అలాఅంటూ ఆమె తనరెండుచేతులూ అతనిమెడకు చుట్టింది. నోట్లో నోరుపెట్టి రహస్యంగా ఇలా అంది.

'దగ్గరికి జరగండి ప్రియా! ఆ పాడు ఇనప్పెట్టెసంగతిఇప్పుడెందుకు? దానికి తాళంవేసి ఇలా రండి! అబ్బ! త్వరగా రండి ప్రియా!'

ఆమె ఉచ్ఛ్వాస నిశ్వాసాలు వెచ్చగా, అతని పెదవులమీద పడుతున్నాయి.

అతనికంటె ముందుగా ఆమె భోజనశాలలోకి వెళ్ళింది. 'రండి

హలో డార్లింగ్!' అని పిలిచింది. 'ఏం తెప్పించారు? నాకు వైన్ కావాలి, తరువాత ప్రేమ కావాలి—ప్రేమ, ప్రేమ, ప్రేమ! ఇదుగో! సేవించండి.' అంటూ ఆమె అతనికి వైనుగ్లాసు అందించింది. 'చుక్క కూడా మిగలకుండా తాగేసెయ్యండి! ఈ రాత్రి, ఈ చల్లనిరాత్రి, ఈ చక్కనిరాత్రి, మన ప్రేమకు చిహ్నంగా అలాగే తాగాలి!'

ఇద్దరూ గ్లాసులు తాకించుకున్నారు. అతను ఒక్కగుక్కలో గ్లాసెడు వైనూ తాగేశాడు. తరువాత కొంచెంసేపు ఆగి ఇలా అన్నాడు.

'ఏమిటిది?...వింతగావుందే!... ఈవైను ఎందుకనో చేదుగావుంది.'

'అవును. మీరుచెప్పింది నిజమే.' ఆమె అంగీకరిస్తూ అతనివంక నిశ్చలంగా చూచింది. 'ఈవైను ఎప్పుడూ కొంచెం వగరుగా, చేదుగా వుంటుంది. రైన్‌వైన్సు అన్నీ ఇలాగే వుంటాయి.'

'ఇది మరీ చేదుగావుందే.' అన్నాడతను మళ్ళీ 'వద్దు ప్రేయసీ! ఇహ నాకొద్దు. నేను తాగలేను.'

ఓ అయిదునిముషాల తరువాత అతను పడకకుర్చీలో పడుకుని గాఢంగా నిద్రపోతూ తల వెనక్కు వేళ్లాడవేశాడు. అతని కిందిదవడ ఒక పక్కకు వాలిపోయింది. టమారా కొంచెంసేపు ఆగి, ఆతరువాత అతన్ని మేలుకొల్పడానికి ప్రయత్నించింది. అతను కదలలేదు, మెదలలేదు. మైమరచి నిద్రపోతున్నాడు. అప్పుడామె ఒకకొవ్వొత్తి వెలిగించి కిటికీలో పెట్టింది. కిటికీలోంచి వీధిలోకి చూచింది. పిమ్మట ఆమె నడవలోకి వెళ్ళి నిశ్శబ్దంగా ఏదో వింటూ నిలబడింది. కొద్దిక్షణాలలో ఎవరో మెల్లగా మేడమెట్లు ఎక్కుతున్నట్లు ఆమెకు వినిపించింది. వెంటనేవెళ్ళిచప్పుడుకాకుండా తలుపు తీసింది. 'శంకా' లోపలికి వచ్చాడు. గొప్ప మర్యాదస్తుడికిమల్లే దుస్తులు ధరించివున్నాడతను. అతనిచేతిలో సరికొత్త 'సూట్‌కేసు ఒకటి వుంది.

'అంతా సిద్ధమేనా?' రహస్యంగా అడిగాడు ఆ వ్యక్తి.

'ఆ! అతను వళ్ళుతెలీకుండా నిద్రపోతున్నాడు.' ఆమెకూడా రహస్యంగానే జవాబుచెప్పింది—'ఇవిగో! తాళపుచెవులు.'

ఇద్దరూ కలిసి ఆఫీసుగదిలోకి వెళ్ళారు. అక్కడే ఇనప్పెట్టె వుంది.

శంకా టార్చిలైటు వేసి ఇనప్పెట్టె తాళం పరీక్షించాడు. ఆ తరువాత మెల్లగా ఇలా గొణిగాడు.

'వాడి దుంపతెగ, ముసలితొత్తుకొడుకు! దీని కిలాంటి తాళంవేశాడే. ఇది మామూలు తాళం కాదు. అక్షరాలు కలిపితేగాని ఇది రాదు. లేదా ఎలెక్ట్రిసిటీ సహాయంతో ఊడతీయాలి. గాడిదకొడుకు! ఎంత చిక్కు పెట్టాడు దేవుడా! దీన్ని తీసేసరికల్లా పుణ్యకాలం పోయి తెల్లవారుతుంది.'

'ఏం అక్కర్లేదు.' వెంటనే అంది టమారా.

'ఏ ఏ అక్షరాలు కలిపితే ఆ తాళం వస్తుందో నాకు తెలుసు జడ్-ఇ-యన్-ఐ-టి, కలపండి వస్తుంది.'

పది నిముషాలతరువాత ఇద్దరూ మేడ దిగి క్రిందికి వచ్చారు. బుద్ధి పూర్వకంగా, వీధులకు అడ్డంగాపడి అనేక గొందులు, సందులు తిరిగారు. చివరకు పాతపట్నం చేరి అక్కడ బండి మాట్లాడుకుని, నగరం వదిలిపెట్టి సరాసరి స్టేషనుకు వెళ్ళిపోయారు. వారివద్ద ఫోర్జరీచేసిన దొంగ ప్యాసుపోర్టులున్నాయి. చాలా తెలివిగా ఫోర్జరీచేశారు. వారిద్దరూ భార్యా భర్తలనీ, స్టావిట్స్కికి చెందిన భూస్వాములనీ, ప్యాసుపోర్టులలో ఉదహరించారు. చాలా కాలంవరకూ వారు ఏమయిందీ ఎవరికీ తెలియలేదు. ఒక ఏడాదితరువాత మాస్కో నగరంలో జరిగిన ఒక పెద్ద దోపిడిలో 'శంకా' పట్టుబడ్డాడు. పోలీసువిచారణలో టమారాసంగతికూడా బయటపడింది. ఇద్దరినీ కోర్టులో విచారించారు. చివరకు ఇద్దరికీ శిక్షపడింది. జైలుకు పోయారు.

ఆవిధంగా టమారా తప్పించుకుపోయి అంతమైంది. తరువాత అమాయకురాలు, కామిని, మోహిని అయిన 'వెర్కా' వంతు వచ్చింది. ఆమె కొంత కాలంనుంచీ యుద్ధశాఖలో పనిచేస్తున్న ఒక సివిల్ ఉద్యోగిని ప్రేమిస్తోంది. అతని పేరు 'డలెక్టొరొస్కీ' నిజానికి ఆమెమీద అతనికి అంత వ్యామోహంలేదు. ఈ పిల్లే అతనంటే పడిచస్తోంది. అతన్నొక దేవుడులా కొలుస్తోంది. మొదట్లో ఆ విషయం ఆమె గ్రహించలేదుగాని, కాలంగడిచిన కొద్దీ, చివరకు వేసవి వచ్చేసరికి అతనిలో ఒక రకమైన మార్పు రావడం గమనించింది. ఆమెఅంటే అతను నిర్లక్ష్యంచేస్తూవచ్చాడు. ఏమిటి కారణమని ఆమె అనేకసార్లు గుచ్చి గుచ్చి అడిగింది. కాని అతను సవ్యంగా సమాధానం చెప్పలేదు. ఏవేవో అర్థంలేని సాకులుచెపుతూ మొహంతప్పించి

తిరుగుతూవచ్చాడు. అతని ప్రవర్తన చూస్తున్నకొద్దీ ఆమెలో ఆవేదన ఎక్కువైంది. అనుమానం కలుగసాగింది. తనలో తాను బాధతో కుమిలిపోతూ వచ్చింది. అడగ్గాఅడగ్గా చివరకతను తన నేరం చిక్కుల్లోవున్నానని చెప్పాడు.

ఆఖరుకు సెప్టెంబరునెల మొదట్లో అతను అసలు విషయం బయట పెట్టాడు. అంతా ఆమెతో నివేదించుకున్నాడు. తన స్వాధీనంలోవున్న గవర్నమెంటు సొమ్ము, దాదాపు మూడువేల రూబుల్సు అక్రమంగా అపహరించాననీ, అయిదారు రోజులలో లెక్కలతనిఖీ జరుగనున్నదనీ చెప్పాడు. తనకు నలుగురిలో అవమానం తప్పదనీ, తను చేసిన నేరానికి విచారణ జరిపి కఠినశిక్ష విధించడం ఖాయమనీ మొత్తుకున్నాడు. ఆమె చెపుతూ చెపుతూ తలమీద చేతులు పెట్టుకుని ఆ ఉద్యోగి గోడుగోడున దుఃఖించాడు.

'మా అమ్మ—నన్నుకన్నతల్లి—ఆమెగతి ఏంకావాలి! ఇది వినగానే ఆమెగుండె పగులుతుంది! వీల్లేదు! ఈ అమాయకుడు ఇలా హింసపడడం కంటె చావడం వేయిరెట్లు నయం!' అంటూ అతను వాపోయాడు.

నవలల్లో, నాటకాల్లోవలె ఆవిధంగా అతను తనబాధను వర్ణించి చెప్పాడు. దాంతో వెర్కామనసు అతనికి పూర్తిగా స్వాధీనమైంది. అవును ఆమె అసలే కల్ల, కపటం ఎరుగనిమనిషి. ప్రియుడు ఆత్మహత్య చేసుకుంటా ననేసరికి ఆమెకు అతనిమీద మరీ మమకారం ఎక్కువైంది. అతనికికూడా నాటకాలలో మాదిరి ఆత్మహత్యచేసుకోవాలనే ఈ అద్భుతమైన ఆలోచన తట్టినతరువాత, అది అతనిమనసులో పాతుకొనిపోయింది.

ఒకనాడు వీరిద్దరూ పార్కులో కలుసుకున్నారు. ఇద్దరూ నడచి వెళుతున్నారు. ఆకులురాలేకాలం అప్పటికే తనప్రతాపం చూపించడం మొదలెట్టింది. చెట్లనుండీ, తీగెలనుండి ఆకులు రాలుతున్నాయి. అక్కడక్కడమాత్రం స్వల్పంగా ఆకులు మిగిలివున్నాయి. వాటిమీదనుంచివచ్చే గాలి పాతపడిన సారాయివాసనకొడుతోంది. అయినప్పటికీ చల్లనిగాలి చెట్లమీదనుంచి, పొదల్లోంచి, పచ్చికనుంచి, మెల్లమెల్లగా వీస్తూనేవున్నది.

డిలెక్టోర్‌స్కీ చాలా నీరసపడిపోయాడు. గుండెబేజారయి కుమిలి పోతున్నాడు. పెద్దపెట్టన ఏడ్వనారంభించాడు. అతనితోపాటు వెర్కా కూడా దుఃఖించింది.

'ఇవాళ నేను ఆత్మహత్య చేసుకుంటాను!' అన్నాడతను బిగ్గరగా 'దాంతో నా కష్టాలన్నీ గట్టెక్కుతాయి.'

'వద్దు ప్రియా! అలా ఎన్నటికీ చెయ్యొద్దు' అంది ఆమె దీనంగా.

'అలా కాదు. అది జరిగితీరాల్సిందే.' అన్నాడతను కటువుగా 'ఆ పాడు డబ్బు! మనిషికి కావల్సింది ప్రాణమా లేక గౌరవమా?'

'ప్రియా!...ప్రియా!...డార్లింగ్!'

'ఇహ మాట్లాడకు, ఇహ మాట్లాడకు అనెట్టీ!' (ఏదో కారణాన అతను ఆమెను వెర్కా అని పిలువకుండా, ఎప్పుడూ అనెట్టీ అనే పిలుస్తుంటాడు) 'నీవేం మాట్లాడకు. నేను ఆ నిశ్చయానికి వచ్చాను.'

'నేను చేయదగిన సహాయం ఏమైనా వుంటే చెప్పండి!' అంది వెర్కా విచారంగా. 'మీకోసం సంతోషంగా నా ప్రాణాలు ఇస్తాను! నాలో వున్న ప్రతి రక్తబిందువు కూడా మీకే అర్పిస్తాను ప్రియా!'

'ఏం జీవితం!' అన్నాడతను తిరిగీ మొహం చిన్నబుచ్చుకొని 'సెలవు అనెట్టీ! శాశ్వతంగా సెలవు తీసుకుంటున్నాను.'

ఆమె నిరాశతో తలూపింది.

'అలా అంటే నేను ఒప్పుకోను. నేను మిమ్మల్ని వదలిపెట్టి వెళ్ళిపోలేను. వీల్లేదు! వీల్లేదు! నన్నుకూడా మీ వెంటే తీసుకెళ్ళండి! మీతోనే చస్తాను!'

'అతను ఖరీదైన ఒక హోటల్లో గది తీసుకున్నాడు. ఇంకొ కొద్దిగంటలలోనో, లేక ఇంకొ తొందరగానో, తనూ వెర్కా చావడం తథ్యమని అతనికి తెలుసు. అతని జేబులో పదకొండు కోపెక్కులు మాత్రమే ఉన్నాయి. అయినా చాలా ఖరీదైన భోజనానికి ఆర్డరిచ్చాడు. పండ్లు, కాఫీ, బ్రాందీ, రెండు బుడ్లు షాంపేన్; ఇవన్నీ పట్టుకురమ్మని ఉత్తర్వు చేశాడు. కొద్దిసేపట్లో కాల్చుకుని చచ్చిపోవడానికి అతను అణుమాత్రం సందేహించడం లేదు. పైగా తను చేసిన సాహసకృత్యానికి స్నేహితులు, బంధువులు, తోటి ఉద్యోగులు అందరూ మెచ్చుకుంటారనీ, ఆశ్చర్యపోతారనీ అనుకున్నాడు. తను చచ్చిపోతున్నాననే చింత ఏకోశానా లేదు. ఏ క్షణంలో అయితే అతనితోపాటు తనూ చావడానికి సిద్ధంగా వున్నానని చెప్పిందో, ఆ క్షణంనుంచీ మళ్ళీ ఆ నిశ్చయాన్ని మార్చుకోలేదు.

తన ప్రియుడితోపాటు మరణించడానికి ఆమెకెంతో హాయిగావుంది. మృత్యువంటే ఆమెకు భయంకలగడంలేదు. 'ఈవిధంగా చావడం ఎంతో ఉత్తమం. ఏ సానికొంపల్లోనో, మురుగుగుంటల్లోనో చావడంకంటే, కనీసం నా ప్రియుడితోపాటు మరణించడం ఎంతో మంచిది.' అనుకుంది ఆమె తనలో. ఆమె తన ప్రియుణ్ణి అనేకసార్లు బలంగా ముద్దుపెట్టుకుంది. ఆమె ఇప్పుడు ఎంతో అందంగా ఉల్లాసంగా అగుపిస్తోంది. ఎన్నడూ అగుపించని కళ ఇప్పుడామెలో కనిపిస్తోంది. ఆమె వంకులొంకులజుట్టు రేగిపోయివుంది. ముంగురులు మొహంమీద పడుతున్నాయి. కళ్ళు మిలమిల మెరుస్తున్నై.

ఎట్టకేలకు ఆ ఆఖరు ఘడియ—ఆ పవిత్ర క్షణం వచ్చింది.

'నీవూ నేనూ, మనిద్దరం ఆనందం అనుభవించాం అన్నెట్టి. జీవితం అనే పాత్రతో సుఖమనే మధువును గ్రోలాం! పాత్ర ఖాళీఅయింది. ఇహ దీన్ని పగులగొట్టడమే తరవాయి. పగులగొట్టేద్దాం! ప్రేయసీ! ఇలా జరుగనున్నందుకు విచారించవుకదూ?' అనడిగాడతను.

'లేదు లేదు. ఏమాత్రం విచారించటంలేదు.

'అయితే నీవు సిద్ధంగా వున్నావా?'

'ఆ...సిద్ధం.' ఆమె మెల్లగా అంటూ మందహాసంచేసింది.

'అయితే ఆ గోడవైపు తిరిగి కళ్ళు మూసుకో.

'ఓ! అలాకాదు ప్రియా! అలా వీల్లేదు. నాదగ్గరకు రండి. అక్కడ! బాగా దగ్గరగా, ఇంకా దగ్గరకు రండి. మీ కళ్ళు ఇలా తిప్పండి. ఆ కళ్ళల్లోకి చూడాలనివుంది. మీ పెదవులు అందించండి. నాకు ముద్దుపెట్టుకోవాలనివుంది. నాకేం భయంలేదు. మీరూ ధైర్యంగానే ఉండండి. నన్ను బలంగా, గట్టిగా ముద్దుపెట్టుకోండి!'

అతను ఆమెను చంపేశాడు. ఆ తరువాత ఆమెను చూచేసరికి అతన్ని భయం ఆవరించింది. అసహ్యమైన, అతిదుష్టమైన, నీచమైన భయం అతన్ని చుట్టుముట్టింది. అతని కాళ్ళు కుప్పగా కూలిపోతున్నాయి. అయినా అతని మనస్సు—దుర్మార్గుడు, మోసగాడు, పిరికిపంద అయిన అతనిమనస్సు అంతా కనిపెడుతూనేఉంది. పక్కకు ఒత్తిగిలి తుపాకి విసనొక్కడానికి అతనికి ధైర్యంలేకపోలేదు. తరువాత అతను బాధతో, తుపాకి పేలిన పెద్దచప్పుడువల్ల కలిగిన భయంతో, మూలుగుతూ కిందికి ఒరిగి

పోయాడు. అప్పు డతని పక్కనవున్న వెర్కా దేహం చివరిసారి అటూ ఇటూ చలించింది.

వెర్కా మరణించిన రెండువారాలలోనే, సాధుస్వభావంగల తెల్ల మంకా, ఎప్పుడూ నవ్వుతూ వుండే ముసలిమంకా—వీరిద్దరూకూడా ఒక పెద్ద పోట్లాటలో చనిపోయారు. యామ్‌స్కాయాలో అప్పుడప్పుడు కలహాలు జరగడం మామూలేగా. అలాగే జరిగిన ఒక కొట్లాటలో ఎవరో పెద్ద పెద్ద సీసాలు తీసుకొని వీరి తలలమీద బలంగా కొట్టారు. ఆ చంపినమనిషి ఎవరో అప్పటికీ ఇప్పటికీకూడా పట్టుపడలేదు.

ఎమ్మాయింట్లో జరిగిన ఈ దురదృష్టసంఘటనలు అంతటితో ఆగిపోలేదు. ఆ తరువాత వెంటనే అక్కడవున్న ఇతర కొంపలకు కూడా ఇలాంటి దుర్గతే పట్టింది.

అసలు ముఖ్యంగా ఇంతటి ఘోరమైన విపత్తులు, భయంకరమైన సంఘటనలు జరగడానికి, ఇంత సంక్షోభం పుట్టడానికీ సోల్జర్లు యామ్‌స్కాయామీద జరిపిన దండయాత్రే కారణం.

ఇద్దరు సైనికులు గుర్రాలమీద ఎక్కి యామాకు వచ్చారు. ఒక రూబులు పుచ్చుకునే సానికొంపలో ప్రవేశించారు. కాని వారివద్ద తగినంత డబ్బులేదు. డబ్బు ఇవ్వకుండానే ఇంట్లోప్రవేశించి సానులతో పిచ్చి పిచ్చి ప్రేమకలాపాలు సాగించారు. అందుకని ఇంట్లోవున్న కాపలా వాళ్ళు, పనిమనుషులు వాళ్ళమీదపడి చావచితకగొట్టి వీధిలో పడేశారు. చిరిగిపోయిన దుస్తులతో, వళ్ళంతా గాయాలుపడి రక్తం కార్చుకుంటూ, వాళ్లు సిపాయిలుండే స్థావరానికిచేరుకున్నారు. ఆరోజు సిపాయిలందరికి సెలవు. ఏటేటా జరుపుకునే ఉగాదిఉత్సవం జరుపుకుంటున్నారు. మిత్రులకుజరిగిన ఈ పరాభవం సిపాయిలందరూ తెలుసుకున్నారు. ఇంకేముంది? ఒక అర గంటతరువాత దాదాపు వందమంది సైనికులు ఊరకలు వేస్తూ, పరుగులుతీస్తూ యామాలో వచ్చి పడ్డారు. కనిపించిన ప్రతి ఇంటిమీదాపడి ధ్వంసంచేయ నారంభించారు. ఇదే సందు అనుకుని, వాళ్ళతో రౌడీలు కేడీలు, తుంటరులు, జూదగాళ్ళుకూడా చేతులుకలిపారు. ఇంకేం? అంతా ఏకమై యామా వీధులను నానావిధాల నాశనం చేయసాగారు. ఇళ్ళకున్న కిటికీఅద్దాలన్నీ పగులగొట్టారు. తలుపులన్నీ విరగ్గొట్టారు. పియానోలు, తదితర వాయిద్యాలు,

...రు. కుర్చీలు, బల్లలు, మంచాలు, పరుపులు,
...కి విసిరేశారు. చాలారోజులవరకూ అవన్నీ
...ల్లో తేలిఆడాయి. స్త్రీలను వంటిమీదగుడ్డ
...కి నెట్టారు. ముగ్గురు కాపలావాళ్ళను ముక్క
...ట్టి చంపేశారు. ఈవిధంగా ప్రతిఇంటిమీదా
...ల్సి భవనంకూడా ధ్వంసం అయింది. అందులో
... రకరకాల వస్తువులు, పట్టుపరుపులు, సిల్కు
... అందమైనబల్లలు, నగిషీచెక్కిన కుర్చీలు; అన్నీ
...ంవచ్చినట్లు వీధిలో పారేశారు. ఆ గుంపు అంత
...కుక్కలవున్న ప్రతి హోటలుమీదా, ప్రతి
...డిమీదా, బీరుషాపుమీదా పడి అన్నీ ధ్వంసం

...యామాలోపడి మూడుగంటలసేపు పెచ్చు
...ంది. తాగి తందనాలాడారు. కోపోద్రేకా
...ముకలాట, దొమ్ములాట, సంక్షోభం, సంకుల
...ప్రత్యేకంగా పంపబడిన సైనికదళం ఒకటి
...వేల్చి, మూకనంతా చెదరగొట్టింది. అప్ప
...సనే రెండు వ్యభిచారగృహాలను నిప్పంటిం
...కం ఎంతో శ్రమపడి వాటిని చల్లార్చింది.
...జడి కొంతవరకు సద్దుమణిగింది. కాని
...చ్చిందో ఏమో! మూకంతా పొర్లుకొచ్చి
... యామాలోనే కాదు నగరంలోను, నగరం
...మిత్త ప్రాకంశమైంది. తలవనితలంపుగా
...ను, దాస్యంలోను విపరీతంగా బాధపడు
...ంకె. వారూ వీరూ అంతా ఏకమై నగ
...యంకరమైన ఈ సంకులసమరం మూడు

...సు గవర్నర్ జనరల్ ఉత్తర్వు జారీ
... నగరంలోగల తదితరభాగాల్లోను వున్న

సానికొంపలన్నీ తత్క్షణం మూసివేయాలని కఠినంగా
తమ తమ వ్యాపారాలన్నీ సర్దుబాటు చేసుకోవడాని
వేయడానికీ, ఆ యా ఇళ్ళ యజమానురాండ్రిందరికీ
ఇవ్వబడింది.

పాపం! వృద్ధాప్యంవచ్చి, చితికి చిదికిప
వ్యభిచార గృహాల యజమానురాండ్రిందరికీ పడు
పోయింది. దుక్కల్లా బలిసిన పనిమనుషులకు, ఇ
గంపలకు, వెనుకటి జీవితంమీద విరక్తిపుట్టిం
కొంపా, గోడూ, సర్దుకుని, మూటా, ముల్లే, కట్టు
బయటపడ్డారు. తరువాత ఒక నెలరోజులకు య
నిశ్శబ్దమైపోయింది. కాని ఒకప్పుడు జూదాని
పోట్లాటకూ, పచ్చి శృంగారానికీ, పడుపుక
యామ్స్కాయా పేరుమాత్రం అలాగే వుండిప

వివిధరకాల హాస్పిటలలు, కొట్కాల
పోయిన పడుపుకత్తెలు; వీరంతా చెల్లాచెదుర
లకు పరుగెత్తారు. అసంఖ్యాకులైన స్త్రీలు అ
చలించి, పిచ్చివాళ్ళయి, బిచ్చగాళ్ళయి జన
తిరుగుతున్నారు. గూండాలు, కొంటెపిల్ల
వెక్కిరిస్తూ, మోసాలుచేస్తూ, హాస్యాలాడుత

ఒకప్పుడు పచ్చిశృంగారం
యామా పేరుకూడా అతి త్వరలోనే మా
వృత్తికీ, అక్రమానికీ, అనాచారానికీ, అ
యమకూపమని ప్రసిద్ధికెక్కిన యామా
పూర్తిగా మాసిపోయింది. ఇహ ఆ పాప

—♦ సమాప్త



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA117B198 |
| పుస్తకం పేరు | యమకూపం |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 373 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 4, 7 |
| లేని పేజీలు | 1, 2 |
| తయారు చేసినది | A.Bi |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | S.Lakshmi |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |